# తత్త్వవేత్తలు

[ సిద్ధాంతాలూ, జీవిత విశేషాలూ ]



I

గోపీచంద్



దేశి కవితా మండలి
విజయవాడ-2

అంకితం:

మాతృమూర్తికి



# పీఠిక

మనిషికి జ్ఞానం అనేది వొచ్చినప్పటినుంచీ, తాత్త్విక దృక్పథం ఏర్పడి వుంటుంది. ఆలోచన అనేది కలగటం మొదలుపెట్టగానే, 'ఈ జీవితం ఏమిటి?' 'ఈ చుట్టూవున్న ప్రపంచం ఏమిటి?' అనే ప్రశ్నలు వుదయించటం సహజం. ఈ ప్రశ్నలే తత్వశాస్త్రానికి పునాది. అయితే తాత్త్వికదృష్టి ఏర్పడకముందు, ఈప్రశ్నలకు జవాబులకోసం మానవుడు ఇతరత్రా అనేక ప్రయత్నాలు చేసి వుంటాడు. ఆ ప్రయత్నాలు ఏవిధంగా, ఏ రూపాల్లో వుండేవో బహుశా ఇప్పుడు మనం చెప్పలేం. అటు వెతికి, ఇటు వెతికి చివరికి వొకదారిని నిర్ణయించుకున్నాడు మానవుడు ఈ అన్వేషణలో. ఇది హేతువాదంవల్లా ఆలోచనా శక్తివల్లా ఏర్పడిన దారి. అయితే ఈ దారిమాత్రం గమ్యస్థానాన్ని జేర్చిందా మానవుణ్ణి? లేదు, అనే చెప్పాలి. పోనీ జేర్చగలదనే ఆశవుందా? ఈ ప్రశ్నకు కూడా లేదనే జవాబు చెప్పవలసి వస్తూవుంది. ఒక పర్షియన్ కవి ఈ ప్రపంచాన్ని మొదలూ చివరా పేజీలు పోయిన గ్రంథం ప్రతిగా వర్ణించాడట. అన్వేషకులకు ఇదీ నిజంగానే కనుపిస్తుంది. ఇదేభావం భగవద్గీతలో కృష్ణుడంతటివాడే చెప్పినప్పుడు, సామాన్యులమాట నేరే ఆలోచించ వలసిన అవుసరం ఏముంది? కృష్ణుడు ఇలా అన్నాడు:—

అవ్యక్తా దీని భూతాని
వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ
కా తత్ర పరిదేవనా!

'ఓ అర్జునా! ఈ ప్రాణికోటి విషయంలో, పుటకకు ముం దేమిటో తెలియదు; మరణానంతరం ఏమిటో తెలియదు; మధ్యన

ఏవో కొంత తెలుస్తూ వుంది. కాబట్టి దీనికి ఇంతగా శోకించటం ఎందుకు ?'

మరి ముందూ వెనుకా తెలియనప్పుడు, తెలిసేఅవకాశంకూడా వున్నట్లు కనపడనప్పుడు; ఈ అన్వేషణ ఎందుకు ? అనే ప్రశ్న ఉదయించటం స్వాభావికమే ! ఆలోచించి చూస్తే ఈ అన్వేషణలో ఏవో ఆనందం వున్నట్లు గోచరిస్తుంది. పైగా పూర్తిగా ఎప్పుడూ తెలియకపోయినా, ఎప్పటికప్పుడు కొంత తెలుస్తూనే వుంది. మనం అనుసరించేమార్గంలోనే గమ్యస్థానం మిళితమై వున్నట్టు కనుపిస్తూంది. అందుకనే ఈ అన్వేషణ ముగియబోనిదేకాక వేసటే లేనిది. ఈ స్థితిని మరొక పర్షియన్ కవి ఈ విధంగా వర్ణించాడట.

"Thoso who follow the Path
never tire
Because it is
both the way and the destination."

ఈ అన్వేషణ ఒక దేశానికీ కాలానికీ చెందింది కాదు. మనుష్యుడికి ఆలోచనాశక్తి అనేది వొచ్చినప్పటినుంచీ అన్నిదేశాలలోనూ జరుగుతూనే వుంది, ఈ అన్వేషణ. పైగా అన్నిటా ముఖ్య లక్షణాలలో పోలికలు వున్నట్లు కనుపించటంకూడా గమనించదగిన విషయం. ఆధ్యాత్మికవాదానికి ప్రసిద్ధిచెందిన మన దేశంలోనూ చార్వాక మతస్థులు వున్నారు. భౌతిక వాదానికి ప్రసిద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలోనూ 'భావమే అనాది వస్తువు, దాని రూపాలే ఇవన్నీ' అని చెప్పే హెగెల్‌లాంటి తత్వవేత్తలు వున్నారు. కాకపోతే ఆయా దేశ పరిస్థితులనుబట్టి కొంత ప్రత్యేకత అనేది వుంటూ వుంది. ఈ ప్రత్యేకత తాత్విక పరిణామానికి దోహదం చేస్తూవుంది.

తత్వశాస్త్ర చరిత్రను పరిశీలించి చూస్తే నమ్మకం, అపనమ్మకం రెండూ ఈశాస్త్రాభివృద్ధికి సహాయ పడుతున్నట్లుగా బోధపడుతుంది. ఈ శాస్త్రాభివృద్ధికి చార్వాకులూ తోడ్పడ్డారు; హెగెల్ లాంటి భావవాదులూ తోడ్పడ్డారు. ఇందులో సందేహములేదు. అయితే ఈభేదం వుండవలసిన అవుసరం ఏవిధంగా వొచ్చింది? అది సామాన్య మానవులు సృష్టించిన పరిస్థితులవల్లవచ్చిందని నేను అనుకుంటున్నాను. ప్రతి సిద్ధాంతంలోనూ నమ్మకం అపనమ్మకం కలిసేవుంటై. కాని, పరిస్థితులనుబట్టి ఒక్కొక్క యుగంలో వొకొక్క లక్షణానికి ప్రాముఖ్యత ఎక్కువ అవుతుంది. ప్రాముఖ్యత ఎక్కువ అవటం మాత్రమే! అదికూడా ఆనాటి అవుసరాన్నిబట్టి. కాని సామాన్య మానవులు అలా అనుకోరు. అవుసరాన్నిబట్టి ప్రాముఖ్యత వహించింది నిజమనీ, రెండవది అబద్ధమనీ నమ్మి ప్రవర్తించటంలో వొస్తూవుంది చిక్కు. దీనివల్ల మరొక మేధావి రెండవలక్షణానికి తన సిద్ధాంతంలో ప్రాముఖ్యత ఇవ్వవలసి రావటం, దానితో చరిత్ర చర్విత చరణం అవటం జరుగుతూవుంది. రెండు సిద్ధాంత లక్షణాలనూ సమన్వయ పరచి చూపగలిగిన శక్తి తత్వవేత్తలకూ, చూడగలిగిన శక్తి చదువరులకూ ఈనాటి అవుసరం. నేడు తత్వశాస్త్ర చరిత్రను అర్థం చేసుకో దలచినవారు మరొక విషయంకూడా గమనంలో ఉంచుకోవాలి.

ఇంతకుముందు తత్వశాస్త్ర చరిత్ర అంటే పాశ్చాత్యతత్వశాస్త్ర చరిత్రే అనీ, ప్రాచ్యదేశాలకు తత్వశాస్త్రం అనేది లేదనీ అన్నట్టు భావించి, రచనలు జరిగినట్లు కనుపిస్తుంది. కాని ఇది నిజంకాదని మనం తెలుసుకోవాలి. పాశ్చాత్య దేశాలలో ఈ తాత్విక చర్చ అంకురార్పణం ముందు గ్రీసు దేశంలో జరిగినట్లు స్పష్ట మవుతుంది. క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దంలో ఈ ఛాయలు గోచరిస్తయి. థేల్స్ అనే ఆయన్ని మొదటి గ్రీకు తత్వవేత్తగా మనం పరిగణించ

వచ్చు. క్రీస్తుకు పూర్వం 585 వ సంవత్సరములో ఆయన పరిశోధనలు కొన్ని ఋజువు అయినట్లు తెలుస్తుంది. పితగోరాస్, సోక్రటీస్‌లు, థేల్స్ తరువాత చెప్పతగ్గ తత్వవేత్తలు. పితగోరాస్ 532 బి. సి. ప్రాంతంలో జీవయాత్ర సాగించినట్లు తెలుస్తుంది. సోక్రటీస్ 399 బి. సి. లో జీవయాత్ర ముగించాడు.

మరి ఈ కాలంలో మన దేశం స్థితి ఎలావుంది! అప్పటి కప్పుడే మన దేశంలో తత్వశాస్త్రం మంచి అభివృద్ధిలో వుంది. అప్పటికే బౌద్ధ-జైనమతాలు మంచి వ్యాపకంలో వున్నాయి. ఈ మతాలకు ముందుకాలంలోనే అనేక తాత్విక సిద్ధాంతాలు మన దేశంలో ప్రచారంలో వున్నసంగతికూడా అందరికీ తెలిసిందే. అంతకు ముందు వ్రేళ్లు పాతుకొనివున్న వుపనిషత్తుల ప్రభావాన్ని గురించి ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో కీర్తిశేషులైన అబ్దుల్ కలాం అజాద్ గారు ఇలా వ్రాశారు: "గౌతమబుద్ధునికీ, మహావీరునికీ ముందు, ఉపనిషత్తు లనేవి వున్నాయని భారత తత్వశాస్త్ర చరిత్రని అభ్యసించే విద్యార్థు లందరికీ తెలిసిన విషయమే! ఈ ఉపనిషత్తులు క్రీస్తుపూర్వం ఎనిమిదవ శతాబ్దానికి చెందినవనే విషయంకూడా నిర్ధారణ అయిన విషయమే. దర్శనాలకాలం విషయంలోమాత్రం కొంత అభిప్రాయ భేదంవుంది. చార్వాకసిద్ధాంతం బుద్ధునికి పూర్వందనే కొంతిమంది భావిస్తున్నారు. ఇందుకు ఉదాహరణంగా ఉపనిషత్తులలోని కొన్ని ఘట్టాలు ఎత్తి చూపబడుతున్నాయి. ఈ ఘట్టాలు భౌతిక వాదం అనేది అప్పటికే వున్నట్లు సూచిస్తాయనీ, వాటి సారాంశమే చార్వాకమనీ కొందరు చెపుతున్నారు. సాంఖ్యసిద్ధాంతాన్ని గురించీ, యోగపద్ధతులను గురించి కూడా కొందరు ఈమాటే అంటున్నారు. వీటి ఛాయలు బౌద్ధంలో కనుపిస్తూ వున్నాయనీ, అందువల్ల ఇవి

బౌద్ధానికి పూర్వం వున్నాయని అంగీకరించినా లేకపోయినా, బౌద్ధానికి సమకాలికమైన వనైనా అంగీకరించాలనీ వీరి వాదం."

పండితులు వెలిబుచ్చిన పై అభిప్రాయాలను అంగీకరించి నట్లయితే, ఏడవ శతాబ్దానికి అనేక శతాబ్దాలు ముందే భారతీయ తత్వ శాస్త్రం ప్రారంభం అయిందని అంగీకరించాలి. ఏడవ శతాబ్దానికి భారతీయ తత్వ శాస్త్రం అంత అభివృద్ధిదశలో వుందంటే అంతకు ముందు కొన్ని వందల సంవత్సరాలనుంచీ ఈ రంగంలో తర్జన భర్జనలు జరుగుతూ వుండి వుండాలి. గ్రీసులో, థేల్స్‌నుంచి అరిస్టోటిల్ దగ్గరకు రావటానికి మూడువందల సంవత్సరాలు పట్టిందనే సంగతి ఇందుకు నిదర్శనంగా మనం తీసుకోవచ్చు. ఒక్క మనదేశమే కాదు, చైనా దేశాలవంటి ఇతర ప్రాచ్యదేశాల చరిత్రను పరిశీలించినా తాత్విక భావాలు అంకురార్పణం ముందు ప్రాచ్య దిశనే జరిగిందని అంగీకరించవలసి వస్తుంది.

చైనా దేశంలోకెల్ల ప్రఖ్యాత తత్వవేత్త అయిన కన్ఫ్యూసియస్ కుడి ఎడంగా బుద్ధుని సమకాలికుడే. క్రీస్తు పూర్వం 551 నుంచి 479 వరకు ఆయన కాలంగా నిర్ధారణ అయింది. అదేకాలంలో యాంగ్‌చూ తన సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చాడు. మిగిలిన వారిలో మోట్సు, చువాఙ్‌ట్సు ముఖ్యులు. కన్‌ఫ్యూసియస్ ముఖ్యంగా నీతిశాస్త్రవేత్త. ప్రజలనైతిక ప్రవర్తనను స్వచ్ఛపరచటానికి కొన్ని సూత్రాలను నిర్మించిన ప్రవక్త. బుద్ధునికి మల్లేనే ఆయనా భగవంతుని గురించిగానీ మరే ఇతర అతీత శక్తులను గురించిగానీ ఎక్కువగా ప్రస్తావించలేదు. ఆయన తరువాత పేర్కొనదగిన సిద్ధాంతం 'టెయోయిజం'. దీనికి చుయాఙ్‌ట్సు రచనలు చాలావరకు ప్రోత్సాహం ఇచ్చాయి. ఈ తత్వం ప్రకృతి నియమాలను అర్ధంచేసి, వాటికి అనుగుణంగా ప్రవర్తించుకుని చెపుతుంది. తత్ఫలితంగా ఏ పనీ చెయ్య

కుండా కూర్చోవటం ఈ తత్వం ప్రధాన లక్షణంగా ప్రచారం అయింది. మోట్సు సిద్ధాంతం దీనికి పూర్తిగా వ్యతిరేకమైంది. కర్మ చెయ్యటం దీని ప్రధాన సూత్రం. విశ్వమానవ ప్రేమ దీని ప్రధానమైన దృష్టి. ఈ తత్వవేత్తను గురించి డాక్టర్ లోచియాలూన్ ఈ విధంగా వ్రాశాడు – "ఆయన ప్రయోజనవాది. ప్రపంచంలో సుఖ దుఃఖ సిద్ధాంతాన్ని సృష్టించిన కొద్దిమంది తత్వవేత్తలలో ఆయన వొకడు. ఎక్కువమందికి ఎక్కువమందిని చెయ్యటం ఆయన సిద్ధాంతం. ఎక్కువమందికేకాదు – అందరికీ. ఆయన విశ్వమానవప్రేమా శాంతీ మానవ సంఘానికి పునాదులుగా ఉండాలని ప్రచారం చేశాడు.

ఇది క్రీస్తు పూర్వం నాలుగువందల సంవత్సరాలక్రిందటి చరిత్ర. జమీందారీ విధానం రద్దయి, గందరగోళం ప్రారంభం అయినప్పుడు 'న్యాయవిధానం' హాన్‌ఫీట్సు నాయకత్వంక్రింద ప్రచారంలోకి వచ్చింది. హాన్‌ఫీట్సు సంస్కరణవాది. మానవుల ప్రభుత్వం కాదు; న్యాయశాస్త్ర సమ్మతమైన విధానం కావాలి అని ఆయన వాదం. ఎవ్వరికో ఏదో వుపకారం చెయ్యటం కాక, న్యాయ చట్టాన్ని ఆచరణలో పెట్టటం ఆయన అభిమతం. ఈ సిద్ధాంతం నీతిబద్ధమైన జీవితం గడపాలనే కన్ఫ్యూషియస్ సిద్ధాంతానికి వ్యతిరేకంగా వృద్ధి చెందింది.

ఈ విధంగా చైనాలోనూ, మన దేశంలోనూ పాశ్చాత్య దేశాలకు పూర్వమే రకరకాల తాత్విక దృష్టులూ, సిద్ధాంతాలూ, ఆచరణలో వుంటూ వచ్చినై. ఇదే విధంగా ఈజిప్ట్, ఇరాక్ మొదలైన దేశాలు ఒకప్పుడు తాత్వికంగా అభివృద్ధి చెందివుండే వన్న విశ్వాసం ఒకటి వుంది. గ్రీసుదేశపు తాత్విక దృష్టికి ఈ దేశాలు కొంతవరకు కారణం అనికూడా విజ్ఞులు భావిస్తున్నారు. ఈప్రభావాన్ని కీర్తిశేషులైన అబ్దుల్‌కలాం అజాద్‌గారు ఇలా విశదీకరించారు. "తనరచనలలో ప్లేటో కొన్ని ఈజిప్ట్ దేశస్థుల భావాలను ప్రశ్నించటానికి వీల్లేని

సత్యాలుగా ఉదహరించాడు. అరిస్టాటిల్ ఇంకొక అడుగు ముందుకు వేసి, 'ఈజిప్టు దేశపు పూజారులు ప్రపంచంలోని మొదటి తత్వవేత్తలు' అన్నాడు. ఇదే విధంగా బైబిలన్, సైన్ నే మొదలైన నాగరికతలు కూడా పరిశీలించదగ్గనే."

ఈ పరిస్థితులనుబట్టి చూస్తే నేడు రచించబడే ఏ తత్వశాస్త్ర మైనా ఒక్క పాశ్చాత్య దేశాల చరిత్రనేకాక, ప్రాచ్యదేశాల చరిత్రనుకూడా అజలోకి తీసుకున్నప్పుడే అది సంపూర్ణ తత్వశాస్త్రం అవుతుంది. మానవునికి ఈ ప్రపంచం అంతా ఒకటే అనే సంపూర్ణ దృష్టి ఏర్పడటానికికూడా ఇటువంటి రచనే తోడ్పడుతుంది.

అయితే నాఈ పుస్తకానికి ఇంత విశాలమైన ఆదర్శం లేదని మొదటే చెప్పటం మంచిది. ఈ పుస్తకం వ్రాయాలనే సంకల్పం నా వ్యక్తిగత అనుభవంవల్లే కలిగింది. నా అనుభవాన్నిబట్టి రక రకాల తత్వవేత్తల సిద్ధాంతాలను చదువరులు ప్రథమదశలోనే తెలుసుకోవలసిన అవసరం వుందని నేను ఒక నిర్ణయానికి రావటమే నన్నీ పుస్తకరచనకు పురికొల్పింది. ప్రముఖ తత్వవేత్తలనుగురించి తెలుసుకునే గ్రంథం వొకటి లేకపోతే చదువరులు అనేక భ్రమ ప్రమాదాలకు లోనుకావలసి వస్తుంది. ముఖ్యంగా ఏదో ఒక తత్వ వేత్త గ్రంథం చదువరులచేతుల్లోకి వచ్చినప్పుడు మిగిలినవారు ఏమం టున్నారో తెలుసుకోకుండానే, దానిని ప్రశంసించి నమ్మటమో, విమర్శించి తెగడటమో జరుగుతుంది. ఈ నిర్ణయంలో అన్నిటినీ తెలుసుకొని దృష్టిని ఏర్పరచుకోవటంలోవున్న స్వాభావికత్వం, విశాలత్వం లోపిస్తుంది. చదువరులను ఇటువంటి ప్రమాదాలనుంచి కొంతవరకైనా తప్పించే అవకాశం కలిగించగలదనే ఉద్దేశంతో నేనీ పుస్తక రచనకు ఉపక్రమించాను.

వివిధ తత్వవేత్తల దృష్టులు ఏవిధంగా వున్నాయో, అలా వుంటానికి కారణాలేమిటో తెలియజెయ్యాలనే అభిలాష ఈ గ్రంథ రచనకు ముఖ్యోద్దేశం అవటంవల్ల, వీలైనంతవరకు నా దృష్టికి ప్రాధాన్యత రాకుండా ఉండగలందులకై ప్రయత్నించాను. ఇది అసంభవమైన పనే కావచ్చు. ప్రయత్నం మాత్రం చేశాను. ప్రతి తత్వవేత్త దృష్టీ, సహృదయంతో తెలియజెప్పటానికై కృషి మాత్రం జరిగిందని చెప్పగలను. దీనివల్ల విభిన్నదృష్టులు కలిగిన తత్వవేత్తల అభిప్రాయాలను నేను అంగీకరిస్తున్నట్లు కనబడినా కనబడవచ్చు. అది సానుభూతేగాని, అంగీకారం కాదని మనవిచేస్తున్నాను.

ఈ పుస్తకంలో మన ఇంద్రియాలు ప్రోగుజేసే జ్ఞానం సత్యమైందనే ప్రాతిపదికను అంగీకరించే తత్వవేత్తలను గురించే ప్రస్తావించాను. వీరికి భగవంతుడు వుండవచ్చు; లేక పోవచ్చు. ఆ దృష్టితో నేను ఈ సందర్భంలో ప్రమేయం పెట్టుకోలేదు. మన జ్ఞానానికి అందే సమస్యలకు ప్రాధాన్యత ఇచ్చినవారిని గురించి వ్రాయాలనే సంకల్పంతో ప్రారంభించాను. దీని వల్ల ఒకేఒక మూల సూత్రాన్ని అంగీకరించిన వారిలో కూడా ఎన్ని అభిప్రాయభేదా లున్నాయో, ఎన్ని అభిప్రాయ భేదాలు వుండటానికి వీలుందో తెలియకపోదు. ఈ విధంగా నేను ఒక గిరి గీసుకున్నాను గనక, మిగిలిన వారి పట్లనాకు నిరసన భావంవున్నదని ఎవ్వరూ అనుకోనక్కరలేదు. ఈ కనపడేది భ్రమేనని, అసలు సత్యం వేరేవుందనీ, అనుకునే తత్వవేత్తలను గురించి కూడా వ్రాయాలనే సంకల్పం వుంది. మరొకసంగతి — ఈ విభజన సౌలభ్యం కోసం చేసుకున్నదే గాని నిజమైంది కాదని మనవి.

సూతాశ్రమం,
14—1—1959.

ఇట్లు,
గోపీచంద్.

# విషయసూచిక:

# 'కమ్యూనిస్టు తత్త్వవేత్త'
# కారల్ మార్క్స్

చరిత్ర గమనాన్ని మార్క్స్ మార్చినంతగా మరే తత్వవేత్త మార్చలేదని మనం చెప్పుకోవచ్చు అనుకుంటాను. దీనికి ఏ కొద్దిమంది మేధావుల మనస్సులను రంజింపజెయ్యాలనో కాక ప్రజాబాహుళ్యం జీవితాన్ని మార్చాలనే అతని సంకల్పం ముఖ్య కారణం. ఈ ఉద్దేశంతోనే అతను తత్వశాస్త్రం నిర్మించాడు; ఆచరణలోకి తేవటానికి కృషిచేశాడు. ఈ విషయం అతను స్పష్టంగా చెప్పాడు. 'ఇంతకు ముందు తత్వవేత్తలు ప్రపంచాన్ని నిర్వచించటానికి ప్రయత్నించారు. ప్రపంచాన్ని మార్చటం నా సంకల్పం' అన్నాడు.

ఈ దృష్టి ఇతర తత్వవేత్తలకూ, మార్క్సుకీ చాలా భేదాన్ని సృష్టించింది. ఋతదృష్టికలిగిన తత్వవేత్తలు, మనకు కనుపించే ఈ స్థితికంటే పైస్థితిలో, ఇంతకంటేఎక్కువ వాస్తవికమైన స్థితిలో, ఆదర్శాలు సిద్ధిని పొందే వున్నాయి. అయితే మనం ఆ స్థితిని వక్రరూపంలో చూడగలగటం వల్ల చెడు అనేది సంభవిస్తూ వుంది అని భావిస్తారు. ఇలాభావించేవారు ప్రపంచాన్ని నిర్వచించటానికి పూనుకోవటం, తత్వవేత్తలు చెయ్యవలసిన పని - అదే అనుకోవటం సహజమే. మార్క్సువంటి తత్వవేత్తలు ఈ దృష్టిని అంగీకరించరు.

వీరు చెడుని నిర్వచించినంత మాత్రాన తత్వవేత్తల పని తీరి పోయిందని అనుకోరు. చెడుని నిర్మూలించాలి. 'చెడూ' 'కష్టాలూ' అనేవి వాస్తవికతలో వున్న కొన్నిలక్షణాలు. వీటిని మానవుడు నిర్మూలించగలడు. యీ నిర్మూలించగలిగి నప్పుడే ఈ ప్రపంచం వాసయోగ్యం అవుతుంది. తత్వ వేత్తలు ఇందుకు సహాయపడాలి. ఈ విధంగా ఆలోచించే తత్వవేత్తల్లో మార్క్స్ ముఖ్యుడు.

అతను తన జీవితాన్ని ఇందుకై వినియోగించాడు. మనోవాక్కాయ కర్మలతో చెడునీ కష్టాలనూ నిర్మూలించ టానికి ప్రయత్నించాడు. అందుకు ఎటువంటి భయానక పరి స్థితిని ఎదుర్కోటానికైనా సందేహించలేదు. నిర్విరామంగా మరణించేవరకూ పోరాటం సాగిస్తూనే వచ్చాడు. మతం దివ్యశక్తి వొకటి వుందని మనం ప్రపంచంలో చూచేవన్నీ దాని రూపాలేననీ చెపుతుంది. అంటే మనకు చూడటం చేత గాక అనుకోవటంతప్ప 'చెడూ' 'కష్టం' అనేది ప్రపంచంలో లేదు-అని బోధిస్తుంది. అటువంటప్పుడు ఊహించుకొన్న చెడుని నిర్మూలించటానికీ, కష్టాలను బాపటానికీ ప్రయత్నిం చటం, సహజ పరిణామాన్ని అడ్డగించటం, వైరితలల సృష్టికి సహాయపడటం అవుతుందని వాదిస్తుంది.

ఈ దృష్టిలో వొక ప్రమాదం వుంది. ప్రపంచంలో ప్రత్యేక హక్కులను అనుభవిస్తున్నవారు, ఇతరులను నిరా దరణచేసే స్థితికి ఈ వాదాన్ని చాలా తేలికగా గుంజగలిగే అవకాశం వుండటమే ఈ ప్రమాదం. 'కష్టం' 'చెడూ'

అనేవి నిజంగా లేవు-అటువంటప్పుడు వాటివల్ల కృంగి కృశించే వారిపట్ల దయచూపటం అనేది ఎలా సంభవిస్తుంది? అంతే కాదు; స్వార్థపరులు తమ స్వార్థాన్నీ, దుష్టులు తమ దౌష్ట్యాన్నీ సమర్థించుకునే అవకాశాన్ని కలిగించే స్థితికి కూడా దృష్టిని దిగజార్చవచ్చు. మార్క్స్ కాలంలో ప్రపంచం ఈ స్థితిలోనే వుంది. దోపిడీ విధానం నిర్విఘ్నంగా సాగటమేకాక, దానినుంచి తప్పించుకునే ప్రయత్నమే సహజ పరిణామానికి ఎదురుతిరగటంగా ప్రపంచం నడకకు ద్రోహదం చెయ్యటంగా, వున్న పరిస్థితిని వున్నట్లుగా వుంచటమే మానవుడు చెయ్యవలసిన పనిగా పరిగణింప బడజొచ్చాయి. ఇక మార్క్సువంటి సంఘ శ్రేయోభిలాషి ఈ దృష్టికి ఎదురు తిరగక గత్యంతరం ఏముంది. ఎదురు తిరిగాడు. దానికి అవసరమైన తత్వశాస్త్రాన్ని సృష్టించి తమ హక్కులను తాము కాపాడుకునే ధైర్యాన్నిచ్చే ఆయుధంగా, కష్టాలు అనుభవించే వర్గాలకు అప్పగించాడు. దానితో లోకం దద్దరిల్లింది.

ఈ భావాలు మార్క్సుతో పుట్టలేదు...అనాదినుంచీ అనేకమంది మేధావుల ప్రయత్నాలలో. అభివృద్ధి చెందుతూ వొచ్చినై. ప్లేటో తాను వ్రాసిన రిపబ్లిక్ అనే గ్రంథంలో కమ్యూనిష్టు స్టేట్‌ని ఊహించాడు. అప్పటినుంచీ వ్యక్తిగత ఆస్తివిధానంవల్ల వొచ్చిన ప్రమాదాలనుఎదుర్కోటానికి అనేక మంది మేధావులు ఎప్పటికప్పుడు ఈభావాలకు రూపాన్ని దిద్దుతూనే వచ్చారు. అయితే మార్క్సుకి వొక ప్రత్యేకత వుంది. ఈ ప్రత్యేకతను ఇల్లా వర్ణించాడు; లాస్కీ 'కమ్యూనిజం' అనే గ్రంథంలో - "అతనిలో వున్న ముఖ్యమైన

లక్షణం ఇది. అతను కమ్యూనిజాన్ని గంద్రగోళంగా వున్న స్థితిలో చూశాడు; ఒక ఉద్యమంగా రూపొందించి విడిచి పెట్టాడు. అతనివల్ల దానికొక తత్వశాస్త్రం, ఒక మార్గం ఏర్పడ్డాయి. ప్రపంచకార్మికులు ఏకం కావాలనే దృష్టిని కలిగించి, దీనినొక అంతర్జాతీయవ్యవస్థగా రూపొందించింది అతనే."

మార్క్స ప్రత్యేకతను ఇంకా ఈ విధంగా ఉద్ఘాటించాడు లాస్కీ. "గమ్యస్థానాన్ని చిన్న చిన్న విషయాలను సైతం అజలోకి తీసుకొని, సమగ్రంగా వర్ణిస్తూ కూర్చున్నదానికంటే, అగమ్యస్థానాన్ని జేరుకునే మార్గాన్ని గురించి చర్చించి తెలుసుకోవటం ఎక్కువ ముఖ్యమని గమనించిన సోషలిస్టు మేధావులలో అతను ప్రథముడు. చుట్టూ వున్న వాతావరణాన్ని విమర్శించి తెలుసుకోవటంద్వారానే ఈ మార్గాన్ని కనిపెట్టగలం అని గ్రహించినవారిలో కూడా అతనే ప్రథముడు."

మార్క్స తన పనిని ఏవిధంగా నిర్వర్తించుకున్నదీ లాస్కీ చక్కగా తెలియజేశాడు. ఏ విప్లవకారుడైనా ముందు, ఆనాడు ఆచరణలోవున్న తాత్వికదృష్టినీ, ఆర్థిక సిద్ధాంతాలనూ విమర్శించి వాటిల్లోవున్న దోసగులను ప్రపంచానికి చూపి వాటిమీదవున్న మోజును రూపుమాపుతాడు. మార్క్స చేసిన పనుల్లో ఇది మొదటిది. అప్పుడు ఆచరణలోవున్న 'ఆర్థిక వ్యక్తిత్వా'న్ని అతను విమర్శించి, ఆ సిద్ధాంత వాదులను తమ్మతామూ కాపాడుకునే స్థితిలోకి తెచ్చి విడిచాడు. తరువాత అతను చేసిన

రెండవపని తన అనుచరులు కార్యోన్ముఖు లవటానికి కావలసిన ఉద్రేకాన్ని వారికి కలిగించటం. ఈ పనికూడా అతను చక్కగా చేశాడు. ఆ ఉద్రేకం అతని అనుచరుల్లో అప్పటికేకాదు; ఇప్పటికీ ఉంటూనే వుంది. అతని రచనలు అనేకం ఈ అగ్నిని చల్లారకుండా రగులుస్తూనే వుంటున్నవి. మార్క్స నిర్వర్తించిన పాత్రను గురించి లాస్కీ ఇలా అన్నాడు— "మార్క్స ఆర్థిక సిద్ధాంతంలో వైరుధ్యాలు వున్నమాట నిజమే. మార్క్స సాంఘిక శాస్త్రంలో ఆ కాలానికి సంబంధించిన అనేక లోపాలు వున్నమాట కూడా నిజమే! అయినప్పటికీ అనేక విమర్శలకు గురి అయిన తరువాతకూడా, అతనియొక్క పలుకుబడీ, అతని సిద్ధాంతంయొక్క పలుకుబడీ ఇంత ఎక్కువగా ఉన్నదంటే– అదే చెపుతుంది దాని విలువను..."

## ౨

కారల్‌మార్క్స 1818 లో ఒక మధ్యతరగతి యూదుకుటుంబంలో జన్మించాడు. కళాశాల విద్య పూర్తి అయినపిదప మంచి ఉద్యోగం వస్తుందని ఆశించాడు. కాని అప్పటికే విప్లవ పూరితమైన అతని భావాలు అధికారంలో వున్నవారికి తెలియటంవల్ల అతను కోరిన ఉద్యోగం లభించటం దుర్లభం అయింది. తరువాత కొన్నాళ్ళు ప్రష్యాలో జర్నలిజం చేపట్టాడు. 1843 లో పారిస్‌కు ప్రవాసిగా తరిమి వెయ్యబడ్డాడు. అక్కడ అతను ప్రౌడన్ మొదలయిన ఫ్రెంచ్ సోషలిస్టులతో పరిచయం చేసుకున్నాడు. తరువాత, అతని

అనుచరుడుగా మిత్రుడుగా జీవితాంతంవరకూ అతనికి అనేక విధాలుగా తోడ్పడిన ఫ్రెడరిక్ ఎంగెల్స్‌తో పరిచయంకూడా అక్కడే కలిగింది.

కాని ఫ్రాంసులోకూడా అతనికి ఎక్కువరోజులు వుండే ఆస్కారం లేకపోయింది. అక్కడనుంచి కూడాఅతన్ని తరిమి వేశారు. 1848 లో అతను ఫ్రాంసును విడిచిపెట్టి బ్రజెల్స్‌లో మకాం వేశాడు. 1848 లో జరిగిన విప్లవం వరకూ అతను అక్కడే వున్నాడు.

అతను బ్రజెల్స్‌లో వున్నకాలం అతని జీవితంలో చాలా ప్రాముఖ్యమైంది. అతను అక్కడ వుండగానే, ప్రౌడన్ మీద తాను వ్రాసిన విమర్శ ప్రచురించాడు. ఈ విమర్శ వల్ల, ఫ్రెంచ్ సోషలిస్టు సాంప్రదాయానికీ అతనికీ వున్న సంబంధం తెగిపోయింది. బ్రజెల్స్‌లో వుండగానే ఎంగెల్స ద్వారా 'న్యాయస్థుల కూటమి' అనే సంఘంతో అతనికి పరిచయం ఏర్పడింది. ఈ సంఘమే తరువాత 'కమ్యూనిస్టు కూటమి' గా మారింది. ఈ పని 1347 లో జరిగింది. ఈ కూటమి ద్వితీయ మహాసభ సందర్భంలోనే మార్క్స 'కమ్యూనిస్టు మేనిఫెస్టో' అనే ఉద్గ్రంధాన్ని ప్రచురించాడు. ఇటు వొక ప్రక్క యీ గ్రంథం ప్రచురించబడిందో, లేదో అటు రెండవప్రక్క పారిస్‌లో విప్లవం ప్రారంభం అయింది. మార్క్స అక్కడకు వెళ్లాడు. కాని అక్కడ ఎక్కువరోజులు వుండటానికి వీల్లేకపోయింది. అభివృద్ధి నిరోధక శక్తులు విజృంభించాయి. జర్మనీలో, ఫ్రాంసులో విప్లవశక్తులు దౌర్జన్యంగా అణచివెయ్యబడ్డాయి. 1849 నాటికి చేతిలో

చిల్లిగవ్వ లేకుండా, మార్క్స లండన్ జేరుకున్నాడు. 1883 లో లండన్ లోనే మరణించాడు.

ఇంగ్లండులో మార్క్స 30 సంవత్సరాలు ప్రవాసిగా గడిపాడు. ఎంగెల్స సహాయం చేస్తున్నప్పటికీ ఎక్కువకాలం అతను దారిద్ర్యంలోనే గడపవలసి వచ్చింది. అతని ముఖ్య గ్రంథమైన 'డాస్ కేపిటల్' అక్కడే పూర్తి చెయ్యబడింది. దీనితోపాటు అనేక కరపత్రాలూ, పారిస్ కమ్యూన్ని సమర్థిస్తూ, గోతా కార్యక్రమాన్ని విమర్శిస్తూ వ్రాసిన గ్రంథాలూ ఆ కాలంలోనే వ్రాయబడినై. గ్రంథరచనకాక అతను 'ప్రథమ అంతర్జాతీయ సంస్థ' ను ఈ కాలంలోనే స్థాపించి దాని అభివృద్ధికోసం కృషిచేశాడు. అతని ఆరోగ్యం ఏమంత మంచిదికాకపోయినా రాత్రింబగళ్ళు కృషి చేసి బీదప్రజల అభివృద్ధికై తాత్విక రంగంలోనూ, కార్య రంగంలో అహర్నిశలూ కృషిచేసి వారికి లోకతత్వశాస్త్రాన్నీ కొన్ని సంస్థలనూ ఏర్పాటు చేసి కాలధర్మం పొందాడు. అతను, అతని మరణానంతరం లీబ్ నెక్ట్ చెప్పిన 'సాంఘిక ప్రజాస్వామికాన్ని లోకకూటమి నుంచి, పార్టీ స్థితికి అభివృద్ధి అయేటట్లు చూశాడు' అనే అభిప్రాయంతో నిస్సందేహంగా మనం ఏకీభవించవచ్చు.

# 3

✓ప్రపంచాన్ని మార్చాలనే దృష్టికలిగిన సిద్ధాంతం అవటంవల్ల మార్క్సిజం అనేక తర్జనభర్జనలకు గురిఅయింది. అందులో ఒక నూతన దృష్టిని కలిగించటమే కాక, ఒక నూతన కార్యక్రమంతో, అధికారంలోవున్న ధనికవర్గాలను కూలద్రోసి, అధికారం చేబట్టాలనే సంకల్పం కలిగిన సిద్ధాంతం అవటంవల్ల, బలమైన వ్యతిరేకం కావటం సహజమే. ఇటువంటి వ్యతిరేకత రావటంవల్ల వాగ్వాదాలు పెరగటం, ఈ వాగ్వాదాలు రేపే ధూళిలో మార్క్స్ చెప్పిన దానికి కొన్ని అపార్థాలు పుట్టి ప్రచారంలోకి రావటం జరిగింది. మార్క్సిజాన్ని అనుచరులూ విమర్శకులూ కూడా ఎవ్వరికి వారు తమకు అనుకూలంగా అర్థం చెప్పుకోవటం కూడా పెద్దపెట్టున జరిగింది. అందువల్ల మార్క్సిజంలోని ముఖ్యలక్షణాలను విడమరచి తెలుసుకోవటం ఎంతైనా అవసరం. తెలుసుకుందాం.

## చారిత్రక భౌతిక వాదం

అద్వైత సిద్ధాంతంగా, మార్క్సిజం, ప్రకృతి శాస్త్రాలను చారిత్రకంగా, చారిత్రక పతనాన్ని, శాస్త్రోక్తంగా చెయ్యటానికి ప్రయత్నించింది. కాని మార్క్సిజం భౌతిక వాదం అనుకోవటంలో మనం ఒక ప్రమాదంలో చిక్కుకోగూడదు. మార్క్సిజం హెగెల్ యొక్క భావ వాదాన్ని వ్యతిరేకించటమే కాక, మోన్టెస్కు, బకిల్ మొదలైనవారి పూర్తి భౌతి వాదాన్నికూడా నిరసించిందని మనం మరచి

పోగూడదు. "చరిత్రను గురించిన స్వాభావిక వాదం పాక్షిక మైంది. అది మానవుడు ప్రకృతిమీద తన ప్రభావాన్ని చూపగలడనీ, మార్చగలడనీ, జీవితాన్ని, నూతనపరిస్థితులను సృష్టించగలడనీ మరచిపోయింది" అన్నాడు హీగెల్.

మానవుడు జీవితావసరాలను కష్టపడి ఉత్పత్తి చేసుకునిగాని బ్రతకలేడు. ఉత్పత్తికి వాడే సాధనాలూ, శ్రమించే శక్తీ, పనికి సంబంధించిన సాంప్రదాయాలూ, విధానాలూ, ఇవి ఉత్పత్తి శక్తులు. మార్క్స్ చెప్పిన ఉత్పత్తి విధానంలో ఇదొక లక్షణం. ఈ విధానంవల్ల సృష్టించబడిన సంబంధాలు రెండవ లక్షణం. ఈ సంబంధాలు. మనుష్యులకూ వస్తువులకూ, మనుష్యులకూ, ప్రకృతి శక్తులకూ, మనుష్యులకు మనుష్యులకూ ఉత్పత్తిచేసే సందర్భంలో ఏర్పడి వుంటై. ఈ విధంగా సృష్టించబడిన నిర్మాణాన్ని చరిత్రకు మూలసూత్రంగా భావించాడు మార్క్స్. ఉత్పత్తి శక్తులు మారితే ఉత్పత్తివల్ల ఏర్పడిన సంబంధాలుకూడా మారవలసి వుంటుంది. ఈ మార్పు అంతకుముందు కొన్నిహక్కులనుఅనుభవించేవర్గానికి సరిపడదు. కాబట్టి పోరాటంవల్ల జరుగుతుంది. అందుకనే మార్క్స్ చరిత్రని వర్గపోరాటాల చరిత్రగా భావించాడు. ఇదే విషయాన్ని హృదయానికి హత్తుకునేటట్లు చెప్పాడు లాస్కీ, "నూతన పరిస్థితులనుంచి, నూతన సత్యాలు ఉద్భవిస్తాయి. ఇవి పోరాడి పైకి రావలసిందే. ప్రతి సంఘంలోనూ, ఉన్న పరిస్థితిని ఉన్నట్టుగా ఉంచదలచినవారూ, దాన్ని మార్చదలచినవారూ ఉంటారు.

మొదటి తరగతివారు అధికారంలో వున్నవారు. వారు తమ అధికారాన్ని, తమ వర్గానికి వినియోగపడే చట్టాలను నిర్మించటానికీ వ్యవస్థలను స్థాపించటానికీ వినియోగిస్తారు. తమకేది ప్రయోజనకారో, అదే మొత్తం సంఘానికి మంచిది అని వారు చెపుతారు. దానికి వ్యతిరేకమైంది నిషేధించ దగ్గది అంటారు. విద్య, న్యాయం, మతం మొదలైన వన్నీ వారి హక్కులను కాపాడటానికి అనుకూలంగా తయారవుతై ... ఈ వర్గం అనుభవించే ప్రత్యేక హక్కులకు దూరంగా వొకవర్గం ఉంది. ఆ వర్గంకూడా ఈ హక్కుల్లో భాగం కోరుతుంది. పైవర్గం పడనివ్వదు. ఈ విధంగా వర్గపోరాటం తప్పనిసరి అవుతుంది."

## గతితార్కిక భౌతికవాదం

మార్పు, చలనం, వాస్తవికతయొక్క జాతిస్వభావం అని చెప్పటం గతి తార్కిక భౌతికవాదంయొక్క ముఖ్య లక్షణం. ఇందులో క్రొత్త ఏమీ లేదు. గ్రీసులోని హెరాక్లిటస్ రోజులనుంచీ, మన దేశంలోని బుద్ధుని రూపంలో నుంచీ, వాస్తవికతయొక్క ఈ స్వభావంమీద నిర్మించబడిన తత్వశాస్త్రాలు వుంటూనే వున్నయి. అయితే ఈ వాదంలో కొత్తదనం ఈ మార్పుకి కారణాలను శోధించటంలో వుంది. 'ఈ మార్పుకి కారణం బయట ఎక్కడో లేదు. ఆ వస్తువు లోపలేవుంది. ఆ వస్తువులో వున్న అంతర్గత శక్తుల వైరుధ్యంవల్ల ఈ మార్పు జరుగుతూ వుంటుంది', అని ఈ వాదం చెపుతుంది. దీనికి వర్తించే

నియమాలు, వాటి చలనానికి సంబధించిన నియమాలే. వీటినిగురించి ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో సాయీద్ అయ్యూబ్ ఇలా వ్రాశాడు—"ఈ నియమాలను మొదట హెగెల్ రూపొందించారు మనం వొకచిన్న ఆలోచనతో ప్రారంభిస్తే దానిలో అంతర్గతంగావున్న తార్కిక అవసరాన్ని బట్టి, అన్నిటికన్నా ఉన్నతమైన భావనను చేరుకుంటాము. ఈ పని క్రమను క్రమేణా మన ఆలోచనను పైకి తీసుకువెళ్లే అనేక దశల ద్వారా జరుగుతుంది. ఈ నియమాలను ప్రకృతిలోనూ, చరిత్రలోనూ గమనించవచ్చని హెగెల్ నమ్మాడు. ఇవి పరిపూర్ణ భావం కాలంలో, తన్ను తాను పొందే పరిణామంలోని దశ లవటమే దీనికి కారణం. మార్క్స్ హెగెల్ వాదాన్ని తిరుగవేసి, భౌతిక ప్రపంచ పరిణామానికి ఈ తార్కిక నియమాలు అన్నిటికీ వర్తించే నియమాల్లని సిద్ధాంతీకరించాడు.

ఈ గతి తార్కికవాదానికి వొక విధానంకూడావుంది. ఇది చాలా ముఖ్యమైంది. ఈ విధానాన్ని గురించి జి. డి. హెచ్, కోల్ ఇలా వ్రాశాడు. 'మార్క్స్ వల్ల మనం ఏమైనా ప్రయోజనం పొందాలంటే, అతనువాడిన పరిభాషను అప్పజెప్పటం వల్లగాని, అతని సిద్ధాంతాలను ఏకరువు పెట్టటం వల్లగాని, సిద్ధించదు. అతని కాలంలో పొటమరించని ప్రశ్నలను ఈ నాడు రేపి, వాటికి అతను జవాబివ్వలేదని విమర్శించటం వల్లా ప్రయోజనం సిద్ధించదు. తనకాలంనాటి ప్రజలకు తాను చేసిన సహాయాన్ని ఈనాటి ప్రజలకు మనం చెయ్యటానికి అతను తోడ్పడేటట్టు చేసుకోవటం వల్లనే ఈ

పని జరుగుతుంది. ఈ తోడ్పాటు అతని సిద్ధాంతాలవల్లకంటే అతను అనుసరించిన విధానాన్ని అర్థం చేసుకోవటం వల్ల ఎక్కువ జరుగుతుందని మనం నిర్ధారణ చేసుకోవచ్చు...అతని సమస్యలూ, మన సమస్యలూ వొకటి కాకపోవచ్చు. కాని అతని ప్రపంచంలో నుంచి అభివృద్ధి చెందిందే మన ప్రపంచ మూను. మన ప్రపంచంలో ఎంతో మార్పు వచ్చినా, అతని ప్రపంచాన్నుంచి సాగి వచ్చిందే. ఈ మార్పూ, అభి వృద్ధీ అతను కొంతవరకు ఊహించిందే కూడా. అందువల్ల కొన్ని అతని సమస్యలు మన సమస్యలు కావచ్చు. కొన్ని అతని జవాబులుకూడా మన జవాబులు కావాలి. కాని మనం ప్రపంచాన్ని పరిశీలించి ఈ విషయం తేల్చుకోవాలి.'

ఈ పరిశీలనకు అతని విధానం బాగా ఉపకరిస్తుంది. అందువల్ల అతను తేల్చిన సారాంశాలకంటే అతని విధానం ఈ నాటి మనకు బాగా సహాయ పడుతుందని అనుకోవటం సత్య దూరంకాదు. దీనికి కారణం ఇది. ఒక పరిశీలనవల్ల తేల్చుకున్న సారాంశాం కంటే, ఆ పరిశీలనా విధానం ఎక్కువరోజులు ఉపయోగకరంగా వుంటుంది. అంటే మారే ప్రపంచంలో పరిశీలనా విధానం మారకుండా వుంటుందని కాదు. విషయం కంటే భావనారూపాలు నెమ్మదిగా మారుత వనే దీని భావం.

మార్క్స అనుసరించిన విధానం ప్రాశస్త్యాన్ని వైవిధంగా చెప్పి దాని స్వభావాన్ని విప్పిచెప్పటానికి పూను కున్నాడు కోల్. "ప్రాణికోటి అంతా నిరంతర మార్పుకి

గురి అవుతూ వుంటుంది. ఈ మార్పుకి కొంతవరకు బాహ్య పరస్థితీ కొంతవరకు అంతర్గత పరిస్థితీ కారణం. ఇది వ్యక్తులకే కాక సంఘాలకు కూడా వర్తిస్తుంది, ఎందుకంటే సంఘాలలో వున్న వ్యక్తులు మారుతూనే వుంటారు గదా! మానవ సంఘాన్ని దేన్ని అర్థంచేసుకో దలచినా మార్పులేని దాన్నిగా పరిగణించ గూడదు. నిరంతర ఈ పరిణామానికి గురిఅవుతున్న దాన్నిగా గమనించి, పరిశీలించినప్పుడే మనకు యధార్థం బోధపడుతుంది. దీని గతచరిత్రకూ, వర్తమాన పరిస్థితికి సంబంధించే అది మనకు అర్థమవుతుంది. మనం వర్తమానాన్ని అర్థంచేసుకో తలచినా, అది నిరంతరం మారుతూ వుంటుందని గమనించి ప్రయత్నించినప్పుడే సాధ్యపడుతుంది. ఎందుకంటే మనం మన పరిశీలనలో వుండగానే రేపు నేడు అవుతూవుంది."

కాబట్టి పరిశీలనా విధానం మార్పును గుర్తించేదిగా వుండాలి. సనాతన అర్థిక శాస్త్రివేత్తలకూ మార్క్సుకీవున్న భేదాలలో ఇది ముఖ్యమైన భేదం. వారు రికార్డో మొదలుకొని ఈ నాటివరకూ తమ పరిశీలనమే, చలనంలేని ప్రపంచాన్ని నిర్మించుకున్నారు. అందువల్ల వారు ఎంతకృషి చేసినా వాస్తవికతకు దూరంగానే వుంటూ వచ్చారు. పునాదే తప్పు అయినప్పుడు ఇది సహజమే.

మనం వాస్తవిక జగత్తుతో సంబంధం పెట్టుకోవాలి గాని దానికి సంబంధించిన ఊహాతో కాదు. ప్రతివొక్కటీ నిరంతరం మారుతూవుంటుంది కనక, ఒకవస్తువు యొక్క

మూలం ఆ వస్తువును నిర్వచించలేదు-అని అనుకోవటంలో అర్థం లేకపోలేదు. దానిచరిత్రలో మూలం వొకముక్క-మాత్రమే. వర్తమానం అంతే. చారిత్ర పరిశీలన అంటే వస్తువులను వాటి మూలాలను బట్టిగానీ కొన్నిదశలను బట్టి గానీ లేక. మొత్తం చరిత్రను బట్టి తెలుసుకోవడం అని స్థూలంగా మనం అర్థం చెప్పుకోవచ్చు.

అంతేకాదు "ఒక వస్తువును మనం అర్థం చేసుకో దలచినప్పుడు, ఆ వస్తువునే మనం పరిశీలించాలి గాని, దానిని గురించిన భావాలను కాదు. దీనికికారణం భావాలకు ప్రాధాన్యత లేకపోవటం కాదు, కొంతమంది మార్క్స్ అనుచరులు నేడు భావిస్తున్నట్లు వాటికి చరిత్రను మరిపేశక్తి లేకపోవటం కాదు. అయితే మరేమటి? వస్తువునిబట్టి భావాలు పుట్టినయి గాని, భావాలనుంచి వస్తువులు పుట్టలేదు. అందువల్ల ఈవస్తువులనే మనం నేరుగా చూడాలి. దానినుంచి మానవులు భావాలను ఏర్పరచుకోక ముందునుంచీ వస్తువు వుంది — భావాలనేవి రూపొందిం తర్వాత వస్తువుల రూపాలనుమార్చటానికీ, వస్తువుల మధ్య క్రొత్తక్రొత్త కలయికలను సృష్టించటానికీ వాటికి ఎక్కువశక్తి ఉండి ఉండవచ్చు. కాని వస్తువుల ఉనికే ముందు. అందువల్ల వాటిని తెలుసుకోవటమే ముఖ్యం. వస్తువులూ భావాలు మానవచరిత్రలో ఎల్లప్పుడూ వొక దానిమీద వొకటి తమ భావాన్ని చూపుకుంటూనే వుంటై.అయినప్పటికి వస్తువులస్థానాన్ని భావాలు ఆక్రమించుకోలేవు. ఎందుచేతనంటే చరిత్రలో భావం ఒక శక్తిగా

ప్రవర్తించటానికి, అది వాకరూపం ధరించి వస్తువుగా తయా రవ్వాలి.

ఆర్థిక విధానం

మార్క్స్ ఆర్థికవిధానం అతను వ్రాసిన 'కేపిటల్' అనే గ్రంథంలో నిర్వచించబడింది. లాస్కీ చెప్పినట్లు ఈ విధానం "తీవ్రమైన వాగ్వ్యాదాలకు దారితీసింది. ఎంతమంది ఈ విధానాన్ని వ్యాఖ్యానించటానికి పూనుకున్నారో అన్ని రకాల వ్యాఖ్యానాలు తయారైనయ్. మార్క్సిస్టులకు సహజంగా అంతకుముందున్న విధానా లన్నిటిలోకీ ఇది శ్రేష్ఠమైంది. విమర్శకులకు ఇది అనేక వైరుధ్యాలతో కూడుకున్నది. సోషలిస్టులలో నే అనేకమంది ఈ విధానాన్ని పూర్తిగా అంగీకరించలేదు." ఎన్ని వాగ్వాదాలూ, అభి ప్రాయ భేదాలూ వున్నప్పటికీ కార్మికులకూ, వారి నాయ కులకూ ఇదివేదం అయింది-అంటే అందులో బలమైనసత్యం వున్నదని మనం అంగీకరించాలి. మార్క్స్ ప్రతిపాదించిన ఈ ఆర్థిక విధానాన్ని స్థూలంగా పరిశీలించుదాం.

ఈ ఆర్థికవిధానం రెండు పునాదులమీద నిర్మించ బడిందని చెప్పాడు, లాస్కీ. ఆడమ్‌స్మిత్ రికార్డోల చేతుల్లో సాంప్రదాయ సిద్ధమైన ఆర్థిక విధాన రూపాన్ని పొందిన, విలువకు సంబంధించిన శ్రమసూత్రాన్ని విపులీకరించటం. అదనపు విలువలు శ్రామికులకు న్యాయంగా చెందవలసిన వనీ అవి వారినుంచి ధనికవాదులచేత దొంగిలింపబడ్డవనీ చెప్పే సిద్ధాంతం రెండవది. మార్క్స్ నిర్వచించిన ఈఆర్థిక

విధానంలో కొన్ని లోపాలు వున్నట్లు ఆర్థిక తత్వవేత్తలు కొందరు చెప్పినా, దానిబలం స్పష్టంగా కనుపిస్తూనేవుంది. లోకంలో భోగాలు అనుభవించేవారు కొందరూ, దారిద్ర్యంలో బాధపడేవారు కొందరూ వున్నమాట అందరికీ తెలిసిందే. ఈ విభాగం న్యాయసూత్రంమీద జరిగినట్లు కనుపించనిమాటే నిజమే. కష్టం చేస్తున్నవాడికి అతను చేసిన కష్టానికి సరిపడిన ఫలితం దక్కనిమాటా నిజమే. ధనం సంఘంలో అధికారాన్నిచ్చేమాటా నిజమే. ఆ అధికారాన్ని నిలబెట్టుకొని ఇతరులను దోచుకోటానికి అనేక అవకాశాలు వారికి వున్నమాటా నిజమే. కాబట్టి కొన్ని లోపాలు వున్నా ఒక పెద్ద సత్యం అతను సమర్థించిన విధానంలో వుంది. కొన్ని కొన్ని పొరపాటులను మనం కనిపెట్టగలిగినా, అతను తేల్చినసూత్రాలు చాలావరకు నిజమైనవని మనం అంగీకరించవలసి వుంటుంది.

కేపిటలిస్టు ప్రభుత్వంక్రింద అధికారం కొంతమంది చేతుల్లో కేంద్రీకృతం అవుతుందని అతనుచెప్పినసూత్రాన్ని విమర్శకులు ఎవ్వరూ పూర్తిగా తప్పని నిరూపించలేక పోయారు. జాయింట్ స్టాక్ కంపెనీల సృష్టివల్ల లాభాలుఎక్కువ మందికి లభించే అవకాశం దొరికినమాట నిజమే. అయినా మార్క్స నిర్వచించిన మూలసూత్రం చెక్కు చెదరలేదు. కొన్ని కొన్ని చిన్న చిన్న పరిశ్రమలు వృద్ధిచెందిన మాట నిజమే. కాని వాటితోపాటు అన్ని పరిశ్రమల్లోనూ కేంద్రీకృతం ఎక్కువ అయింది వ్యవసాయం, కొన్ని కొన్ని పెద్ద

క్షేత్రాలూ, సహకార క్షేత్రాలూ పెరుగుతున్నప్పటికీ, స్వభావంలో వ్యక్తిగతంగానే ఉంది. పరిశ్రమల్లో మాత్రం సహకార తత్వం ప్రబలింది. దీనివల్ల పారిశ్రామికుల మనస్తత్వంలో వచ్చిన మార్పు మార్క్స్ ఊహించినట్లుగానే ఉంది. వారిలో ఐకమత్యం హెచ్చింది. ఇంతకుముందు ధనిక వర్గం చేతుల్లో వున్న కీలకస్థానాలను ఆక్రమించుకోవాలనే కోర్కె ఉత్పన్నమయింది. అన్ని ముఖ్యపరిశ్రమల్లోనూ సోషలిస్టు విధానం కావాలనే నినాదం ప్రతిధ్వనించింది. ధనికవాదం గుత్తవ్యాపారాన్ని ప్రోత్సహించింది. కాని దానిని ఆచరణలో పెట్టటంలో పారిశ్రామికుల విశ్వాసాన్ని కోల్పోయింది."

అతను కేపటలిస్టు విధానం యొక్క పరిణామాన్ని గురించి సామాన్యంగా చెప్పిన మాట లేకాక, అదనపు విలువను గురించి చెప్పినమాటలు కూడా చాలావరకు నిజమే అయినై. ఉత్పత్తి సాధనాలతో ప్రజలకు ప్రమేయం లేకుండా పోవటం వల్ల, ఎంత తక్కువగా ఉత్పత్తి జరిగినా ప్రజల దారిద్ర్యం ఎక్కువ అవుతూనే వుంటుంది అని అతనుచెప్పిన మాట నిజమే అయింది. ధనం దారిద్ర్యం ప్రక్క ప్రక్కన పెరగటం వల్లా, రక్షణ అనేది లేకపోవటం వల్లా, దారిద్ర్యం కోత హెచ్చుతుంది. మార్క్స్ ఉద్దేశంలో శ్రామికశక్తిని అమ్ముకొని బ్రతకటం ఒకరకమైన బానిసత్వమే. పంపకంలోనే కాకుండా వ్యక్తి స్వాతంత్ర్యంలోకూడా అసమానత్వం ఉంటుంది. శ్రామికులు దారిద్ర్యంలో వున్నారంటే, జ్ఞానం

న్యాయం, అధికారం అన్నీ వారికి దూరం అయినట్లే. ఇతర అపేక్షలూ, లాభాలూ వున్నవారు సృష్టించిన ఆలోచనలే వారి వాతావరణంగా తయారవుతుంది. ధనికవాదం మొదట్లో తాము గడించిన జయాలను నిలబెట్టుకోలేదు. అది విషమ పరిస్థితిని కొని తెచ్చుకుంటుంది. అది ప్రకృతి పదార్థాలను దుర్వినియోగ పరచుకొని ఉత్పత్తిసాధనాలే పాడు జేసుకుంటుంది. ఎవ్వరి శ్రామిక శక్తి వల్ల తాను వృద్ధి చెందిందో వారి శ్రేయస్సును అది కాంక్షించదు. తాను ఉత్పత్తిచేసే వస్తువులను అది కల్తీ పరుస్తుంది. దీనివల్ల ప్రజలను మోసం చెయ్యటం, ఉత్పత్తి చేసేవారిలో అపనమ్మకం ఘనీభవించటం జరుగుతుంది. తాను నిరంకుశాధికారం స్వీకరించటంవల్ల తన ఉద్యోగంలో వున్నవారి వ్యక్తిత్వం దెబ్బతింటుంది. ప్రభుత్వ విధానంగా అది ప్రజాస్వామిక తత్వానికి వ్యతిరేకం. తత్ఫలితంగా తన అధికారం క్రింద వున్నవారు తప్పని సరిగా ఎదురుతిరిగేటట్లు అదే చేస్తుంది. అంతర్యుద్ధం తప్పనిసరి అవుతుంది. తనవల్ల ప్రథమంలో కలిగిన అభివృద్ధి తానే నాశనం చేసుకుంటుంది. చివరికి ఎప్పటి కప్పుడు మార్కెట్టు అవుసరంవుండి, ముడిపదార్థాలను వశంలో వుంచుకోవలసిన అగత్యం కలిగి, యుద్ధాలకు దారితీస్తుంది.

మార్క్స్ చెప్పిన మాటల్లో ఇటువంటి నిర్వచనాలు ఎన్నో నిజమని తేలినై. కష్టపడుతున్నవారు సంఘంలో దారిద్ర్యం అనుభవిస్తున్నంత కాలం, అధికారం కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం అయి, అధికారంవల్ల వచ్చే హక్కు-

లను వారు అనుభవిస్తున్నంత కాలం, మార్క్స్ సిద్ధాంతా నికి బలం ఉంటూనే వుంటుంది. వర్గాలు లేని దోపిడీ లేని వ్యవస్థను మార్క్స్ ఊహించాడు. దీనిని పొందితే గాని సమానత్వాం అనేదాన్ని అంతా అనుభవించ లేరని చెప్పాడు. ఈ అభి ప్రాయం న్యాయదృష్టి గలిగిన ఎవ్వరి నైనా ఉత్తేజపరచక ఏం చేస్తుంది. మార్క్స్ దృష్టిలో అంతర్గతంగా వున్న ఈ న్యాయదృష్టే అతని ప్రజానురంజకత్వానికి కారణం.

## ४

మార్క్స్ హెగెల్ భావవాదానికి వ్యతిరేకంగా తన సిద్ధాంతాన్ని నిర్మించాడని చెప్పుకున్నాం. అయితే 'మనస్సు' ప్రధానమా 'పదార్థం' ప్రధానమా అనే దానిమీద కాదు- వారి నైరుధ్యం. హెగెల్ మనస్సుకి ప్రాధాన్యత ఇచ్చాడను కోవటం కూడా సత్యం కాదు. అతను మనస్సునీ పదార్థాన్నీ కూడా పరిపూర్ణ భావానికి లోబరిచాడు. ఈ రెంటినీ పరి పూర్ణ భావం కౌగిలినుంచి విడిపించటానికి ప్రయత్నించాడు మార్క్స్. "మార్క్స్ భౌతికవాదం నిజంగా వాస్తవిక వాదం. అతను 'సంఘానికి చెందిన మనస్సు' రూపంలో మనస్సును సమర్థించాడు. అదేవిధంగా పదార్థాన్నీ సమర్థిం చాడు. అతను 'మనస్సా, పదార్థమా?' అనే లెక్కలో ప్రశ్న వేసుకున్నట్లు కనబడదు. మానవ ప్రపంచంలో మనస్సూ పదార్థం వొకదానిలో వొకటి పెనవేసుకొని వుండటంవల్ల ఏది ముఖ్యం అని ఆలోచించటం వ్యర్థం అని

అతను అభిప్రాయ పడ్డాడు. మెదడుకి సంబంధించిన భౌతిక పదార్థం లేకుండా మనస్సు అనేది వుండదు. ఇంద్రియాలకు సంబంధించిన భౌతిక సాధనాల ద్వారా మాత్రమే మానవుడు అనుభవాలను స్వీకరించగలుగుతాడు. తాను వేటిమధ్యన బ్రతుకుతున్నాడో, వేటిమీద పని చేస్తున్నాడో, ఆ భౌతిక పదార్థాలు తమ రూపాన్నీ స్వభావాన్నీ ఉత్పత్తిశక్తినీ, అతని ప్రయత్నంవల్లే పొందాయి, కనుక మనస్సువల్ల ఉత్పత్తి అయినవే అవి అని చెప్పుకోవాలి," అన్నాడు జి. డి. హెచ్ కోల్.

మనస్సునీ పదార్థాన్నీ ఒకటిగా చూడగలగటంవల్లనే మార్క్స్ వ్యక్తియొక్క వాస్తవికతను గుర్తించగలిగాడు. ఎలాగంటే మనిషి అనేవాడిలోనేగదా; ఈ రెండూ సమన్వయించబడింది.

కాని మార్క్స్ మానవుణ్ణి రూపొందించటంలో సాంఘిక శక్తులకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడంవల్ల వ్యక్తి, వ్యక్తిత్వం దెబ్బతినటం, అతని సిద్ధాంతం అనేక అపార్థాలకు అవకాశం ఇవ్వటం జరిగింది. దేనికీ సంబంధించకుండా విడిగా వుండే వ్యక్తి ఊహాజనితుడని అతను అభిప్రాయపడ్డాడు. దీనినిబట్టి వ్యక్తే ఊహాజనితుడనే స్థితికివచ్చాడు. అందువల్ల వాస్తవికతను వ్యక్తికి ఆపాదించకుండా, వ్యక్తి దేనికి చెంది వుంటాడో దానికి ఆపాదించాడు. అంటే వర్గానికి ఆపాదించాడు. వాస్తవికతనూ, ప్రపంచాన్ని మార్చే శక్తినీ అతను వ్యక్తికి ఆపాదించలేదు. వర్గానికి ఆపా

దించాడు. దీనితో వ్యక్తి మూలపడి వర్గం పెత్తనంలోకి వచ్చింది. ఇలా ఆలోచించటంవల్ల 'మనస్సూ పదార్థం రెండు వాక్క మనిషిలోనే సమన్వయించబడినై' అని చెప్పిన తన సిద్ధాంతాన్నే, తాను విస్మరిస్తున్నాననే భావం అతనికి కలగకపోవటం నిజంగా ఆశ్చర్యకరమైన సంగతి. శరీరం లేకుండా మనస్సు అనేది అతని భావన ప్రకారం ఉంటానికి వీల్లేదు. అయినా అతను శరీరంలేని వర్గానికి వాస్తవికత్వాన్ని ఆపాదించాడు! దీనివల్ల వర్గం చేతుల్లో కీలుబొమ్మయి కూర్చున్నాడు మానవుడు. ఈ పరిస్థితిని వ్యాఖ్యానిస్తూ కోల్, "ఆనాడు హెగెల్ సిద్ధాంతాని ఎదుర్కోవటం ఎక్కువ అవసరమై వుండవచ్చు. కాని వర్గాలకు వాస్తవికత్వాన్ని అంటగట్టటం తర్కానికే విరుద్ధం. భావవాదానికి భౌతిక వాదాన్ని ఎదురుగా నిలబెట్టటంవల్ల, హెగెల్ ప్రభావానికంటే మార్క్స్ ప్రభావానికి లోనైన యుగం మీాదకు అనేక అపార్థాలను విసరటంగా పరిణమించింది." అన్నాడు.

౫

మానవుడు స్వతంత్రంగా ఆలోచించగలడు. కాని ఈ స్వాతంత్రతకు కొన్నిహద్దులుంటై. ప్రతి ఆలోచనకూ ఆ కాలపు పరిస్థితులే గదా ఆధారం. కాబట్టి ఆ కాలపు ప్రభావం ఆలోచనలమీాద ఉండకుండా వుండదు. ఆ మేరకు ఆలోచన సంకుచిత పక్షే వుంటుంది. ఈ సిద్ధాంతం మార్క్స్ ఆలోచనలకు కూడా వర్తిస్తుంది. అతని తరువాత వచ్చిన పరిశోధనా ఫలితాలను బట్టి అతను ఆలోచించ లేడుగదా!

ఆనాడు నిజం అనుకొన్న కొన్ని భావాలు తప్పని తరువాత పరిశోధనలు చెపితే, అంతకుముందు నిజం అనుకున్న ఆధారాల మీద తన ఊహను నిర్మించినవారు ఏమి చెయ్యగలుగుతారు. అందుకని ఏ సిద్ధాంతంలోనైనా కొన్ని లోట్లూ, పొరపాట్లూ ఉండక తప్పదేమో - అనిపిస్తుంది. మార్క్సిజాన్ని కూడా మనం ఈ దృష్టితోనే చూడాలి. చిన్న చిన్న విషయాలు అంటించి మార్క్స్ సృష్టించిన దృష్టి చెప్పుకోదగ్గది - ఏ కాలానికైనా వర్తించేది.

మార్క్స్ 'ఈ ప్రపంచంలోని జీవకోటి అంతా అనుక్షణం మారుతూ వుంటుంది' అని చెప్పాడు. అంటే స్థూలంగా ఈ ప్రపంచం అనుక్షణం మారుతూ వుంటుందని మనం చెప్పుకోవచ్చు. కాబట్టి ఈ మారే ప్రపంచానికి వర్తించే సిద్ధాంతాలుకూడా మారుతూ వున్నప్పుడే, ఈ ప్రపంచాన్ని అవి నిజంగా వ్యాఖ్యానించగలుగుతై. ఎప్పుడో నిర్వచించబడిన సిద్ధాంతం సర్వకాల సర్వావస్థలకూ వర్తిస్తుందనుకోవటం భ్రమ ప్రమాదాలకు దారి తీస్తుంది.

ఇది మార్క్సిజానికి కూడా వర్తిస్తుంది. మార్క్సిజం ఎల్లప్పటికీ యదాతథంగా ప్రపంచాన్ని అర్థం చెప్పటానికి సరిపోతుందని అనుకోవటం మార్క్స్‌కే అపచారం చెయ్యటం అవుతుంది. తన్ను శంకించమనీ, ప్రశ్నించమనీ మార్క్సిజమే మనకు బోధిస్తుంది. ఇది మార్క్సిజం గొప్పతనం. మార్క్స్ సృష్టించ దలచిన దృష్టియొక్క ఔన్నత్యాన్ని జి. డి. హెచ్ కోల్ ఈ విధంగా వర్ణించాడు. 'మార్క్స్

వాదంలోని ఇతర లక్షణాలకు వలెనే, గత తార్కికవాదాన్ని కూడా చాదస్తంగా చూడకూడదు. మామూలు తర్కం ద్వారా కంటే ఈ వాదం వల్ల ఉపయోగం ఉందని నేను అప్పుడప్పుడూ అనుకుంటూ వుంటాను. కాని ఈ వాదాన్ని నేను నా ఆలోచనకు సహాయకారిగా మాత్రమే వాడతాను. నాకు ఎంతవరకు సహాయకారిగా వుంటుందో అంతవరకే దాని సహాయాన్ని తీసుకుంటాను. దానిని వొక చాదస్తంగా నేను అనుసరించను. ఆలోచనకు వొక మార్గంగా మాత్రమే నేను దానిని పరిగణిస్తాను. అది ఆలోచనకు సహాయకారిగా ఉన్నంత వరకే దాని ప్రయోజనం మనకు కనబడుతుంది. మన ఆలోచనకు అది అధికారి అవటంవల్ల ప్రయోజనం వుండదు. ఇతరులకు కూడా ఇది ఈవిధంగానే ఉపయోగపడగలదని నేను విశ్వసిస్తున్నాను."

# 'ప్రజాస్వామిక తత్త్వవేత్త'

# జాన్ డ్యూయీ

రష్యాలో మళ్ళీ అల్లకల్లోలం ప్రారంభమైంది. బెరియా బర్తరఫ్ జరిగింది. 'బెరియా అనుయాయులు' అనే నెపంమీద అనేక అరెస్టులు జరుగుతున్నాయి, అంటే. ఇన్ని ఏళ్ళ తరువాత కూడా బోల్షివిక్ పార్టీ రష్యాలో సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యలేక పోయిందనే అనుకోవలసి వస్తూవుంది. 'అధికారంకోసం' రాజకీయ ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి-అనుకోవలసి వొస్తూవుంది.

స్టాలిన్ మరణానంతరం జరుగుతున్న సంఘటనలు, 'నిరంకుశత్వం ప్రజాస్వామికానికి దారి తియ్యద'ని నిరూపిస్తున్నాయి. మార్క్స్ ఊహించినట్లు ఈపరిస్థితుల్లో 'స్టేట్' దానంతట అది రాలిపోదని, ఇంకా గట్టిపడటానికే ప్రయత్నం జరుగుతుందని ఋజువు చేస్తున్నవి.

స్టాలిన్ మరణం, నిరంకుశవిధానంలోని చెడుని బయట వేసింది. ప్రపంచానికి బోల్షివిక్ విధానంమీదవున్న మోజుని తగ్గించి, ప్రజాస్వామిక సూత్రాలపట్ల సుముఖత్వాన్ని ప్రేరేపిస్తూవుంది. ఈ కారణంవల్ల ప్రజాస్వామిక తత్త్వశాస్త్రజ్ఞుడైన జాన్ డ్యూయీనిగురించి తెలుసుకోవలసిన అవసరం హెచ్చవుతూవుంది.

జాన్ డ్యూయీ అమెరికా దేశస్థుడు 'సంస్కారంలో వున్న సంఘర్షణలకు భావంతో కూడిన రూపాలనిచ్చి, ఆ సంఘర్షణల మూలకారణాలను తెలుసుకొని, వాటి నివారణో పాయాలను తెలియజెయ్యటం, తత్త్వశాస్త్రం యొక్క ప్రయోజనం' అని అతని ఉద్దేశం. ఏ తత్త్వశాస్త్రం అయినా, అది పైకి ఎంతజటిలంగా, టెక్నికల్‌గా, తటస్థంగా వున్నట్లు కనిపించినా, కొన్ని సాంఘిక ఆదర్శాలను పెట్టుకోవడం, వాటిని సాధించడానికి మానవులను ఉత్సాహపరచడం తన పనిగా పెట్టుకుంటుంది. గైల్ కెన్నడీ డ్యూయీని గురించి వ్రాస్తూ, 'తత్త్వశాస్త్రజ్ఞుడు ఒక ప్రవక్తక్రింద లెక్క; తన ఆదర్శానికి ఒక స్పష్టమైన, నికరమైన రూపాన్నివ్వటానికి ప్రయత్నించే ప్రవక్త' అన్నాడు. కాబట్టి ఏ తత్త్వశాస్త్రజ్ఞుడైనా తన మీమాంసతో నాటి సాంఘిక వ్యవస్థను సమర్థించటానికికో, కూలద్రొయ్యటానికో సహాయపడుతూనే వుంటాడు. ప్లేటో, అరిస్టాటిల్ మొదలైనవారి తత్త్వశాస్త్రాలు గ్రీసుదేశపు నాగరికత యొక్క విలువలను సమర్థించటానికి సహాయపడినవి. డికార్టిస్, మార్క్స మొదలైనవారు నిర్వచించిన తత్త్వశాస్త్రాలు, క్రొత్త విలువలను సృష్టించి, క్రొత్త నాగరికతను సమర్థించి, సంఘంలో వీటికి అనుకూలమైన మార్పులను కోరి, వాటిని సాధించడానికి ప్రజలను పురికొల్పినవి. జాన్ డ్యూయీ ఈ రెండవ తత్త్వవేత్తల తరగతికి చెందినవాడు. అమెరికా జీవితంలో, ప్రజాస్వామిక విధానానికి ఉత్పత్తిల్లిన విషమ పరిస్థితులే అతని తత్త్వశాస్త్రానికి మూలం. ఆ విషమ పరి

స్థితుల పరిష్కారానికి ఎప్పటికప్పుడు అతను సూచించే మార్గాల సారాంశమే అతని తత్వశాస్త్రం.

డ్యూయీ ప్రథమదశలో, తన సమకాలికుల్లో ఎక్కువమందికిమల్లే, హెగెల్ పలుకుబడిలో వుండేవాడు. హెగెల్ భావవాదాన్ని ప్రచారం చేసేవాడు. కాని; పీర్స్, విలియం జేమ్స్ మొదలైన తత్వశాస్త్రజ్ఞుల ప్రభావంవల్ల క్రమక్రమేణా ప్రెగ్మాటిస్టుగా తయారయ్యాడు. ప్రెగ్మాటిజం ప్రకృతికి అతీతంగా వుండే శక్తిని దేనినీ అంగీకరించదు; శాస్త్రజ్ఞానానికి ప్రాధాన్యత ఇస్తుంది. అన్ని సమస్యలను శాస్త్రజ్ఞానంతో పరిష్కరించుకోవా లంటుంది. ఎప్పటికప్పుడు ఫలితాలనుబట్టి సిద్ధాంతానికి విలువలు కట్టుకుంటూ, అవసరమైన మార్పులు చేసుకుంటూ అభివృద్ధి చెందాలంటుంది. ఆనాటినుంచీ ఈనాటివరకు డ్యూయీ ఈ సిద్ధాంతానికి అనుకూలంగానడుచుకుంటున్నాడు. ఆనాటినుంచీ ఈనాటివరకూ, అతను ఎప్పుడూ మార్పునే అభిలషిస్తున్నాడు. డ్యూయీకీ, మిగిలిన తత్వవేత్తలకూ, అతని రచనలు చదువుతుంటే, ఒక విస్పష్టమైన భేదం కనిపిస్తుంది. మిగిలిన తత్వవేత్తలు సిద్ధాంతాలను నిర్వచనం చేస్తారు. డ్యూయీ ఇప్పుడు ప్రజలను క్షోభపెడుతున్న సమస్యలకు శాస్త్రజ్ఞానం సహాయంతో పరిష్కార మార్గాలను సూచిస్తాడు. అంటే అతని భావనలో సిద్ధాంతీకరణం కంటే ఒక పద్ధతి ప్రాముఖ్యం వహిస్తుంది.

'అన్వేషణకు సంబంధించిన ప్రతి శాఖకూ శాస్త్రజ్ఞానాన్ని జోడించడం వొక్కటే పారిశ్రామిక ప్రజాస్వామి

కంలో ఉత్పన్నమయ్యే సమస్యలకు పరిష్కార మార్గం' అని అతని ఉద్దేశం. కాబట్టే డ్యూయీ తత్వశాస్త్రం ఒక సిద్ధాంత విపులీకరణం అనుకున్న దానికంటే, ఒక పరిష్కారమార్గం అనుకోవటం సమంజసం. తన దెబ్బయ్యోయేట, అంటే ఏభయ్యేళ్ళ నిరంతరకృషి తరవాత డ్యూయీ తన తత్వ శాస్త్రం ఇంకా మారుతూనే వుందనీ, అందువల్ల తన సిద్ధాంతాన్ని నిర్వచించటానికి వీల్లేదనీ, అనటానికి ఇదే కారణం. ఈ కారణంవల్లే, 'డ్యూయీ ఏమి చెప్తున్నాడు?' అని ఎవ్వరైనా ప్రశ్నిస్తే ఇదమిద్ధమని తేల్చి చెప్పటం కష్టం అవుతుంది. అతని ఆలోచన ఏ విధంగా పరిణామం చెందిందో, ఒక తాత్త్వికవిధానాన్ని అతను ఏవిధంగా చేరుకో గలిగాడో, ఆ విధానాన్ని ఏ విధంగా ఆచరణలో పెడుతున్నాడో, దానివల్ల సంఘానికి కలుగుతున్న లాభాలేమిటో మాత్రమే మనం చెప్పగలం.

౨

జాన్ డ్యూయీ బర్లింగ్‌టన్‌లో వున్న వెర్మాంట్ అనే పట్టణంలో జన్మించాడు. డార్విన్ వ్రాసిన 'ది ఆరిజిన్ ఆఫ్ ది స్పీసీస్' అనే గ్రంథం ఆ సంవత్సరంలోనే ప్రచురించ బడింది. ఆర్థికంగా, పారిశ్రామికంగా అమెరికా మహర్దశను అనుభవించబోయే ముందు రోజు లవి. గ్రాడ్యుయేట్ అయిన తరువాత అతను మూడు సంవత్సరాలు హైస్కూలులో చదువు చెప్పాడు. ఆ రోజులలో తన పాత ప్రొఫెసర్ అయిన హెచ్. ఏ. పి. టోరేతో కలిసి తత్త్వశాస్త్రంలో

కృషిచేస్తూ, హారిస్ అనే అతను నడుపుతున్న 'జర్నల్ ఆఫ్ స్పెక్యులేటివ్ ఫిలాసఫీ' అనే పత్రికకు తన రచనలను పంపుతుండేవాడు. కొద్ది రోజులలోనే పై వారిద్దరి సానుభూతితో, గ్రాడ్యుయేట్ పని చెయ్యటానికిగాను, హాప్కిన్స్ కళాశాలకు వెళ్ళాడు. అప్పుడు ప్రెగ్మాటిజం సృష్టికర్త అయిన ఛార్లెస్ పీర్స్, జి. స్టాన్లీ హాల్ అక్కడ చదువు చెపుతుండేవారు. కాని, డ్యూయీని వీరు మొదట్లో ఆకర్షించలేదు. మొట్టమొదటగా అతన్ని ఆకర్షించినవాడు అక్కడ తత్వశాస్త్రోపాధ్యాయుడుగావున్న జార్జి సెల్వెస్టర్ మోరిస్. ఆ రోజులలో ఇతను హెగెల్ వాదానికి తాను తయారుచేసిన నిర్వచనాన్ని ప్రచారంచేస్తూ వుండేవాడు. డ్యూయీని త్వరలోనే ఈ వాదం ఆకర్షించింది. డ్యూయీని ఈ వాదం ఆకర్షించటానికి మరొక ప్రబలమైన కారణం కూడా వుంది.

ఆనాడు హెగెల్ భావవాదానికి వ్యతిరేకంగా 'సైంటిఫిక్ ఎంపరిసిజమ్' మాత్రమే ప్రచారంలో వుండేది. నిజం చెప్పాలంటే దాన్ని ఒక వాదంగా పరిగణించటానికి వీల్లేదు. ఇది ముఖ్య సమస్యలకు ఏవిధమైన పరిష్కార మార్గాన్నీ సూచించక వాటిని 'పోస్టుపోన్' చెయ్యమని చెపుతుంది. కాబట్టి జిజ్ఞాసువుల్ని ఇది ఆకర్షించలేక పోయింది. ఈ పరిస్థితులలో డ్యూయీకి అనుసరిస్తే హెగెల్ భావవాదాన్ని అనుసరించటమో, లేకపోతే అసలు తత్త్వ శాస్త్రాభిరుచికి స్వస్తి చెప్పటమో - ఈ రెండే మార్గాలు కనుపించినై. ఈ రెండుమార్గాలలో డ్యూయీ, హెగెల్ భావవాదాన్ని వరించడంలో ఆశ్చర్యం లేదు. ఈరోజులలో

మార్క్సుకిమల్లే డ్యూయీకూడా తీవ్రవాద 'హెగలియన్' గా వుండేవాడు. వీరిద్దరూ కొన్నాళ్లు సాంఘికాభివృద్ధికి, శాస్త్రపరిశోధనలకు ఉపయోగించటానికిగాను హెగల్ వాదం ఉపకరిస్తుందని భావించినవారే!

1884 లో ప్రొఫెసర్ మోరిస్, జాన్ హాప్కిన్స్‌ని విడిచిపెట్టి మిచిగాన్ విశ్వవిద్యాలయంలో చేరి, అక్కడకు తనకు సహాయకుడుగా డ్యూయీని రప్పించాడు. అక్కడ వున్న రోజులలో డ్యూయీ, శాస్త్రపరిశోధనలను హెగల్ భావవాదంతోనూ, హాల్ నుంచి 'ఎక్స్‌పెరిమెంటలిజా'న్ని తాను నిర్మించుకున్న మతచట్టంతోనూ సమన్వయ పరచటానికి విశ్వప్రయత్నం చేస్తూవుండేవాడు. ఈ ప్రయత్నాన్ని 'ఆబ్జెక్టివ్ మెథడ్ ఇన్ ఫిలాసఫీ' అనేవాడు. ఈ పద్ధతి ప్రకారం అతను పదిహేను సంవత్సరాలు పనిచేశాడు. అప్పటికి దాని అసమగ్రతను గ్రహించాడు. 'ఆదర్శం అనేది స్థిరంగా వాస్తవికతలో వుందని ఒప్పుకుంటే, మానవుడు తన ప్రయత్నంవల్ల ప్రపంచాన్ని అభివృద్ధిపరచగలడను కోవటం కుదరదు' అని అతను స్వానుభవంవల్ల ఒక నిర్ధారణకు రాగలిగాడు. అతనికి ఈవిధంగా దృష్టిలో మార్పూ, మనస్సులో సందేహాలు కలుగుతున్నసమయంలో, విలియం జేమ్స్ తాను వ్రాసిన 'ప్రిన్సిపిల్స్ ఆఫ్ సైకాలజీ' అనే గ్రంథాన్ని ప్రచురించాడు. ఈ గ్రంథం డ్యూయీకి చాలా సహాయం చేసింది. అతను ఈ గ్రంథంలో రెండు దృక్పథాలను కనిపెట్టగలిగాడు. ఇందులో మొదటిది - భావాల పరిణామం, చరిత్ర మామూలు భావవాద ధోరణిలోనే

చిత్రించబడటం. రెండవది- మనస్సుకి మూలం శరీరమేనని, మనస్సుకు కారణాలు శరీరానికి సంబంధించిన వొడుదుడుకులే నని అంగీకరించటం. విలియంజేమ్స్ వెలిబుచ్చిన ఈ భావం కూడా క్రొత్తదికాదు. 'మనస్సు శారీక పరిణామానికి సంబంధించింది' అని చెప్పే 'బిహేవియరిజం' అరిస్టాటిల్ నాటినుంచివున్న సిద్ధాంతమే! అయితే, జేమ్స్, పరిణామ వాదంవల్లం సంక్రమించిన కొత్తబలంతో, ఈ భావాన్ని చాలా ఆకర్షవంతంగా ప్రదర్శించగలిగాడు. 'భవిష్యత్తుకు సంబంధించిన ఆదర్శాలను సాధించటానికి ప్రయత్నించటం, దానికి అనువైనమార్గాలను అవలంబించటం పదార్థంలో మనస్సు అనేది, వున్నదనడానికి ఉదాహరణ' అన్నాడు విలియం జేమ్స్.

ఈ సిద్ధాంతాన్ని డ్యూయీ హృదయపూర్వకంగా అంగీకరించాడు. అలా అంగీకరించి తన పాత భావవాదాన్ని వొదులుకున్నాడు. 'విలువలూ, ప్రయోజనాలూ, అసలు వాస్తవికతలో, మనచేత క్రమక్రమేణా తెలుసుకోబడటానికి ఉండనైనా వుండాలి; లేకపోతే మానవుడు తన పరిసరాలతో రాజీపడటానికి వీటిని సృష్టించుకొని అయినా వుండాలి. అంతే గాని, ఈ విలువలు వాస్తవికత్వానికి దూరంగావున్న ఏశక్తి వల్లో సృష్టించబడినవి కావు. ఇవి నిత్యజీవితంలో ఏర్పడే సంఘర్షణలవల్లా, మనం అవలంబించే విధానంవల్లా ఉత్పన్న మౌతున్నవి. మనం అవలంబించే విధానంలో మనకు స్వతంత్రత అనేది వుండబట్టే, పరిణామానికి ప్రయోజనం అనేది ఏర్పడుతూవుంది. మానవుడు తన బుద్ధిబలంతో

భవిష్యత్తును కొంతవరకు అదుపులోకి తెచ్చుకోగలుగుతున్నాడు. కాని, ఈ శక్తి సంకుచితంగానే వుంటుంది. హద్దులకు లోబడివుండే మానవుల ఆదర్శాలు, పరిస్థితుల మార్పులతో, మారుతూనే వుంటాయి. జ్ఞానం అభివృద్ధి చెందినకొద్దీ విలువలు మారుతుంటాయ్.' ఈవిధంగా ఆలోచించటం మొదయిపెట్టాడు డ్యూయీ.

జ్ఞానంయొక్క ఈ స్వభావాన్ని అంగీకరించిన తత్వశాస్త్రం కొన్ని విలువలను తెలుసుకోవటానికిగాను, 'అప్సల్యూట్ ఆరిజిన్స్' 'అప్సల్యూట్ ఫైనాలిటీస్'గా ఉంటవని అంగీకరించదు. విధానం ముఖ్యం డ్యూయీ 'ది ఇన్ఫ్లుయెన్స్ ఆఫ్ డార్విన్ ఆన్ ఫిలాసఫీ' అనే గ్రంథంలో చెప్పినట్లు, 'జీవితంలో జరిగే సంఘర్షణలు ఎక్కడ, ఎట్లా జరుగుతూవుంటే నిర్వచించి, వాటిని ఉపశమింపజేసే మార్గాలను వెతికి తెలియజెప్పటం తత్వశాస్త్రంయొక్క కర్తవ్యం' అవుతుంది. డ్యూయీ రచించిన వివిధ గ్రంథాలలో ఈ సిద్ధాంతాచరణే కనిపిస్తుంది. 'ది క్వెస్టు ఫర్ సర్టెనిటీ' అనే గ్రంథంలో అతను 'ఈనాటి శాస్త్రజ్ఞానంతో మానవుల్ని వేధిస్తున్న వివిధ సమస్యలకు పరిష్కార మార్గం సూచించటమే తన రచనలద్వారా తాను చేస్తూన్న పని' అన్నాడు. ఈ ప్రపంచాన్ని గురించి మనకున్న నమ్మకాలకూ, నిత్యజీవితంలో అనుక్షణం మనల్ని నడిపే విలువలకూ, ప్రయోజనాలకూ ముందు సమన్వయం కుదరాలి. అలా కుదరనప్పుడు దేనిదారి దానిదే అయి, జీవితం గంద్రగోళం అయి, అనవసరమైన సంఘర్షణలమధ్య బ్రతుకే నిష్ఫలం

అవుతుంది. అని అతని అభిప్రాయం. మన భావాలయొక్క, ఆచారాలయొక్క, సంస్థలయొక్క యోగ్యతాయోగ్యతలను, వాటి ఫలితాలనుబట్టి ఎప్పటికప్పుడు నిర్ణయించుకోవడం డ్యూయీ పద్ధతి యొక్క ముఖ్యలక్షణం. ఈ పద్ధతివల్ల అజ్ఞానం, నిరంకుశత్వం, గందరగోళం నశిస్తాయి. మానవులు వైరుధ్యంలోపడి విడిపోవలసిన అవసరం వుండదు. సంఘం వర్గ వైషమ్యాలతో నాశనంఅయ్యే పోరాటాలలో చిక్కుకోవలసిన అవసరం వుండదు. అనేక శతాబ్దాలక్రితం బేకన్ చెప్పినట్లు ఈ పని జరిగితే, 'వేటిని సమన్వయ పరచలేక పోవటంవల్ల మానవవ్యవహారాలు అయోమయం అయినవో, అటువంటి హేతువాదాన్ని, స్వానుభవాన్ని సమన్వయపరచి కృతార్థులం అయ్యాం' అనుకోవడానికి వీలవుతుంది. ఈ విధమైన సమన్వయం, మూఢనమ్మకాలను, మూఢాచారాలను భ్రాంతులను నిర్మూలించి, ప్రతివ్యక్తికీ అభివృద్ధిచెందే అవకాశం ఒకరికొకరు సహకారంచేసుకొనే సద్భావం వున్న సంఘం నిర్మించబడటానికి సహాయపడుతుందని డ్యూయీ విశ్వాసం.

## 3

జాన్ డ్యూయీని ప్రజాస్వామిక తత్త్వవేత్త అని చెప్పుకోవచ్చు. అతడు తన తత్త్వశాస్త్ర పాండిత్యంలో ఎక్కువభాగాన్ని ప్రజాస్వామికవిధానంలో వచ్చే చిక్కులను విడదీయటానికి వినియోగపరిచాడు-అని చెప్పటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. ఈవిషయంలో ఇతణ్ణి థామస్

జఫర్‌పన్ అనే మరొక అమెరికన్ తత్త్వవేత్తతో పోల్చ వచ్చు. జఫర్‌సన్ ప్రజాస్వామిక విధానాన్ని మానవ చరిత్రలో ఒక అత్యద్భుతమైన సంఘటనగా భావించేవాడు. డ్యూయీ, ప్రస్తుతం ప్రజాస్వామికం విషమసమస్యలను ఎదొర్కొంటూ వుందనీ, వాటిని పరిష్కరించి ప్రజాస్వామిక విధానాన్ని సరైన మార్గంలో పెట్టటం తన విధి అనీ భావిస్తాడు. ఇద్దరూ మానవ సంఘంలో మూఢనమ్మ కాలకూ, శాస్త్రపరిశోధనలకూ సంఘర్షణ జరుగుతూ వుందని గ్రహించినవారే! వారిద్దరికీ సామాన్య మానవునిలో విశేషమైన నమ్మకంవుంది. ఇద్దరూ వ్యక్తి యొక్క ప్రాముఖ్యతను గమనించినవారే. ప్రజాస్వామిక విధానాన్ని జయప్రదంగా ఆచరణలో పెట్టటానికి విద్య ముఖ్యమని ఇద్దరూ నమ్మి ప్రచారం చేసినవారే!! గైల్ కెన్నడీ చెప్పినట్లు సాంఘికంగా క్రమబద్ధం చెయ్యబడిన బుద్ధిబలాన్ని లౌకిక వ్యవహారాలలో ప్రవేశ పెట్టటంవల్ల ప్రజాస్వామిక జీవనం సామాన్య మానవుని మామూలు జీవితమే అవు తుందని ఇద్దరూ ఆశించిన వారే!!

కానీ, వీరిద్దరికీ ఈ పోలికలతోపాటు కొన్ని అభి ప్రాయ భేదాలు కూడా వున్నాయి. పారిశ్రామిక కేంద్రీ కరణవల్ల ప్రజాస్వామిక విధానం దెబ్బతింటుందని జఫర్‌సన్ భావిస్తూ వుండేవాడు. జేమ్స్ మేడిసన్‌కు వ్రాసిన ఉత్తరంలో తన అభిప్రాయాలను ఈ విధంగా వెల్లడించాడు —'మన ప్రభుత్వాలు, మనదేశం వ్యావసాయిక దేశంగా వున్నంత కాలం నీతిగా ప్రవర్తిస్తాయని నేను అనుకుంటున్నాను.

ఖాళీస్థలాలు దేశంలో వున్నంతకాలం ఇది సాగుతుంది. అలాకాక పెద్దపెద్ద పట్టణాలు ఒకదానిమీద ఒకటిగా కేంద్రీకృతం అవటం మొదలు పెట్టినప్పుడు, పాశ్చాత్య దేశాలకుమల్లే మనదేశం కూడా నీతి బాహ్యం అవుతుంది' అన్నాడు.

అమెరికా అభివృద్ధి జఫర్‌సన్ కోరనివిధంగా జరిగింది. అమెరికాలో పరిశ్రమలు వృద్ధిచెందినయ్. పరిశ్రమలు కేంద్రీకృతం అయినాయి. డ్యూయీ తత్వశాస్త్రం, ఈ మార్పును గమనంలోకి తీసుకొని వృద్ధిచెందింది. డ్యూయీ ప్రయత్నం 'ఇంచుమించు జఫర్‌సన్ భావాలను పారిశ్రామిక నాగరికతలో ప్రవేశపెట్టటానికి చూడటమే' అని చెప్పకోవచ్చు.

బోల్షివిక్ విధానం ఫలితాలు ప్రజలను ఆకర్షించలేకపోతున్న ఈ రోజులలో డ్యూయీవంటి ప్రజాస్వామిక తత్త్వవేత్తల అభిప్రాయాలను జిజ్ఞాసువులు సాంగోపాంగంగా తెలుసుకోవలసిన అవసరం దృఢతరం అవుతూవుంది. 'మానవుల సమస్యలు' అనే గ్రంథంలో జాన్‌డ్యూయీ ఈనాటి సాంఘిక పరిస్థితిని ఈవిధంగా వర్ణించాడు: 'మనం సంకరమైన, విభాగించబడిన జీవితాన్ని అనుభవిస్తున్నాం. వ్యతిరేక శక్తులచేత ఇటూఅటూ గుంజ బడుతున్నాం. పాత తత్త్వశాస్త్రాలేగాని, సంపూర్ణమైన నవీన తత్త్వశాస్త్రం ఈనాటికీ మనకు లేదు. వ్యతిరేక గుణాల కలగూరగంపగాని, సాంఘిక వ్యవస్థగాని, విద్యావ్యవస్థగాని మనకులేదు. ప్రకృతి

శాస్త్రిలలో పద్ధతులకూ పర్యవసానాలకూ వున్న భేదాలను చూచినా, మతంలోనూ, నైతిక విలువలలోనూవున్న భేదాలను చూచినా మన సంఘంలో ముఖ్యసూత్రాలపట్ల మనకు ఏకీభావం లేదని స్పష్టమౌతుంది. ఇది చాలా విషాదకరమైన పరిస్థితి' అన్నాడు.

మరొకచోట ప్రజాస్వామికాన్ని గురించి ఈవిధంగా వ్రాశాడు:

'చర్చలద్వారా ఒకరి అభిప్రాయాలను వొకరు తెలుసుకోవటం ద్వారా, సాంఘిక భేదాభిప్రాయాలను తొలగించుకోవటమే రాజకీయ ప్రజాస్వామికంయొక్క ముఖ్యోద్దేశం. ఈ పద్ధతి అన్వేషణద్వారా, నిరూపణద్వారా, మార్పును సాధించే శాస్త్రీయ విధానానికి చేరువగా వుంటుంది. ఈ విధానం నైతిక విలువలు సైన్సుకీ శాస్త్రీయ విధానానికీ విడిగా వుంటాయనే భ్రమను తొలగించాలి. మానసిక జీవితం కాయకష్టజీవితంకంటె గొప్పదనేభావాన్నీ ఇహలోక జీవితంకంటె పరలోక జీవితం గొప్పదనే భావాన్నీ రూపుమాపాలి.'

మరొకచోట ప్రజాస్వామిక విధానాన్ని సమర్థిస్తూ డ్యూయీ ఇలా వ్రాశాడు: 'వ్యక్తియొక్క విలువనూ, గౌరవాన్నీ గమనించటమే ప్రజాస్వామికంయొక్క ముఖ్యలక్షణం. పరస్పరగౌరవ సహకారాలవల్లా, తమ అనుభవాలను పోల్చిచూచుకొని ఏకం చేసుకోవటంవల్లా, మానవజాతి సక్రమంగా జీవించగలుగుతుంది. ఈరకం జీవితం ఏ

వ్యక్తికి ఆవ్యక్తికి లాభదాయకంగానూ వుంటుంది; ఇతరుల వ్యక్తిత్వాన్ని అభివృద్ధి పరచేదిగానూ వుంటుంది.' ఈ విధంగా ప్రజాస్వామిక విధానం యొక్క ఉపయోగాన్ని గురించిచెబుతూ మామూలుగా ప్రజాస్వామిక వాదులు చేసే తప్పును ఈవిధంగా వేలెత్తిచూపాడు: 'ప్రజాస్వామిక విధానం భావంలోగానీ రూపంలోగాని స్థిరత్వం పొందిందను కోవటం నా ఉద్దేశంలో పెద్ద పొరపాటు' అన్నాడు.

'ప్రజాస్వామికం అనే భావాన్నీ ప్రజాస్వామికం యొక్క అర్థాన్నీ మనం ఎప్పటికప్పుడు కొత్తగా తరచి చూచుకుంటూ వుండాలి. కొత్తఅవసరాలకు సరిపోయేటట్టు చూచుకోవాలి. రాజకీయ, ఆర్థిక, సాంఘిక సంస్థలనుకూడా దీనికి అనుకూలంగా మార్చుకోవాలి. ప్రజాస్వామికం నిత్యనూతనం అయి, ప్రజల అవసరాలతోపాటు తానూ మారుతూ వచ్చినపుడే అది ప్రజల జీవితాన్ని ప్రతిబిం బించేదీ, ప్రజలకు సహాయం చెయ్యగలిగేదీ అవుతుంది - ప్రస్వామికం జీవితవిధానంగా కదలకుండా వుండటానికివీల్లేదు. ఈనాటి మార్పులనూ, రాబోయే మార్పులనూ తెలుసుకో టానికి అది ముందుకు నడవాలి. అది కదలకుండా నిలబడటం ఆత్మహత్య చేసుకోవటమే అవుతుంది' అని వార్నింగ్ ఇచ్చాడు జాన్ డ్యూయీ.

మానవ స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామిక విధానం కోసం డ్యూయీకిమల్లే కృషిచేసిన తత్వవేత్త మరొకడు లేడు. ప్రజాస్వామికం అతనికొక ప్రభుత్వ విధానంకాదు;

జీవితసంధ్యా. రష్యా, ట్రాట్స్కీని దేశంనుంచి వెళ్ళగొట్టి, అతనికి తన్నుతాను డిఫెండ్ చేసుకునే అవకాశం ఇవ్వకుండా, నేరస్థుణ్ణిగా నిర్ధారణ చేసినప్పుడు ట్రాట్స్కీకి న్యాయం జరగాలనే ఉద్దేశంతో కొంతమంది ప్రజాస్వామిక వాదులు వొక విచారణ సంఘాన్ని నియమించారు. డ్యూయీ ఈ సంఘానికి అధ్యక్షుడుగా పనిచేశాడు. ఈ సంఘం ట్రాట్స్కీని నిర్దోషిగా ప్రకటించింది. తరువాత కొన్ని సంవత్సరాలకు ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ, డ్యూయీ 'నే నీపదవిని ట్రాట్స్కీకోసం అంగీకరించలేదు. తన్ను తాను సమర్థించుకొనే అవకాశం ఇవ్వకుండా, ఎవ్వరినీ ఏ ప్రభుత్వం దోషిగా నిర్ధారించగూడదు. ఈ హక్కుకి భంగం కలుగుతూవుంది గనుక అంగీకరించాను' అన్నాడు. ఈ సంఘానికి ప్రారంభోపన్యాసం చేస్తూ, 'నేను విద్యా ప్రచారానికి నా జీవితాన్ని అంకితంచేశాను. విద్యాప్రచారం అంటే సంఘ శ్రేయస్సుకోసం ప్రజలకు జ్ఞానం కలిగించటమని నేను భావిస్తున్నాను. నే నీ పదవిని అంగీకరించకపోతే నాజీవిత ఆదర్శానికే విరుద్ధంగా నడిచినవాడి నౌతాననే భయంతో, అంగీకరించాను' అన్నాడు.

ఈ విచారణను గురించి డ్యూయీ 1937 లో రెండు ఉపన్యాసా లిచ్చాడు. మొదటి ఉపన్యాసంపేరు- 'ట్రూత్ ఈజ్ ఆన్ ది మార్చ్' ఇందులో అతడు ఇలా చెప్పాడు. 'తమకు వ్యతిరేకుడనే ఉద్దేశంతో సోవియట్ ప్రభుత్వం ట్రాట్స్కీని అతను చెయ్యని తప్పులక్రింద దోషిగా పరిగణించడం అన్యాయం' అన్నాడు. రెండవ ఉపన్యాసంలో—

'మా విచారణ ఫలితాలు చాలా ఆందోళన కలిగించేవిగా వున్నాయి. సోవియెట్ ప్రభుత్వం రాజకీయ వ్యతిరేకతను క్రిమినల్ చర్యల క్రింద జమకడుతూ వుంది. తాను జరుపుతున్న హత్యలనూ, కృత్రిమ నేరారోపణలనూ కప్పిపుచ్చటానికీ, రాజకీయ వ్యతిరేకతను అణగద్రొక్కటానికీ సోవియట్ ప్రభుత్వం ట్రాట్స్కీ వ్యతిరేక నినాదాలను ఉపయోగించుకోవటం ఘోరాతిఘోరం' అన్నాడు.

ఇంతటితో ఆగక భయంవల్లో, మరే కారణంవల్లో ఉదాసీనభావం వహించిన లిబరల్స్‌ని, తమ సిద్ధాంతానికే తాము ముప్పు తెచ్చిపెడుతున్నారనీ, తమ నైతిక బాధ్యతను తాము సక్రమంగా నెరవేర్చక పోవటం అవినీతితో సమానమే ననీ పరిశోధనా స్వాతంత్ర్యం లిబరలిజం ముఖ్య లక్షణమని మరచిపోవద్దనీ హెచ్చరించాడు.

దీన్నిబట్టి మానవ హక్కులకు డ్యూయీ ఎంత ప్రాధాన్య మిచ్చేదీ మనకు బోధపడుతుంది. అయితే, సోవియట్ విధానాన్ని అంతఘాటుగా విమర్శించాడు గనుక మార్క్స్‌కి తాత్వికంగా అన్నిట్లోనూ వ్యతిరేకుడని మనం అనుకోరాదు.

ప్రజాస్వామిక సోషలిజాన్ని కోరే మార్క్స్‌కీ డ్యూయీకి కొన్ని పోలికలు వున్నాయి. హుక్ అనే అతను పై వారిద్దరి తత్త్వశాస్త్రాలనూ పరిశోధించి ఈ పోలికలను విశదపరచాడు. 'భాషా, ప్రయోగాల భేదాలను మినహాయిస్తే 'తాత్వికంగా ముఖ్యోద్దేశాలలో వీరిద్దరిదృష్టి ఒకటే'

అన్నాడు. అతను 'మోడరన్ క్వాంటిటీ' లో వ్రాసిన వ్యాసాల్లో ఈ విషయాన్ని చర్చించాడు. 1936 లో అతను వ్రాసిన 'ఎక్స్పరిమెంటల్ మెటీరియలిజమ్' అనే వ్యాసంలో తార్కికంగా, తాత్వికంగా వీరిద్దరి స్థితీ వొక్కటే అన్నాడు. 1939 లో అతను వ్రాసిన 'జాన్ డ్యూయీ' అనే గ్రంథంలో ఇదే విషయం ఇంకా విపులంగా వ్రాశాడు. 'మార్క్సిస్టులు తాము సాధించదలచిన ప్రజాస్వామిక సోషలిజానికి అవలంబించే పద్ధతులను శాస్త్రీయ విమర్శనాదృష్టితో చూడటానికి పూనుకుంటేనూ, డ్యూయీ నేటి ఆర్థిక, సాంఘిక పరిస్థితులకు సంబంధించిన రాజకీయ కార్యక్రమాన్ని నిర్మించకలిగితేనూ, వీరిలకు భేదాలు అసేపి వుండవు' అన్నాడు.

జాన్ డ్యూయీ తొంభయ్యవ జన్మదినోత్సవ సందర్భంలో జరిగిన గోష్టికి సంబంధించిన ప్రచురణలో, 'జిమ్ కార్క్ 'అనే అతను 'జాన్ డ్యూయీ అండ్ కారల్ మార్క్స్' అనే వ్యాసం ఒకటి వ్రాశాడు. ఆ వ్యాసంలో, వీరిద్దరికీ, ఈ క్రింద ఉదహరించిన తొమ్మిది పోలికలను క్రోడీకరించాడు.

1. వీరిద్దరికీ మూలం హెగెలే. క్రమంగానూ, మార్పుతోనూ కలిసి నిర్మాణయుక్తంగా వుండే సంఘం యొక్క స్వభావాన్ని వీరిద్దరూ అంగీకరించారు. ప్రజలు అంగీకరించిన రాజ్యాంగ ప్రణాళిక, మతంద్వారా, కళల ద్వారా, తాత్విక దృష్టిద్వారా, కనీసం అది సమర్థించే ఊహాద్వారా, ఉద్దేశ్యాల ద్వారా, సంస్కారం ద్వారా,

వాకేభావాలకు చెందింది' అన్నాడు హెగెల్. వీరిద్దరూ ఎవ్వరి ఉద్దేశాలకు అనుకూలంగా వారు హెగెల్ యొక్క పరిజ్ఞానంవల్ల లాభంపొందుతూ అతనిభావాన్ని నిరసించారు.

2. వీరు ఇద్దరూ తత్వశాస్త్రం అనేది ప్రపంచానికి గానీ మామూలు మానవుల అనుభవాలకుగానీ, అతీతమైంది కాదనీ, అది నిత్యజీవితాన్నుంచి వెలువడే మామూలు అనుభవాలనూ, సమస్యలనూ, కోర్కెలనూ, ప్రతిబింబించే సంస్కారంలో ఒకముఖ్యమైన భాగమే ననీ భావించారు. కాబట్టి తత్వశాస్త్రం అనేది సాంఘిక వైరుధ్యాలనూ, సాంఘిక పోరాటాలనూ ప్రతిబింబించి అధికారవర్గం యొక్క అభిప్రాయాలను ఎదుర్కోటానికి వినియోగపడుతుందని వీరిద్దరూ అభిప్రాయపడ్డారు. 'జ్ఞానం కావాలనే సిద్ధాంతం, వస్తుతః తీరుబడివున్న వర్గంవల్ల సృష్టించబడిందనీ, కొద్ది మంది వ్యక్తులు ప్రత్యేక హక్కులను అనుభవించే సాంఘిక నిర్మాణానికి దోహదం ఇస్తుందనీ, ఆవిధంగా సంఘంలో అవసరమైన మార్పులు రాకుండా చూడ్డానికి సహాయ పడుతుందనీ అనుకునే నానమ్మకం, నా పూర్ణసిద్ధాంతంలో వొక భాగం' అన్నాడు జాన్ డ్యూయీ.

3. వీరిద్దరి సిద్ధాంతాలలోనూ ప్రకృతి సహజమైనటువంటివన్నీ, లౌకికానికి సంబంధించినటువంటివన్నీ వాసనలు ప్రతికూలంగా ఉండే సిద్ధాంతాలకూ, మిస్టిసిజానికి అనుకూలంగా ఉండే సిద్ధాంతాలకూ, సహజత్వానికి అతీతంగా వుండే సిద్ధాంతాలకూ పూర్తివ్యతిరేకులే. డ్యూయీ తాను

గౌరవించే విలియం జేమ్స్ యొక్క మత ప్రస్తావనలను నిరసనభావంతో చూచేవాడనే విషయం, ఎఫ్. సి. యస్. స్కిల్లర్ యొక్క మతానుకూల ప్రచారాన్ని తృణీకరించే వాడనే విషయం మనం మరచిపోగూడదు.

4. తత్త్వవిచారణలో వీరిద్దరూ భౌతికవాదం యొక్క సాంప్రదాయాలను అనుసరించినవారే. అయితే డ్యూయీ 'భౌతికవాదం' అనే మాటను వాడటానికి బదులు 'పదార్థశాస్త్రం' అనే మాటను వాడటానికి ఉత్సాహం చూపుతుంటాడు. కొన్ని రకాల భౌతిక వాదాలకు ఇతను వ్యతిరేకుడుగనుక, మొత్తం మార్క్సుకే వ్యతిరేకుడనుకో రాదు. ఆ లెక్కలో మార్క్సుకూడా 'మెకానికల్' భౌతిక వాదానికీ, 'డిలెక్టివ్' భౌతిక వాదానికీ వ్యతిరేకుడే. డ్యూయీ భౌతిక ప్రపంచం యొక్క అస్తిత్వాన్ని అంగీకరిస్తాడు. ప్రాణం, మనస్సూ, భౌతిక పదార్థాన్నుంచి బహిర్గతం అయినవని ఒప్పుకుంటాడు. కాబట్టి రసెల్ మొదలయిన తత్త్వవేత్తలకుమల్లే భౌతిక ప్రపంచాన్ని ఒక సమస్యగా పరిగణించటానికి నిరాకరిస్తాడు. రసెల్‌ని గురించి డ్యూయీ 'అతనికి భౌతిక ప్రపంచం ఒకసమస్యగా కనపడుతుందని చెప్పటానికి నేను వెరవను. నాకుమాత్రం ఈ సమస్య చాలా కృత్రిమంగా కనిపిస్తుంది; బాహ్యపదార్థాలు మన కోర్కెలకూ, ప్రయత్నాలకూ గట్టిగా ఎదురుగా నిలబడినప్పుడు అవి మన అనుభవంలోకి వొచ్చే ముఖ్యాంశాల క్రిందే లెక్క' అన్నాడు.

5. సంస్కారాన్ని అర్థం చేసుకోటానికీదాన్ని ఒక ప్రత్యేకసృష్టిగాభావించేవాదాలన్నిటికీ 'యటామిజమ్, ప్రియారిజమ్, సెన్సేషనలిజమ్. ప్లాటానిక్ రిస్పొన్సెస్ అండ్ టు ది ఎక్స్ట్రీమ్స్ ఆఫ్ బోత్ ఆర్గానిజమ్ అండ్ ఫార్మాలింజమ్ —' ఇద్దరూ వ్యతిరేకులే.

6. జిస్టార్టిస్ కేస్ట మొదలైనవారి ద్వంద్వాలను వొప్పుకునే తత్వశాస్త్రాలకు కూడా వీరిద్దరూ వ్యతిరేకులే.

7. ఇద్దరూ 'పరిపూర్ణ సత్యం' అనే సిద్ధాంతానికి వ్యతిరేకులే. సత్యం తాత్కాలికం అనీ, పోల్చుకుని తేల్చుకోవలసిందని. నిరూపణ సహాయంతో ఎప్పటికప్పుడు వృద్ధి చెందుతూ వుంటుందనీ ఇద్దరూ అంగీకరిస్తారు. డ్యూయీ యిలా అన్నాడు. 'ఎటువంటి సత్యంఅయినా ఎప్పటికప్పుడు జరిగే పరిశోధనల ఫలితాలమీద ఆధారపడివుంటుంది. కాని సత్యసంధత తాత్కాలికం: ఇంతవరకు పరిశోధన ఎంతవరకు జరగటానికి వీలుందో అంతవరకు అది సత్యం. అది భవిష్యత్తుకు సంబంధించిన నమ్మకంతో కూడిన ఊహ కాదు; అతి జాగ్రత్తగా అనేక శ్రమలకోర్చి ఈనాడు చేసిన పరిశోధనల ఫలితం.'

8. ఈ ఇద్దరికి ప్రకృతిశాస్త్రం సూచించే 'యదార్థాల'మీద గౌరవంవుంది. ఈ ఇద్దరూ డార్విన్ నిర్వచించిన తత్వశాస్త్రాన్నీ దానివల్ల వొచ్చే ఫలితాలనూ హృదయపూర్వకంగా అంగీకరిస్తారు. జీవులూ, పరిసరాలూ వొకదాని

మీద వొకటి తమ ప్రభావాలను చూపుకోవటంవల్ల పరిణామం అనేది జరుగుతూ వుందని ఇద్దరూ అంగీకరిస్తారు.

9. సిద్ధాంతానికీ, ఆచరణకూ కలయిక వుండాలని వీరిద్దరూ చెపుతారు. వొట్టి ఆలోచన ద్వారా తెలుసుకోవటం అనేది ఇద్దరూ నిరసిస్తారు. తెలుసుకునే విధానం చైతన్యంతో కూడుకున్నదీ, నిర్మాణయుక్తమైనదీ, అనుభవ పూర్వకమైనదీ అని వీరిద్దరి ఉద్దేశమూను. ఈ విషయంలో మార్క్సుకీ, డ్యూయీకీ వ్యతిరేకుడైన బెర్ట్రెండు రసెల్ 'భాషలో కొద్ది మార్పులను మినహాయిస్తే మార్క్సు యొక్క ఈ సిద్ధాంతానికీ, ఇన్స్ట్రుమెంటలిజానికి భేదం కనపట్టంలేదు' అని ఒకవ్యాసంలో వ్రాశాడు.

అయితే మార్క్సుకీ డ్యూయీకీ ఇన్ని పోలికలున్నాయి గనుక అభిప్రాయభేదాలు తక్కువ వున్నాయని ఎవ్వరూ అనుకోవలసిన అవసరం లేదు. డ్యూయీ తాను వ్రాసిన 'స్వాతంత్ర్యం, సంస్కారం' అనే గ్రంథములో మార్క్సునీ, మార్క్సిజాన్నీ తీవ్రంగా విమర్శించాడు.

అతని విమర్శలోని ముఖ్యాంశా లివి :

1. చారిత్రక మార్పుమీద తమ ప్రభావాన్ని చూపే కారణ జనితమైన లక్షణాలను గురించి మార్క్సుకి వున్న అభిప్రాయాలు అతి కృత్రిమమైనవేగాని, స్వానుభవంతో కూడిన పరిశోధనవల్ల కలిగినవి కావు. 'మార్క్సు యొక్క ఈ నియమం చారిత్రక సంఘటనలను విమర్శించి చూచుకోవటంవల్ల వొచ్చినది కాదు. హెగెల్ యొక్క

తార్కిక వేదాంతంనుంచి దిగుమతి అయింది' అన్నాడు డ్యూయీ.

2. మార్క్స్, మానవ విలువలకూ, భావాలకూ, ప్రయత్నాలకూ, సంఘంమీదవున్న ప్రభావాన్ని నిరసించాడు. 'స్వాతంత్ర్యం-సంస్కారం' అనే గ్రంథంలో డ్యూయీ 'సంఘటనలమీద విలువలకు ఏమాత్రం పలుకుబడి వుండదని చెప్పటం మార్క్స్ నమ్మకంయొక్క ముఖ్య లక్షణాలలో వొకటి; పరిస్థితుల ప్రభావానికి అన్నిటినీ ముడిపెట్టి మానవ ప్రయత్నానికి ఏ మాత్రం ఆవశ్యకత చూపలేని సాంఘిక సిద్ధాంతాన్ని దేన్నయినా నేను విమర్శించకుండా ఊరుకోలేను... ఇంతేకాక మార్క్స్, శాస్త్రం పేరుతో, మానవ విలువలకు కదిలించే శక్తినికూడా లేకుండా చేశాడు' అని వ్రాశాడు.

3. మార్క్స్ ఒక విషయాన్ని పరిశీలించి 'ఇలా జరిగితీరాలి' అని చెబుతాడనీ, ఈ 'తప్పనిసరి' అనే దృష్టి కర్మసిద్ధాంతం వంటిదనీ డ్యూయీ విమర్శించాడు. 'సాంఘిక మార్పులవల్ల వచ్చే ఫలితాలనూ, వాటి నడకనూ నిర్ణయించే నియమానికి సంబంధించిన ఒక బాటను మార్క్సిస్టులు ముందే నిర్ణయించుకున్నారు' అన్నాడు.

4. సాంఘిక మార్పుకి కారణమైన లక్షణాలలో ఏ ఒక్కదానికీ ఎక్కువ ప్రాధాన్యతఇవ్వగూడదనీ' ఏ వొక్కదాన్నీ విడిగా తీసి చూడగూడదనీ, మార్క్స్ ఆర్థిక లక్షణాన్ని ఈ విధంగా చేశాడనీ, దీనివల్ల అనేక

సుఫలితాలు కలిగాయనీ డ్యూయీ వాదం. దీన్ని పురస్క రించుకొని, 'ఒక పరిస్థితులో ఒక గుణం ఎంత బలంగా పనిచేస్తున్నా, ఏదో ఒక గుణాన్ని మాత్రమే అజలోకి తీసుకొని వెనకవేసుకు రావటం, తెలుసుకోటానికీ, తెలివిగా పనిచెయ్యటానికీ ఉపకరించదు' అన్నాడు.

5. ఇదేవిధంగా మరొక సందర్భంలో మార్క్స్ సమర్థించిన శ్రామిక నియంతృత్వాన్ని విమర్శించాడు. మార్క్స్ నిర్వచించిన శ్రామిక నియంతృత్వం ఒక ప్రత్యేక పరిస్థితికి చెందిందని మనం చెప్పుకోవచ్చు. సామాన్య ప్రజలందరికీ ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వమనే మార్క్స్ ఉద్దేశమనీ, విరోధివర్గాల పట్ల అది అనుసరించే వైఖరినిబట్టి నియంతృత్వం అన్నాడనీ మనం చెప్పుకోవచ్చు. కాని అది ఆచరణలో అతిభయంకరమైన నియంతృత్వంగా మారటం మాత్రం స్పష్టం. ఇది మనస్సులో ఉంచుకునే డ్యూయీ 'ప్రజాస్వామిక ఆదర్శాలు ప్రజాస్వామిక పద్ధతులద్వారా మాత్రమే సాధింపబడతాయని మానవుని అనుభవం స్పష్టంగా నిరూపిస్తూవుంది.' అని వ్రాశాడు.

ఈవిషయంలో మార్క్సిస్టులలోనే అనేక అభిప్రాయ భేదాలున్నాయి. మెన్షెవిక్కులూ, సోషల్ డెమొక్రాట్లూ, ఫేబియన్లూ, మొదలయినవారి మాట అటుంచి, రోజా లగ్జెంబర్గ్ వంటి మార్క్సిస్టు ప్రముఖనాయకురాలే సోవియట్ ప్రభుత్వం మొదటి రోజులలో డిక్టేటర్‌షిప్పుని నిరసిస్తూ ఈ విధంగా వ్రాసింది. 'ఒక పార్టీసభ్యులకు మాత్రం,

ప్రభుత్వం అనుకూలురకు మాత్రం, స్వాతంత్ర్యం ఇచ్చి వూరుకోవడం స్వాతంత్ర్యం అనిపించుకోదు. వ్యతిరేకంగా ఆలోచించే వారికి స్వాతంత్ర్యమే స్వాతంత్ర్యం. రాజకీయ స్వాతంత్ర్యాన్ని అణగద్రొక్కటం వల్ల రష్యాలో సోవియట్ల శక్తికూడా క్రమక్రమేణ క్షీణించి తీరుతుంది. ఎలెక్షన్లు, వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, నలుగురు కలిసే స్వాతంత్ర్యం లేనిసంఘంలో నిరంకుశత్వం తలెత్తితీరుతుంది. ఈ నియమాన్నుంచి ఎవ్వరూ తప్పుకోలేరు' అన్నది.

ఆమె నిజమే చెప్పిందని సోవియట్ చరిత్ర ఋజువు చేసింది. కాని ఆనాడు బోల్షివిక్ పార్టీ అధికారంలోకి వచ్చిన పార్టీ అవటంవల్ల. ఆ పార్టీ చెప్పిందే నిజమైన మార్క్సిజంగానూ విప్లవ పూరితమైన ఆదేశంగానూ పరిగణింపబడింది.

౫

మార్క్సిజాన్ని గురించి డ్యూయీ చేసిన విమర్శలను జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆ విమర్శలు మార్క్సిజానికంటే, మార్క్సిజం పేరుతో బోల్షివిక్ పార్టీ ప్రచారం చేసిన వ్యాఖ్యానాలకు బాగా వర్తిస్తాయని విశదం అవుతుంది. ఈ విషయాన్ని గురించి వ్రాస్తూ, జేమ్స్‌కార్క్, 'మార్క్స భావాలకూ ఉపదేశాలకూ, స్టాలిన్ అనుయాయుల భాష్యాలకూ వున్న భేదం డ్యూయీ ఎలా కనిపెట్టలేకపోయాడో నాకు ఆశ్చర్యంగా వుంది. తామే మార్క్స

యొక్క నిజమైన శిష్యులమని స్టాలిన్ అనుయాయులు చేసుకునే ప్రచారానికి డ్యూయీ అవుసరానికి మించిన విలువ ఇచ్చివుంటాడు' అన్నాడు. ఇది నిజమే. మార్క్సిజానికి అపార్థాలు ఎక్కువ ప్రచారంలో వున్నమాట నిజమే. అయినప్పటికీ మార్క్సిస్టులకూ, డ్యూయీకీ, ప్రజాస్వామికాన్ని నడిపించే దృష్టిలోనే భేదం వుందని అంగీకరించక తప్పదు.

ప్రజాస్వామికంపట్ల మార్క్సిస్టుల దృష్టికన్నా డ్యూయీ దృష్టి విశాలమైంది. డ్యూయీ ప్రజాస్వామికం వివిధఆలోచనలను ఒకటిగా కలిపే సాధనం. అతని సిద్ధాంత నిర్మాణాలన్నిటికీ అది మూలం, 'మంచి సంఘం' అనే అతని ఊహాచిత్రానికి ఇది జీవం పోస్తుంది. క్లుప్తంగా చెప్పాలంటే ప్రజాస్వామికం డ్యూయీకి జీవితవిధానం. మార్క్సిస్టులకు ఈమాట వర్తించదు. ప్రజాస్వామికాన్ని చారిత్రకంగా గానీ, ఈనాటి రూపాలలోగానీ, మార్క్సిస్టులు సంకుచితవర్గ దృష్టితోనే చూస్తారు. అధికారం చేపట్టగానే అన్ని పనులు వాటంతటవే అయిపోతవనే భావానికి వారు వారికి తెలియకుండానే కట్టుబడి పోయారు. అధికారం చేపట్టకముందే, ప్రజాస్వామిక విలువలమీదా, ప్రజాస్వామిక పద్ధతిమీదా అభిమానాన్ని ప్రజలకు కలిగిస్తేతప్ప, అధికారాన్ని చేబట్టిన తరువాత ప్రజాస్వామికాన్ని సాధించలేమని వీరు అంగీకరించరు. ఈ సందర్భంలో డ్యూయీ దూరదృష్టి గమనించతగ్గది.

'1789లోగాని, 1917 — 18లోగాని విప్లవం జరిగిందంటే అది క్రమపద్ధతిలో జరుగవలసిన వికాసవిధానానికి

నాంది అనుకోవటంకంటే, ఇంకొకవిధంగా అనుకోవడం ఆత్మవంచనే అవుతుంది. విప్లవం తన జీవితాన్ని తాను పూర్తి చేసుకునేలోగా, విప్లవకారులు వేసే ప్రతి అడుగూ తెలివితేటలతో తూచి వెయ్యాలి. విప్లవంయొక్క విజయం విప్లవం నెగ్గటంమీద ఆధారపడి వుండదు- మనకర్తవ్యాన్ని అంటే తరువాత జరుగవలసిన పనిని—తెలివితేటలతో నెర వేర్చుకోవటంమీద ఆధారపడి వుంటుంది.

డ్యూయీ గౌరవార్థం వెలువడిన ప్రచురణకు పీఠిక వ్రాస్తూ, సిడ్నీహుక్, డ్యూయీ పలుకుబడికి కారణం ఈ నాటి సంస్కారాన్ని కలవరపెట్టే రెండు ముఖ్య లక్షణాలను అతడు పరిశీలించటమే' అన్నాడు. అందులో మొదటిదిశాస్త్ర పరిశోధనయొక్క స్వభావం, దాని లోతుపాతులు. రెండవద స్వతంత్ర మానవులతో కూడిన ప్రపంచం కావాలనే గాఢ మైన వాంఛ. డ్యూయీ తన జీవితాన్ని ఈ రెండు లక్షణా లనూ పరిశోధించటానికి అంకితం చేశాడు. అందుకనే అతని గౌరవార్థం వెలువడిన ప్రచురణకు 'ఫిలాసఫర్ ఆఫ్ సైన్స్ అండ్ ఫ్రీడమ్' అని పేరు పెట్టటం జరిగింది.

కమ్యూనిస్టులు జాన్‌డ్యూయీని బూర్జువా తత్వవేత్త క్రింద లెక్కవేస్తారు. తమ సిద్ధాంతంతో పూర్తిగా ఏకీభ వించని వారిని అలా అనటం వారికి సహజమే. వారు ప్రచారం చేస్తున్న కార్మిక నియంతృత్వాన్నీ, ఒకపార్టీ ప్రభుత్వాన్నీ కార్మికవర్గం ఒక్కటే విప్లవపూరితం అయిందనే తమ నమ్మకాన్నీ, వారు నిర్వచనంచేసిన 'స్టేట్' స్వభావాన్నీ, దౌర్జన్యపూరితమైన విప్లవంద్వారా తప్ప

ప్రజాస్వామిక విధానంద్వారా సోషలిజాన్ని సాధించలేమనే వారి అభిప్రాయాన్ని సమర్థించనివారంతా వారికి 'బూర్జువా' లే! ధనిక వాదుల తొత్తులే.

కాని బోల్షివిక్ పార్టీ ప్రభుత్వ విధానంయొక్క ఫలితాలను చూస్తున్న నేటి కమ్యూనిస్టులు ఒకటికి రెండుసార్లు పై విషయాలను గురించీ, తమ నమ్మకాలను గురించీ ఆలోచించుకోవటం లోక శ్రేయస్సుకి సహాయ పడుతుంది. మార్క్సు 'రీ డిస్కవర్' చెయ్యటం మంచిది. రష్యా విప్లవాన్నుంచి వారు గుణపాఠం నేర్చుకోదలిస్తే ముఖ్యంగా మూడు విషయాలను గురించి వారు తిరిగి పరిశోధనలు చెయ్యాలి.

1. ప్రజాస్వామికాన్ని, సోషలిజాన్ని ఏకం చెయ్యటం.

2. ఆదర్శానికీ, సాధనమూ వున్న సంబంధం.

3. ఇంకా సశాస్త్రీయమైన, ఉదాహరణ ప్రోక్తమైన దృష్టి.

రష్యా పోయినదారిని పోకుండా రష్యా విప్లవాన్ని అనుభవంలోకి తీసుకొని ప్రజాస్వామిక విధానాన్ని అనుసరించ దలచిన మన ప్రభుత్వంలాంటి ప్రభుత్వాలు ఇటువంటి తత్వవేత్తల అభిప్రాయాలకు తగిన ప్రచారం ఇవ్వటమే కాక ప్రజాస్వామిక విధానానికి తమ అనుభవంతో ఒక నూతనాధ్యాయాన్ని కలపాలి.

బోల్షివిక్ పార్టీ విధానాన్ని అంగీకరించని ప్రజాస్వామిక వాదులు విద్యా విధానానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తారు. చిన్నతనమునుంచీ ప్రజాస్వామిక సంస్కారాన్ని పిల్లలకు అలవరిస్తే, ఈ విధానం జయప్రదంగా సాగటానికి వీలవుతుందని వీరి అభిప్రాయం. ప్రజాస్వామిక విధానానికి బలమైన శత్రువు అజ్ఞానం. కాబట్టి విజ్ఞానాన్ని ప్రచారం చెయ్యటం ముఖ్య అవుసరం. విజ్ఞానం గ్రంథ పఠనంవల్లే కాక అనేక విధాల నేర్చుకోవచ్చు. రాజకీయపార్టీలు తమ తమ సిద్ధాంతాలను ప్రచారం చేసుకునే ప్రయత్నంలో ప్రజలకు ఆయా సమస్యల మంచి చెడులను విమర్శించిచెప్పి, వారికి జ్ఞానాన్ని కలుగజేసిన వారవుతున్నారు. ప్రజాస్వామిక వాదులకు మానవ స్వభావంలో విశేషమైన నమ్మకం ఉంటుంది. డ్యూయీ చెప్పినట్లు 'ప్రజలకు సంగతి సందర్భాలు తెలిసివుంటే సక్రమంగానే ప్రవర్తించ గలుగుతారు' అనే నమ్మకం ప్రతి ప్రజాస్వామిక వాదికి ఉంటుంది. అంతేకాదు. ప్రతి పౌరుడికీ, నాయకుడయ్యే సత్తా, తన్ను తాను రక్షించుకొనగలిగిన జ్ఞానం ఉంటుందని ప్రజాస్వామిక విధానంలో ప్రతిపౌరుడూ, అత్యద్భుతమైన అనుభవాన్ని గడిస్తాడనీ, ఆ అనుభవమే అతనికి పెట్టని కోటగా ఉంటుందనీ తలుస్తాడు.

పౌరులను ఈ విధంగా తయారు చెయ్యటానికి డ్యూయీ పిల్లల పాఠశాల నొకదానిని స్థాపించాడు. సమస్యలను ఎదుర్కొనే అభ్యాసాన్ని, వాటిని పరిష్కరించే జ్ఞానాన్ని ఇవ్వటం ఈ పాఠశాల ముఖ్యోద్దేశం. 1899 లో

అతను ప్రచురించిన 'పాఠశాల సంఘం' అనే గ్రంథంలో ఈ పాఠశాలలో జరిగే కార్యక్రమాన్ని విపులంగా చర్చించాడు.

సామాన్య మానవుల్లో మేధస్సు బాగా వృద్ధి అయి వుండదు. కార్యరంగంలోకి దిగటంవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు మేధస్సును కదిలించాలి. డ్యూయీ తన పాఠశాలలో పిల్లలకు, కొవ్వూ, దూదీ, వూలూ వంటి ముడి పదార్థాలను ఇచ్చేవాడు. వారు ఈ పదార్థాల రకాలను తెలుసుకొని, వాటిని వినియోగించటానికి వీలైన మార్గాలను పరిశోధించేవారు. ఈ పరిశోధనల ఫలితంగా, ఈ ముడి పదార్థాలు ఏ పరిస్థితులలో ఉత్పత్తి చెయ్యబడ్డవో, ఉత్పత్తి కేంద్రాలూ, పంపిణీ కేంద్రాలూ ఎక్కడెక్కడ వున్నాయో, వీటిని తయారు చెయ్యటానికి కావలసిన పదార్థ విజ్ఞాన, రసాయనిక శాస్త్రాలలోని విషయాలూ, క్రొత్తగా అందుబాటులోకి వచ్చిన జ్ఞానం మానవాభివృద్ధికి ఏవిధంగా తోడ్పడుతూందీ మొదలైన సంగతులన్నీ వారు తెలుసుకోవలసివచ్చేది. ఒక విషయాన్ని గురించి సంపూర్ణంగా తెలుసుకోవాలంటే, మిగిలిన విషయాలను గురించి కూడా తెలుసుకోవలసివస్తుందనే హెగెల్ సిద్ధాంతం మీద విశ్వాసం ఉంచుకుంటూనే మానవ చరిత్రనంతా కొవ్వూ, దూదీ, వూలూ వస్త్రరూపాన్ని పొందే పరిణామంలోకి ఇమడ్చవచ్చని భావించేవాడు డ్యూయీ.

ఈ పాఠశాలలో పిల్లవాడు పనిచేస్తూ, నేరుగా జ్ఞానం సంపాదించేవాడు. అంటే జ్ఞానం పొందటం, ఆ జ్ఞానాన్ని

ఉపయోగించటం ఒకేసారి నేర్చుకునేవాడు అన్నమాట. అలా నేర్చుకోవటంలో వాస్తవికతతో సంబంధం పెట్టుకునే వాడు. తన తోడివారితో సహకరించేవాడు. సైన్సు, భూగోళశాస్త్రం, చరిత్ర — వీటియొక్క ప్రాముఖ్యతనూ, అవసరాన్నీ గుర్తించేవాడు. తనుచేసే పనినిగురించీ, పరిశోధనలను గురించీ చర్చించటంలో తన మాతృభాషను వృద్ధి చేసుకునేవాడు; వ్రాయటం నేర్చుకునేవాడు. తాము చేస్తున్న పనులను వ్యక్తపరుస్తూ బొమ్మలు గీసేవాడు. శిల్పాలను మలిపేవాడు. అతనిపాఠశాల ప్రశ్నలకు జవాబులు చెప్పే మామూలు పాఠశాలగా ఉండేది కాదన్నమాట — ఒకపని చెయ్యటం, దానినిగురించి ఇంకా ఎక్కువ తెలుసుకోవటంగా నడిచేది. దీనికి ఉపాధ్యాయుడు పుస్తకజ్ఞానంతో సహాయపడే వాడు. ఈ పద్ధతివల్ల క్రమశిక్షణ, ఉపాధ్యాయుడు భయ పెట్టటంవల్ల కాక దానంతట అదే వొచ్చేది. కావలసింది నేర్చుకునేవారు; నేర్చుకొన్నది ఆచరణలో పెట్టేవారు. పిల్లలు వొకరంటే వొకరు అసూయపడటంకాక, ఎవ్వరిపని వారు చక్కగా నిర్వర్తించి ఇతరుల అభిమానాన్ని చూరగొనటానికి ప్రయత్నించేవారు. మంచి పౌరులయ్యే లక్షణాలను వృద్ధిచేసుకునేవారు. డ్యూయీ పాఠశాలను గురించి సమీక్షిస్తూ, 'ఈ పాఠశాల వృత్తి విద్యలను నేర్పటానికి సంకల్పించింది అని అనుకోగూడదు. పరిశోధన అన్ని క్షేత్రాలలోనూ జరగటంవల్లా, జీవితవిధానానికి వర్తించేది అవటంవల్లా, ఈ పాఠశాల ఆచరణలో పెట్టిన విద్యావిధానం విశాలదృక్పథం

కలిగించేదనీ, సంస్కృతాభివృద్ధికి దోహదమిచ్చేదనీ అయి వుంది' అన్నాడు విలియం కెల్ప్ రెట్.

డ్యూయీ 1916 లో 'ప్రజాస్వామికం-విద్య' అనే గ్రంథం ప్రచురించాడు. ఇందులో విద్యనుగురించిన తన తాత్వికదృష్టిని విపులపరిచాడు. సాంఘికముఠాలు తమ ఉని కిని నిర్విఘ్నంగా సాగించుకోటానికి ఉపయోగపడే విధానం విద్య. ఈ ముఠాలు అభివృద్ధిని కోరేవైతే పరస్పరసంబంధం కలిగిన ప్రయోజనాలను వృద్ధిచేస్తయి. నిలువగ్రోక్కుకున్న సాంప్రదాయాలను రక్షించటంద్వారా మాత్రమే ఈ పని చెయ్యవు. గుణంలో అవి ప్రజాస్వామిక లక్షణాలు కలిగినవి. అందువల్ల సభ్యులకు స్వాతంత్ర్యం ఇస్తూ సంఘానికి చెందిన వొక ప్రయోజనాన్ని ఉద్దేశపూర్వకంగా సృష్టించి ఈ పనిని సాధిస్తాయి. అనుభవాన్ని ఎప్పటికప్పుడు సరిదిద్దుకోవటం, పునర్నిర్మాణం చేసుకోవటం ప్రజాస్వామికం ఆదర్శం. సంఘంలో ఈ పని నిత్యం జరుగుతూ ఉండాలి. ఇదే విధంగా పాఠశాల అనేది సాముదాయక ప్రయత్నాలద్వారా విద్యార్థుల అనుభవాన్ని ఎప్పటికప్పుడు పునర్నిర్మాణం చేసేదిగానూ, పరిపుష్టిని కలిగించేదిగాను వుండాలి. ఈ ఆద ర్శానికి సరిపోయే విధానాలనూ విషయాలనూ సేకరించాలి. పాఠశాల, సాంఘికజీవితాన్ని ప్రతిబింబించేదిగా మాత్రమే వుండరాదు. విద్యార్థులు గ్రహించటానికీ, తెలిసి ప్రవర్తించ టానికీ వీలుగా సమస్యలను తేలిక పరచాలి. దానికి సంబం ధించిన సమిష్టిజీవితం బయట ప్రపంచంలో వున్నదానికంటే పైస్థాయిలో నీతి బద్ధకంగా వుండాలి. పాఠశాల ఉన్నత

ప్రజాస్వామిక ఆదర్శాన్ని ధ్యేయంగా పెట్టుకొని, దానిని రూపొందించటానికి సహాయపడాలి.

౬

తత్వశాస్త్రం సాంఘిక జీవితం తెచ్చిపెట్టే కష్టాల నుంచి ఉద్భవించేదని డ్యూయీ అభిప్రాయం. మనస్సుకీ పదార్థానికీ, శరీరానికీ ఆత్మకీ మానవునికీ ప్రకృతికీ, వ్యక్తికీ సంఘానికీ, సిద్ధాంతానికీ ఆచరణకీ వుండవలసిన సంబంధాన్ని గురించిన చర్చలుకూడా ఇటువంటివేనని అతని అభిప్రాయం. జీవిత విధానానికి తోడ్పడే వివేకాన్ని పొందటానికి తత్వ శాస్త్రం ప్రయత్నిస్తుంది. మనస్సుని తెరచివుంచి. క్రొత్త పరిస్థితులకు అనుకూలంగా తన అలవాట్లను మార్చుకుంటూ సాంఘిక బాధ్యతను గుర్తించి ప్రవర్తించే వ్యక్తి, తాత్విక దృష్టికలవాడు అని మనం భావించవచ్చు. ఈ ప్రపంచానికి సంబంధించిన విషయాలను తెలుసుకోడానికి వివిధశాస్త్రాలు ఉపయోగిస్తాయి. కాని వీటిని బట్టి మనం ఎటువంటి దృష్టిని పెంపొందించుకోవాలి? ఏమిచెయ్యాలి? అనే ప్రశ్నలు వచ్చి నప్పుడు సహాయానికి వచ్చేది మాత్రం తత్వశాస్త్రం. డ్యూయీ లెక్కలో, 'నూతన అవసరాల్లో ఉద్భవించిన పరిష్కరించబడని సమస్యలను తత్వశాస్త్రం ఎదుర్కుంటుంది. తత్వశాస్త్రం ముగిసిన ఆలోచన కాదు. అది వొక దృష్టికి అనుగుణంగా పరిణామం చెందుతున్న ఆలోచన. అది కష్టా లను నిర్వచించి, వాటిని ఎదుర్కొనే మార్గాలను సూచి

స్తుంది... ఎప్పుడైతే వివిధ ఆదర్శాలఘర్షణ మొత్తం సంఘాన్ని పీడిస్తుందో అప్పుడు తత్వవేత్తలు అవసరం అవుతారు. తత్వవేత్తలు తమ తమ సాంఘిక వర్గదృష్టిచే ప్రేరేపింప బడి వివిధరకాల పరిష్కార మార్గాలను సూచిస్తారు. ఒక తత్వవేత్త ప్రతిపాదించిన సిద్ధాంతం ఎక్కువ ప్రచారం లోకి వచ్చిందంటే దానికి కారణం అతను సంఘంలో వివిధ శక్తులను సమన్వయ పరచగలగటమే అని మనం నిర్ధారణ చేసుకో వచ్చు. డ్యూయీని ఎక్కువమంది మెచ్చుకోటానికి కూడా ఇదే కారణం. అతను ప్రతిదాన్ని సాంఘికదృష్టితో వ్యాఖ్యానిస్తాడు.

కాయకష్టాన్ని వర్జించే విద్య డ్యూయీకి గిట్టదు. పూర్వ పరిస్థితులు ఎలావున్నా ప్రస్తుతం మనం పారిశ్రామిక యుగంలో వున్నాం. కాబట్టి మనం నేర్చుకోవలసిన విద్య పుస్తకాల ద్వారాకంటే వృత్తులద్వారా. ఇంతకుముందు ప్రచారంలోవున్న విద్య దురహంకారాన్ని ప్రకోపింపజేస్తూ వుంది. ప్రజాస్వామికానికి ఉపయోగపడే సహకారం, వృత్తులలో కలిసి పనిచెయ్యటంవల్ల వచ్చే మనస్తత్వంవల్లే లభిస్తుంది. పారిశ్రామిక సంఘానికి చెందిన పాఠశాల ఒక చిన్న పారిశ్రామిక కేంద్రంగా వుండాలి. మానవుడు అనుభవం వల్ల — తప్పులుచేసి దిద్దుకోవటంవల్ల — జ్ఞానాన్ని సంపాదించాలి. అప్పుడే సర్వతోముఖమైన ప్రజాస్వామికం విరాజిల్లటానికి వీలవుతుంది.

డ్యూయీ ఆచరణకు ఇంత ప్రాధాన్యత ఇవ్వటానికి డార్విన్ ప్రతిపాదించిన పరిణామ వాదాన్ని పూర్తిగా అంగీక

రించటమే కారణం. ఇదే అతని ప్రత్యేకతకూడా. అతనికి మనస్సూ శరీరంకూడా బ్రతుకుకోసం జరిగే పోరాటంవల్ల పరిణామం చెందిన వస్తువులే కాబట్టి ప్రపంచానికి అతీతంగా వుండే వొక శక్తిని ప్రవేశపెట్టి ప్రపంచానికి అర్థం చెప్ప టానికి పూనుకోకూడదు. ప్రపంచంలో జరిగే సంఘటన లను, ఆయా పరిస్థితుల్లో అవి నిర్వహించే పాత్రనుబట్టీ, అవి ఆక్రమించివున్న ప్రాముఖ్యతనుబట్టీ అర్థం చేసుకో టానికి ప్రయత్నించాలి. ప్రపంచాన్ని హేతువాద పూరితం చెయ్యటంగానీ, భావపూరితం చెయ్యటంగానీ సబబైన పని కాదని అతని ఉద్దేశం. మనకు సంబంధించి, పరిష్కారాన్ని కోరే సమస్యలనుంచి తప్పించుకోటానికి చేసే ప్రయత్నం ఇది అని అతని నమ్మకం. ఈ దృష్టివల్లనే అతనికి షోపనార్ సమర్థించిన 'సంకల్పం' అన్నా, బెర్గ్‌సన్ ప్రతిపాదించిన 'ఇలాన్' అన్నా పూర్తి అపనమ్మకం. 'అవి ఉండి ఉండ వచ్చు. కాని వాటిని ఉపాసించవలసిన అవుసరం లేదు' అని అతని భావం.

ఈమధ్య ప్రపంచ విజ్ఞాన సమితి (యునెస్కో) ప్రజా స్వామికాన్ని గురించి వొక గోష్టి జరిపి, వివిధ దేశాల ప్రముఖుల అభిప్రాయాలను సేకరించింది. చర్చ జరిగిన ముఖ్య విషయాలలో 'పాశ్చాత్య ప్రజాస్వామికాలకూ, తూర్పు ప్రజాస్వామికాలకూ వున్న భేదాలేమిటి? ఆ భేదాలు లేకుండా చెయ్యడానికి వీలుందా?' అనేది వొకటి. తూర్పు ప్రజాస్వామికాలలో సమానత్వం పేరుతో స్వాతంత్ర్యం లేకుండా పోతూవుంది. పశ్చిమ ప్రజాస్వామికాలలో

స్వాతంత్ర్యం పేరుమీదుగా సమానత్వం లేకుండా పోతూ వుంది. ఈ రెండు లక్షణాలను పొందగలిగేటట్టు ప్రజాస్వామికాన్ని విస్తరించటం నేటి పౌరుని ముఖ్య కర్తవ్యం' ఈ చర్చలలో పాల్గొన్న హుమయూన్ కబీర్ ఈ ఉద్దేశాన్నే వెల్లడించాడు.

ఈ చర్చలలో పాల్గొన్న మరొక ప్రముఖుడు లవ్ జాయ్ ప్రతి ప్రజాస్వామికవాది గుర్తు ఉంచుకోవలసిన వొక ముఖ్య విషయాన్ని దృష్టిలోకి తెచ్చాడు. 'ప్రతి ప్రభుత్వంలోనూ కొన్నికొన్ని సందర్భాలలో ఉమ్మడి చర్య తీసుకోవలసి వస్తుంది. ఒక వ్యక్తి మరొకని దౌర్జన్యాన్నుంచి రక్షించవలసి వస్తుంది. వొకొ్కక్కప్పుడు ప్రభుత్వ దౌర్జన్యాన్నుంచే రక్షించవలసి వస్తుంది. అటువంటివారు ఎటువంటి విధానాన్ని అనుసరించవలసి వుంటుంది? ప్రభుత్వం ఎంతవరకు తన అధికారాన్ని వినియోగించవలసి ఉంటుంది?' అని అడిగాడు. ఇది చాలా గడ్డుసమస్య; ప్రతి ప్రజాస్వామికవాదినీ కలవరపెట్టే సమస్య.

ప్రజాస్వామికం పేరుమీద వొకవర్గం మరొక వర్గాన్ని దోపిడికి గురిచెయ్యటం, అనేక రకాలైన దౌర్జన్య విధానాలతో నిర్ణయాల్నే స్వార్థంతో కలుషితం అయ్యేటట్టు చూడటం 'ప్రజల ప్రభుత్వం' అనే నెపంతో వ్యతిరేకతనే సహించకపోవటం మాటిమాటికీ తమ అధికారాన్ని దుర్వినియోగం చేసుకోవటం మనం నిత్యం చూస్తూనేవున్నాం. ఈ ప్రమాదంనుంచి ఎలా తప్పించుకోవటం?...

ఏ హిట్లర్‌కి మళ్లీనో ప్రజాస్వామిక సూత్రాల ద్వారానే అధికారంలోకి వచ్చి సైన్యసహాయంతో డిక్టేటర్‌షిప్ సాధిస్తే ఏం జరగాలి? ఏదో వొక నెపంతో ప్రజలకు సమానావకాశాలు లేకుండా చేసినా, అనుకోని మరే ప్రమాదం అయినా తటస్థించినా ఏంచెయ్యాలి? ఈ ప్రశ్నలకు మహాత్ముని అహింసా విధానం ఎంతవరకు ఉపకరిస్తుందో, నెహ్రూలాంటి రాజకీయ నాయకులూ, రాధాకృష్ణలాంటి తత్వవేత్తలూ పరిశోధించాలి. ప్రజాస్వామిక వాదం మనచేతుల్లో పెరగాలి.

---

# 'నవ్య వాస్తవిక తత్త్వవేత్త'
# శామ్యూల్ అలెగ్జాండర్

నవ్య వాస్తవిక తత్వశాస్త్రం- మనం తెలుసుకున్నా, తెలుసుకోలేకపోయినా, 'వాస్తవికత' అనేది వున్నదనీ, దాని అస్తిత్వం మనం తెలుసుకోవడంమీద ఆధారపడి లేదనీ చెపుతుంది. 'అంతా మిథ్య' అని చెప్పే భావ వాదాల్లో 'వున్నదంతా మనస్సే' అని చెప్పేవాళ్ళవంటి మానసిక వాదుల వాదానికి వ్యతిరేకంగా ఈ ఉద్యమం తలెత్తింది. బ్రిటిష్ తత్వవేత్త అయిన శ్యామ్యూల్ అలెగ్జాండర్ ఈ ఉద్యమ నాయకుల్లో ప్రముఖుడు.

అలెగ్జాండర్ తాను వ్రాసిన 'స్పేస్, టైమ్, డెయిటీ' అనే గ్రంథములో భావవాదానికీ వాస్తవిక వాదానికీ వున్న భేదాన్ని ఇలా చెప్పాడు. 'భావవాదానికీ వాస్తవిక వాదానికీ వున్న భేదం ఆదిలో, వారి విధానాలయొక్క భావనలో వుంది. ఒకదానికి ఎన్ని పూతలుపూసినా, ఎన్ని తొడుగులు తొడిగినా, పునాది మనస్సు. వారి అన్వేషణ మనస్సు దగ్గర నుంచి బయలుదేరుతుంది. భావవాదం మొత్తం వాస్తవిక మైనదేగాని, ఆ మొత్తానికి సంబంధించిన భాగాలు మాత్రం వాస్తవికమైనవి కావని చెపుతుంది. వాస్తవిక వాదంలో

మనస్సుకీ ఒక ప్రత్యేకస్థానం లేదు. లేకపోతే పరిణామంలో ఈనాటికి అగ్రస్థానాన్ని ఇస్తాం' అన్నాడు.

వాస్తవిక వాదులకు భౌతిక ప్రపంచమే యదార్థమైంది. ప్రాణం, మనస్సు, మొదలైనవన్నీ పదార్థ పరిణామంవల్ల బహిర్గతమైన లక్షణాలే. ఇటువంటి లక్షణాలు, క్రొత్త క్రొత్త లక్షణాలు పదార్థపరిణామంలో అనంతంగా బహిర్గతం కావొచ్చని వారు అంగీకరిస్తారు. అంతేగానీ ఒక శక్తిగానీ, ఒక మనస్సుగానీ, ఒకభావంగానీ, ముందేవుందనీ ఈ భౌతిక ప్రపంచం, ఈ లౌకిక వ్యవహారం దాని లీల అని అంగీకరించదు. అందువల్ల ఏ ఒక్క లక్షణానికీ ప్రత్యేకతను ఆపాదించదు. అలెగ్జాండరు ఈ ఉద్దేశంతోనే, 'పదార్థాల ప్రజాస్వామికంలో మనస్సులను తెలివిగల సభ్యులుగా పరిగణించవచ్చు. ఉనికినీ, వాస్తవికత్వాన్నీ పరిగణిస్తేమాత్రం అన్నీ సమానమే. ప్రజాస్వామిక విధానంలో తెలివితేటలు గలవాళ్ళు ప్రధాన స్థానాల్లోకి వచ్చినట్లు, ఈ పదార్థమయ జగత్తులో మనస్సులు ప్రముఖస్థానాలను ఆక్రమించుకొని వుండవచ్చు. అంతమాత్రాన వాటికి ప్రత్యేకత ఆపాదించటానికి వీల్లేదు' అన్నాడు. మరొక సందర్భంలో తాను అనుసరించిన 'ఎంపెరికల్' విధానంయొక్క స్వభావాన్ని విపులీకరిస్తూ 'వాస్తవికవాదులు మానసికశక్తిని అంగీకరించరని ఎవ్వరూ అనుకోవలసిన పనిలేదు. మేము మనస్సులనూ దానిశక్తినీ అంగీకరిస్తాం. కాకపోతే పరిణామంలో బహిర్గతం అవుతున్న అనేకరూపాల్లో అదొక రూపంమాత్రమే

అంటాం. ఈ రూపం మిగిలిన రూపాలకంటే అభివృద్ధిలో ఎక్కువ అని అంగీకరిస్తాం గానీ, అంతకంటె దీనికొక ప్రత్యేకత వుందని అంగీకరించం' అన్నాడు అలెగ్జాండర్.

ఈ విధంగా మనస్సుకు ప్రత్యేకత లేదని చెప్పి, అప్పుడు ఇందుకు విరుద్ధంగా ప్రచారంలో వున్న బెర్క్లే సిద్ధాంత విమర్శకు పూనుకున్నాడు. బెర్క్లే 'పదార్థం అనేది అసలు లేదనీ, వున్నదంతా భావమేననీ చెప్పి ప్రపంచాన్ని ద్వంద్వరహితంగా చిత్రించివున్నది మనస్సేగనుక, మనం జ్ఞానాన్ని సంపాదించగలుగుతున్నాం' అనిచెప్పాడు. బెర్క్లే ద్వంద్వ రహితమైన ప్రపంచాన్ని చిత్రించగలిగాడు గనక 'వున్నదంతా భావమే' అనే అతని వాదాన్ని అంగీకరించ వలసిన అవుసరం లేదు అన్నాడు అలెగ్జాండర్. 'పదార్థాలు లేకుండా మనస్సు అనేది వుండదు. ఇది వొప్పుకున్నాం గనక దీనికి వ్యతిరేకమైన మనస్సు అనేది లేకుండా పదార్థాలు వుండవు అనే సిద్ధాంతాన్ని వొప్పుకోవలసిన అవుసరం లేదు. నేను వొకచోట నిలబడిచూస్తే వొకబల్లయొక్క అంచు కనబడుతుంది. బల్లయొక్క అంచుమాత్రమే కనబడటానికి కారణం నేనే... ... అయినప్పటికీ ఆ బల్లఅంచు బల్లకు చెందిందే, నాకు చెందింది కాదు' అన్నాడు అలెగ్జాండర్.

'భౌతికపదార్థాలన్నీ భావాలే' అని నిరూపించటానికి చేసేప్రయత్నంలో బెర్క్లే ముఖ్యంగా మూడుతప్పులు చేశాడని వాస్తవిక వాదులు భావిస్తారు. (1) ఒకపదార్థంలో తాను కనిపెట్టదలచిన గుణాలను, ముందే దానికి ఆపాదిం

చటం అతని మొదటితప్పు. ఉదాహరణకు : బెర్క్లే మొదటి సారిగా వొక అనాసపండును చూశాడు అనుకుందాం. అతనికి ఆ అనాసపండు, మనస్సుకి సంబంధించిన వొక భావం మాత్రమే. అంటే తనతో చూడబడటం అనేది దాని ప్రథమ లక్షణం. దీనినిబట్టి మనస్సుకు కనబడటం అనేది అనాసపండు యొక్క ముఖ్యలక్షణం అవుతుంది. కాని ఇదితప్పు. ఎందుచేతనంటే ఎవ్వరిచేతా చూడబడనప్పుడు కూడా అనాసపండు వున్నది. (2) 'నేను' అనే అహాన్ని తన సిద్ధాంతాన్ని సమర్థించుకోవటానికి ఉపయోగించుకోవటం బెర్క్లే చేసిన రెండవతప్పు. 'ఏగో ఒక అహం లేకపోతే ఏమీ లేదు' అన్నాడు బెర్క్లే. అయితే, ఈ సిద్ధాంతం ఏ వాదానికైనా వర్తిస్తుంది. దీన్నిబట్టి బెర్క్లే మానసిక వాదం రైటనీ, వాస్తవిక వాదం తప్పని ఎలా చెప్పటం? 'ఏ పదార్థాన్నీ ఎవ్వరూ తెలుసుకోకుండా తెలుసుకోలేర'ని ఒప్పుకుందాం. అయినంత మాత్రాన సిద్ధాంతం మంచి చెడ్డలు దీనివల్ల ఎలా తేలతాయి? అలా తేలనప్పుడు పైసిద్ధాంతంమీద అధారపడివున్న బెర్క్లే వాదం వీగిపోయినట్లే భావించవలసివస్తుంది. (3) 'సోలిప్సిజం' అంటే 'నేను వున్నాను; నా భావాలే వున్నాయి; నన్ను మించిన వ్యక్తులు లేరు; నా భావాలకు మించి భావాలు లేవు,' అనే వాదం బెర్క్లే సిద్ధాంతంలోని మూడవ తప్పు. ఈ దృష్టిని తన దృష్టి అని ఏ తత్వవేత్తా అంగీకరించడు. కాని బెర్క్లే దృష్టిని తార్కికంగా విమర్శించిచూస్తే పర్యవసానం ఇదిగానే తేలుతుందని చెప్పక తప్పదు. చూడబడనప్పుడు ఏదీ

చూడలేం గనుక, మనస్సు చూస్తేతప్ప ఏదీ వుండదనేది బర్క్లే ఉద్దేశ్యమనీ, చివరకు తను చూడనిది ఏదీ లేదనేది ఈ ఉద్దేశ్యం పర్యవసానమనీ అందువల్ల ఇది దోష భూయిష్టమనీ విమర్శకులు వాదిస్తారు.

ఈ పై విమర్శవల్ల భావమూ, పదార్థమూ రెండూ వొకటేననీ, ఈ ఏకత్వంవల్ల వాస్తవికత్వాన్ని తెలుసుకో గలమని వారు భావిస్తారనీ పరిణామాన్నీ, పరిణామం బహి ర్గతం చేసే దశలనూ వారు అంగీకరిస్తారనీ మనం తేల్చుకో వలసి వుంటుంది. అమెరికన్ నవ్య వాస్తవిక తత్వవేత్తలలో వొకడైన మాన్టేగ్ నవ్య వాస్తవికత్వాన్ని, దాని అవస రాన్నీ ఈ విధంగా విపులీకరించాడు. 'ఈ ప్రపంచం రెండు రకాల జీవులతో నిండివుంది. ఆకాశంలో వుండే శరీరాలూ, సంఘటనలూ వొకరకం. ఆకాశానికి కట్టుబడ కుండా వున్న మనస్సులయొక్క, భావాలయొక్క అతీత మానసిక రంగం రెండవది. ద్వంద్వ ప్రకృతిచేత ఈ విధంగా విడగొట్టబడిన ఈ రంగాలను ఏకం చెయ్యవలసిన బాధ్యత జ్ఞానంమీదవుంది' అని, ఆనాటి బాధ్యతను తెలియ జేస్తూ, పై సమస్యలను ఈ విధంగా పరిష్కరించాడు:

'అంతా వొకటే అనుకునే వాస్తవిక వాది ఈ ద్వంద్వాన్ని తేలిగ్గా అధిగమించ గలుగుతాడు. భావ వాదు లకు మల్లే యదార్థ ప్రపంచాన్ని వొదులుకునే బదులు, దాన్ని ఉంచుకొని ఆకాశానికి అతీతంగా, ప్రకృతికి అతీ తంగా మనస్సులతో, భావాలతో సందుకొని వుండే

ప్రపంచాన్ని వొదులుకుంటాడు. ఆకాశంతోనూ కాలంతోనూ కలిసివుండే వొకే వాస్తవికతను అతను అంగీకరిస్తాడు. చైతన్యంతో సంబంధం ఏర్పడినంతమాత్రాన ఏ పదార్థమూ తన అస్తిత్వాన్ని కోల్పోదని వాస్తవికవాది భావిస్తాడు. చైతన్యంయొక్క లక్షణాలూ, అనుభవంలోకివచ్చే గుణాలూ, ఈ వాస్తవిక నిర్మాణానికి సంబంధించినవే. ఈ రెండూ కాలానికీ, ఆకాశానికీ కట్టుబడివుండే ప్రకృతి విధానానికి సంబంధించినవే. అసలు చైతన్యం అనే ఈ పదార్థాలకు, ఒకదానికొకటి వున్న సంబంధం అంటాడు వాస్తవికవాది.

చైతన్యాన్ని గురించి మూర్టేగ్ వొక వ్యాసం వ్రాశాడు. అందులో అతను చైతన్యాన్ని ఒక సంబంధంగా నిర్వచించాడు. 'చైతన్యం ఒక సంబంధంమాత్రమే అయితే చైతన్యానికి సంబంధించిన పదార్థాలను, ఆ సంబంధానికి విడిగా, స్వాతంత్ర్యాన్నీ, అస్తిత్వాన్నీ కలిగిన వాటినిగా భావించాలి. చైతన్యానికిగానీ, జ్ఞానానికిగానీ విడిగా స్వాతంత్రతనూ, అస్తిత్వాన్నీ పదార్థాలు పొందియున్నవని అంగీకరిస్తే అప్పుడా చైతన్యంగానీ, జ్ఞానంగానీ ఆ పదార్థాలకు చెందిన సంబంధంమాత్రమే అవుతుంది. ఇంకొకరకం అవడానికి ఏమాత్రం వీల్లేదు' అన్నాడు.

ఇవీ వాస్తవిక వాదంయొక్క ముఖ్య లక్షణాలు. ఇది శాస్త్ర పరిశోధనలవల్లా, శాస్త్ర పరిజ్ఞానంవల్లా పుట్టినవాదం. అందువల్ల సైన్సూ, పరిశ్రమలూ బాగా వృద్ధిలోకి వచ్చిన

అమెరికా, ఇంగ్లండు దేశాల్లో ఇది చరచరా వ్యాప్తిలోకి వచ్చింది.

ఈ దేశాలలోని సిద్ధాంతాలనుగురించి డబ్ల్యు. హెచ్. వెర్కమిసర్ తాను వ్రాసిన 'అమెరికాలోని తాత్త్వికభావాల చరిత్ర' అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు: బెర్ట్రాండ్ రస్సెల్ వ్రాసిన 'గణితసూత్రాలు' (1903) అనే గ్రంథం, 'భావవాద నిరాకరణ' అనే జి. ఇ మోర్ వ్రాసిన వ్యాసం అమెరికాలోని వాస్తవికోద్యమానికే సహాయపడినవి. కాని ఈ పలుకుబడి అక్కడి వాస్తవిక వాదులు తమ ముఖ్యసూత్రాలను నిర్వచించుకున్న తర్వాత వచ్చింది. అందువల్ల ఈ దేశాలలోని వాస్తవికోద్యమాలు దేని ప్రత్యేకతను అది కాపాడుకుంటూ వృద్ధిచెందినవి. రెండూ రెండు సంస్కారాలుగా వొకదానికొకటి సహాయపడుతూ దేనికదే వృద్ధిచెందింది. అందువల్ల ఈ ఉద్యమాలకు విలువలను కట్టాలంటే దేనికి దాన్ని విడిగా తరచి చూడాలి' అన్నాడు.

౨

అమెరికాలో నవ్యవాస్తవికోద్యమం 1900 నుంచి ప్రారంభమైందని చెప్పుకోవచ్చు. అంటే అంతకుముందు తాత్త్వికరంగంలో ఈ పోకడలు లేవని కాదు. విలియం జేమ్స్, అలెగ్జాండర్ ఫ్రేజర్, లాయిడ్ మోర్గన్, ఆర్థర్ కె-రోజర్స్ మొదలయిన తత్త్వశాస్త్రజ్ఞులంతా, తమతమ వ్యాసాలవల్ల ఈ ఉద్యమానికి బీజాలు నాటినవారే. కాని

ఈ రచనలు 'భావవాదుల హేతువాద ప్రదర్శనం, ఏమి నిరూపించినా, వాస్తవికమైన బాహ్యప్రపంచం వొకటున్నది' అని చెప్పటంకంటే లోతుకి దిగలేదు. ఈ రచనల్లో, తరువాత వొచ్చిన వాస్తవిక వాదుల్లో కనపడే తాత్విక కారణాలు గానీ, అనుభవపూర్వకమైన వాదబలం గానీ కనుపించదు.

'ఆకాశంలోనూ, కాలంలోనూ వున్న యదార్థ ప్రపంచం' అనే వ్యాసంలో జార్జి బి. ఫుల్లెర్టన్, నిజంగా వున్న ఆకాశానికీ, కాలానికీ మించి స్వతంత్రంగా వుండే యదార్థ ప్రపంచం ఒకటి వున్నదన్నాడు. అలా అన్నాడే గాని, అటువంటి ప్రపంచం ఉండే అవకాశాన్ని నిరూపించటానికికూడా ప్రయత్నించలేదు.

స్పెల్లర్స్, లవ్‌జాయ్, వైట్‌హెడ్ మొదలయినవారు విలియంజేమ్స్ వ్రాసిన, 'చైతన్యం అనేది వున్నదా?' అనే వ్యాసం అమెరికన్ వాస్తవిక ఉద్యమ చరిత్రలో ఒక ముఖ్యమైన ఘట్టమని భావించారు. అంటే ఈ సహాయం జేమ్స్ తెలిసిచేశాడని కాదు; తనకు తెలియకుండానే విలియం జేమ్స్ వాస్తవిక వాదానికి మార్గాన్ని ఏర్పరిచాడు అని చెప్పుకోవాలి. డ్రేక్, మాంటేగ్, పెర్రీ, ప్రాట్, శాంతాయన, సెల్లర్స్, స్ట్రాంగ్ మొదలయిన ప్రముఖ వాస్తవిక వాదులు, తమ తాత్విక భావాలకు ఎక్కువ ప్రోత్సాహం జేమ్స్ రచనలనుంచే వొచ్చిందని పదేపదే చెప్పటం దీనికి ప్రబల నిదర్శనం. వాస్తవికోద్యమం ప్రబలపడటానికి వొక్క జేమ్స్ సహాయమే కాకుండా జర్మన్ మేధావుల సహాయం

కూడా చాలావరకు వుంది. ప్రముఖ వాస్తవిక వాదుల్లో చాలామంది జర్మనీలో చదువుకున్నవారే! అంతేకాక జర్మన్ తత్వవేత్తలయిన ఎవనేరియస్, ఫూపే, మాచ్, బ్రెన్టానో, మీనాంద్, హుసరెల్ మొదలయిన ప్రముఖుల రచనల ప్రభావంకూడా ఈ ఉద్యమంలో కనుపిస్తుంది. అంటే, అన్ని ఉద్యమాలకువల్లే ఈ ఉద్యమంకూడా ఎక్కడ నుంచో ఊడిపడక, క్రమక్రమేణా బలపడింది, అనేక చిన్న చిన్న వాహినులను తనలో కలుపుకొని వృద్ధిచెందింది.

1910 లో ఈ ఉద్యమానికి బలం చేకూర్చే మరొక సంఘటన జరిగింది. హార్వర్డ్‌కి చెందిన ఇ. బి. హోల్ట్, రట్జర్స్ కాలేజీకి చెందిన డబ్ల్యు టి. మార్విన్, కోలంబియా విశ్వవిద్యాలయానికి చెందిన డబ్ల్యు. పి. మాన్టేగ్, ప్రిన్స్‌టన్‌కు చెందిన, ఇ జి. స్పాల్‌జింగ్, 'ఆరుగురు వాస్తవిక వాదుల కార్యక్రమం మొదటివేదిక' అనే వొక డాక్యుమెంటును ప్రచురించారు. ఇందులో వారిలో వారికి ఏకీభావం కుదిరిన పద్ధెనిమిది సూత్రాలను ఏకరువు పెట్టారు.

వాటి సారాంశం ఇది :—

తర్క, గణిత, భౌతికశాస్త్రాల పరిశోధనలకు చెందిన పదార్థాలు గానీ, నిజాలుగానీ మనస్సుకి సంబంధించినవి కావు. వీటి స్వభావం వాటిని తెలుసుకోవటంమీద ఆధార పడిలేదు. వీటికి పరస్పరం ఎంత కలయిక వుందో, ఎంత సంబంధం వుందో, ఎంత పొందిక వుందో అనుభవాన్నిబట్టి నిర్ణయించాలి. ఈనాటి జ్ఞానాన్నిబట్టి ఊహ 'అనేకత్వానికే'

అనుకూలంగా ఉంది. అన్ని శాస్త్ర, తాత్వికసిద్ధాంతాలకీ ముందు, కొన్ని తార్కిక నియమాలున్నాయి. 'సంబంధాలను గురించిన బాహ్యదృష్టి' అనేది అందులో ఒకటి. జ్ఞానంయొక్క స్వభావాన్ని బట్టి, వాస్తవికతయొక్క స్వభావాన్ని నిర్ణయించలేం. ఒక పదార్థం తెలిసిందంటే, తెలియటం అనే దానిచేత అది నిర్ణయించబడటం లేదని మనం తెలుసుకోవాలి. వాస్తవికత్వం, తెలిసిన వస్తువులు, తెలుసుకునే సంబంధాన్నిబట్టి జనించాయని చెప్పదు. వాస్తవికత్వం తెలుసుకున్న ప్రతి వస్తువూ తెలుసుకోటానికి, అనుభవానికీ, చైతన్యానికీ సంబంధించి వుంటుందని వొప్పుకుంటూ, ఈ తెలుసుకోవటం మొదలైనవాటిని రద్దుచేసి, తెలుసుకోవటం అనేది లేనప్పుడు ఏవిధంగా ఉంటుందో ఆ విధంగా ఆ వస్తువును తెలుసుకోవొచ్చు అని చెప్తుంది. అంటే ఆ వస్తువు ఉనికిలో, ప్రవర్తనలో, స్వభావంలో తెలుసుకోటానికి విడిగా ఉంటుందని అంగీకరించటం అన్నమాట. ఈ దృష్టి సామాన్య జ్ఞానాన్ని రెండు విధాలుగా సమర్థిస్తుంది. (1) అన్ని వస్తువులూ మానసికమూ, చైతన్యమూ, ఆధ్యాత్మికమూ కావు (2) వస్తువులను తెలియజెప్పుకోకుండా తెలుసుకోటానికి వీలుంది. తెలిసిన విషయాలు, తెలియనప్పుడు కూడా అదేవిధంగా వుంటాయనీ, మార్పేమీ ఉండదనీ వాస్తవికత్వం చెపుతుంది. తెలుసుకునే సంబంధంలోకి వస్తువులు వొచ్చి పోతుంటాయి ఈ వచ్చి పోవటం వాటి అస్తిత్వాన్ని ఏవిధంగానూ మార్చదు. తెలుసుకోవటం అనేది దానికి సంబంధించిన పదార్థాలు చెందిన ప్రపం

చానికే చెందుతుంది! ప్రకృతి విధానంలో దానికి ఉండే స్థలం దానికి వుంది.

పై వాస్తవికవాదులు క్రోడీకరించిన సూత్రాల పర్యవసానం ఇది. ఈ ప్రచురణ అమెరికాలో వొక గాలి దుమారాన్ని లేపింది. ప్రముఖుల దృష్టిని ఆకర్షించింది.

ఈ సూత్రాలనుబట్టి నవ్యవాస్తవిక సిద్ధాంతం భావవాదానికి వ్యతిరేకం అని నిర్ణయించుకొని మ్యూయిర్ ఈ వాదానికి తన అనుకూలతను ప్రకటించాడు. 'వాస్తవికత్వానికి దగ్గర దారికోసం పరిశోధన' అనే వ్యాసంలో తన అనుకూలతను ఈ క్రిందివిధంగా ప్రకటించాడు :

1. వస్తువులను తెలుసుకోటాన్ని గురించి చర్చించటానికి ముందు వస్తువులు తెలిసి వుండాలి గనక, వస్తువులు వాటంతట అవి ఎప్పుడూ తెలిసేవుంటవనీ మనస్సుకు ఎప్పుడూ సంబంధించే వుంటవనీ వాదించటం.

2. తెలుసుకోవటం అనేది మనం తెలుసుకోటానికి ముందూ, మనం తెలుసుకోటానికీ విడిగానూ అస్తిత్వాన్ని సూచిస్తుంది.

మ్యూయిర్ ఈవిధంగా వాస్తవిక వాదంలో మొత్తం మీద తన ఏకీభావాన్ని తెలిపి, కొన్ని విషయాలలో అనుమానాలను వెలిబుచ్చాడు.

'వాస్తవికవాది, తెలుసుకోటానికీ తెలుసుకున్న జ్ఞానానికీ వున్న భేదాన్ని గమనించక, అనుమానం, ఆధారం, తప్పు మొదలయిన సమస్యల్ని అజలోకి తీసుకోక పొరపాటు



చేస్తున్నాడు' అన్నాడు. ఈ అనుమానాన్నే కాక, ద్వ్యాయీ, 'బాహ్యసంబంధాల' విషయాల్లో వాస్తవిక వాదులు వెలిబుచ్చిన అభిప్రాయాలనుకూడా విమర్శించాడు. తన విమర్శలను క్రోడీకరిస్తూ, 'వాస్తవిక వాదుల ప్రణాళి కను భావవాద వ్యతిరేక ప్రణాళికగానే కాక, క్రియా రూపకమైన ప్రణాళికగా పరిగణిస్తే, అది రెండు ముఖ్య సమస్యల్ని గమనంలోకి తీసుకోనట్లు కనిపిస్తుంది' అన్నాడు. అవి ఇవి:

1. తెలుసుకోవటం అనే ప్రకృతిసంఘటనకు మిగిలిన సంఘటనలతో వున్న సంబంధంయొక్క ప్రాముఖ్యతను ఈ వాదం గమనించటం లేదు.

2. జ్ఞానాన్ని సంపాదించే విధానానికీ, అనుమానం నుంచీ, ఊహనుంచీ నిర్ధారణకు చేసే ప్రయాణానికీ ఈ వాదం ప్రాముఖ్యతను ఇవ్వటంలేదు. అంటే ఈ వాస్తవిక వాదం జ్ఞానంయొక్క అభివృద్ధినే గమనంలోకి తీసుకోవటం లేదన్నమాట.

ఈ వాస్తవిక వాదుల 'వేదిక' పట్ల హెచ్. సి బ్రౌన్ తన అసంతృప్తిని వెల్లడించాడు. అందుకు మూడు కారణాలు చెప్పాడు. ఈ వేదిక వాస్తవికత్వంయొక్క ప్రయోజనాన్ని సంకుచిత పరుస్తూవుంది అనేది మొదటి కారణం. ఉపపాదించిన విషయాలు అస్పష్టంగానూ, సంది గ్ధంగానూ, వున్నాయనేది రెండవకారణం. ఇక మూడవ



కారణం: ముఖ్యసూత్రాలనుకూడా ప్రతిపాదకులందరూ ఒకే అర్థంలో అంగీకరించటం లేదని స్పష్టంగా కనుపించటం.

ఇదేవిధంగా ఈ 'వేదిక' ప్రముఖులనుంచి అనేక విమర్శలను లేపింది. ఈ విమర్శలనూ, వాగ్వివాదాలనూ, అనుభవాలనూ గమనంలోకి తీసుకొని 1912లో 'ఆ ఆరుగురు వాస్తవిక, వాదులు 'నవ్య వాస్తవికత్వం' అనే 490 పేజీలు గల ఒక సంపుటిని ప్రకటించారు. ఈ సంపుటిలో రచయితల్లో వున్న అభిప్రాయభేదాలు స్పష్టంగా కనుపించినప్పటికీ వారు స్పష్టంగా సిద్ధాంతీకరణ చెయ్యగలిగారనీ, ముఖ్యసూత్రాలను క్లిష్టంగా చెప్పగలిగారని అయిష్టులు సైతం అంగీకరించక తప్పలేదు.

ఏ క్రొత్త ఉద్యమమైనా ఆనాటి ఆచార వ్యవహారాల మీదకు దుమారం లేపక తప్పదు. ఆలోచించే అలవాట్లలో మార్పును తీసుకురావటంవల్ల వచ్చిన జయం మీంద ఆశపెట్టుకొని వుండటం ఏ ఉద్యమ నాయకులకైనా సహజమే. నవ్యవాస్తవిక ఉద్యమంయొక్క పుట్టుకే దీనికి ఉదాహరణ. అమెరికాలోని ఈ ఉద్యమం మొత్తం భావవాదానికి ముఖ్యంగా రాయిస్‌హోం సిద్ధాంతానికి నిరసనగా పుట్టిన ఉద్యమం. వాస్తవిక వాదాన్ని గిఫర్డ్ ఉపన్యాసాలలో రాయిస్ తీవ్రంగా విమర్శించారు. ఈ విమర్శకు జవాబుగా వాస్తవిక వాదం వృద్ధిచెందింది.



# 3

ఇంగ్లండులో నవ్యవాస్తవికోద్యమ చరిత్రనీ, దాని లక్షణాలనూ శ్యామ్యుయెల్ అలెగ్జాండర్ వాస్తవికత్వాన్నీ పరిశీలించే ముందు అమెరికాలో నవ్యవాస్తవిక సిద్ధాంతానికి దగ్గరలో వుండి, కొద్దిపాటి భేదాలతో ప్రచారంలో వున్న మరికొన్ని సిద్ధాంతాలను తెలుసుకుందాం :—

సహకార ప్రయత్నంతో సంపుటిని ప్రకటించిన నవ్యవాస్తవిక వాదుల్లోనే అభిప్రాయ భేదాలున్నాయి. మాన్టేగ్ తాను మితవాదినని ప్రకటించుకున్నాడు. తనకూ మిగిలిన వారికీ వున్న అభిప్రాయభేదాలను ఏకరువుపెట్టాడు. (1) పెర్రీ హోల్ట్ మొదలయిన వాస్తవికవాదులు ఒక వ్యక్తి ఒక పదార్థాన్ని తెలుసుకోవడం అంటే, అతని శరీర నిర్మాణం, ఆ పదార్థానికి ఏదో ఒకవిధంగా బదులుపలుకుతూ వుండాలి.' అంటారు; బదులు పలకటం అంటే శరీరానికి సంబంధించిన అన్నీగాని; కొన్నిగాని అణువులకు కదలిక కలగాలి, అని మాన్టేగ్ ఉద్దేశం. అప్పుడు ఈ కదలిక వొక నిర్ణీతమైన దారిన స్థలాన్ని ఆక్రమించుకోవటంగా జరగాలి అంటాడు మాన్టేగ్. పదార్థంయొక్క చైతన్యానికి ఇటువంటి కదలిక లేదని మాన్టేగ్ విశ్వాసం. (2) వీరు పదార్థాలు మనకు తెలియకపోయినా ఉంటాయని అంగీకరిస్తారని ఇదివరకే తెలుసుకున్నాం. ఒకవేళ మన చైతన్యం ప్రమాద జనితమైందో, భ్రాంతిపూర్వకమైందో అయితే ఆ చైతన్యానికి సంబంధించిన పదార్థం సంగతి ఏమిటి? అప్పుడుకూడా దానికి



బాహ్యాంలో స్వతంత్ర అస్తిత్వం ఉన్నట్లైనా? హోల్టు, పెర్రీ 'తప్పు' 'అవాస్తవికత్వం' 'వైరుధ్యం' బాహ్యంలో వున్నాయంటారు. ఇవి చైతన్యంవల్ల ప్రవేశపెట్టబడిన వికృతాలు కావు అంటారు. ఈ వాదాన్ని మాన్టేగ్ అంగీకరించడు.

మనస్సుకి బాహ్యంలో అవాస్తవిక పదార్థం ఉండే అవకాశాన్ని మాన్టేగ్ అంగీకరించాడు. కాని, అది అవాస్తవికం అయింది గనుక దానికి ఫలితాలు వుండవు అంటాడు. 'అవాస్తవికత యొక్క స్వభావం ఫలితాలను ఇవ్వకపోనటం. మనం వాస్తవిక పదార్థాన్ని తెలుసుకోగలం; కాని ఆ తెలుసుకోటానికి అది కారణం అవదు' అంటాడు. 'చైతన్యానికి విడిగా పదార్థాలకు ఎంత అస్తిత్వం, స్వతంత్రతా వుందో, అంత అస్తిత్వం, స్వతంత్రతా, వాటికి ఉండే సంబంధాలకుకూడా వుంది' అనే సిద్ధాంతాన్ని ఒప్పుకోదలచుకోక పోవటమే మాన్టేగ్ యొక్క ఈ అభ్యంతరానికి కారణం.

వీరికి ఇవేకాక ఇంకా చాలా అభిప్రాయభేదాలున్నాయి. ఆనాడు తాత్విక ప్రచారానికి పూనుకున్న పత్రికలన్నీ ఈ వాదోపవాదాలతోనే నిండి వుండేవి. ఇవి ముఖ్యమైన అభిప్రాయభేదాలుగా మనం పరిగణించవచ్చు.

మరికొన్ని వాస్తవికత్వ రూపాలను పరిశీలిద్దాం.

## 'క్రిటికల్' వాస్తవికత్వం:

1916 నుంచి 20 వరకూ ఈ గ్రూపు తమ ఉద్దేశాలను విరివిగా ప్రచారంచేసింది. ఈ గ్రూపు, వస్సార్

కాలేజీకి చెందిన డురాన్టు డ్రేక్, జాన్‌హాప్‌కిన్స్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆర్థర్ ఒలవ్‌జాయ్, విలియమ్స్ కాలేజీకి చెందన జేమ్సుబిస్సెట్‌ప్రాట్, యేల్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆర్థర్. కె రోజర్స్, మిచిగన్ విశ్వవిద్యాలయానికి చెందిన రాయ్ వుడ్ సెల్లర్స్, హార్వార్డులో అధ్యాపకుడుగా వున్న జార్జి శాంతాయన, కొలంబియా మనస్తత్వ శాస్త్రోపాధ్యాయుడుగా వున్న సి ఏ. స్ట్రాంగ్‌ల వంటి ఏడుగురు తత్త్వవేత్తలతో స్థాపించబడింది. ఈ ఏడుగురూ కలిసి 'క్రిటికల్ వాస్తవికత్వాన్ని గురించిన వ్యాసాలు' అనే గ్రంథాన్ని ప్రచురించారు.

వీరు, కొన్ని సందర్భాల్లో తెలిసిన పదార్థానికీ, ఆ జ్ఞానాన్ని పొందటానికీ కారణభూతమైన చైతన్యస్థితికీ భేదాన్ని గుర్తించాలి, అన్నారు. అంటే తమ పూర్వులు నిరసించిన 'ద్వంద్వా' న్ని వీరు కొన్ని ప్రయోజనాలకోసం కొంతవరకు అంగీకరించారు. కాని, ఈ భేదాన్ని అంగీకరించటంలో, 'మనం తెలుసుకోగలిగింది మానసిక స్థితినే; చైతన్యాన్నే' అని వారు అనలేదు.

జ్ఞానాన్వేషణకు బయలుదేరే స్థలంవొకటి వుంటుంది. ఇది దేనివల్లా వొచ్చింది కాదు. అది 'ఉంటుంది.' అంతే. దీన్ని వాస్తవికవాదులు 'డేటమ్' అన్నారు. పదార్థానికీ, దేనివల్ల అది చైతన్యంలోకి వస్తూవుందో, అటువంటి మానసిక స్థితికీ, వున్న భేదాన్ని గుర్తించటం ఈ వాస్తవిక వాదుల ముఖ్యసూత్రం. కొంతమంది మానసికస్థితి అంత

గతం అన్నారు. అట్టివారికి 'డేటమ్' బాహ్యవస్తువు. అది భౌతిక పదార్థంమాత్రంకాదు. జ్ఞానాన్వేషణలో మనం పదార్థాన్ని సమగ్రంగా అందుబాటులోనికి తెచ్చుకోలేం ...కొంతమంది ఈ 'డేటమ్' అటు పదార్థానికీ, ఇటు మనస్సుకీ చెందని ప్రత్యేకత కలదనీ పదార్థాన్ని మనస్సుకి తెలియబరచే గుణాలు కలదనీ భావిస్తారు. పదార్థంయొక్క 'ఏమిటిని' తెలుసుకొనే స్వభావం, మూలాం ఈ 'డేటమ్'అని వీరు భావిస్తారు. పైన ఉదహరించిన ఏడుగురు క్రిటికల్ వాస్తవికవాదులు దీన్ని నిర్వచించటానికి పూనుకునేటప్పటికి ఏకీభావం కుదరలేదు. లవ్ జాయ్, ప్రాట్, సెల్లర్స—ఈ ముగ్గురూ మనస్సుకి ప్రదర్శించబడే పదార్థం ఎప్పుడూ ఇంద్రియాలు ప్రోగుచేసే సరుకుతో తయారు చెయ్యబడుతుందని అభిప్రాయపడ్డారు. మిగిలిన నలుగురూ ఈ 'డేటమ్' అనేది పైవారు చెప్పేటంత స్వల్ప వ్యవహారం కాదనీ, చాలా క్లిష్ట వ్యవహారమనీ అభిప్రాయపడ్డారు.

## 'స్వాభావిక' వాస్తవికత్వం :

ఇది మామూలు మానవుడు అనుసరించే వాస్తవికత్వం. ఈ ప్రపంచంలో మామూలు మనిషికి కనపడే వాస్తవికత్వం. ఈ సిద్ధాంతానికి రాయ్‌వుడ్ సెల్లర్స్‌ని ప్రధానపురుషుడుగా అంగీకరించవచ్చు. 'తత్వశాస్త్రాల గొడవల్లో చిక్కుకోని మామూలు మనిషి వాస్తవికవాది. తనకు బాహ్యంలో ప్రపంచం వుంది. అందులో స్థలాన్నీ, కాలాన్నీ ఆక్రమించుకొని వున్న పదార్థాలున్నాయి. వాటిని

తాను చూస్తున్నాడు; వింటున్నాడు; ఊహిస్తున్నాడు; వాటితో సంబంధం పెట్టుకొని పునఃసృష్టి చేస్తున్నాడు; మారుస్తున్నాడు; ఉపయోగించుకొంటున్నాడు. తన అనుభవమే మామూలు అనుభవం అనుకుంటున్నాడు.'

భౌతికపదార్థాలు తను గమనించక ముందు నుంచి వుంటున్నాయనీ తరువాతకూడా ఉంటాయనీ అతడు భావిస్తాడు. వాటి ఉనికి అతనిమీద ఆధారపడిలేదు. వాటి గుణాలకీ, అతని మనస్సుకీ ప్రత్యేకసంబధం ఏమీలేదు. ఇతరుల దృష్టి వొకదానివైపుకు తాను మరలిస్తే వారు దాన్ని చూడగలుగుతారు. కావలసిన పని చేసుకోగలుగుతారు. వస్తువులు మానవులందరికీ వొకేవిధంగా సంబంధించినవీ మానవులనుంచి స్వతంత్రతగల వీనూ. పదార్థంలో మార్పు, పదార్థంలో మార్పువల్ల వచ్చిందికాదు. పదార్థాన్ని చూ చేవారికి సంబంధంలో వచ్చినమార్పు అది. ఈ దృష్టిలో చూచే వాడిలోకూడా ప్రత్యేకత ఏమీ లేదు. అతను తనుచూచే పదార్థాలవంటి ఒక వ్యక్తి. కాని, అతను ఇతర పదార్థాలను గురించీ, తన్నుతాను గురించీ, తెలుసుకోగల జ్ఞానం వొక సమస్యకాదు. వొక యదార్థ సంఘటన.

మామూలు మనిషియొక్క ఈ వాస్తవికత్వానికి రాయ్‌వుడ్, సెల్లర్స్ 'స్వాభావికత్వం' అని నామకరణం చేశారు. అయితే, 'ఈవాదం జ్ఞానంలో ఏం జరుగుతుందీ చెప్పదు. ఏం జరుగుతూవున్నట్టు కనపడేది మాత్రం చెపుతుంది' అన్నాడు సెల్లర్స్

## 'భావవాద' వాస్తవికత్వం:

ఈ ఉద్యమ నాయకుల్లో పిల్‌బర్. యం. అర్బన్ ముఖ్యుడని చెప్పవచ్చు. అతను 'వాస్తవికతత్వానికీ, భావ తత్వానికీ పైన' అనే గ్రంథంలో తన అభిప్రాయాలను విపులీకరించాడు. వాస్తవికతత్వం, భావతత్వం-ఈ రెండూ అసమగ్రమైనవేననీ, ఈ రెంటినీ అధిగమనించాలనీ, అందుకు వీటి వైరుధ్యంలో వున్న తర్కం ఉపయోగపడుతుందనీ చెప్పాడు. అయితే, ఈ అభివృద్ధి పూర్వపు భావవాదాలను మల్లేకాక వాస్తవికతమీద ఆధారపడివుండాలి అన్నాడు. అతని సిద్ధాంతాన్ని గురించి జోసెఫ్ యల్. బ్లా, 'వాస్తవికతలోని విరుద్ధ కెరటాలు' అనే వ్యాసంలో ఇలా చెప్పాడు— 'ఈ మధ్య శతాబ్దాల్లో వాస్తవికతత్వానికీ, భావతత్వానికీ సాగిన పోరాటం అనవసరమైన పోరాటం. పూర్వం జరిగినట్లే మళ్ళీ ఈ వైరుధ్యం త్వరలోనే అధిగమించబడుతుంది. నవ్యతత్వవేత్తలు ఈ రెండు సిద్ధాంతాలకూ వున్న వైరుధ్యాన్ని హేతువాద సిద్ధాంతంద్వారా, అనుభవంవల్ల వచ్చిన జ్ఞానంద్వారా పరిష్కరించగలమని భ్రమపడ్డారు. వాస్తవికతత్వంగానీ, భావతత్వంగానీ ఒక జ్ఞానంకాదు. అందువల్ల పరిష్కారం జరగదు. 'ఏ సిద్ధాంతానికి ఆ సిద్ధాంతం రెండో సిద్ధాంతం తప్పని నిరూపించ లేదు: ఏసిద్ధాంతానికి ఆ సిద్ధాంతం తాను రైటని నిరూపించుకోలేదు. ఇవి వొకదాని కొకటి సహాయం చేసుకొని, అభివృద్ధికి సహాయపడే సిద్ధాంతాలుగాని, వైరుధ్య సిద్ధాంతాలుకావు...'

ఈ విధంగా ఈ సిద్ధాంతాల సమన్వయంయొక్క అవుసరాన్ని చెప్పి, అర్బన్ ఈ రెండు సిద్ధాంతాలు 'స్వాభావిక వాస్తవిక వాదానికి వ్యతిరేకంగా ఏకం అవ్వాలి' అన్నారు.

## ౪

'నేను న్యూసౌత్ వేల్స్‌లోని సిడ్నీలో పుట్టాను. జనవరి ఆరు 1859 వ సంవత్సరం నా జననం. నా తండ్రిని నేను ఎరుగను. ఆయన, నేను పుట్టకముందే మరణించాడు క్షయతో మరణించాడు. కాని పిల్లలెవ్వరికీ ఆ జబ్బు సంక్రమించలేదు' – శ్యామ్యూల్ అలెగ్జాండర్ తన జీవితాన్ని గురించి వ్రాసుకోవటం ఈ విధంగా ప్రారంభించాడు. కాని పూర్తిచేయలేదు.

అతనికి సుమారు నాలుగవ ఏట అతనితల్లి మెల్‌బోరన్‌కు తన నివాసం మార్చింది. అప్పటినుంచి అతను ఇంగ్లండులోనే కాలం గడిపాడు. ఆక్స్‌ఫర్డులో వున్న బెలియాల్ కాలేజిలోనూ, మెల్‌బోరన్ కళాపరిషత్తులోనూ విద్యాభ్యాసంచేశాడు. మెల్‌బోరన్‌లో అనేక గౌరవాలనూ, బహుమతులనూ పొంది, అక్కడే కొన్ని సంవత్సరాలు పని చేశాడు. 1893 నుంచి 1924 వరకు మేన్‌చస్టర్ విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్రోపాధ్యాయుడుగా వుండేవాడు. ఆ రోజుల్లో ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ హెగెల్ వాదంతో తొణికిసలాడుతుండేది. మ్యాయిూకిమల్లే అలెగ్జాండర్ కూడా డార్విన్, హక్స్‌లే, స్పెన్సర్ మొదలయినవారి పరిశోధన

హెగెల్ ఇన్‌ఫ్లుయున్స్ చెయ్యబడిన భావవాదిగా తన జీవితాన్ని ప్రారంభించాడు. కాని వారి నాటి వాతావరణాల్లో చాలా భేదముండడంవల్ల అలెగ్జాండర్ యొక్క భావవాదం నవ్య వాస్తవికతత్వంలోనూ, ఐన్‌స్టీన్ మొదలయినవారి రిలేటివిటీ సిద్ధాంతంలోనూ పెరిగి ఒక వేదాంతశాస్త్రంగా వృద్ధి చెందింది.

ఈ కారణంగా క్రమక్రమేణా ఇద్దరిదృష్టులూ మారి పోయినై. మార్గాలు వేరైనై. వీరికున్న భేదాలను, విలియం కెల్లీ రైట్, 'అలెగ్జాండర్ వేదాంతం వాస్తవికతకు సంబంధించిన సమస్యల పరిష్కారమార్గాన్ని వెతుకుతుంటే, మ్యూయా ప్రాక్టికల్ దృష్టి ఆ వంకకు ప్రసరించనైనా ప్రసరించలే'దని క్లుప్తంగా చెప్పాడు.

అలెగ్జాండర్ తాత్విక పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ, అరిస్టాటిల్ పేర స్థాపించబడిన సొసైటీలో తాను వ్రాసిన వ్యాసాలు చదువుతూ, తన అభిమాన శాస్త్రంలో కృషి చేస్తూ, చాలా సంవత్సరాలు గడిపాడు. చివరికి 1916–18 మధ్యన గ్లాస్గో కళాపరిషత్తులో జరిగిన గిఫ్ఫర్డ్ ఉపన్యాసాలలో తన విధానాన్ని సమగ్రంగా చిత్రించి మేధావుల మన్ననలను పొందాడు

అప్పటినుంచీ అతన్ని అనేక బ్రిటిష్ విశ్వవిద్యాలయాలు గౌరవించినై. బ్రిటిషు ఎకాడమీలో 'ఫెలో' అయి 'ఆర్డర్ ఆఫ్ ది మెరిట్'ని పొందాడు. సెప్టెంబర్ 13, 1938 న మరణించాడు.

కొంతమంది, పుట్టినప్పటినుంచీ వొక చిన్న ఆదర్శం మనస్సులో వున్నట్లు ప్రవర్తించి, ఆ ఆదర్శాన్ని సాధించు కొని వొచ్చినదారిని వెళ్తారు. అటువంటి జీవితం శామ్యూల్ అలెగ్జాండర్‌ది. వీరు బ్రతికి నన్నాళ్ళు బ్రతుకుతారు; మరణానికి భయపడరు. జీవించినందుకు పశ్చాత్తాపపడరు. ఆగస్టు 21, 1938 న అతను ఒక స్నేహితునికి వ్రాసిన ఉత్తరం ఈ గుణాన్నే నిరూపిస్తుంది.

'నేనిప్పుడు వ్రాయలేను. ఇక మనం కలవమేమో అని భయపడుతున్నాను వొకవేళ ఈలోగా నేను సెలవు తీసుకున్నట్లు నువ్వే రిపోర్టయినా చదివితే విచారించకు. ఎందుకంటే, నేను దాన్ని గాఢంగా కోరుకుంటున్నాను,' అని వ్రాశాడు ఆ ఉత్తరంలో. ఈవిధంగా అతను ఈ ప్రాపంచిక రంగంనుంచి సెలవు తీసుకున్నాడు. నవీన తత్వశాస్త్ర చరిత్రలో అతని శక్తిసామర్థ్యాలనుగురించి రైట్, 'అతను సంభాషణా చతురుడుగాను, ఆలోచలను రేపే ఉపన్యాసకుడుగానూ ప్రసిద్ధికెక్కాడు. అతని రచనలు సానుభూతితోనూ, సౌహార్దంతోనూ నిండివుంటాయి. శాస్త్ర పరిశోధనలవల్ల వచ్చిన మార్పులకు సంబంధించిన తాత్విక ఫలితాల జ్ఞానాన్ని, లలితకళలమీద అతనికున్న అభిమానాన్నీ అతని రచనలు ప్రతిబింబిస్తాయి' అన్నాడు. అతని విధానాన్నీ, కృషినీగురించి ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ఈ విధంగా వ్రాసింది:

'ప్రవక్తలు, ఇక తాత్వికవిధాన నిర్మాణం అవసరం లేదని గట్టిగా, ధైర్యంగా చెప్పినతర్వాత, ఒక క్రొత్త

తాత్విక విధానాన్ని నిర్మించటానికి పూనుకున్న ప్రథమ బ్రిటిషు తత్వవేత్త ఇతను. ఇతని, 'స్పేస్, టైమ్, డియటీ' అనే గ్రంథంలో కాలాకాశాలను గురించిన నూతన దృష్టి, అత్యవసర పరిణామవాదం - ఈ రెంటి సహాయంతో ఏర్పడిన, ఇంచుమించు స్పినోజా ఉద్దేశించిన 'పాంథీజం' వంటి 'పాంథీజం' సృష్టికరించబడింది.

అసలు వాస్తవికత కాలాకాశం. దీన్నుంచి వేరే కాలం, వేరే ఆకాశం అనే మాటలు ఉమ్మడి మాటలు. కాలాకాశం ఒక మహాసముద్రం. అందులోని సుడిగుండాలు పదార్థాలను సృష్టిస్తుంది. పదార్థాలకూ, ఒకే విధానంలో కదలికవల్ల పుట్టిన అన్ని చర్యలకూ వర్తించే కొన్ని గుణాలు కాలాకాశాలకు వున్నవి. ఇవి వాటి స్వభావాలకు సంబంధించి వుంటవి. పదార్థాలకు ఇవికాక మరికొన్ని గుణాలు వుంటవి. అవి ప్రత్యేక పరిస్థితులవల్ల పుట్టినవి అయి వుంటవి. ఇవి అన్నీ కలిసి ఒక కూటంగా తయారవుతవి..."

౩

నవీన తత్వశాస్త్ర చరిత్రలో అలెగ్జాండర్ స్థానం చాలా ప్రత్యేకమైంది. అతని, 'స్పేస్, టైమ్, డియటీ' అనే గ్రంథం ఈ శతాబ్దంలో వెలువడిన గ్రంథాలన్నిటిలోకీ అతి గంభీరమైంది. ఒక నిర్దిష్టమైన ఆదర్శం గలది. అతని ప్రత్యేకతను తెలుసుకోవటానికి, అతని తత్వశాస్త్రం యొక్క ముఖ్య లక్షణాలను మనం అవగాహన చేసుకోవాలి.

నవ్యవాస్తవికత్వం:—అలెగ్జాండర్, చైతన్యం అనేది ఎక్కడ వుంటుందో, అక్కడ ఒక వస్తువు మరొక వస్తువుతో కలిసి కనపడుతుందని చెపుతాడు. మొదటి వస్తువుతో కలిసి కనపడటంవల్ల, రెండో వస్తువులో వచ్చే మార్పేమీ ఉండదు. నేను ఒక బల్లను చూచినప్పుడు ఆ బల్ల నాతో కలిసి కనపడుతూ వుందన్నమాట. నా చేతనశక్తి బల్లయొక్క ఉనికిని ఏవిధంగానూ మార్చలేదు. బల్ల నా సంబంధం లేకుండా దానంతట అది వుంటూనే వుంది. నేను ఒకచోటనుంచి, ఆ బల్లయొక్క ఒక కోణాన్ని చూడగలుగుతున్నాను. ఆకాశానికీ కాలానికీ సంబంధించిన మరికొన్ని కోణాలు ఆ బల్లకు వున్నవి. అవి నాకు తెలియవు. అంతమాత్రాన నాకు తెలిసిన బల్లమిథ్య అనటానికి వీల్లేదు. నేను చూసింది అసలు బల్లలోని భాగమేగాని, కాపీకాదు.

అలెగ్జాండర్ ఈ సిద్ధాంతాన్ని చివరదాకా లాగాడు. అతను ఈ సిద్ధాంతాన్ని జ్ఞాపకాలకూ, ఊహాచిత్రాలకూ, భ్రాంతులకూ కూడా వర్తింపజేశాడు. ఇప్పుడు మనం మద్రాసులో ఉండి, ఇంతకుముందు చూచిన హైదరాబాదుని ఊహించుకున్నామనుకోండి. మనకు అనుభవంలోకి వచ్చే హైదరాబాదు మనం చూచిన నిజమైన హైదరాబాదేగాని దాని భావనా కాదు, ప్రతిబింబమూ కాదు... ఆ మాటకి వస్తే మనస్సు సృష్టించే భ్రాంతులన్నీ నిజాలే. ఏ కారణంవల్లో వక్రరూపాలు ధరించిన నిజాలు అవి. 'మనస్సు కొత్తదాన్ని దేన్నీ సృష్టించలేదు. ఆలోచనద్వారా, హేతువాదంద్వారా, అంతకుముందే స్వతంత్రంగా వుంటున్నవాటిని,

మనస్సు ఒక క్రమపద్ధతిని 'అరేంజ్' చేస్తుందే గాని, మరేమీ చెయ్యలేదు. 'అసలు మనస్సు అనేది, వున్నవాటిని ఒక నిర్మాణం క్రిందకు తీసుకువొచ్చే క్రొత్త వ్యవస్థ' అని అలెగ్జాండర్ ఉద్దేశం.

అలెగ్జాండర్ సిద్ధాంతంలో మనం ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయం ఆలోచనకూ, ఆనందానికీ వున్న తేడా. 'నాచుట్టూ వున్న పదార్థలను గురించి నేను, నాకు విడిగా, ఒకదానికి ఒకటి విడిగా, వున్నవస్తువులుగా ఆలోచిస్తాను. కాని, ఏ టెన్నీసో నేను ఆడుతున్నప్పుడు, నా కదలికలనుగురించి ఆలోచించటమే కాక, దానివల్ల నాకు కలిగే ఆవేశాన్ని ఆనందిస్తాను. ఒక ప్రకృతిదృశ్యాన్ని చూచినప్పుడు, అది నాలో రేపిన ఆవేశాలను ఆనందిస్తాను; అన్నాడు. అలెగ్జాండర్ దృష్టిలో, ఆనందం అంటే ఒక్క సంతోషమే కాదు, విచారం, దుఃఖం. అంతర్గత జీవితానికి సంబంధించిన ప్రతి అనుభూతీ ఆనందమే.

కాలం; ఆకాశం; తరగతులు:-అలెగ్జాండర్ దృష్టిలో, దేనిలోనుంచి ఈ పరిణామం వృద్ధిచెందిందో, ఇప్పటికీ దేనిలో వుంటూవుందో, అటువంటి అనాది వాస్తవికత, కాలాకాశాలు. ఈ దృష్టి, ఈన్‌స్టిన్, బెర్గ్‌సన్ మొదలయినవారు చెప్పేది తెలుసుకోకుండా అలెగ్జాండర్‌కు కలిగివుండి వుండదు. పై వారి సిద్ధాంతాలను కొన్నిటిని ప్రతిపాదిస్తూ వాటి కొక ప్రత్యేకతను సిద్ధింపజేశాడు అలెగ్జాండర్. అనిత్యమైందీ ఆకాశానికి చెందందీ మరొకటి ఏదీ లేదు

అతనికి. 'ఆకాశం కాలంతో నిండి వుంది. కాలం ఆకాశంతో నిండివుంది. ఖాళీగావుండే ఆకాశం, ఖాళీగా వుండేకాలం 'ఏమీ లేకపోవటం'తో సమానం. అందులో ఉండటం అనేది క్రమంగా జరగటం అనేది ఉండదు. ఆకాశాన్ని ఆక్రమించుకొని ఒకదాని తర్వాత వొకటిగా జరిగే క్షణాలే కాలం. సంఘటనలను గుర్తుంచుకోవటం అనేది లేకపోతే, కాలంలో భూత భవిష్యత్ వర్తమానాలు అనేవి వుండవు.

ఒకదాన్నుంచి వొకటి విభాగించబడిన అనేక క్షణాలతో కూడుకొని వుంటుంది కాలం. మరల యే క్షణానికి ఆ క్షణం ప్రయాణం చేస్తూనే వుంటుంది. కదలకుండా వుండదు. ఆకాశంకూడా ఇంతే. ఆకాశం అనంతమైన 'పాయింట్ల'తో కూడుకొని వుంటుంది. ఈ ఒక్కొక్క పాయింటూ అనేక పాయింట్లుగా విభజించబడివుంటుంది. మరల ప్రతి పాయింటుకీ, దానికి వుండే కొలతలు దానికుంటవి. లేకపోతే కొలతలులేని పాయింట్లతో, ఈ ఆకాశం ఎలా నిండి వుంటుంది? కాల ఆకాశాల ఏకత్వం ఎప్పుడైనా ఉన్నదా అంటే, అది ఇదే పాయింటూ క్షణం వొకటిగా వున్న ఈ సంఘటనే! ఎంత తక్కువగా వుంటానికి వీలుందో అంత తక్కువ అవకాశం, ఎంత తక్కువగా ఉంటానికి వీలుందో అంతతక్కువ కాలాన్ని ఆక్రమించుకొని వుంటమే ఏకత్వం. కాలం ఆకాశంయొక్క నాలుగో పరిమాణం కాదు. కాలానికి వొక్క పరిమాణమేవుంది. అది దానికి సంబంధించిందే. అనంతకాలంలోవున్న ప్రతిక్షణం ఆకాశా

న్నంతా ఆక్రమించుకొని వుంటుంది; ఆకాశంలో వున్న ప్రతి 'పాయింటూ' కాలం వున్నంతకాలం వుంటుంది. ఈ ప్రపంచంలో ఏదీ పూరకి నేవుండదు. ఆ కాలా కాశాల్లో ఏదో ఒకవిధంగా కదులుతూనే వుంటుంది. బెర్గ్సన్ నిర్మిం చిన ప్రపంచానికి మల్లే అలెగ్జాండర్ ప్రపంచం కూడా ఎప్పుడూ మారుతూనే వుంటుంది. కాని వీరిద్దరికీ ఒక భేదం వుంది. కాలంతోపాటు ఆకాశంకూడా నిజమైన అస్తిత్వం కలదేనని అలెగ్జాండర్ భావిస్తాడు. దానికి ఇది వుండి తీరవలసింది అని కూడా చెపుతాడు.

గుణాలకు సంబంధించినంతవరకు నెమ్మదిగానో, త్వర గానో, ప్రతిదీ నిరంతరం మారుతూనే ఉంటుంది. అయిన ప్పటికీ కొరవడని కొన్ని స్వభావాలు వస్తువులకు ఎప్పుడూ వుండనేవుంటై. ఈ స్వభావాలను 'తరగతులు' అన్నాడు అలెగ్జాండర్. కాన్టుకిమల్లే, అలెగ్జాండర్‌కి ఈ తరగతులకు కారణం, మనస్సుయొక్క నిర్మాణంకాదు. ఈ ప్రపంచంలో కనపడే వస్తువుల యొక్క ముఖ్యమైన, అన్నిటికీ చెందిన, అనాది లక్షణాలే ఈ తరగతు లని అలెగ్జాండర్ విశ్వాసం. 'కాబట్టి భౌతిక, మానసిక అనుభవాల్లో ఇవి వుంటూనే వుంటవి. వస్తువులు విభాగం అయినప్పటికీ ఈ లక్షణాలు కాలం యొక్క, ఆకాశంయొక్క ముఖ్యగుణాలుగనక, అంతటా వుండనే వుంటాయి' అని అలెగ్జాండర్ ఉద్దేశం.

అత్యవసర పరిణామం:- పరిణామంలో అవసరాన్ని బట్టి క్రొత్తగుణాలు వొస్తాయని ఈ వాదం చెపుతుంది,

ఈనాటికి వున్న జ్ఞానంతో ఈ గుణాలు అంతకుముందున్న గుణాలలోనుంచి ఎలా వొచ్చినయ్యో, ఎలా వృద్ధిచెందినయ్యో మనం చెప్పలేం. ఇవి పైకి మరెక్కడనుంచో వొచ్చిపడిన క్రొత్తగుణాలుగా కనిపిస్తయి. పదార్థంలోనుంచి ప్రాణం, ప్రాణంలోనుంచి మనస్సు ఇందుకు ఉదాహరణలు.

ఈ వాదాన్ని చర్చిస్తూ కెల్లీరైట్, "ఆకాశం, కాలం, తరగతులూ మూలానికి సంబంధించిన గుణాలు కలిగినవి. ఇవి ప్రపంచానికి అన్నిటా సంబంధించినవి. ఇవి కాక, మన అనుభవంలోకివొచ్చే ప్రతి ప్రతివస్తువుకీ, వీటికి సంబంధంలేని మరికొన్ని గుణాలు, అనుభవంవల్ల తెలుసుకోబడేవి వుంటాయి. 'అత్యవసర పరిణామం' యొక్క ప్రతి ప్రతిదశలోనూ పాతదశకు లక్షణాలు వుంటూనే, క్రొత్త దశకు చెందిన లక్షణాలు కలుస్తూవుంటవి" అన్నాడు.

ఈ విధంగా చెప్పుకున్నదానికంటె, స్పెన్సర్ యొక్క రిడక్ష నిజంతో పోల్చి చూసుకుంటే ఈ వాదంయొక్క స్వభావం తేలిగ్గా అర్థమవుతుంది. స్పెన్సర్ పరిణామంలో అన్ని దశలనూ ఒకే కారణానికి ముడి పెట్టాడు. అతను పదార్థం, ప్రాణం, మనస్సూ - వీట్లవల్లవచ్చిన భేదాలను గమనించలేదు. అన్నిటినీ పదార్థానికీ, కదలికకూ ముడి పెట్టాడు. ఈ పరిణామవాదులు, స్పెన్సర్ వొక విషయంలో సక్రమంగానూ, మరొక విషయంలో పొరపాటుగానూ ఊహించాడని చెపుతారు. మన శరీరాలు, మనస్సులూ అన్నీ పదార్థంయొక్క, కదలికయొక్క, నిర్మాణాలే - అనే

స్పెన్సర్ ఉద్దేశాన్ని వీరు అంగీకరిస్తారు. శరీరంలేని చేతన శక్తి ఉండబోదని వీరు అంగీకరిస్తారు. కాని ఇంతవరకు చెప్పి, చెప్పవలసినది అంతా చెప్పాననుకోవటం స్పెన్సర్ చేసినతప్పు. అతను ప్రాణం పదార్థంలో లేని కొన్ని గుణాలను కలిగి వుండటంయొక్క ప్రాముఖ్యతను గ్రహించలేక పోయాడు - అని వీరి వాదం.

భూమిమీద ప్రాణం కనుపించకముందు, మరొక గోళాన్నుంచి ఇక్కడికి ఎవ్వరైనా వచ్చి, భౌతిక రసాయన శాస్త్రాల జ్ఞానాన్ని సంపూర్ణంగా సంపాదించి ఆలోచించి పరిణామాన్ని ఈ జరిగిన విధంగా ఊహించలేడు. ప్రాణం బహిర్గతం అయిన తర్వాత యాటమ్స్‌యొక్క, మోలెక్యూల్స్‌యొక్క అన్నిరకాల కలయికలనూ తెలుసుకొనివున్నా, అతను మానసిక శక్తిని ఊహించి ఉండలేకపోయేవాడు. కాబట్టి స్పెన్సర్ చెప్పినట్లు, పదార్థాన్నీ, కదలికనూ తీసుకొని, ప్రాణం, మనస్సూ మొదలయిన దశలు బహిర్గతమవటాన్నీ కారణయుక్తంగా విశదపరిచలేం. ఈ దశలను జరిగిన సంఘటనలనుగా మాత్రమే చూస్తాడు శాస్త్రకారుడు. ఈ పరిణామవాదులు అటు స్పెన్సర్‌తోనూ, ఇటు ద్వంద్వాలను అంగీకరించే బెర్గ్‌సన్‌తోనూ ఏకీభవించరు. 'పదార్థాన్ని భిన్నంగా, స్వతంత్రంగా, నడిపే శక్తి ప్రాణం' అని వీరు అంగీకరించరు. 'కొత్తదశలో ఆర్గనైజ్ అయిన పదార్థమే ప్రాణం' అని వీరు అంటారు. పదార్థానికి సంబంధించిన ప్రాతిగుణాలను ఉంచుకుంది; క్రొత్తగుణాలను కలుపుకుంది పరిణామం-అంటారు.

పరిణామంలో ఎన్ని దశలున్నాయి-అనే విషయంలో వీరిలో వీరికి అభిప్రాయభేదాలు వున్నాయి. కాని పదార్థం ప్రాణం, మనస్సూ ఈ మూడుదశలను గురించీ అందరి అభిప్రాయాలూ వొకటే. అలెగ్జాండర్ మాత్రం ప్రస్తుతం భూమిమీద అయిదు దశలకు తక్కువకాకుండా వున్నాయనీ ఆరో దశ రాబోతూవుందని పరిణామంలోని ఈ దశేఅంతు వుండదనీ భావిస్తాడు; అతను భావించిన ఆరుదశలు ఇవి:—

1. అలెగ్జాండర్ లెక్క ప్రకారం క్రింద అంతస్థు, తరగతులవారీగా తేల్చబడిన ఆకాశ కాలాలకు సంబంధించినది. ఈఅంతస్థుని మనం సహజ జ్ఞానంతో తెలుసుకోగలం. దీన్నే కాన్టు 'అన్గాను' అన్నాడు. దీని సహాయంతోనే మనం కాలాకాశాలను తెలుసుకోవచ్చు.

2. భౌతిక పదార్థాలయొక్క గుణాలతో కూడుకున్న అంతస్థు ఇది. వీటిని మనం 'సెన్సేషన్స్' ద్వారా తెలుసుకోగలం. ఇందులో ముఖ్యమైనవి పరిణామం, ఆకారం, సంఖ్య, గమనం. మొత్తాన్ని జడత్వాన్నీ, శక్తినీ ఈ అంతస్థుకి, ఆపాదించాలో, ఇంకొక అంతస్థుకి ఆపాదించాలో అలెగ్జాండర్ గట్టిగా తేల్చలేదనే చెప్పాలి.

3. ఈ అంతస్థు రంగు, ధ్వని, వాసన, వేడి మొదలయిన రెండవరకం గుణాలకు సంబంధించినది. రంగుని కంటిద్వారా, ధ్వనిని చెవిద్వారా తెలుసుకున్నట్లు ఈ రెండవరకం గుణాలను ఒక్కొక్క గుణాన్ని వొక్కొక్క

ఇంద్రియంద్వారా తెలుసుకోగలుగుతాం. ఈ గుణాలు కూడా తమ అస్తిత్వానికి మనస్సుమీద ఆధారపడకుండా స్వతంత్రంగా వుండేవే! కాని ఇవి వొకవస్తువుయొక్క స్వభావంలో కూడుకొని వుండక, వస్తువుకీ, దాని పరిస రాలకీ సంబంధించి వుంటవి. రంగువిషయంలో కాంతి, ధ్వనివిషయంలో గాలీ మనం ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవొచ్చు. ఈప్రకారం చెప్పుకోవటం లోకే, బర్క్లేల తత్వశాస్త్రాల సమన్వయంగా మనం పరిగణించవచ్చు. 'ప్రధానగుణాలుకాక, రెండవరకం గుణాలుకూడా యదార్థ మైనవే! మనస్సుకి విడిగా, స్వతంత్రంగా వుంటమేకాక బయట ప్రపంచంలో హోదాలోనూ వాటికీ, వీటికీ కొంచెం తేడా వుంటుంది' అని చెబుతాడు అలెగ్జాండర్.

4. ఇది ప్రాణానికి సంబంధించిన అంతస్థు తక్కువ అంతస్థులకి సంబంధించిన గుణాలే కాక, కొన్ని కొత్త గుణాలు బహిర్గతం అయినై. అసలు పదార్థంలో భేదంలేదు. ఈ గుణాలు ఒక రకంగా నిర్మాణమైన పదార్థంయొక్క ఫలితాలే! కండరాల కదలికా, ఆకలీ, దాహం మొదలైన వాటిద్వారా మనం ప్రాణాన్ని తెలుసుకోగలుగుతున్నాం. వాస్తవిక వాదియైన అలెగ్జాండర్, వీటిని మనస్సుకి విడిగా వున్న నిజమైన ప్రేరేపణల క్రిందే పరిగణించాడు. అతనికి ఇవి నిజమైన ప్రపంచంలోని సంఘటనలే!

5. ఇది మనస్సుకి సంబంధించిన అంతస్థు. ఈ అంత స్థుకి చెందిన లక్షణాలు మన ఆలోచనకు సంబంధించినవి

కాదు. మనలో మనమే ఆనందించి, ఇతరుల ఆనందాన్ని సానుభూతితో తెలుసుకోగలిగిన లక్షణాలు ఇవి. 'జీవితం అంతస్థులో వున్నవారు జీవితాన్ని ఆనందిస్తారు కాని, ఆస్వాదించరు. పై అంతస్థుకు చెందినవారు మాత్రమే మనం ఆనందించే మానసిక స్థితిని ఆస్వాదించ గలుగుతారు' అన్నాడు అలెగ్జాండర్.

6. ఇంకా భూమిమీద అవతరించని ఆరో అంతస్థు, 'దేవత' అంతస్థు. ఈ అంతస్థు గత అంతస్థులకంటే అభివృద్ధికరమైంది అని చెప్పటంకంటే, ఎక్కువ ఊహించటం కష్టం...

'నా మనస్సు నాకు, చెట్టుమాదిరిగా, బల్ల మాదిరిగా వొకపదార్థం కాదు' అని చెపుతూ, దేవత అనే భావాన్ని 'స్పేస్, టైమ్, డియటీ' అనే గ్రంథంలో ఇలా విపులీకరించాడు అలెగ్జాండర్—'నాకంటే వృద్ధిచెందిన, అంటే మానసిక స్థితిని దాటిన మరొకరిని ఊహించుకోండి. అతన్ని 'దేవత' అందాం. అతనికి మాత్రం నా చైతన్యం, చెట్టుతో సరైన పదార్థంగా కనుపిస్తుంది. చెట్టునీ, భూమినీ నేను కలిపి చూడగలిగినట్లే, అతను చెట్టునీ, చెట్టుకి సంబంధించిన నా ఆనందాన్నీ చూడగలుగుతాడు' అన్నాడు.

విలువలు:—అలెగ్జాండరుకి విలువలు మూడవ తరగతికి చెందిన గుణాలు, మొదటితరగతి గుణాలకు మల్లే ఇవి పదార్థాలకు వాటంతట వాటికి చెందినవి కావు; రెండవ తరగతి గుణాలకుమల్లే పరిసరాలకు సంబంధించిన పదార్థాల

గుణాలూ కావు మొదటి రెండురకాలూ, గుణాలూ, స్వతంత్రంగా అస్తిత్వం కలవి. తమ అస్తిత్వానికి మనస్సు మీద ఆధారపడి లేవు. విలువలు అలా కాదు. అవి మనకూ పదార్థాలకూ వున్న సంబంధంమీద ఆధారపడి వుంటవి. మనస్సుకి విడిగా వుండ లేవు...

అలెగ్జాండర్ తత్వశాస్త్రంలోని ముఖ్యలక్షణా లివి. ఈ లక్షణాలను మనం పరిశీలిస్తే అలెగ్జాండర్ మానవుణ్ణి భూమిమీద నిలిపి, అతనికి వొక నిర్దుష్టమైన దృష్టిని ఇవ్వటానికి తీవ్రంగా ప్రయత్నించాడని తెలుస్తుంది. 'ఇతరులకు నిరాశా, తప్పుకుతిరిగే అవకాశం కనపడినచోట అలెగ్జాండర్‌కు ఆనందం కనుపించింది. అలెగ్జాండర్ దృష్టిలో మానవుడు ప్రకృతికి విడిగా లేడు. ప్రకృతిలోనే వున్నాడు. ఈ ప్రపంచం వొక పద్ధతికి లోనై వున్నదే. ఇది కాలంతోనూ ఆకాశంతోనూ కూడుకొనివున్న వొక విధానం. దీనికి అర్థం వుంది; వొక పొందిక వుంది; ఏకత్వం వుంది' అన్నాడు, మిల్టన్ ఆర్. కాన్విడ్జి తాను వ్రాసిన 'విలువ యొక్క స్వభావం' అనే గ్రంథంలో. అదే గ్రంథంలో మరొకచోట 'ఈ ప్రపంచంలో మనిషికీ మనస్సుకీ ఉచిత స్థానాలు కల్పించటం అలెగ్జాండర్ యొక్క ఉద్దేశం. వాస్తవిక వాదిగా అతను పదార్థాలకు మనస్సుయొక్క అహంవల్ల పూయబడిన రంగును మాపటం వొక పనిగానూ, అంతటితో ఆగక మనస్సుతో బాటు వాటికీ స్వతంత్రతను కలిపించటం ఇంకొక పనిగానూ పెట్టుకున్నాడు. అతని వాస్తవిక సిద్ధాంతం ఈ ప్రపంచంలో మానవునికీ అతని ఆపేక్షలకీ ఒక స్థానాన్ని

కల్పించటంలో ఆగలేదు. పదార్థాల భౌతిక స్వభావం అన్నిటికీ వర్తిస్తుందనీ, ఒక కోణంనుంచి చూస్తే అన్నీ స్వభావసిద్ధమైనవిగానూ, మెకానికల్‌గానూ కనిపిస్తవనీ నమ్మకం కలిగేటట్టు చేసింది' అన్నాడు.

౬

నవ్యవాస్తవికోద్యమం శాస్త్రజ్ఞానంవల్ల పుట్టిన ఉద్యమం. పాశ్చాత్య దేశాల్లో దీని వ్యాపకానికి పరిస్థితులు బాగా దోహదం చేశాయి. దీనికి దోహదంచేసి, వాస్తవిక ఉద్యమంయొక్క అవసరాన్ని తెచ్చిపెట్టిన పరిస్థితులను జోసెఫ్ యల్. బ్లా 'మానవులూ - ఉద్యమాలూ' అనే గ్రంథంలో చక్కగా చిత్రించాడు.

"కాన్టు శాస్త్రజ్ఞానానికి కొన్ని హద్దులు పెట్టదలిస్తే, అతని అనుచరులు ఈ ప్రయత్నాన్ని 'అతనికి ప్రకృతి శాస్త్రాలమీద నమ్మకం లేక పోవటంగా' అర్థంచేసుకొని, వాస్తవికత్వాన్ని తెలుసుకోటానికి సైన్సుకి అతీతంగా ఉండే ఒక దృష్టిని ప్రోత్సహించారు. 'అనుభవంమీద ఆధారపడే శాస్త్రం యదార్థాన్ని తెలుసుకోలేదు' అన్నారు. 'భౌతిక ప్రపంచాన్ని అధిగమించి ఊహించగల తాత్విక ఊహాలే ఇందుకు తగినవి' అని ప్రకటించారు. మొత్తం ప్రపంచాన్ని అర్థం చేసుకోటానికి ఈ 'తాత్విక సత్యాన్ని' అనుసరించటంకంటే వేరు మార్గం లేదు" అన్నారు.

ఈ మార్గం ప్రకారం పదార్థం కొందరికి మనస్సుగా కనిపించింది; మరికొందరికి [illegible]గా కనిపించింది; ఇంకొందరికి 'ఇచ్ఛ'గా కనిపించింది. మానవ జ్ఞానానికి సంబంధించిన పదార్థాలు వాటిని తెలుసుకునే ప్రయత్నంలో మారుతుంటాయనీ, కాబట్టి తెలుసుకోవటం అనేది ఎప్పుడూ జరగదనీ చెప్పి, భావవాదం వీటన్నిటినీ సహించింది కాని తెలుసుకోలేమని తెలుసుకొని, తెలుసుకోవటానికి ప్రయత్నించటం మానవ ప్రయత్నాన్నీ, ఆ మాటకు వొస్తే జీవితాన్నే అపహాస్యం పాలుచేసింది. ఈ చక్రంనుంచి తప్పించుకోటానికి మానవునికి, మనం తెలుసుకున్నా తెలుసుకోలేకపోయినా అసలు వాస్తవికత ఒకటి వున్నదనీ, అది మనం తెలుసుకోటానికి విడిగా స్వతంత్రంగా వుంటూ వుందనీ మనం తెలుసుకునే ప్రయత్నం దాన్నేవిధంగానూ బాధించదనీ చెప్పే సిద్ధాంతం కావలసివొచ్చింది. అదే నవ్యవాస్తవిక తత్వం. ఆనాడు వొచ్చిన ఈ మార్పుని పారింగ్టన్ ఈవిధంగా వర్ణించాడు :

“సైన్సు ప్రపంచాన్ని గురించి అంతకుముందు మేధావులకూ, ప్రజాసామాన్యానికీ వున్న అభిప్రాయాలను పూర్తిగా మార్చివేసింది. శాస్త్ర పరిశోధనలు ‘ఈ ప్రపంచం కరుణామయం’ అనే భావాన్ని త్రోసివేసినై. ఈ ప్రపంచం జీవశాస్త్రం ఊహించినదానికంటే విశాలమైందీ, ఉత్సాహ రహితమైందీ అని ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్ప నారంభించినై. ఈ శాస్త్రజ్ఞులు ప్రపంచాన్ని యాక్షన్, రియాక్షన్ రూపంలో బహిర్గతం అవుతున్న శక్తివల్ల నిలబడివున్న ఒక చలన

యంత్రంగా వర్ణించటానికి పూనుకున్నాయి. దీనివల్ల అంతకు ముందుతరంవారు ఊహించిన దేవుళ్ళ రూపాలు మారాయి" అన్నాడు.

వాస్తవిక తత్వశాస్త్రానికి శాస్త్రజ్ఞానమే పునాది. అందువల్ల వాస్తవిక వాదప్రముఖులు తత్వశాస్త్రాన్నికూడ సైన్సుగానే పరిగణించారు. అలెగ్జాండర్ 'స్పేస్, టైమ్, డీయటీ' అనే తన గ్రంథంలో తత్వశాస్త్రానికీ సైన్సుకీవున్న భేదాన్ని చర్చిస్తూ 'ఈ రెంటికి అవి చర్చించే విషయాల స్వభావాల్లోతప్ప, అనుసరించేవిధానంలో భేదం ఏమీలేదు' అన్నాడు. అని పోలికలను ఈ విధంగా క్రోడీకరించాడు :

1. రెంటి విధానం అనుభవంమీద ఆధారపడిందే.

2. రెండూ తాము తెలుసుకోదలచిన విషయాలను, ఆలోచనతో కూడిన వర్ణనద్వారానూ, విమర్శద్వారానూ, తెలుసుకో దలచినవే.

3. తాము సేకరించిన విషయాలను, వొక పద్ధతిన కూర్చటానికిగాను, రెండూ వొక ఆధారాన్ని కల్పించుకునేవే.

4. ఈ రెండూ విషయసంగ్రహణనుబట్టి వొక హేతువాద విధానాన్ని నిర్మించటంకంటే, చెయ్యగలిగింది ఏమీ లేదు-అని వొప్పుకునేవే.

## ౭

'మానవ ప్రయత్నానికి విలువ వుందా; లేదా ?' 'మానవుడు స్వతంత్రుడు కాదా ?' అనే ప్రశ్నలకు అలెగ్జాండర్ ఒకప్పుడు హెగెల్‌లాగానూ, మరొకప్పుడు స్పినోజా లాగానూ మాట్లాడుతాడు. 'చేస్తున్నది నేను' అనే ఆనందం నాకు కలిగితే నేను స్వతంత్రుడ నన్నమాటే. చెయ్యటంలో వున్న ఆనందాన్ని నేను అనుభవించలేక పోయినప్పుడు నేను అస్వతంత్రుణ్ణిగా పనిచేస్తున్నట్లే! దానికి కారణం అయిన మానసికస్థితి కనపడనప్పుడు వొచ్చినకోపం, నేను అస్వతంత్రుణ్ణనే చెపుతుంది. అయినప్పటికీ, మనం అస్వతంత్రులం అని భావించుకున్నప్పటికీ, మన బాధ్యతలు పోవు.

'స్వతంత్రత'లో రెండు రకాలున్నాయి.

1. బయటి వొత్తిడి లేకపోయినప్పుడు, ఈ స్థితిలో మానవుడు తన ఆవేశాలకు లోనయ్యే తాను ప్రవర్తిస్తాడు. తన పనులకు తానే బాధ్యుడవుతాడు.

2. తన ప్రవర్తన తన స్వభావంలో నుంచి పుట్టినపుడు; తన పూర్ణ ప్రవృత్తి పై ప్రవర్తనకు కారణం అయినప్పుడు.

తన పూర్ణ ప్రవృత్తి కారణంగా ప్రవర్తించే మనిషి సత్పురుషుడు ఎందుకంటే, అతను చేసే పనుల్లో పొందిక వుంది. అతను చేసే పనులకూ, సంఘశ్రేయస్సుకీ వైరుధ్యం అనేది ఉండదు.

మొదటితరగతి ప్రకారం మంచివాడూ, చెడువాడూ కూడా స్వతంత్రులే. రెండో తరగతి ప్రకారం మంచివాడు మాత్రం స్వతంత్రుడు ఔతున్నాడు.

ఇంతవరకు అలెగ్జాండర్ సిద్ధాంతం, హెగల్ సిద్ధాంతానికి మల్లేనే నడిచింది. ఈసిద్ధాంతాన్ని పరిణామవాదం చిత్రంగా ఇముడ్చుకున్నాడు, అలెగ్జాండర్. అతని పరిణామవాదంలో ప్రతి దశా, తన చేష్టలను తాను ఆనందిస్తుంది; తన క్రిందదశకు చెందిన చర్యలను గురించి ఆలోచిస్తుంది. ఈవిధంగా అణువులు, తమ కదలిక వరకూ స్వతంత్రాన్నే అనుభవిస్తున్నాయి. ఆలోచించే కాల ఆకాశాలకు కట్టుబడి వున్నాయి. మొక్క తనకు తాను స్వతంత్రాన్నే అనుభవిస్తూ వుంది. పైదశకు చెందిన మనకుమాత్రం బానిస బ్రతుకు బ్రతుకుతున్నట్లు కనిపిస్తూవుంది. పై దశనుండి చూస్తున్న దేవతకు మన మానసిక ప్రవృత్తులు ముందుగా నిర్ణయింపబడి అస్వతంత్రతగా వున్నట్లే కనిపిస్తాయి. ఈ దశకు చెందిన మనంమాత్రం స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నట్లే భావిస్తాం.

అలెగ్జాండరు యొక్క ఈ సిద్ధాంతంలో అటు హెగెల్ వాదం, ఇటు స్పినోజా వాదం, రెండూ వున్నాయని ముందే చెప్పుకున్నాం. ఈ రెంటినీ సమన్వయం ఎంతవరకు చెయ్యగలిగాడనేది ప్రశ్న.

జాగ్రత్తగా పరిశీలిస్తే స్వాతంత్ర్యాన్ని గురించి అలెగ్జాండర్ అభిప్రాయాలు, నవ్య తత్వశాస్త్ర చరిత్రలో,

రైట్ చెప్పిన పద్ధతికి తేలుతయ్. 'నవ్యవాస్తవిక వాదుల్లో ఇటీవల ఒక గుణాం కనిపిస్తూవుంది. అందులో అలెగ్జాండర్ ముఖ్యుడు. వీరి పరిణామం మానసిక దశకు వొచ్చేటప్పటికి విలువల్లో, స్వాతంత్ర్యంలో నూతనాధ్యాయం వొచ్చినట్లు చూస్తున్నారు' అన్నాడతను.

నవ్యవాస్తవిక వాదానికీ, ప్రెగ్మాటిజానికీ, నవ్యవాస్తవిక వాదానికీ, భావవాదానికీ వున్న భేదాన్ని కొలంబియా విశ్వవిద్యాలయానికి చెందిన జోసెఫ్ యల్. బ్లా చక్కగా వ్యక్తపరిచాడు. ఈ అభిప్రాయాలను తెలుకోకుండా నవ్యవాస్తవికత మీద ఏ వ్యాసమూ పూర్తి అయినట్లు కాదు. అతను నవ్యవాస్తవికత్వానికీ, ప్రెగ్మాటిజానికీ వున్న మూలభేదాన్ని ఈవిధంగా చెప్పాడు:

'యదార్థ సంఘటనలకు ఆలోచనను కలపటమే భావాలవల్ల వొచ్చే భేదమని నవ్యవాస్తవిక వాదం చెపుతుంది ఆలోచన, ఆలోచనకు గురియైన పదార్థాల్లో ముఖ్యమైన మార్పులను కలిగించదని ఈ వాదం చెపుతుంది. కాని జ్ఞానంయొక్క పని, యదార్థ సంఘటనలను తెలియజెప్పటం మాత్రమేనని ప్రెగ్మాటిజం అంగీకరించదు. ఈ వాదానికి యదార్థ సంఘటనలు అనేవి ముందు వుండవు. తెలుసుకునే విధానంలో అవి యదార్థ సంఘటనలు అవుతున్నాయి...'

'సంఘటనలను నిర్మించే విధానంలో ఆలోచన ఒక భాగం; ప్రతిసిద్ధాంతం మారే విధానంలోవున్న అనుభవమే' అంటుంది ప్రెగ్మాటిజం.

ఇక, భావవాదానికీ, నవ్యవాస్తవికతత్వానికీ వున్న భేదం అతను ఇలా సంక్షిప్తంగా చెప్పాడు: 'ఏదో ఒక విధంగా తెలుసుకోవటం అనేదిలేకుండా యదార్థం అనే వుండదు. తెలుసుకున్నది 'నేనైతే' అది 'సబ్జక్టివ్' భావవాదం అవుతుంది; యాబ్‌సొల్యూట్ మనస్సయితే 'యాబ్సొల్యూట్' భావవాదం అవుతుంది. ఈ తెలుసుకోవటం సాంఘికం అయితే అది 'ఆబ్జక్టివ్' భావవాదం అవుతుంది. నవ్య వాస్తవికత్వంమాత్రం మానవుడు తెలుసుకోటానికి, స్వతంత్రంగా వుంటుంది, 'యదార్థం' అని చెపుతుంది'' అన్నాడు.

సహజ వాస్తవికత్వం, వాస్తవికత్వానికీ మనకు కనపడేదానికి, భేదంలేదని చెపుతుంది. ఉన్నదే మనకు కనపడుతూంది; చూచేదానికీ, చూడబడేదానికీ మధ్య ఏదీ జోక్యం కలిగించుకొని వాస్తవికత్వాన్ని మనకు తెలియకుండా చెయ్యటంలేదని చెపుతుంది. మనం చూస్తున్నాం. చూచింది నిజం క్రింద తీసుకొని ప్రవర్తిస్తున్నాం. కొన్నిట్లో కాకపోయినా, కొన్నిట్లో అయినా అనుకున్న ఫలితాలను పొందగలుగుతున్నాం. కాబట్టి మనం చూచేది యదార్థమే అయి వుండాలి.

ఇలా భావించటంవల్ల కొన్ని చిక్కులు తొలగుతున్నాయి. అన్నిటికన్నా ముఖ్యం అసలు ప్రపంచమే లేదు, 'జగం మిథ్య, పలాయనం మిథ్య' అనే స్థితికి రావలసిన అవసరం లేకుండా పోతూంది. ఇంతవరకు నిజమేగాని, ఈ దృష్టి

మరొక కొత్తచిక్కును తెచ్చిపెడుతూవుంది. ఉన్నదాన్ని మనం తెలుసుకుంటున్నప్పుడు చూచేదానికీ, చూడబడే దానికీ మధ్య ఏదీ ఐక్యం కలిగించుకోనప్పుడు పొరపాటూ, భ్రాంతీ అనేవి ఎలా కలుగుతున్నవి?

ఈ ప్రశ్నకు సహజ వాస్తవిక వాదులు జవాబుచెప్పలేదు. ఈ ప్రశ్నకు జవాబుగా డిస్కార్టిన్, లోకే మొదలయిన తత్వవేత్తలు ద్వంద్వ సిద్ధాంతాన్ని సృష్టించారు. ఈ సిద్ధాంతం తెలుసుకునేది వేరూ, తెలుసుకోబడేది వేరూ అని చెబుతుంది తెలుసుకునేదీ, తెలుసుకోబడేదీ వేరు అవటంవల్ల, తెలుసుకోవటంలో పొరపాట్లూ, భ్రాంతులూ కలుగుతున్నాయని చెబుతుంది. ఈ విధంగా సహజ వాస్తవికవాదం తెచ్చిపెట్టిన చిక్కును ఈ ద్వంద్వవాదం విడదీసింది. కాని, ఈ వాదం చేసిన పని అంతవరకే. పై చిక్కును విడదియ్యటంకోసం, 'అసలు వాస్తవికత్వాన్ని తెలుసుకోలేం' అనే పరిస్థితిని అంగీకరించవలసి వచ్చి, అంగీకరించింది. 'నవ్యవాస్తవికత' అనే గ్రంథంలో చెప్పినట్లు, ఈ వాదం 'మనస్సు తన భావాలనూ, స్థితులనూ మాత్రమే తాను తెలుసుకుంటూ వుందిగాని, బాహ్య పదార్థాలను తెలుసుకోవటం లేదు.'

ఈ విధంగా ద్వంద్వ సిద్ధాంతం తాను విడదీసిన చిక్కుకంటే పెద్ద చిక్కును తెచ్చిపెట్టింది. మరోరకంగా చెప్పుకోవాలంటే, 'మనం ప్రస్తుతం తెలుసుకుంటున్నది

యదార్థప్రపంచాన్ని కాదు; దాని ప్రతిబింబాన్ని మాత్రమే' అనే నిర్ణయానికి వచ్చింది.

భావవాదం ఈ చిక్కును విడదియ్యటానికి పూను కుంది. ఈవాదం మనస్సుకి విడిగా వున్న బాహ్యప్రపంచాన్ని వొదిలివేసి, మనస్సులూ, మానసిక స్థితులూ వున్న ప్ర చాన్నే గమనంలోకి తీసుకుంటుంది. 'చూచేది లేకుండా చూడ బడేది లేదు. చైతన్యం లేకుండా అస్తిత్వం లేదు' అని ఈ వాదం చెపుతుంది.

ఇటువంటి అల్లకల్లోలంలోకి 'నవ్యవాస్తవికత' అడుగు పెట్టింది. అడుగుపెట్టి మనం తెలుసుకున్నా, లేకపోయినా వాస్తవికత అనేది స్వతంత్రంగా వున్నదని ముందు నిర్ధా రించింది. మనం చూడగలిగేది వాస్తవికతనే అన్నది. అయితే, వాస్తవికతను మనం సంపూర్ణంగా చూడలేక పోతున్నాం గనక, ఊహించటానికి కొంతఅవసరం కలగటం, దానివల్ల భ్రమ, ప్రమాదాలకు చోటు దొరకటం జరిగింది అని చెప్పింది. పరిణామ వాదాన్ని అంగీకరించి మనస్సుకి అందులో ఈ నాటికి వున్న దశల్లో అగ్రస్థానం ఇచ్చింది. తత్వశాస్త్రాన్ని మేఘాలలోనుంచి క్రిందకు లాగి భూమిమీద నిలబెట్టింది. శాస్త్రజ్ఞానంమీద ఆధారపడేటట్టుచేసి దానికి ఒక 'ప్రత్యేకతను' లేకుండా చేసింది.

---

# 'ప్రెగ్మాటిస్టు తత్త్వవేత్త'
# విలియం జేమ్సు

విలియమ్ జేమ్సుకిముందు అమెరికాలో తత్వశాస్త్రం, యూరప్ దేశాల తత్త్వశాస్త్రాన్నే అనుకరిస్తూ వుండేది. స్థలం మార్పుతప్ప, సంస్కారం, దృష్టి, ముఖ్యసూత్రాలూ అన్నీ వొకటిగానే వుండేవి. విలియం జేమ్సుతో ఈ పరిస్థితి మారిపోయింది. అతని తత్త్వశాస్త్రం అమెరికా దేశం యొక్క ఊంపున్ని ప్రతిబింబించటం మొదలుపెట్టింది. విల్ మూరాన్టు తాను ప్రచురించిన 'తత్త్వశాస్త్ర కథ' లో జేమ్సునిగురించి వ్రాస్తూ, "అతని కంఠధ్వనీ, అతను వాడే పదాలూ, ప్రయోగాలూ, అన్నీ అమెరికాకి చెందినవే. అమెరికా సంఘంలో ఎక్కువగా వాడబడే 'డబ్బు విలువ', 'ఫలితాలు', 'లాభాలు' మొదలైన పదాలను వాడి, అతను తన ఆలోచనలను సామాన్యపౌరుని అందుబాటులోకి తీసుకు వెళ్ళటానికి ఉత్సహించాడు. అతను శాంతాయన, హెన్రీ జేమ్సు మొదలైనవారివలె పైస్థితిలో వున్నవారు మాట్లాడి నట్లు మాట్లాడక అందరికి అందుబాటులో వుండేటట్లు, అర్థం అయ్యేటట్లు మాట్లాడేవాడు" అన్నాడు. 'శాంతాయన యూరప్ దేశాల సంస్కారంలో మునిగితేలినవాడు మాట్లాడి నట్లు మాట్లాడితే, విలియంజేమ్సు అమెరికా నేలనుంచి

వెళ్ళగిలి వొచ్చినవాడు మాట్లాడినట్లు మాట్లాడేవాడు. పాల్ హెన్లీ 'క్లాసికల్ అమెరికన్ తత్త్వవేత్తలు' అనే గ్రంథంలో, 'ప్రపంచదృష్టిలో విలియంజేమ్సు అమెరికన్ తత్త్వశాస్త్ర ప్రతినిధిగా పరిగణించబడతాడు. పాశ్చాత్య తత్త్వశాస్త్రంయొక్క పలుకుబడిని విదిలించుకొని, తన కాళ్ల మీద తాను నిలబడటానికి అమెరికాదేశంయొక్క ఆలోచన చేసే ప్రయత్నం ఈ దశకు చెందిందే. ఈ అభివృద్ధికి జేమ్సు చాలా సహాయం చేశాడు. అతని తత్త్వశాస్త్రం స్వభావంలోనూ, విన్యాసవైఖరిలోనూ, పూర్తిగా అమెరికా దేశానికి చెందింది. అతని సిద్ధాంతంఅయిన ప్రెగ్మాటిజానికీ, యూరప్ దేశాలలోని కొన్ని భావలకూ కొద్దిపాటి పోలికలున్నా, మొత్తంమీద ఆ సిద్ధాంతం అమెరికా దేశంలో పుట్టిన సిద్ధాంతంగానే భావించబడింది' అన్నాడు.

విలియం జేమ్సుని పాతను జీర్ణించుకొని క్రొత్తకు కారకుడైన తత్త్వవేత్త అని చెప్పవచ్చు. అందుకనే అతని తర్వాత వొచ్చిన తత్త్వవేత్తలందరూ వారిలో వారికి ఎన్ని అభిప్రాయభేదాలున్నా జేమ్సుని గౌరవిస్తారు; గురువుగా భావిస్తారు. తమ దృష్టికి అతను ఏదో వొక విధంగా కారకుడని చెప్పుకోవడానికి ప్రయత్నిస్తారు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, బెర్ట్రెండ్ రస్సెల్ తాను వ్రాసిన 'పాశ్చాత్య తాత్విక చరిత్ర'లో, 'ఒక్క శాంతాయనతప్ప మిగిలిన తత్త్వవేత్తలందరూ అతణ్ని గౌరవించేవారే' అని వ్రాశాడు. 'అతనంటే భక్తిని చూపనివాడు, నేను ఎరిగినంతవరకు శాంతాయన వొక్కడే. డాక్టరేట్ కోసం శాంతాయన

వ్రాసిన వ్యాసాన్ని జేమ్సు 'పండిన కుళ్ళుడు' అన్నాడు. ్వభావాలలోనే వీరిద్దరికీ వైరుధ్యంవుంది. అది దాటటానికి లులేనంత వైరుధ్యం. శాంతాయనకు మతంఅంటే ష్టమే. కాని, ఆ ఇష్టం జేమ్సు ఇష్టంవంటిదికాదు. ్సకి మల్లే నీతిగా బ్రతకటానికి ఉపయోగపడుతుందనే ద్దేశంతో కాక మతాన్ని శాంతాయన, చారిత్రకదృష్టితో రసదృష్టితో ప్రేమించేవాడు. ఈ కారణంచేత ప్రొటెస్టెంట్ మతానికంటే కాథలిక్ మతాన్ని సమర్థించేవాడు. సత్ప్రవర్తన ముఖ్యం- అనుకునే జేమ్సుకి ఇది గిట్టేదికాదు. అతని ప్రజాస్వామిక స్వభావం తత్వవేత్తలకు వొక సత్యం. మామూలు ప్రజలకు వొక సత్యం వుంటుందని అంగీకరించటానికి ఎదురు తిరిగేది-' అన్నాడు.

తనకు ముందున్న తత్వవేత్తలకువలె కాక, జేమ్సు ఆలోచనలు ఎప్పుడు భౌతికప్రపంచానికి సంబంధించే వుండేవి. మామూలు ప్రజలకు సహాయకారిగానే వుండేవి. సంఘానికి అతీతంగావుండే తర్కంలో, వివాదాలలో, ఊహాలలో అతనికి ఏ మాత్రం నమ్మకంవుండేదికాదు. 'మనం ఆలోచించినా, ఏంచేసినా, మానవ శ్రేయస్సుకే కాబట్టి ఏ వంకతో మానవునికి అపకారం జరిగినా అది సహించదగ్గది కాదు' అని అతని ఉద్దేశం. అందుకనే ప్రెగ్మాటిజం అతనికి నచ్చింది. ప్రెగ్మాటిజం, ఒక భావంయొక్క మంచిచెడ్డలను దాని ఆచరణవల్ల వొచ్చే ఫలితాలనుబట్టి నిశ్చయించాలి అని చెపుతుంది. ఆలోచనలకూ, పదార్థానికీ పైకి ఎంత భేదం కనిపించినా, ఆలోచన పదార్థంయొక్క

ప్రతిబింబమేననీ, ఇంకొకరకమైన అస్తిత్వం దానికి లేదని జేమ్సు విశ్వాసం. అంతేకాక ఈ ప్రతిబింబం కొందరు భావి స్తున్నట్లు కాక అసలు యొక్క సరైన ప్రతిబింబమే అ కూడా అతని విశ్వాసం. 'హ్యూమ్ మొదలైన తత్వవేత్త భావించినట్లు అది విభాగాలను మాత్రమే ప్రతిబింబించ వాటిసంబంధాలనుకూడా ప్రతిబింబిస్తుంది. ఒక సందర్భా చెందిన అన్నిటినీ అదిచూడగలుగుతుంది. సందర్భానికీ దాన్ని చూచేదానికీ మధ్య దేనిజోక్యమూ వుండదుకూడాను' - ఈ విధంగా భావించాడు జేమ్సు. అందువల్ల కాన్టుని కలవర పెట్టిన 'తెలుసుకోవటం ఎలా ?' అనే సమస్య అతన్ని ఏ మాత్రం కలవర పెట్టలేదు.

తెలియని మరొకదానికోసం మనకు కనపడే వాస్తవి కత్వాన్ని వొదులుకోవటం జేమ్సుకి అర్థంలేని పనిగా కని పించింది. కాబట్టి అతను తన శక్తినంతటినీ ఏ నమ్మకాల ఫలితాలు సంఘ శ్రేయస్సుకి వినియోగపడుతున్నవో వాటిని సమర్థించి ప్రచారం చెయ్యటానికి వినియోగించాడు. అంతకు ముందు బ్రిటిష్ తత్వవేత్తలు ఆలోచనను భావాల కలయి కగా మాత్రమే ఊహించారు. జేమ్సు ఈ అభిప్రాయంతో ఏకీభవించక ఆలోచన ఒక ప్రవాహంవంటిదనీ, అందులోకి భావాలు వొచ్చిపోతుంటాయనీ చెప్పాడు. చైతన్యానికి భావవాదులు పూసిన రంగులనూ, దాన్ని ఆధారంగా తీసు కొని వారు నిర్మించిన భవంతులనూ పరిశుభ్రంగా తుడిచి వేసి, దాని నిజస్వరూపాన్ని లోకం ఎదుట పెట్టాడు. చైత న్యాన్ని గురించి జేమ్సు అభిప్రాయాన్ని పూరాన్టు ఈ

విధంగా విపులీకరించాడు—'చైతన్యం అనేది ఒక వస్తువు కాదు; ఒక ప్రత్యేక తత్త్వం కాదు; సంబంధాలను సంబంధించి అనుక్షణం మారే ఒకవిధానం. అది పదార్థాల సంబంధం యొక్కా, సంఘటనల యొక్కా పర్యవసానంలో ఆలోచనల సంబంధం, పర్యవసానం కలిసే చోటు. అటువంటప్పుడు అది ఆలోచనలోకి అకస్మాత్తుగా వచ్చే ఒక దృశ్యం అవదు. వాస్తవికత్వమే అవుతుంది. దీనికి కారణం-ఈ దృశ్యానికీ, కనపడేదానికీ వెనక ఏమీ లేకపోవటమే! అంతేకాక అనుభవానికి చెందిన ఈ విధానం వెనక ఒక 'ఆత్మ'ను కనిపెట్టవలసిన అవుసరంకూడా లేదు. పరిపూర్ణత అనేది ఏ విధంగా ప్రాపంచిక సంబంధాల మొత్తమో అదే విధంగా 'ఆత్మ' అనేది మానసిక అనుభవాల మొత్తం' అన్నాడు.

చైతన్యాన్ని ఈ విధంగా విప్పి చెప్పి. తత్వవేత్తల దృష్టిని ప్రపంచంవైపుకి త్రిప్పాడు జేమ్సు. ప్రపంచంలో ఇక మిగిలింది ప్రజలూ, వారి శ్రేయస్సూ. 'ప్రజల శ్రేయస్సుకు వ్యతిరేకంగా ఉండే ప్రతి భావనా తప్పే' అన్నాడు. 'ప్రజలను కష్టనష్టాలకు గురిచేసే ప్రతి సిద్ధాంతమూ తప్పే' అన్నాడు. 'ప్రిన్సిపిల్స్ ఆఫ్ సైకాలజి' అనే పుస్తకంలో తన దృష్టిని ఈ విధంగా విశదపరిచాడు—'ఏ తత్వశాస్త్రమయినా మిగిలిన విషయాల్లో ఎంత నిర్దుష్టంగా వున్నా ఈ రెండు తప్పుల్లో ఏ వొక్కతప్పు చేసినా ఎందుకూ కొరగాని దౌతుంది. (1) మన ప్రియమైన కోర్కెలనూ, మనం పదిలపరచుకున్న ఆశలనూ గందరగోళపరచి తృణీకరించటం

ఇందులో మొదటి తప్పు. (2) రెండవతప్పు ఇంతకంటే ప్రమాదమైంది. మన సహజకోర్కెలకు వైరుధ్యం కల్పించి దానికంటే ఆ కోర్కెలకు వాక ఆదర్శాన్ని ఇవ్వలేక పోవటం ఘోరమైన తప్పు. మన కోర్కెలకు తగిన ఆ ర్శాన్ని చూపలేని తత్వశాస్త్రం, మన కోర్కెలకున్న ఆ ర్శాన్ని రూపుమాపే తత్వశాస్త్రం ఘోరంకలి కేదారితీస్తుం నిరాశా వాదానికంటే ప్రమాదకరమైన విముఖత్వాని లేపు తుంది ... ఈ కారణంవల్లే భౌతికవాదాన్ని అంతా అనుస రించరు' అన్నాడు.

౨

తత్వశాస్త్రచరిత్ర పరిశీలిస్తే మన వాక విషయం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈలోకంలో మహాపురుషులు ఉద్భ వించారు. కొందరు భగవంతుడు 'వున్నాడు' అన్నారు. కొందరు 'లేడు' అన్నారు. కొందరు మనం జీవించే ఈ లోకమే నిత్యమూ, సత్యమూ అన్నారు. కొందరు మరి కొన్ని లోకాలు ఉన్నవి, అవి ముఖ్యం మనం జీవించే ఈ లోకం మనలను ఆ లోకాలకు సన్నద్ధంచేసే రంగభూమి మాత్రమే అన్నారు. ఎవ్వరుచెప్పే కారణాలు వారు చెప్పు తూనే వున్నారు. ఒకప్పుడు ఒక వాదం జయించినట్లు, రెండవవాదం పూర్తిగా వీగిపోయినట్లు కనుపిస్తుంది. కాని, కొద్దికాలం జరగ్గానే వీగిపోయిందనుకున్న వాదం విజృం భిస్తుంది. దీనికి అంతు వున్నట్లుగాగానీ, అంతిమ విజయం అనేది వున్నట్లుగాగానీ కనుపించదు. ఇది చిత్రాతి చిత్ర

మైన పరిస్థితి. ప్రముఖ తత్వవేత్తయిన ఆల్‌ఫ్రెడ్ నార్త్ వైట్ హెడ్ తాను వ్రాసిన 'భావాల సాహసకృత్యాలు' అనే గ్రంథంలో పై పరిస్థితిని ఈ విధంగా వర్ణించాడు.

'మానవ చరిత్రను ఇహలోక పరలోకాల మధ్య గులాబీ వూగిసలాటగా మనం చెప్పుకోవచ్చు. లోభత్వానికీ, సౌశీల్యానికీ, సత్యానికీ, ప్రమాదానికీ వున్న వ్యత్యాసాన్ని ప్రదర్శించే రంగస్థలంగా చూడవచ్చు...... ఒక్కొక్క విధానం కొన్ని కొన్ని గుణాలను ప్రస్ఫుటంచేసి, కొన్నికొన్ని గుణాలను కప్పివేస్తుంది; తాను గమనంలో తీసికోగా మిగిలిన గుణాలను తాను తీసికోని వాతావరణం లోకి నెట్టివేస్తుంది' అన్నాడు.

మనం ప్రపంచాన్ని పైవిధంగా అర్థం జేసుకొంటున్నాం. ప్రపంచాన్ని అర్థం జేసుకోవాలి అనే సిద్ధాంతాలచర్చ ఈ విధంగా జరుగుతూవుంది. ఇది సత్యాన్వేషణ కావచ్చు. సత్యాన్వేషణకు మనకు తెలిసిన మార్గం ఇది వొకటే కావచ్చు. వైట్‌హెడ్ చెప్పినట్లు, 'పొరపాట్ల చరిత్రే భావాల చరిత్ర అయినప్పటికీ ప్రవర్తనను స్వచ్ఛపరచటానికి ఈ విధానం వినియోగపడుతుంది' అని అర్థం చెప్పుకోవచ్చు. కాని ఈ విధానం, మామూలు మానవుణ్ణి గందరగోళం పరిచి, నిరుత్సాహపరచి దేనినీ నమ్మని అపనమ్మకస్థునిగాచేసి వదిలిపెడుతుందనేది నిర్వివాదాంశం. మానవుణ్ణి ఈ ప్రమాదంనుంచి తప్పించటానికి జేమ్సు మరొక మార్గం తొక్కాడు ... పై గందరగోళం జోలికి

వెళ్ళకుండా, 'దేనిఫలితం శ్రేయస్కరం అయిందో అదే సత్యమైంది' అని చెప్పాడు. ఈ భావం మామూలు మనిషికి చాలాహాయినిగూర్చే భావం; ప్రత్యక్ష నిదర్శనంతో కూడుకున్నది అవటంవల్ల తేలికగా అర్థమయ్యే భావం. సత్యాన్ని ముందు తేల్చుకొని, దాన్ని ఆచరణలో పెట్టటానికి బదు ఫలితాన్నిబట్టి సత్యాసత్యాలను నిర్ణయించటం క్రొత్తపద్ధతి. ఈ ఉద్దేశంతోనే హోరేస్. యం. కాలెన్, 'విలియం జేమ్స్' అనే గ్రంథానికి తాను వ్రాసిన పీఠికలో, 'జేమ్స్ ఇతరులు చెప్పిందే చెప్పి వుండవచ్చు; అతను అనుసరించిన మార్గం ఇతరులు అనుసరించిన మార్గంకాదు' అన్నాడు.

అతని తత్వశాస్త్రంలో మొత్తంమీద చూస్తే ముఖ్యమైన విషయం, అతను సూచించిన అర్థాన్ని తెలుసుకునే విధానమే. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ పాన్ హెన్లే, 'ఈ విషయంలో జేమ్స్ పియర్స్‌ని అనుసరించాడు. అనుసరించినట్లు అతనే అంగీకరించాడు. పియర్స్‌తోపాటు అతనూ, వాక భావానికి అర్థాన్ని, అనుభవంలోకి పెట్టటంవల్ల వచ్చే ఫలితాలను ఊహించి, వాటినిబట్టి నిర్ణయించాలని భావించాడు' అని వ్రాశాడు. జేమ్సు తత్వశాస్త్రంలో ముఖ్యమైన ఈ సూత్రాన్ని విపులంగా తెలుసుకుందాం.

ఉదాహరణకు: 'నా సిగిరెట్ ఆరిపోయింది' అనే వాక్యాన్ని తీసుకుందాం. సిగిరెట్ ఆరిపోవటంయొక్క ఫలితాలు ఏమిటి? పీల్చినా పొగ రాకపోవటం. రుచి లేకపోవటం; వేలు అంటించినా కాలకపోవటం మొదలయినవి.

కాబట్టి ఈ ఫలితాలనుబట్టి 'సిగిరెట్ ఆరిపోయింది' అనే దాని అర్థం తెలుసుకోవాలన్నమాట. ఇంతవరకు ఇందులో ొప్పగా చెప్పుకోవలసిన నూతనత్వం అంతగా లేదు. కాని వాక్యంయొక్క మొత్తం అర్థాన్ని, అనుభవంలోకి చ్చే ఫలితాలనుబట్టి చెప్పుకోవచ్చునని ఈ తత్వవేత్తలు ప్పినప్పుడు మాత్రం, పై సిద్ధాంతానికి అంతకు ముందులేని నూతనత్వం' వొస్తూవుంది. ఈ సిగిరెట్ ఉదాహరణ చిన్న ఉదాహరణ. కాని ఎటువంటి భావాన్నయినా, అనుభవంలో ఇటువంటి స్థితికి తీసుకురావచ్చునని జేమ్సు అభిప్రాయం.

జేమ్సు ప్రచారం చేసిన ఈసిద్ధాంతం మానవకోటికి-ముఖ్యంగా రెండువిధాల సహాయంచేసింది. (1) ఏభావాన్నీ వొట్టి వాగ్వాదంలో ఆపక, ఆచరణస్థితికి దింపి, చాలా గందరగోళాన్నీ, చీకాకునీ పోగొట్టింది. ఏ భావానికైనా వొట్టి మాటలతో అర్థం చెప్పుకోవటం, అనేక వాగ్వ్యాదా లకు దారితియ్యటం, చివరికి అనేక సందర్భాల్లో మనం ఊహించని అర్థాలు పుట్టుకురావటం, అవి సంఘానికి అప కారం చేసేవి అవటం - నిత్యజీవితంలో మనం చూస్తూనే వున్నాం. జేమ్సు పద్ధతి ఫలితాలను గీటురాయిగా పెట్టి ఈ ప్రమాదాన్ని నిర్మూలించింది. ఉదాహరణకు, 'ఈ బల్ల సరిగ్గా ఒక గజం పొడుగువుంది.' అనే వాక్యాన్నీ 'యీ బల్లగజం పొడుగు ఉండదు. కాని, ఎంత దగ్గ రగా వున్నదంటే, ఈ భేదాల్ని ఏ కొలబద్దా గ్రహించ లేదు' అనే వాక్యాన్ని తీసుకుందాం. పైకి ఈ రెండు

వాక్యాలకూ చాలా భేదం వున్నట్లు కనుపిస్తుంది. ఒకదాన్ని ఒకటి వ్యతిరేకిస్తున్నట్లు కనిపిస్తుంది. కాని జేమ్సుయొక్క ప్రెగ్మాటిస్టు విధానం ప్రకారం చూస్తే, ఈ వైరుధ్యం కన పించదు; అంతరిస్తుంది. 'ఏ సాధన సంపత్తితో చూచినా బల్ల గజం పొడుగే వుంటుంది,' అనే అర్థానికే వొస్తా అనుభవానికివొచ్చే ఫలితాలూ, అర్థాలూ ఒకటేనని తెలు సుకుంటాం. పై వాక్యాల్లో ఒకేభావాన్ని రెండు రకాలుగా వ్యక్తపరచటం మాత్రమే కనిపిస్తుందిగాని, పైకి కనుపించే వైరుధ్యంలేదు అని ప్రెగ్మాటిజం చెపుతుంది.

(2) ఇక ఈ సిద్ధాంతం చేసిన సహాయాలలో రెండవ విధానాన్ని విచారిద్దాం. కొన్ని వాక్యాలకు పైకి అర్థం వున్నట్లే కనిపిస్తుంది గాని, అసల్లో అర్థం వుండదు. దీనికి కూడా వొక ఉదాహరణ తీసుకుందాం. ఈ గదిలో వొక మూల చిన్న దయ్యం వొకటి కూర్చున్నదని నేను మీతో చెపుతాననుకోండి, అది మూడు అడుగుల పొడుగు వుందనీ, దానికి వొక తోక వుందనీ మీతో చెపుతాను అనుకోండి. అది ప్రజలకు అందదనీ, దానిమీదకు విసిరివేసిన ఏవస్తువూ దానికి తగలదనీ, దాని దగ్గర్నుంచి ఏ వాసనా రాదనీ, ట్రాన్స్పరెంటుగా వుంటుందనీ చెపుతాననుకోండి. ఈ విషయాలు తెలియటంవల్ల మన వివేకం ఏవిధంగా వృద్ధి చెందుతూ వుంది? ఇటువంటివి వున్నా లేకపోయినా మన భావం వొకటిగానే వుంటూవుంది. అంటే ఈ విషయాలు మన అనుభవంలో ఎటు వంటిమార్పునూ తీసుకురావటం లేదు. వీటి ప్రభావం మన అనుభవంమీద ఏవిధంగానూ

కనపడటంలేదు. కాబట్టి జేమ్సు ప్రెగ్మాటిస్టు సిద్ధాంతం ప్రకారం ఈ విషయాలకు, స్థూలంగాచూస్తే అర్థంవున్నట్లు కనిపించినా అసల్లో అర్థంలేదు. స్థూల దృష్టిమీద ఆధార పడక మన అనుభవంమీద ఆధారపడాలని జేమ్సు చెపుతాడు.

మనం ఇంతవరకు సూటిగా వొచ్చే ఫలితాలను గురించే ఆలోచించాము. జేమ్సు కొన్నికొన్ని సందర్భాల్లో తన సిద్ధాంతాన్ని సువిశాలం చెయ్యటానికి అంగీకరించాడు. అటువంటి సందర్భాల్లో సూటిగా వొచ్చే ఫలితాలనే గాక, మరికొన్నిటిని కూడా మనం గమనంలోకి తీసుకోవలసి ఉంటుంది. వొక ఉదాహరణను తీసుకొని విచారిద్దాం. భగవంతుడు ఉన్నాడా, లేడా అనే వాదాన్ని తీసుకుందాం. ఉన్నాడని నిరూపించటానికి వివిధవాదాలు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయని జేమ్సుకి తెలుసు. అయితే లేడని నిరూపించటానికి వీల్లేదు. అనుభవం మీద ఆధారపడితే లాభం వున్నట్లు కనిపించదు. భగవంతుడు వున్నా, లేకపోయినా ఇప్పట్లో మన అనుభవం మారవలసిన అవసరం కనపడటం లేదు. కాబట్టి ఇంతకుముందు మనం చేసుకున్న నిర్ణయాన్నిబట్టి, ఈ ప్రశ్న అర్థంలేని ప్రశ్న అయింది. కాని, భగవంతుణ్ణి నమ్మటం అనేది ప్రజల జీవితాల్లో మార్పును తీసుకువస్తుంది గనుక ఈ ప్రశ్న అర్థం కలుగుతూ గాందని జేమ్సు భావిస్తాడు.

ఒక భావం అనుభవంలో తెచ్చే మార్పు అర్థయుతంగా వుండాలని జేమ్సు భావిస్తాడు. దానినుంచి శాస్త్ర

నిరూపణకు నిలబడే ఫలితాలు వొచ్చినాసరే, అటువంటి ఫలితాలు రాక ఆ భావాన్ని నమ్మటంవల్ల పైన ఉదహరించిన మార్పువంటి మార్పు వచ్చినాసరే! ఇందు దేనికైనా 'అర్థం వున్నచోట అనుభవంలో భేదం తీరుతుంది.' అనే ముఖ్యసూత్రం వర్తిస్తుంది.

ఈ తన సిద్ధాంతాన్ని జేమ్సు 'సత్యం అంటే ఏమిటి' అనే సమస్యను పరిష్కరించడానికి మొదట్లో ప్రయోగించాడు. పాశ్చాత్య తత్వశాస్త్రానికి 'సత్యం' అనేదాన్ని వొక దేవతను కొలిచినట్లు కొలవటం ఆచారం. ఇది వొక్క పాశ్చాత్య తత్వశాస్త్రం ప్రత్యేకతే కాదు. ఇంచుమించు అన్ని తత్వశాస్త్రాలూ ఇదే ధోరణిలో వుంటాయి. ఆమాటకి వొస్తే ఒక్క తత్వశాస్త్రమేకాదు – సైన్సుకూడా ఇంతే. 'దీనికి కారణం ఏమిటి?' అని జేమ్సు ప్రశ్నించాడు. 'అప నమ్మకస్తులు 'సత్యం' 'అసత్యం' రెండూ వొకేరకంగా కనిపిస్తాయి' అంటారు. 'రెండిటికీ సరిసమానమైన సాక్ష్యాన్నే పోగుజెయ్యవచ్చు' అంటారు. కల్పనకన్నా సత్యం విచిత్రంగా వుండటమే దీనికి కారణం అనుకుంటే, కల్పన సత్యానికంటే కొన్ని సందర్భాల్లో ఆకర్షవంతంగా వుంటుం దనే విషయం మనం మరచిపోగూడదు అంటారు. అయినప్పుడు 'సత్యం' అంటే మనకు భక్తి ఎందుకు వుండాలి? ఈ ప్రశ్నకు జేమ్సు ఈవిధంగా జవాబు చెప్పాడు.

ఒక స్టేట్‌మెంట్ నిజమైతే వొచ్చే భేధం ఏమిటి? నిజాన్ని ఆధారంగా తీసుకొని ప్రవర్తిస్తే ఆశాభంగం కలు

గదా. అసత్యాన్ని నమ్మి ప్రవర్తిస్తే ఆశాభంగం తప్పదు. జేమ్సుదృష్టిలో సత్యానికీ, అసత్యానికీ వున్న భేదం ఇది. త్యం, ప్రవర్తనకు మంచిమార్గాన్ని చూపుతుంది. అసత్యం పని చెయ్యలేదు. అందువల్ల మానవుడు సత్యాన్ని కారంగా తీసుకొని ప్రవర్తించవలసిన అవుసరం కలుగుతూ ంది.

విలియం జేమ్సుయొక్క ఈదృష్టిని చర్చిస్తూ పాల్ హెనీ ఇలా వ్రాశాడు - 'జేమ్స్ దృష్టిని మరొకరకంగా చెప్పుకోవచ్చు. సైన్సులో కొన్ని అంశాలను సరిగ్గా అర్థం చెప్పటం, చెప్పలేకపోవటం అనేదాన్నిబట్టి మనం నిలబడిన ఆధారానికి విలువకడతాం. దానిఊహలు సత్యమౌతున్నంత వరకు ఏ సిద్ధాంతమైనా మంచి సిద్ధాంతంగానే పరిగణింప బడుతుంది. అదేవిధంగా మన నమ్మకాల నన్నిటినీ ఈ సైన్టిఫిక్ సిద్ధాంతాలను పరిగణించినట్లు పరిగణించాలని జేమ్స్ వుద్దేశం. భవిష్యత్తును నిర్ణయించటానికి అవి ఎంత వరకు వినియోగపడతవో అంతవరకే అవి నిజం. అంతవరకే వాటి మంచితనం. కాబట్టి 'నా సిగిరెట్ ఆరిపోయింది' వంటి చిన్నవాక్యాన్నికూడా పదార్థాల స్వభావంయొక్క చిత్రణంగా కాకుండా, పీల్చేటప్పటి నా ప్రేరణలనుగురించి చెప్పే దానినిగా, 'నా వేలు ప్రస్తుతం కాలదు' అనే జ్ఞానాన్నిచ్చేదాన్నిగా భావించాలి. భవిష్యత్తులో ఇది ఎంత వరకు నిజమౌతుందో అంతవరకూ దీన్ని ప్రతిపాదిస్తున్న సిద్ధాంతం నిజం. జేమ్స్ దృష్టిలో అంతవరకు ఆస్టేట్మెంట్ సత్యం.

3

జేమ్స్ యొక్క ఈ దృష్టి అనేక విమర్శలకు ..
తీసింది. 'ఏది నమ్మటం మంచిదో అదే సత్యం' 'రాబో
అనుభవంతో ఏది ఏకీభవిస్తుందో అదే నిజం' 'ఏది అ
రాన్ని తీరుస్తుందో అదే నిజం' - ఇటువంటి భా..
అపార్థానికి దారితియ్యటం సహజం. కొంతమంది జేమ్స్
యొక్క ప్రెగ్మాటిజం 'పచ్చిభౌతిక సిద్ధాంతం' అన్నారు.
మరికొంతమంది 'మనం చేసిన ప్రతిపనినీ సమర్థించుకోటానికి
ఈ సిద్ధాంతం పుట్టింది' అన్నారు. 'ఇతర విలువలు
తెలియని అమెరికా దేశానికి తగిన సిద్ధాంతం' అని కొందరు
అపహాస్యం చేశారు. 'అసలు వాస్తవికత తేలక ముందు
మంచి చెడులు నిర్ణయించటానికి వీల్లేదనీ, అందువల్ల ఈ
సిద్ధాంతం మానవజాతికి ఉపకారం కంటె అపకారమే
ఎక్కువ చెయ్యవచ్చనీ కొంతమంది విమర్శకులు అన్నారు.
వాదదృష్ట్యా ఈ విమర్శలు సరైనవేగాని, జేమ్స్ వాదంలో
కొంతబలం, కొంత సత్యం, కొంత అవుసరం లేకపోలేదు.

1. ప్రజలు తాము అనుసరించదలచిన తత్త్వ
శాస్త్రాన్ని, వాస్తవికత్వాన్ని క్షుణ్ణంగా తెలుసుకొని ఏరు
కోరు. తమ స్వభావాలకు అనుకూలమైన దానిని ఏరు
కుంటారు. తార్కికంగా ఈ తత్త్వశాస్త్రం రైటేనా అని
ఆలోచించరు. ఈ తత్త్వశాస్త్రాన్ని అనుసరిస్తే మన జీవి
తాలకు ఏమి ఉపయోగం జరుగుతుంద అనే ఆలోచిస్తారు.
కారణాలు తరువాత వస్తవి. ఈ కారణాలు ఉదాహరణకు

పడేవేగాని, నిరూపణకు వినియోగపడేవి కాదు. మన అవసరాన్నిబట్టి పుడుతవి. కారణాలనుబట్టి ...ాలు పుట్టవు.

" 'ప్రెగ్మాటిజం' అనే గ్రంథంలో విలియం జేమ్సు, ...వరకు మానవ స్వభావాల సంఘర్షణే తత్త్వశాస్త్ర ...త ... తత్వవేత్త తన స్వభావాన్ని కప్పిపుచ్చుతాడు. 'స్వభావం' అనేది వొక కారణంగా చెప్పటానికి వీల్లేదు గనక తన వాదాన్ని సమర్థించుకోటానికి తనకు సంబంధం ...కొన్ని కారణాలను చెప్పి స్వభావం అనే కారణాన్ని ...పుచ్చుతాడు. కాని, మిగిలిన కారణాలన్నిటికంటె ...వం అనేది దృష్టి నిర్ణయంలో ఎక్కువ పనిచేస్తుంది" ...డు.

దీని ప్రయోజనాన్ని తెలుసుకోటానికి మనం ఒక ప్రశ్న వేసుకోవాలి. అసలు స్వభావం అనేది ఎలా కలుగుతూ వుంది? అనేది ఈ ప్రశ్న. పరిస్థితులూ, మానవుడూ ఒకరి ప్రభావం ఒకరిమీద చూపుకోవటంవల్ల స్వభావం ఏర్పడుతూ వుందని మనం టూకీగా చెప్పుకోవచ్చు. అయినప్పుడు ఈ స్వభావం యదార్థాన్నికాక, అయదార్థాన్ని ఎందుకు సూచిస్తుంది? లేకపోతే ఈ యదార్థం ఆ ప్రత్యేక పరిస్థితివల్లా, ఆవ్యక్తి ప్రత్యేక శక్తివల్లా పరిణితంకావచ్చు. అంటే, ఆ సత్యం అసంపూర్ణం కావచ్చు. అంతేగాని మన స్వభావానికి అనుకూలంగా పోవటంలో తప్పేముంది? ఈ అసంపూర్ణ సత్యాలు, ఘర్షణవల్ల సంపూర్ణ సత్యానికి మళ్ళీ ఎలాగూ దారితీస్తవామె!!!

విలియం జేమ్సు స్వభావాలనుబట్టి తత
(1) సున్నితమైన మనస్సుగల వారిగానూ, (2
మనస్సు గలవారిగాను విభజించాడు. ఈ రెండు
వేత్తలూ రెండు రకాల తత్వశాస్త్రాలను సృష్టించారన
వీటి సమన్వయం అవసరం అన్నాడు. అనేకత్వా
వొప్పుకునే అస్తికత్వాన్ని అంగీకరించటమే దీనికి మా
అన్నాడు. ఈ ప్రపంచం వొక స్థిరస్వరూపాన్ని పొందింది కాదు అన్నాడు. ఇంకా వృద్ధిచెందుతూనేవుంది అన్నాడు. అందువల్లనే మానవ ప్రయత్నం అవసరం అవుతూవుంది అన్నాడు.

2. పై విమర్శకుల అభ్యంతరాన్ని మరొక దృష్టితో పరిశీలిద్దాం. వాస్తవికత ఏదో తేలకముందే మానవులకు కొన్ని నమ్మకాలు వుండేమాట నిజమే. వాస్తవికత తేల్చుకోకుండా మానవుడు తన నమ్మకాలను అనుసరించి పనులు చేసుకు పోతున్నమాట నిజమే. రేపు వాస్తవికత తెలిసింతర్వాత దానినిబట్టి మానవుడు ఈనాడు తన స్వభావం మీాదా దాన్నిబట్టి వచ్చిన నమ్మకాలమీాదా ఆధారపడి చేస్తున్న పనులన్నీ తప్పులు కావచ్చు. ఈ పనులన్నీ వాస్తవికతకు విరుద్ధమైన పనులు కావచ్చు. అంగీకరిద్దాం. అయితే భవిష్యత్తులో ఈ అపాయం వుంది గనక ఇప్పుడేం చెయ్యాలి? ఏ విధంగా ప్రవర్తించాలి? వాస్తవికత తేలలేదు. తేలేలోగా చేతులు ముడుచుకు కూర్చోవలసిందేనా? చేతులు ముడుచుకు కూర్చోవటం వీలు అవుతుందా? ఈ

...ఖరి వాస్తవికతను తెలుసుకోటానికి సహాయపడుతుందా?- ఈ ప్రశ్నలకు జవాబు కావాలి.

తెలిసినంత వరకు తెలుస్తుంది. పూర్తిగా తెలిసే ...తవరకూ వాటిని గురించి ఏ అభిప్రాయమూ లేకుండా ...డటం కుదరదు; కుదిరినా శ్రేయస్కరం కాదు. అప్పటికి ...లసిన దాన్ని బట్టి ప్రవర్తిస్తాం. అనుభవంమీద ఆ నాడు మనకు తెలిసింది తరువాత తప్పని తెలిసే వీలున్నా సరే, తెలుసుకోటానికి ఒక దాన్ని నమ్మి పని చేసుకుపోవటమే దారి.

ఈ విధంగా ఊహించటం విలియం జేమ్సుకి చాలా విశాలమైన దృష్టిని కలిగించింది. యదార్థం తెలియకుండానే కొన్ని సందర్భాల్లో ప్రవర్తించవలసి వస్తుందని అంగీకరించటంతో, తానే రైటని చెప్పవలసిన అవసరం అతనికి లేకుండా పోయింది. 'ఇంతకంటే బాగా బ్రతికే వీలుండీ, అందుకు సహాయపడే భావం వొకటి వుంటే, ఆ భావాన్ని తప్పకుండా సమర్థిస్తాను. దీనికంటే ఎక్కువ లాభాలను సూచించే సిద్ధాంతం లేకుండా వుంటేనూ, వొకవేళ వున్నా, దానికీ దీనికీ వైరుధ్యం లేకుండా వుంటేనూ సరి' అన్నాడు 'ప్రెగ్మాటిజం' అనే గ్రంథంలో.

విలియం జేమ్సు సిద్ధాంతం ఇంత విశాలమైందీ, సత్తువ గలిగిందీ, యదార్థాన్ని ప్రతిబింబించేదీ అవబట్టే హోరేస్, యం, కాలెన్ 'నవీనులమైన మనకు అది వొక జీవిత విధానాన్ని చూపుతుంది. ధైర్యాన్నీ సృష్టించేశక్తినీ

స్వతంత్రాభిలాషనుసూచించే త్రోవనూచూపించే జ్ఞ
మనస్వభావంలో అంతర్గతంగా వున్నదానికి ఒకస్వరూపా
న్నిస్తుంది. బయట జరిగేసంఘటనను భ్రమ ప్రమాదాలకు
లోనుగాకుండా, ఏవిధంగా ఉత్సాహంగా ఎదుర్కోవాల
అది మనకు నేర్పుతుంది-' అన్నాడు.

మరొకచోట అతనే విలియం జేమ్సు సిద్ధాంతంల
వున్న మంచి లక్షణాలను ఈ విధంగా వర్ణించాడు:—

'అది సమరస భావాన్ని నెలకొల్పుతుంది. వక్ర లక్షణాలను ఏ విధంగా బాగుచేసి ఆరోగ్యాన్ని స్థాపించాలో, బలాత్కారాన్ని ఏవిధంగా సమ్మతిలోకి మార్చాలో అతనికి తెలుసు. వాస్తవికత్వాన్ని అది అంగీకరిస్తుంది. వ్యక్తిత్వాన్ని గౌరవిస్తుంది. కాని వ్యక్తి, సాముదాయక వ్యవస్థలలో, మొత్తాలలో జేరటంకూడా అది అంగీకరిస్తుంది. అది స్వతంత్రాన్నీ, నూతనత్వాన్నీ, సొంత ఆలోచననూ ప్రోత్సహిస్తుంది; కాని అనుక్షణంమారుతూవుండే క్రమాభివృద్ధినికూడా అది అంగీకరిస్తుంది. అది స్వతంత్రతయొక్క, నమ్మకం యొక్క ప్రాముఖ్యతను గమనిస్తుంది. పరిస్థితుల ప్రభావాన్ని కూడా అంగీకరిస్తుంది. అనేకత్వంతో, రక రకాల గుణాలతో నిత్యచలనంతో విరాజిల్లే వ్యక్తిత్వం, ఏ విధంగా తనలోవున్న ఒక గుణం ప్రభావంతో తాను కోరిన ఆదర్శాన్ని నెరవేర్చుకోగలదో; జేమ్సు సిద్ధాంతం నిరూపిస్తుంది. క్రమత్వం, ఒకే వస్తువులో చెయ్యబడటం, అనేవి వుండబట్టి పదార్థాలనుంచి ఆలోచనలు వొచ్చినై—రావ

టమే కాక, వొచ్చి వాటిని మార్చగలుగుతున్నయ్. పదార్థాలను ఆలోచనలూ, ఆలోచనలను పదార్థాలూ—ఒకదాని మీద ఒకటి తమ ప్రభావాన్ని చూపుకోవటం యొక్క, దాన్ని ఒకటి మార్చుకోవటం యొక్క పర్యవసానమే ఆరికత ... ...' అన్నాడు.

ఇంతవరకు జేమ్సు నిర్వహించిన సిద్ధాంతం యొక్క స్వభావాన్నీ, అందులో వున్న మంచినీ తెలుసుకున్నాం. అంతేగాని అతని సిద్ధాంతం పరిపూర్ణ సిద్ధాంతమనీ, లోటులు లేవని చెప్పటంకాని నా ఆదర్శం కాదు. ఇక అతని జీవితాన్ని తెలుసుకొని ఆపైనదట అతని సిద్ధాంతంలో వున్న లోటులను చర్చిద్దాం.

విలియం జేమ్సు జీవితం తెలుసుకోవలసిన జీవితం. మార్గరెట్ నైట్ అనే ఆవిడ 'విలియం జేమ్సు' అనే పుస్తకంలో అతని జీవితాన్ని గురించి వ్రాస్తూ, 'మానవ స్వభావానికి పునాదులు పసితనంలోనే వెయ్యబడతాయి—అని చెప్పే ఫ్రాయిడ్ సిద్ధాంతానికి జేమ్సు బాల్యం వొక ప్రబల తార్కాణం' అన్నది.

ఇది యదార్థం.

జేమ్సు తండ్రి చిత్రమైన స్వభావం గలవాడు. 'నేను తండ్రినిగనుక నామాట మీరు వినాలి' అనేభావం కొడుకులకు ఎన్నడూ కలుగనిచ్చేవాడు కాదు. తనుకూడా వారిలో వొకడై వారి జిజ్ఞాసను రేపేవాడు, వాదనలను

రెచ్చగొట్టేవాడు; తానూ పాల్గొనేవాడు; వా౦
త్రేచ్చకు ఏవిధంగానూ భంగం కలుగనిచ్చేవాడు కా౦

విలియంజేమ్సు తండ్రిపేరు హెన్రీజేమ్సు (సీనియర్
అతనికి అయిదుగురు పిల్లలు. నలుగురు కొడుకులు,
కూతురు. అందరిలోకి పెద్దవాడు విలియం జేమ్సు.
కుటుంబం పెరిగిన వాతావరణాన్ని ఎడ్వర్డు ఎమర్సన్
విధంగా చిత్రించాడు:

"విల్కీ ఏదో చెపుతాడు. వెంటనే అందర్లోకీ చిన్న వాడైన బాబ్ దాన్ని విమర్శిస్తాడు. హెన్రీ (జూనియర్) విల్కీని సమర్థిస్తాడు. బాబ్ ఇంకా గట్టిగా వాదిస్తాడు. పెద్దకుమారుడైన విలియమ్స్ నెమ్మది నెమ్మదిగా అందు కుంటాడు. తండ్రి మితవాదిగా జోక్యం కలిగించుకుంటాడు. క్రమక్రమేణా ఈ మితవాది మాటలు వినేవారే వుండరు. అంతటితో అతనికికూడా ఆవేశం పెరుగుతుంది. తన్నుతాను మరచి రంగంలోకి ఉరుకుతాడు. అంతా పెద్దపెట్టున మాట్లా డుతూ చేతులు త్రిప్పుతూ వుంటారు. చూచేవారికి వారి చేతుల్లో వున్న కత్తులు (భోజనంచేసే సమయం) ఎవ్వరికి ఎక్కడ గుచ్చుకుంటయ్యో అని భయంవేస్తూ వుంటుంది. ఆ సమయంలో జేమ్సు భార్య నన్నుచూచి నవ్వుతూ, 'కంగారుపడకు ఎడ్వర్డ్! వొకరి నొకరు పొడుచుకోరులే. బడినుంచి పిల్లలు ఇంటికి రాగానే ఇది నిత్యం జరిగేదే' అంటుంది."

వంటి వాతావరణంలో పెరిగిన జేమ్సు తత్వవేత్త తన తత్వశాస్త్రం మానవ విలువలకు ప్వటంలోనూ ఆశ్చర్యం ఏముంది?

యం జేమ్సు జననం 11 జనవరి, 1842. న్యూయార్క్ పట్టణం అతని జనన ప్రదేశం. తొమ్మిదో సంవత్సరంవరకూ అతను రకరకాల పంతులమ్మల దగ్గర చదివాడు. తొమ్మిది మొదలు పదమూడో సంవత్సరం లోగా న్యూయార్క్‌లో మూడు పాఠశాలలు మారాడు. అతనితండ్రికి ఆమెరికన్ విద్యాలయాలమీద సానుభూతి లేదు. అందువల్ల 1855 లో విద్యాభ్యాసానికిగాను పిల్లలందర్నీ యూరప్ తీసుకొని వెళ్ళాడు. లండన్‌లో మకాం పెట్టాడు. పారిస్, బోలోన్, గోడ్ ఐలెన్, జినీవా, బోన్ మొదలయినచోట్ల మొత్తం అయిదు సంవత్సరాలు చదువుకొన్నాడు, విలియం జేమ్సు. ఈ రోజుల్లో అతను పరీక్షలకు పనికిరాని చదువు చాలా చదివాడు. దాని పర్యవసానం అతను 'ఇక మామూలు చదువు ఐపోయింది. ప్రస్తుతం నాకు చిత్రకారుడు కావాలని అభిలాషగా వుంది' అనే క్షను వెలిబుచ్చటంగా బయటపడింది.

కొన్న తండ్రికి ఇది ఇష్టంలేదు. ఏదో గొప్పవాడవుతా న్న కుమారుడు ఇలా అయిపోతున్నాడేమా అని విచాించాడు. అయినప్పటికీ కుమారునికి అడ్డుచెప్పలేదు. కాని, సంవత్సరంలోనే జేమ్సుకి చిత్రకారుణ్ణి కావాలనే అభిలాష అడుగుఅంటింది. 1861 లో పంతొమ్మిదవఏట అతను హార్

వర్గ్‌లో వున్న లారెన్స్ సైంటిఫిక్ స్కూల్లో రసా
విద్యార్థిగా జేరాడు. కొన్నాళ్ళవరకూ
శ్రద్ధగా చదివాడు. కాని, త్వరలోనే అతని
శాస్త్రాలమీదకు వెళ్ళింది. ఈనాటికి అతని వం
వొకటి. ఏదోవొక వృత్తిలో ప్రవేశించటానికి ప్రయత్న
వలసిన అవసరం కళ్ళముందు కనపడటం మొదలు పెట్టి
ఈ ఉద్దేశంతో అతను 1864 లో హార్వర్డులో వున్న
వైద్య కళాశాలలో జేరటం, అటుతిరిగి, ఇటుతిరిగి 1869 లో
యమ్. డి. డిగ్రీ సంపాదించటం జరిగింది. అతను సంపా
దించిన డిగ్రీ ఇదే మొదటిదీ, చివరిదీనూ.

అతనికి చదువు పూర్తిఅయినా, జీవితం ఒక దారికి రాలేదు. ఆరోగ్యం సరిగా లేదని ఊహించుకొని అతను మూడుసంవత్సరాలు ఇంటిదగ్గిరే వున్నాడు. చెదురు బదురుగా వ్యాసాలు, సమీక్షలు వ్రాయటంకంటే, ఈ రోజుల్లో ఏవీా చేసేవాడు కాదు. తెలివిగల యువకులు ఏదోఒక వ్యాపకం లేకపోతే, ఏదో ఒక జబ్బును వృద్ధి చేసుకుంటారు. జేమ్సుకి ఇదే సంభవించింది. లోపలకు చూచుకోవటం, తన్ను తాను విమర్శించుకోవటం ఎక్కు వైంది. తాత్వికంగా అనేక అనుమానాలు చెలరేగి, బాధ పెట్టటం మొదలుపెట్టినై. మనస్సు వికలమై అనేక వక్ర దృశ్యాలకూ, పీడకలలకూ తావిచ్చింది. ఆ రోజుల్లో తను అనుభవించిన అనుభవాల్లోని ఒక ఊహాదృశ్యాన్ని మారు పేరుతో ప్రకటించాడు జేమ్సు. ఆనాటి అతని మానసిక స్థితిని ఆ ఊహాదృశ్యం చెప్పక చెపుతుంది:—

"తాత్విక నిరాశతోనూ, మామూలు నిస్పృహతోనూ గంద్రగోళం అవుతున్న స్థితిలో, నేను ఒకనాటి సాయంకాలం, అసలు సంధ్యవేళ, దుస్తులు వేసుకునే గదిలోకి వెళ్ళటం తటస్థించింది. ఆ గదిలో అకస్మాత్తుగా నా ఉనికిని గురించి నాకే భయంవేసింది వెంటనే నేను ఇదివరకు పిచ్చి ఆసుపత్రిలో చూచిన ఒక రోగి నా మనస్సులో ప్రత్యక్షమయ్యాడు. నల్లనిజుట్టుతో, ఆకుపచ్చరంగు శరీరంతో ఎప్పుడూ అతను వాకే బెంచీమీద మోకాళ్ళు ముడుచుకొని, తన చొక్కాను మోకాళ్ళమీదకు లాక్కొని, కూర్చుని వుండేవాడు; కదలకుండా కూర్చొని వుండేవాడు నల్లనికళ్ళను మాత్రం కదులుస్తూ వుండేవాడు... అతన్ని ఊహించీ ఊహించగానే 'నా ఆకారంఅదే ఆకారం'అనిపించేది నాకు. నేను 'అలా అవవలసివుంటే,కాకుండా నన్నేదీ తప్పించలేదు' అనే భావం అకస్మాత్తుగా అంకురించేది. ఈ భావం నాలో వున్న శక్తిని హరించింది. నేను మూర్తీభవించిన భయాన్నయ్యాను. దీంతో నాకు ప్రపంచమే మారిపోయింది. రోజూ ఉదయం ఈ భయంతోనే లేచేవాణ్ణి"

ఇదీ ఆనాటి అతని స్థితి. అతని ఈ స్థితికి ముఖ్యకారణం వైద్యవిద్యవల్ల అతనికి వచ్చిన భౌతిక జ్ఞానం, అందులోనుంచి పుట్టిన కర్మసిద్ధాంతం. ఈ వాదంవల్ల తనొక యంత్రంలో చిక్కుకున్నట్లూ, అందులోనుంచి తప్పించుకునే మార్గం లేనట్లూ తలిచి బాధపడేవాడు. 'మానసిక అనుభవాలన్నీ పదార్థంనుంచి పుట్టినవే. కారణనిర్మాణం, చైతన్యస్థితికి సంబంధించి వుండక, దీని పుట్టుకకు కారణమైన

మెదడుకి సంబంధించి వుంది! అయినప్పుడు మానవుడు చేసేది ఏమిటి? వీటినుంచి మానవుడు తప్పించుకునేది ఎట్లా?' ఇదే అతని హృదయావేదన, బాధ.

ఈ బాధే అతని అనారోగ్యానికి ముఖ్యకారణం అ టంవల్ల 'కారణ వ్యవస్థ మనస్సుకి సంబంధించినది' చెప్పిన ఫ్రెంచి తత్వవేత్త రెనోవీర్ రచనలు అంధకారంలో దారీ తెన్నూ లేకుండా కొట్టుకుంటున్న అతనికొక మార్గాన్ని చూపి, క్రమక్రమేణా ఆరోగ్యవంతుణ్ని చేశాయి. 'భావాల బలాని'కి జేమ్సు జీవితంలోని ఈ ఘట్టం ఒక నిదర్శనం.

ఈ విధంగా జేమ్సు ఆరోగ్యం కుదుటపడింది. 1872లో అతను హార్వర్డు యూనివర్సిటీలో శరీర శాస్త్రోపధ్యాయుడుగా జేరాడు. అప్పటినుంచీ అతని జీవితం పూర్తిగా మారిపోయింది. అతనికి తగిన వృత్తి ఆనాటికి దొరికింది.

అతను అనేక ఉపన్యాసాలు ఇచ్చాడు. వాటిని పుస్తక రూపాల్లో ప్రచురించాడు. అతని పుస్తకాలు ఎక్కువ ఉపన్యాస ధోరణిలోనే వుండేవి. అందువల్ల చదువరులకు అర్థం అవటానికి వీలుగా వుండేవి. ఈ కారణంవల్ల ప్రముఖ విమర్శకులు అతని రచనలు అక్కడక్కడా విషయానికి తగిన బరువు ఉండక, తేలిక పారుగా వుంటాయని అభిప్రాయం వెల్లడించారు. 1890 లో అతను 'మనస్తత్వ సూత్రాలు' అనే గ్రంథాన్ని ప్రచురించాడు. ఇది పదార్థానికీ, మనస్సుకీ, వున్న సంబంధాన్ని నిర్వచనం చేసిన గ్రంథం. తరువాత 1902 లో 'మత అనుభవంలోని భేదాలు' అనే గ్రంథం

ప్రచురించాడు. ఇదికూడా మనస్తత్వ శాస్త్రానికి సంబంధిం
న గ్రంథమే. ఈ గ్రంథం గిఫర్డు ఉపన్యాసాల ఫలితం.
ు, మిస్ ఫ్రాన్సిస్ మోర్స్‌కి వ్రాసిన ఉత్తరాన్నిబట్టి
ఉపన్యాసాల ఉద్దేశాలివి: (1) మత జీవితానికి 'తత్వ
్రం' కంటే అనుభవం ముఖ్యం, (2) మతంయొక్క
న్ని ప్రత్యేకరూపాలు విపరీతంగా కనిపించినా, జీవితాన్ని
మొత్తంగా తీసుకుంటే, మతం, మానవుడు అనుసరించవల
సిన ముఖ్యాంశాల్లోకల్లా ముఖ్యమైందని చదువరులచేతా,
ప్రేక్షకులచేతా, నమ్మించటం. ఈ విషయం జేమ్సుకి అభి
మాన విషయం అవటంవల్ల ఈ గ్రంథం అతని ఉత్తమ
గ్రంథాల్లో ముఖ్యస్థానాన్ని ఆక్రమించుకో గలిగింది.

'ప్రెగ్మాటిజం' అనేది జేమ్సు ప్రచారం చేసిన
తాత్విక సిద్ధాంతం. ఈ వాదం తార్కిక వాస్తవిక వాదా
నికి పునాది. 'మన నమ్మకాలు నిజమైనవి గనక సత్ఫలితాల
నిస్తున్నా యనుకోగూడదు; సత్ఫలితాల నిచ్చిన నమ్మకాలు
నిజమైనవని అనుకోవాలి' అని ఈ వాదం చెపుతుంది.
1897 లో 'నమ్మాలనే సంకల్పం' అనే గ్రంథరూపంలో
వెలువడిన భావాలు 1907 లో ప్రెగ్మాటిజం అనే గ్రంథంగా
వృద్ధి చెందాయి. 1909 లో 'ద్వంద్వ ప్రపంచం' అనే
గ్రంథం ప్రచురించబడింది. తత్వవేత్త జేమ్సు ప్రతిభను
ఈ గ్రంథం నిరూపిస్తుందని చాలామంది విమర్శకుల
ఉద్దేశం. ఈ గ్రంథాన్నిగూర్చి ప్రెగ్మాటిజం అంటే
ఇష్టంలేని పామర్, 'జేమ్సు ఆక్రమించుకున్న ప్రముఖ

స్థానానికి ప్రెగ్మాటిజం కలిగించిన ప్రమాదాన్ని, ఈ గ్రంథం తుడిచివేసింది,' అని అభిప్రాయం ఇచ్చాడు.

ఈ గ్రంథాలు మనస్తత్వ శాస్త్రజ్ఞునిగానే తత్వవేత్తగా జేమ్సుకి మంచిపేరుని తెచ్చిపెట్టాయి.

౪

'పాశ్చాత్య తత్త్వశాస్త్ర చరిత్ర' అనే గ్రంథంలో రస్సెల్ జేమ్సునిగురించి వ్రాస్తూ, అతను ముఖ్యంగా మనస్తత్వ శాస్త్రజ్ఞుడనీ, రెండుకారణాలవల్ల తత్త్వశాస్త్రంలో అతను ప్రాముఖ్యత వహించాడనీ వ్రాశాడు. ఈ కారణాల్లో మొదటిది, అతను సృష్టించిన 'రాడికల్ ఎంపిరిసిజం' అనే వాదం. రెండవది అతను ప్రచారం చేసిన 'ప్రెగ్మాటిజం' అనే సిద్ధాంతం అన్నాడు.

జేమ్సు తాత్త్వికదృష్టిలో రెండురకాల అభిరుచులు కన్పిస్తాయి - శాస్త్ర సంబంధమైన అభిరుచి ఒకటీ మత సంబంధమైన అభిరుచి ఒకటీ. అతని శాస్త్ర సంబంధమైన అభిరుచి అతను అభ్యసించిన వైద్య విజ్ఞానంతో మలపబడి భౌతిక సిద్ధాంత వాసనలను వెరజిమ్ముతూ వుంటుంది. కాని అతని మత సంబంధమైన ఆవేశం ఈ అభిరుచిని ఎప్పటి కప్పుడు హద్దుల్లో పెడుతూ వుంటుంది. ఆర్ద్రతను కాపాడి మానవత్వాన్ని కోల్పోకుండా, మానవ సంబంధాలను సడలి పోనివ్వకుండా కాపాడుతూ వుంటుంది. అందుకనే 'మానవుడు యంత్రం', అనే దృష్టికి అతను బానిస కాలేదు.

అతని తాత్త్వికసిద్ధాంతంయొక్క ముఖ్యలక్షణాలను
(స్థ)ూలంగా తెలుసుకుందాం:—

'(రా)డికల్ ఎంపెరిసిజం'

ఈ వాదాన్ని జేమ్సు చివరికాలంలో వృద్ధిచేశాడు. ఈ వాదానికి సంబంధించిన బీజాలు అంతకుముందు వ్రాసిన గ్రంథాల్లో కనిపిస్తూనే వుండేవి. 'రాడికల్' అనేపేరు ...ంప్రథమం 'విల్ టు బిలీవ్' అనే ...కనపించింది. ఈ పేరును వాడటానికి గల ...జేమ్సు ఈ విధంగా విపులీకరించాడు:—"మనం ...పర్యవసానాల నన్నిటినీ రాబోవు అనుభవంలో ...వలసిన ఊహాలనుగా మాత్రమే తీసుకోవాలి ...న్ని ప్రస్ఫుటం చెయ్యటానికిగాను 'ఎంపెరిసిజం' అద్వైత సిద్ధాంతాన్ని కూడా ఇటువంటి ఊహ ...ించాలనే ఉద్దేశాన్ని ప్రస్ఫుటం చెయ్యటానికి ...కల్' అన్నాను అని చెప్పాడు."

...ద్ధాంతంలో ముఖ్యసూత్రాలు రెండున్నాయి. ...తత్వవేత్తలు జ్ఞానాన్ని ప్రేరణల క్రింద ...భాగాలనుంచి దానిని తిరిగి నిర్మించేవారు. ఇలా చెయ్యటంలో ప్రేరణలకు వొకదానికి వొకటి వుండే సంబంధాలను ఎక్కడనుంచో వచ్చి వున్న వాటినిగా పరిగణించేవారు. ఈ విధానం తరువాత చాలా విమర్శలకు గురి అయింది. జేమ్సు ఈ విమర్శలలో వున్న సత్యాన్ని గమనించి, అవి వర్ణించే నిబంధనలకు మల్లేనే ఈసంబంధాలు

కూడా వున్నాయని చెప్పాడు. 'ఈ సంబంధం అ...
యొక్క లక్షణాలకు కలుపబడిన మానసిక ప్రవృత్తి కాది
అంమలో వొక భాగమే. అన్నీ ప్రదర్శించబడినట్లే, ఆ
ప్రదర్శించబడుతుంది,' అన్నాడు. (2) అనుభవంలోవ
వొకే లక్షణం వివిధ సందర్భాల్లో మెలగగల దనేది రె
సూత్రం. భౌతిక వాస్తవికత్వంలో వొక భాగం
చైతన్యంలో వొక లక్షణంగానూ అది మె
ఉదాహరణకు: నేను వొక సిగరెట్‌ని చూస్తే, ఆ
నా చైతన్యంలో ఒక భాగంగానూ, భౌతికం
సిగరెట్‌లో ఒక భాగంగానూ, వుండవచ్చు.
పదార్థానికి చెందిన వొక మానసిక బింబాన్ని
ఊహించవలసిన అవసరం లేదు. అసలు కనబ
టానికి వీలుండేవాటి మొత్తాన్నిగా మనం ఈ
పరిగణించవచ్చు. దీనినిబట్టి, మనస్సూ, పదార్థ
కాదనీ, ఒకే వస్తువుయొక్క భిన్న నిర్మాణంప
భేదమేననీ తేలుతుంది. ఈ భేదం అవి ఏర్పరు
సంబంధాలను బట్టి వచ్చిన భేదమే.

ఇదే విషయాన్ని రస్సెల్ తాను వ్రాసి
తత్త్వశాస్త్ర చరిత్రలో విపులంగా పరామర్శించాడు.
దాన్ని పరిశీలిద్దాం—

బెర్ట్రాండ్ రసెల్ లెక్కప్రకారం జేమ్సుయొక్క
ఈ వాదం 1904 లో అతను ప్రచురించిన 'అసలు చైతన్యం
వున్నదా?' అనే వ్యాసంతో ప్రారంభమైందని చెప్పుకోవచ్చు.

ంతకుముందు లోకే, బెర్క్లే, హ్యూమ్ మొద
ుయిన తత్త్వవేత్తలు తెలుసుకోవటాన్ని ఒక సంఘటనగా
రిగణించారు. ఈ సంఘటనలో ఒక పదార్థం మరొక
ార్థాన్ని తెలుసుకుంటూ వుంది అనుకున్నారు. తెలుసు
నేది మనస్సు; తెలుసుకోబడేది భౌతిక పదార్థం కావచ్చు.
తంగా వుండే 'అసలు వస్తువు' కావచ్చు. మరొక
కావచ్చు. పూర్వపు తత్త్వశాస్త్రాల్లో అన్ని ముఖ్య
లు ఈ ద్వంద్వదృష్టి చుట్టూ తిరుగుతుండేవి.
ఈ దృష్టిని అంగీకరించలేదు. ఈ నీవూ, నేనూ
బంధం ముఖ్యమైన సూత్రం క్రింద పరిగణించటానికి
ి జేమ్సు వాదం.

చైతన్యం అనేది ఒక ప్రత్యేక వ్యక్తిత్వం వున్నది
అందువల్ల దానిని ముఖ్యసూత్రాల్లో ఒకదానినిగా
చటానికి వీల్లేదు. దానిని నమ్మేరు కూర్చున్న వారు,
ంచుతున్న 'ఆత్మ', విడిచిపెట్టిన పుకారుని నమ్మేరు
వారికింద లెక్క" అన్నాడు. భౌతిక పదార్థానికి
ిరొక పదార్థం లేదు. మన ఆలోచనలు భౌతిక
ికి సంబంధం లేని పదార్థంతోగానీ, వ్యతిరేక
స్వభావం గలిగిన పదార్థంతోగానీ చెయ్యబడలేదు. అంటే,
ఆలోచనలు 'తెలుసుకోవటం' అనే కర్తవ్యాన్ని నెర
వేర్చటం లేదని చెప్పటం అతని ఉద్దేశ్యం కాదు. చైతన్యం
వొక వస్తువు కాదని అతనిభావం; అనాదిపదార్థం ఒక్కటేఅని
అతని భావం. ప్రపంచంలోని ప్రతి వస్తువూ దీనితో చెయ్య
బడ్డదనీ, తెలుసుకోవటం అనేది వొకే అనుభవం యొక్క

రెండు భాగాలకు సంబంధించిన సంబంధమనీ, విభాగించబడ అనుభవం, వొక సందర్భంలో తెలుసుకునేదానిగానూ, మరొక సందర్భంలో తెలుసుకోబడేదానిగానూ ఉంటుందనీ అతని తాత్పర్యం.

పదార్థాన్నీ, మనస్సునీ, అనాది పదార్థం యొక రెండు గుణాలుగా భావించి, మిగిలిన తత్వవేత్తలు దించిన 'ద్వంద్వత్వాన్ని' జేమ్సు నిర్మూలించాడని చెప్పుకోవచ్చు. ఈ అనాది పదార్థం అటు మనస జేరదు; ఇటు పదార్థంలోకీ జేరదు. 'నిర్గుణం' అని కోవచ్చు. అందువల్ల ఈ విషయంలో జేమ్సుతో వించినవారు, ఈ ప్రపంచం మనస్సుతోనూ కాక ర్థంతోనూ కాక ఈ రెంటికీ ముందున్న మరొక వ నిర్మించబడిందనిచెప్పే 'న్యూట్రల్ మోనిజం' సిద్ధా బలపరచటంలో ఆశ్చర్యంలేదు.

జేమ్సుమాత్రం ఈ సిద్ధాంతాన్ని విపులీకరి పైగా 'విశుద్ధానుభవం' అనే మాటను వాడుత వాడు. అందువల్ల తనకు తెలియకుండానే బెర్క్లే వాదాన్ని సమర్థిస్తున్నాడా అనిపిస్తూంటుంది.

'అనుభవం' అనే మాటను ప్రతి తత్వవేత్తా ఎప్పుడో ఒక్కసారి వాడేవుంటాడు. కాని ఈమాటను చాలాతక్కువ మంది నిర్వచించారు. దీని అర్థం తెలుసుకోవటం ప్రస్తుతం అవసరం.

మన అనుభవంలోకి రాని సంఘటనలు అనేకం వుంటాయని సాధారణ జ్ఞానం చెపుతుంది. ఉదాహరణకు, చంద్రునిలో మనకు కనపడని రెండోవైపు జరిగే సంఘటన తీసుకోవచ్చు. బెర్క్లే, హెగెల్ మొదలైనవారు దీన్ని గీకరించక, అనుభవంలోకి రానిది లేనట్లే అని నిర్ధా . ఈనాటి ప్రముఖులు వీరితో ఏకీభవించనిమాట నాదిపదార్థం అనుభవం ఒకటేనని మనం ఒప్పు మనం చంద్రునిలో కనపడని రెండోవైపు అనే న్ని సమర్థించడానికి చాలాచిక్కులు పడవలసివస్తుంది. అనుభవంలో వున్నవాటినిబట్టి లేనివాటిని ఊహించ క్తిని అంగీకరించకపోతే ఎవరికివారికి వారి ఉనికిని గిలినవారి ఉనికిని నిరూపించటం కష్టంఅవుతుంది.' బెర్ట్రెండ్ రసెల్.

నుభవం అంటే ఏమిటో తెలుసుకోటానికీ, అను వొచ్చిన సంఘటనకూ, రాని సంఘటనకూ వున్న సుకోవటం మంచిది. ఎడారిలో పడే వర్షం అను రాకపోయినా పడినట్లే. ప్రాణంఅనేది వుంటే అనుభవం అనేది ఉండదు. కాని ప్రాణం వుంటే అనుభవం వుండటం, లేకపోతే లేకపోవటం సత్యం కాదు. మనం గమనించని అనేకవిషయాలు జరుగుతూ వుంటాయి. వీటిని మనం అనుభవిస్తున్నాం అని చెప్పటానికి వీల్లేదు. మనకు జ్ఞాపకంఉన్నంతవరకు అనుభవంలోవున్నట్లే. కాని జ్ఞాపకంలేనివి కొన్ని మనకు కొన్నిఅలవాట్లను, అలవాటు

చేసి వుండవచ్చు, అవి మిగిలివుంటై. మొదట కాలిన సంఘటన జ్ఞాపకం లేకపోయినా, కాల్చుకున్న బిడ్డకు నిప్పంటే భయం మిగిలి వుండవచ్చు. కాబట్టి వొక సంఘటన వొక అలవాటును సృష్టించినప్పుడు, ఆ సంఘట అనుభవించినట్లుగా మనం భావించవచ్చు. అలవాట్లు అ ప్రాణమున్నవాటికే కలుగుతాయి. కాబట్టి, మామూ కారణాలలోనే అనాది పదార్థమున్న చోటల్లా ముంటుందని చెప్పుకోటానికి వీల్లేదు. ఈ విష మామూలుగా కనపడే కారణాలకు భిన్నంగా వెళ్ళ అవసరం నాకు కనపడటంలేదు' అన్నాడు రసెల్. అ 'అనుభవం' విషయంలో తప్ప రాడికల్ ఎంపెరిసి చెందిన మిగిలిన విషయాల్లో నేను జేమ్సుతో ఏకీ న్నాను' అన్నాడు."

## 'ప్రెగ్మాటిజం'

ప్రెగ్మాటిస్టు విధానాన్ని 1878 లో ఛార్లెస్ పీర్స్ సృష్టించాడు. అతను మాటలఅర్థాన్ని తెలు వరకే ఈ విధానాన్ని వినియోగించాడు. ఒక ప గురించిన మన ఆలోచనల యదార్థాన్ని నిర్ణయించు కా లంటే, ఆ పదార్థం ఎటువంటి ఫలితాల నిస్తుందో ఊహించు కుంటే తేలిపోతుందని పీర్స్ అభిప్రాయం. ఈఅభిప్రాయాన్ని జేమ్సు విశాలపరచి 'వివిధ సిద్ధాంతాలను ఆచరణవల్ల మనకు సంభవించే భేదాలను తెలియజెప్పడం, తత్వశాస్త్రం పని' అని నిర్వచనం చేశాడు, ఈ నిర్వచనంవల్ల సిద్ధాంతాలు

తెలుసుకోలేని ప్రశ్నలకు జవాబులుగా కాక, అందుకు
...రముట్లుగా తయారైనై!' అన్నాడు, బెర్ట్రెండ్ రసెల్.
...ి కొంతవరకు నిజమే.

ఈ సిద్ధాంతాన్నిబట్టి వొక భావంయొక్క నిజా
...ు, అది ఇతర అనుభవాలతో సంబంధం ఏర్పరచు
...చేసే సహాయాన్నిబట్టి నిర్ణయించబడతవి. 'ఒక
...నమ్మటం మన జీవితానికి లాభదాయకం అయితే
...సత్యమైందే!' సత్యం అనేది మంచిలో ఒక
...గాని, ఒక ప్రత్యేక తరగతికి చెందినది కాదు. ఒక
...కి సత్యం అవటం అనేది సంభవిస్తుంది; దాన్ని
...నలు సత్యాన్నిగా చేస్తవి.

...ఈ భావాన్నే 'ప్రెగ్మాటిజం; మతం' అనే అధ్యా
...జేమ్సు సోదాహరణంగా విపులీకరించాడు — 'ఫలి
...యోజనకారి అయితే ఏ ఊహనూ మనం తోసి
...డదు.' 'భగవంతుడు అనేభావం మానవకోటికి
...గిస్తే, ఆ భావం సత్యమైందే' అతను ఈ విధంగా
...డు.

జేమ్సు ఈ సిద్ధాంతం తాను క్రొత్తగా సృష్టిం
చింది కాదనీ, అనేకమంది ప్రముఖులు మేధా సంపత్తితో,
వృద్ధిచెందుతూ వచ్చి తనకాలం నాటికి తన శక్తిని తాను
తెలుసుకొని విజృంభించిందనీ, చెపుతూ, ఇలా అన్నాడు -
'ఈ విధానంలో క్రొత్త అనేది ఏమీలేదు. సోక్రటీస్
ఇందులో ప్రావీణ్యుడు. అరిస్టాటిల్ ఒక క్రమపద్ధతిలో

దీన్ని వుపయోగించాడు. లోకే, బేర్క్లే, హ్యూమ్ మొద
లయిన ప్రముఖ తత్త్వవేత్తలు ఈ సిద్ధాంతాభివృద్ధి
తోడ్పడ్డారు. మనకు తెలిసిందే వాస్తవికత అని హడ
గట్టిగా చెప్పేవాడు. కాని, వీరు వైతాళికులు మా
చెదురు బదురుగా ఈ సిద్ధాంతాన్ని ఆచరణలో పె
గాని సమగ్ర దృష్టితో వ్యవహరించలేదు. మన
మాత్రమే అది సంపూర్ణమైన ఒక ఆకృతిని
దింది. విశ్వసందేశాన్ని ఇవ్వగలిగిన శక్తి తనకు
గ్రహించగలిగింది; భవిష్యత్తును నిర్ణయించగలి
కారం తనకున్నదని అర్థం చేసుకోగలిగింది; నా కీ
నమ్మకంవుంది. ఈ నమ్మకంతో మిమ్మల నందరినీ
పరచాలని నా ఆశ' అన్నాడు.

ప్రెగ్మాటిజాన్ని ఒక్క జేమ్సుకాక, సి
జాన్ డ్యూయీ కూడా ప్రచారం చేశారు. వీరిలో
ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వనక్కరలేదు గాని,
ప్రెగ్మాటిజం వ్యాపకానికి ముఖ్యకారకుడని చెప్ప
అయితే జేమ్సుకీ డ్యూయీకీ కొన్ని అభి
లున్నాయి. రసెల్ చెప్పినట్లు డ్యూయీది శా
అతని కారణాలు శాస్త్రవిధానంలోనుంచి పుట్టినవి. జేమ్సు
దృష్టికి మతమూ, నైతికవిలువలూ ముఖ్యం. 'టూకీగా
చెప్పాలంటే, జేమ్సు ప్రజలను గుణవంతులుగానూ, సుఖ
వంతులుగానూ చేసే ఏ సిద్ధాంతాన్ని బలపరచటానికయినా
సన్నద్ధుడే. ఈ పనిని చెయ్యగలిగిన ఏ సిద్ధాంతమైనా
అతనికి యదార్థమైనదే;' అన్నాడు రసెల్.

జేమ్సు తత్వశాస్త్రంలోని పై రెండు లక్షణాలను ...ప్తూ, రసెల్ రాడికల్ ఎంపెరిసిజంతో తాను పూర్తిగా ...భవిస్తానని, ప్రెగ్మాటిజం విషయంలో మాత్రం తనకు అభిప్రాయభేదాలున్నాయనీ చెప్పి వాటిని ఈవిధంగా ...రించాడు:

...నమ్మకం ఫలితాలు మంచివి అవుతవో ఆనమ్మకం ... ఈ సిద్ధాంతం చెపుతుంది. కాబట్టి ఈ సిద్ధాంతం ...కారి అవాలి అంటే ముందు మనకు (1) మంచి ...మిటి? (2) రాబోయే ఫలితాలను ప్రమాదం ... ఎలా ఊహించటం? అనే విషయాలు తేలాలి. తేల్చుకోక ముందు దేన్నీ 'ఇది సత్యం' అని చెప్పలేం.

... చాలా గంద్రగోళానికి దారితీస్తుంది. ఉదాహర...ంబస్ అట్లాంటిక్ మహాసముద్రాన్ని 1492 లో ... లేదా అనే ప్రశ్నను తీసుకుందాం. ఈ సంగతి ...నికి అందరికిమల్లే మనం కూడా ఏపుస్తకాన్నో ...నికి వీల్లేదు. మనం ముందు ఇలానమ్మడంవల్ల ...తాలను తెలుసుకోవాలి. 1491 లో గానీ, 1493 లో గానీ దాటాడనుకుంటే వొచ్చే ఫలితాలను ఊహించి, వీటిని పోల్చి ఏ ఫలితాలు మంచివో తేల్చుకొని, వాటినిబట్టి సత్యాసత్యాలను నిర్ణయించాలి. ఇదే కష్టమైనపని. ఈ నిర్ణయం నీతిశాస్త్రాన్నిబట్టి జరగాలంటే ఇంకా కష్టం. పరీక్షలో మార్కులు ఎక్కువ వస్తాయిగనక 1492 వ

సంవత్సరాన్ని మనం ఎన్నుకోవచ్చు. కాని నువ్వు 1491 నో, 1493 నో ఎన్నుకొని వుంటే నీకంటే ఎక్కువ మార్కు సంపాదించే మిగిలినవారు, నీతిశాస్త్రందృష్ట్యా, వారి గెలు కంటే నీ గెలుపు విచారించదగిందని అనుకోవచ్చు.

మన కష్టాలు ఇంతటితో ఆగవు. ఈసిద్ధాంతాన్ని ఫలితాల మంచిచెడులను నిర్ణయించే శక్తి అని ముందు నిర్దుష్టంగా వుండాలి. ఈశక్తి నిర్దుష్టంగా మనం మంచివి అనుకున్న ఫలితాలు చెడువికావచ్చు చెడువి అనుకున్న ఫలితాలు మంచివి కావచ్చు. మంచి చెడులను నిర్ణయించే ఈమనశక్తి నిర్దుష్టం అ కాదో ఎలా తేల్చుకోవటం? ఫలితాలనుబట్టి ఫ మంచివో కావో ఎలా తేల్చుకోవడం? ఇలా గు గుంచంగా ఆలోచించవలసిందే! దీనికి అంతులే

ఇంకొక కష్టం: కొలంబస్ అనేవాడు ఒకడు డని నేను చెపితే అందరూ నమ్ముతారు. అదీ 'స కుంటారు. కారణం ఏమిటి? అది ఎందుకు సత్య వందలపైబై సంవత్సరాల క్రిందట ఇటువంటి బ్రతికి వుండేవాడు గనుక ఈనాడు నేను చెప్పింది పరిగణించబడుతూ వుంది. అంటే నా నమ్మకంయొక్క కారణాలనుబట్టి అది సత్యం అవుతూతుందిగాని, ఫలితాలనుబట్టి కాదు అనేది జగద్విదితం. ఈ సిద్ధాంతాన్నిబట్టి కొన్ని సమయాల్లో లేనిదాన్ని సత్యంగా నమ్మవలసి రావటం చివరి కష్టం.

ప్రెగ్మాటిజాన్ని గురించి బెర్ట్రెన్డు రసెల్ వెలిబుచ్చిన సందేహాలు ఇవి.

అనేకత్వం :

'రాడికల్ ఎంపెరిసిజం'లో జేమ్సు వెలిబుచ్చిన ...లే వృద్ధిచెంది ఈ రూపం తాల్చినవి, అని చెప్పటం ...కి దూరం కాదు. అవే భావాలను, మొత్తం ప్రపం ...ర్తింప జెయ్యటంవల్ల ఈ సిద్ధాంతం ఏర్పడింది. రాడికల్ 'ఎంపెరిసిజం' వ్యాసాల్లో మనం తెలుసు భౌతిక మానసిక పదార్థాలకు రెంటికీ చెందిందని ...టే ఈ తెలుసుకోవటం అనేది రెండు మూడు రకాల ...్య రంగాలకు చెందివుంటుందని చెప్పాడు. నా ఆలో ...్లో కొన్ని నా చైతన్యానికి కాక, పైస్థాయికి చెందిన చైతన్యానికికూడా చెందివుండవచ్చు. ఈ ఆలో ...ఈ వివిధ చైతన్యాలలో వివిధ రకాలుగా కనుపించ ...కాని దీనికి వివిధ చైతన్యాలకు చెందివుండే విలు నిస్సందేహంగా వుంది. దీన్నిబట్టి మానవుల ఆలో ...ష్టినీ ఆవహించి వుండే చైతన్యాన్ని కలిగివున్న ...లాత్మ' వొకటి వున్నదని అనుకోవలసి వస్తుంది. ఈ ఆలోచనలు వేరువేరుగా నిర్మాణం అయివుండవచ్చు. కాని అదే పదార్థం పైస్థాయికిచెందిన చైతన్యంలోనూ, మానవుని మనస్సులోనూ కనపడవచ్చు. మత సాంప్రదాయంలోలాగా, పూర్తిగా ప్రపంచాన్నుంచి విడిపడి వుండకుండా, అద్వైతం లాగ ఉనికియొక్క మొత్తంగా వుండకుండా, ప్రపంచానికి

సంబంధంవుంటూ తన వ్యక్తిత్వాన్ని ఉంచుకునే భగవంతు డనే భావం ఈవిధంగా వృద్ధిచెందింది.

చైతన్యం వొకదానితో వొకటి కలవటం వొకస్థితి చెందింది మాత్రమే అనుకోవలసిన అవుసరంలేదు. స్థాయికి చెంది చైతన్యాల్లో అనేకత్వం వుండవచ్చు. కొ వేరుగా మరికొన్ని ఇతరవాటితో కలిసివుండవచ్చు జేమ్సు నిత్యమూ అభివృద్ధిచెందే మొత్తం ప్రప చెందిన చైతన్యాన్ని చిత్రించాలని కాని, మొత్తం చానికిచెంది, అంతటినీ ఆవరించి వుండే చైతన్యం వ వుంటుందనిగానీ స్పష్టంగా అంగీకరించలేదు.

అలా అంగీకరించకపోవటానికి గతాను గతిక వొచ్చే ప్రపంచంలోకి చెడు ఎక్కడనుంచి వొచ్చింది సమస్యే కారణం. ప్రపంచానికి వొకే వొక మనస్సు ఉనికి మొత్తమే దాని ఆలోచనలైతే ప్రపంచంలో ప్రతిదానికీ బాధ్యత దానిదే అవుతుంది. మరి ప్రప చెడు జరుగుతూవుంటే, ఎందుకు జరుగుతూవుంది భగవంతుడు బాధ్యుడనో, లేకపోతే దీన్ని అతనికి అధికారం లేదనో అనుకోవలసివస్తుంది. ఇల కోవటం ఇష్టంలేక జేమ్సు ఏ చైతన్యమైనా, ఎంతటి విశాలత్వం కలదైనా అంతటినీ ఆక్రమించుకోలేదు అన్నాడు. 'భగవంతుడుకూడా మనకు మల్లేనే యీ మంచి- చెడూ సమస్యను పరిష్కరించటానికి ప్రయత్నిస్తున్నాడు. గట్టిగా జయిస్తాడని చెప్పలేం. మంచి దానంతట అదే జరుగుతుం దనే భావంతో మెదలకుండా వూరుకోవటంలో అర్థంలేదు.

జయాపజయాలు మానవ ప్రయత్నం మీద ఆధారపడి వుంటై' అన్నాడు.

ఈ పరిస్థితి నుంచి చెడులను ఏరుకోవటంలో మాన ...కి స్వాతంత్ర్యాన్నిచ్చింది. 'మానవునికి స్వాతంత్ర్యత వున్నది' ...ది జేమ్సు తత్వశాస్త్రంలో పదేపదే ఉద్ఘాటింపబడే ... వంశపారంపర్యా సంక్రమించే ప్రభావాన్నీ, పరి ...పలుకుబడినీ అధిగమించి ప్రవర్తించే స్వాతంత్ర్యత ...నికి వుంది. ప్రపంచం ఆదర్శం తేలని విషయం మానవుని ప్రయత్నానికి ప్రాముఖ్యత ఏర్పడింది....

ప్రపంచాన్ని గురించి జేమ్సు చిత్రించిన చిత్రం ఇది. ఊహించటానికి ఆధారాలేమిటి-అని జేమ్సుని విమ... ప్రశ్నించవచ్చు. సాంప్రదాయాను సారంగా చెప్పా... ధారాలేమీ లేవనే చెప్పాలి. ఇది ఊహాచిత్రమే ...). మనకు తెలిసిన విషయాలను తెలియనట్లే ...వచ్చు ... ఏదైనా ఇది ఆకర్షవంతమైన చిత్రం ...నిస్సందేహం. ఈ విషయాన్ని చర్చిస్తూ హెన్లీ, ...అవటం మంచిది. కాబట్టి ఇది నిజమని జేమ్సు ...డు. క్లుప్తంగా చెప్పాలంటే జేమ్సు చిత్రించిన ప్రపంచంయొక్క మనుగడ నమ్మాలనే కోర్కెమీద ఆధారపడివుంది' అన్నాడు.

కెల్లీరెట్ తాను వ్రాసిన నవ్యతాత్విక చరిత్రలో జేమ్సుయొక్క ఈ సూత్రాన్ని యీ విధంగా వ్యాఖ్యానించాడు:

"ఈ ప్రపంచం వొకటా, అనేకమా-అనేది చాలా పాత సమస్య. ఈ ప్రపంచం కొన్ని సందర్భాల్లో ఒకటే నసీ, మరికొన్ని సందర్భాల్లో అనేకం అనీ ప్రెగ్మాటిజ చెపుతుంది. (1) మనం మాట్లాడుకునే వైఖరినిబట్టి వొక్కటే — మనం 'ప్రపంచాన్ని' గురించి మాట్లాడగ (2) కాలాకాశంలో అవిచ్ఛిన్నంగా వుంటున్న అర్థంలో అది వొకటే; (3) మానవులకు, వొకరి అనేక సంబంధాలు వుండటం ఏకత్వాన్నే సూచిస్తు

మిగిలిన రకాల కలయికనుగూర్చి మనం ఇదమి ఏదీ గట్టిగా చెప్పలేము. అన్నిటికీ వర్తించే కారణ ఎంతవరకు వుందో జేమ్సు చెప్పలేదు. చాలా మామూలుకలయిక అనేది వుండటంమాత్రం నిస్సం వస్తువుల రకాలు వుండటం, తరగతుల వారీగా డానికి వీలుగా వుండటం అందరికీ తెలిసిందే. పోతే లేకపోతే గతాన్నిబట్టి భవిష్యత్తులో వచ్చే అ ఊహించలేం...కాని ప్రపంచంలో పూర్తి ఏకత లేదు; ఆదర్శంలో ఏకత్వంలేదు. మానవ సంఘ భౌతిక ప్రపంచంలోనూ వైరుధ్యాన్ని సూచించే చాలా వున్నాయి... ఇది పెరిగే ప్రపంచం గనక ఎప్పటి కైనా ఈ వైరుధ్యం నశించి పూర్తి ఏకత్వం లభిస్తుం దేమో అని ఆశ" అన్నాడు.

**మ త ం:**

జేమ్సు భగవంతుడు ఉన్నాడు-అని నిరూపించటానికి మామూలు మత కర్తలుమల్లే ప్రయత్నించలేదు మతం

యొక్క విలువను నిరూపించటానికి జీవితాన్నే ఆధారంగా
సుకున్నాడు. ప్రార్థన, మిస్టిక్ అనుభవాలు మనిషిలో
ర్పును తీసుకొని వస్తాయని అతను భావించాడు. మాన
లో వున్న బలహీనతను ప్రార్థన పోగొడుతుంది. ఈ శక్తి
నకు ఎక్కడనుంచి వొచ్చింది? మన తత్వశాస్త్రంలో,
కి రాని మనస్సు వుంటుందనీ, పైకి కనుపించే
ంటే ఇది బలమైందనీ అతను తెలుసుకున్నాడు.
వాలవల్ల వచ్చే శక్తి, దీనినుంచి వస్తూవుందని
చాడు.

ఈ శక్తి స్పృహలో లేని మనస్సులోనుంచి వొస్తూ
అంగీకరిద్దాం. కానీ, అక్కడకు ఎక్కడనుంచి
? అక్కడే పుట్టిందా లేక మన మనస్సుకంటే పెద్ద
రొక మనస్సునుంచి వొచ్చిందా? జేమ్సు ఈ
జవాబు తేల్చలేదు. తేల్చటానికి వీల్లేనిది గనక
ంవచ్చిన నమ్మకాన్ని వారు ఉంచుకోవచ్చున
. తానుమాత్రం ఈ శక్తి మరొక శక్తినుంచే
నమ్మాడు. కాని ఇతరులను ఈ విషయంలో
నికి త్రిప్పుకోటానికిమాత్రం ప్రయత్నించలేదు.

జేమ్సు తత్వశాస్త్రంయొక్క ముఖ్య లక్షణాలు ఇవి: ప్రపంచంలో వున్న వాటిని అన్నిటినీ తర్కంమీాద ఆధార పడిన వొక పద్ధతిలోకి సర్దగలగటం తాత్విక విధానంయొక్క ముఖ్య లక్షణం – అని అర్థం చెప్పుకుంటే, జేమ్సుకి ఒక తాత్విక విధానం లేదనే చెప్పుకోవలసివస్తుంది. అలా కాక కొన్ని సూత్రాల సహాయంతో సమస్యలను పరిష్కరించటం

తాత్విక విధానంయొక్క ముఖ్య లక్షణం అని అర్థం చెప్ప
కుంటే మాత్రం జేమ్సుకి ఒక తాత్విక విధానం వున్నద
గట్టిగా చెప్పుకోవచ్చు. అతనికి సత్యానికి సంబంధించిన
సిద్ధాంతం వుంది. నీతికి సంబంధించి కొన్ని అభిప్ర
లున్నాయి. అర్థం చెప్పుకోటానికి ఒక సిద్ధాంతం
అవన్నీ ప్రపంచాన్ని ఒక పద్ధతిని చిత్రిస్తయ్.

మనం పైన చెప్పుకున్నట్లు జేమ్సు త
యొక్క సారాంశం ఇది:- ఒక స్టేట్‌మెంటు (1)
పూర్వకమైన ఫలితాలను కలిగి వుంటేనూ; (2)
ఫలితాలు లేకపోయినా, దాన్ని నమ్మడంవల్ల
పూర్వకమైన ఫలితాలు కలిగివుంటేనూ, అ
మైనదిగా భావించబడుతుంది. మొదటితరగతిలో స
ఫలితాలే ఆ స్టేట్‌మెంటుయొక్క అర్థంగా భ
తాయి. రెండో తరగతిలోఅర్థంగా భావించబడే
అనే ప్రశ్నే లేదు. దీనివల్ల మనకు మిగిలేది ప్ర

జేమ్సు ప్రెగ్మాటిస్టు సిద్ధాంతాన్ని గురి
చేసిన విమర్శను ఇంతకుముందు పరామర్శించా
యొక్క ఈ మతదృష్టినికూడా అతను తీవ్రంగా విమ
జేమ్సు భగవంతుని స్థానంలో, భగవంతునిమీద వున్న
నమ్మకాన్ని కూచోబెట్టాడనీ, ఇతర మత కర్తలవలె కాక
అతను మతాన్ని మానవునికి అవసరమైనదానినిగా మాత్రమే
పరిగణించాడనీ, సాధారణ మానవుడు, 'భగవంతునిమీద
నాకున్న నమ్మకం సుఖాన్నివ్వాలి' అని కోరక 'నేను భగ
వంతుణ్ణి నమ్మాను గనుక సుఖంగా ఉన్నాను' అనిమాత్రమే

అనుకుంటాడనీ విమర్శించాడు, 'అపనమ్మకం అనే పునాది
మీద, నమ్మకం అనే నిర్మాణాన్ని కట్టటానికి ప్రయత్నించి
వుంది జేమ్సు ప్రయత్నం' అన్నాడు. 'ఇటువంటి
యత్నాలు అన్నిటికిమల్లే ఈ ప్రయత్నం కూడా ఫెయి
ంది. బెర్క్లేయొక్క మానసిక వాదంలో అపనమ్మ
డించటంవల్ల, భగవంతుని స్థానంలో భగవంతుని
నమ్మకాన్ని కూచోబెట్టటం తప్పక, అలాచేసి,
ది అనుకున్నాడు జేమ్సు. నవీన తత్వశాస్త్రంలో
జబ్బుయొక్క వివిధరూపాల్లో ఇదొక రూపం'
, రసెల్ తాను వ్రాసిన పాశ్చాత్య తత్వశాస్త్ర
లో.

# 'నిశ్చితార్థ తత్వవేత్త'
# జాన్ స్టూవర్ట్ మిల్

భావజగత్తులో విహరించటంవల్ల అలసట
తర్వాత, కొన్నాళ్ళు మళ్ళీ, కాలికి భూమి తగిలేవ
భూమిమీద ప్రశాంతంగా, ఏ ప్రమాదం లేకుండ
లని బుద్ధిపుట్టటం కద్దు. 1830 నుంచి 1870 వరకూ
కాలం ఇటువంటిదే. పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో
నుంచి 1830 వరకు జరిగిన చరిత్ర అతి ప్రాముఖ్యమై
కాలంలో అత్యద్భుతమైన ఊహలు ఎన్నో ఊహించ
ఇక తర్వాత వచ్చిన కాలం నిశ్చితార్థాలకోసం వెతి
అవటంలో ఆశ్చర్యం ఏముంది? ఇటువంటి
మెచ్చుకోదగిన మేధావులు పుట్టకపోవటంకూడా
ఈ యుగాన్ని, డబ్ల్యు. హెచ్. వాల్ష్ అనే ఆ
శాస్త్రం అనే గ్రంథంలో ఈ విధంగా వ్రా
కాలంలో గొప్ప తాత్వికులుగా పరిగణింపబడవ
వాళ్ళెవరూ లేరు. చెదురు బదురు గాని, కొన్ని గొప్పప
జరిగినప్పటికీ, మొత్తంస్థాయి చెప్పుకోదగిందిగా లేదు.'

ఈ కాలంయొక్క ప్రత్యేకత ప్రకృతి శాస్త్రానికి ప్రాముఖ్యత ఇవ్వటం, ప్రతి సమస్యనీ భావబలంతో కాక శాస్త్రజ్ఞానంతో పరిష్కరించుకోవటానికి ప్రయత్నించటం— అని మనం చెప్పుకోవచ్చు. ఈ దృష్టికి పునాది వేసినవాడు

ఫ్రెంచ్ దేశస్థుడైన అగస్టెకోమ్టే. తరువాత జాన్ స్టూవర్ట్ మిల్ చేతుల్లో వృద్ధిచెందిన నిశ్చితార్థతత్వశాస్త్రానికి ఆయనే బీజాలు నాటాడు. ఆయన దృష్టికి సిద్ధాంతంకంటే, కార్య క్రమం ముఖ్యంగా కనుపిస్తుంది. ఆ కార్యక్రమం కూడా ఇదే... ప్రతిశాఖలోనూ, శాస్త్రార్థాన్ని తెలుసుకోవ ప్రయత్నించటం, ఈ కార్యక్రమం చెయ్యదలచిన కార్యక్రమం, మతనమ్మకాల సహాయంగాని, అధ్యా త్మికపరంపర సహాయంగానీ అపేక్షించదు. ఇంతవరకు వుల సంబంధాలకు శాస్త్రవిధానం అన్వయం, చెయ్య దు గనుక ఆ లోటు తీర్చటానికి పూనుకున్నాడు కోమ్టే. ప్రయత్నంలో శాస్త్రదృక్పథంలో నిర్మించబడిన ఒక శాస్త్రా'న్ని సృష్టించాడు. 'నూతన శకాన్ని ఆరం ఆయన కృషికంటే, ప్రతి శాఖలోనూ శాస్త్రీయ అపేక్షించిన అతనికోర్కె, భావదృష్టికి వ్యతిరేకంగా ంద ఆయన చూపిన ఆదరం విదేశాలలోని అనేక ముఖుల దృష్టిని ఆకర్షించివై' ఈ విధంగా ఆకర్షించ రిలో ముఖ్యుడు జాన్ స్టూవర్ట్ మిల్.

## ౨

మిల్ 1806వ సంవత్సరంలో ఇరవై తేదీన లండన్‌లో జన్మించాడు. ఆయన తండ్రికూడా తత్వశాస్త్రంలో అభి రుచి కలిగినవాడే. ఆయన బెన్థామ్ ప్రియశిష్యుడు. అందు వల్ల తన కుమారుణ్ణి బెన్థామ్ వారసు డవటానికి అర్హతను సంపాదించేటట్లు చెయ్యాలని కృషిచేశాడు. తన కుమారుని

విద్య తన పర్యవేక్షణ క్రింద జరిగేటట్టు ఏర్పాట్లు చేశాడు. మూడవ సంవత్సరానికే కుమారుడు గ్రీకుభాష చదివేటట్ల చేశాడు. ఎనిమిదవ సంవత్సరంలో లాటిన్ చదువు ప్రారంభ అయింది. పన్నెండవ సంవత్సరంనాటికి తత్వశాస్త్ర పరిశీ నకు సిద్ధమయ్యాడు, స్టూవర్ట్ మిల్. ఈ విధంగా నిరి మంగా జరిగిపోయింది ఆయన విద్యాభ్యాసం. 1 ఆయన వృత్తి విద్య పూర్తి అయింది. ఆయన ఈస్ట్ కంపెనీలో ఒక ఉద్యోగం సంపాదించాడు. 1856 లో పరీక్షల ముఖ్యాధికారి అయినాడు; కంపెనీ రద్దయ్యే ఆ ఉద్యోగంలో వున్నాడు. తరువాత కామన్స్ మెంబరుగా ఎన్నికయి మూడు సంవత్సరాలు పనిచే ఆనాటినుంచి అంత్యంవరకూ గ్రంధరచనకు తన జీవి అంకితం చేశాడు. 1873 వ సంవత్సరం మే, 8 స్వర్గస్థు డయ్యాడు.

మిల్ వ్యక్తిగత జీవితంలో చెప్పుకోదగ్గ ఒకటే వొకటి వుంది. అది ఆయనకూ హారియట్ సంబంధం.

హారియట్, తీవ్రవాద సానుభూతి పరుడైన టైల త్ నే వొక వ్యాపారస్థుని భార్య. ఆమెను మిల్, తన ఇరవై అయిదవ ఏట కలుసుకోవటం సంభవించింది. ఇద్దరూ ఆప్త మిత్రులయ్యారు. ఈ స్నేహం, హారియట్ భర్త సహృద యతవల్ల, ఇరవై సంవత్సరాలు నిరాటంకంగా విరాజిల్లింది. మిల్, టైలర్ ఇంటికి వెళ్తుండేవాడు. హారియట్ ఆయనా

ఈవిధంగా మానవుల సంబంధాలను తెలియజెప్పే శాస్త్రాన్ని నిర్మించే అవకాశాలను సూచించాడు మిల్. రాజకీయ ఆర్థికతత్త్వ విధాన నిర్వచనంలో మాత్రం ఆయన ప్రవిజయం సాధించాడని నిస్సందేహంగా చెప్పుకోవచ్చు. 'శాస్త్రం లాగా సాంఘికశాస్త్రం సార్వజనీనకమైె కొన్ని సూచనలుచేస్తుంది. తాత్కాలిక నిర్ణయాలను కొన్నిటిని కొన్ని పరిస్థితుల్లో ఒక కారణం పనిచేస్తూవుంటుందని మజేస్తుంది. ఆపని చెయ్యటంకూడా విభిన్న పరిస్థి పరిస్థితిని మార్చేవరకే అని చెపుతుంది. రాజకీయ తత్వం డబ్బుమీదవున్న మమకారం అనే లక్షణాన్ని వునిలోని మిగిలిన లక్షణాలనుంచి విడదీస్తుంది. విభిన్న కోర్కెలు వాటిని కదిల్చకపోతే, ఆర్థిక సూత్రాలు గా పనిచేసేదీ ఈ తత్త్వం తెలియ చెయ్యగలుగు కాని ఇటువంటి విభిన్న ఆపేక్షలనేవి మానవుల్లో వుంటూనే ఉంటాయిగనుక మానవుని ప్రవర్తన ర్థిక నియమాలను బట్టే జరగదని మనం చెప్పు అయితే ఈ జ్ఞానం అనేక విధాల ఉపకరిస్తుంది.

### తత్వశాస్త్రం :

మానవుని ఆదర్శం సమిష్టిసుఖం అని మిల్ ఉద్దేశం. సంతోషం మంచిది; కష్టం చెడుది. మనం ప్రతివాళ్ళం సుఖాన్ని కోరుకుంటాం, కష్టాన్ని నిరసిస్తాం. బెన్థామ్‌కి వలె, మిల్ 'మానవుడు స్వార్థపరత్వంతో కారంతోనూ కూడుకొని వున్నాడ'ని అనడు. 'స

క్షించే సానుభూతీ, భూతదయా అతనియం దున్నాయి' అని అంటాడు. మరొక విషయంలో కూడా ఆయన బెన్థామ్‌తో ఏకీభవించడు. బెన్థామ్‌వలెకాక ఆయన కొని సుఖాలు, గుణంలో, మిగిలిన కొన్నిటికంటే గొప్ప ఉండవచ్చని అంగీకరించాడు. తృప్తికలిగిన బుద్ధిహీ కంటే, అసంతృప్తిని కలిగిన సోక్రటీస్‌గా ఉండటం దని ఆయన వాదం.

సుఖమే మానవుని ఆదర్శం అని మిల్ భా చెప్పుకున్నాం. ఇందులో ఆయనకు తికమక లేదు. గుణాలు మనిషికి ఎందుకు వుండాలి? ఎందుకంటే సహజంగా సుఖాన్నిస్తాయి గనక. మంచి గుణాలు, ప్పుడు వాటంతట అవి మంచిగా కనపడవచ్చు. కాని కనపడటానికి కారణం అవి అలవాటు అవటంవల్లే. భంలో వాటిని సుఖంకోరే, సుఖాన్ని ఇచ్చేవి ఆచరణలోకి తెచ్చుకున్నాం.

ఈ సిద్ధాంతంలో అనుభవానికి అతీతంగా ప్రమేయం ఏమీ లేదు. అయినా క్రైస్తవ ఈ సిద్ధాంతానికీ దగ్గర సంబంధం వుండదని మి చాడు. భేదమల్లా ఒకటే అన్నాడు. తన సిద్ధాంతం నైతిక విలువను సమర్థించటానికి హేతు వాదంమీద నిలబడు తుంది. క్రైస్తవమతం రివలేషన్‌మీద ఆధారపడుతుంది.

వ్యక్తికి వున్న స్వాతంత్ర్యాన్నిగురించి తర్జన భర్జన అనాదినుంచీ జరుగుతూవున్నదే. సంఘం అతని స్వాతం

త్ర్యాన్ని ఎంతవరకు హద్దుల్లో పెట్టవచ్చు అనేది అందరినీ బవరపెట్టే సమస్య. ఈ సమస్యను 'స్వాతంత్ర్యం' అనే ్యాసంలో విపులంగా చర్చించాడు మిల్. ఇతరులకు అప ం జరక్కుండా వుండగలందులకు వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ట్టవచ్చు సంఘం. కాని 'అతనికి మంచి' అని ఇతరులు ్చేదానికోసం అతని స్వాతంత్ర్యంలో జోక్యం కలిగిం ాడదు. ప్రాయం వచ్చిన ప్రతివాడికీ తన అభి లను వెలిబుచ్చుకునే హక్కు వుంది. తన అభిప్రా సారం జీవితాన్ని నడుపుకునే స్వేచ్ఛ అతనికి వుంది. విషయం మంచికో చెడుకో తేల్చుకోటానికి స్వేచ్ఛగా ర్శించటం అవసరం. భిన్నాభిప్రాయాలకు వీలుంటేనే న్ని అన్ని కోణాలనుంచీ దర్శించగలం.

అభిప్రాయాలను వెలిబుచ్చటంవరకు తేలికే కాని చరణలో పెట్టేటప్పటికి వస్తుంది చిక్కు. దౌర్జ గేవారినీ, ఇతరులను అందుకు పురికొల్పేవారినీ య్యక తప్పదు. కాని శాంతియుతంగా మార్పును కి మాత్రం పూర్తి స్వేచ్ఛవుండాలి. ప్రజాస్వా ంలో ఒకరిలాగు ఒకరు ఆలోచించాలనే వొత్తిడికి అవకాశం వుంది. దీనివల్ల సమిష్టి మాంద్యం ఎక్కువ అవుతుంది. 'నూతన భావం' అనేది వొకవ్యక్తి మనస్సులోనో కొద్దిమంది వ్యక్తుల మనస్సుల్లోనో ఉద్భవిస్తుంది. అందువల్ల వ్యక్తిత్వంగల వ్యక్తుల వ్యక్తిత్వాన్ని ప్రోత్సహించాలి. వారిలోవున్న విభిన్నత్వాన్ని వృద్ధిచెందించాలి.

మత తత్వశాస్త్రం :

మిల్ మరణానంతరం 'మతాన్ని గురించి మూడు వ్యాసాలు' అనే గ్రంథం ప్రచురించబడింది. అందు 'ప్రకృతి' అనేది మొదటి వ్యాసం. ప్రకృతిలో క్రమత్వం, శక్తివంతుడైన కరుణాసముద్రుడైన భగవ వల్ల సృష్టించబడిన క్రమత్వం కాదు. ప్రకృతి సంతటినీ హింసించి హింసించి, చంపుతుంది. దాన్ని వుడు అదుపులోకి తెచ్చుకొని ఉపయోగించుకోవాలె అనుసరించగూడదు. మానవులకు మంచిని కలిగించట గాని ప్రకృతి లేదు. ఏదన్నా మంచి దానివల్ల జరిగితే మానవ ప్రయత్నం యొక్క ఫలితం మాత్రమే.

ఇక ఈ గ్రంథంలోని రెండవ వ్యాసం యొక్క ప్రయోజనం'. ప్రారంభదశలో నైతికవిలు రానికి మతం ఉపయోగపడిన మాట నిజమే. విలువలకు మూలం భగవంతుడని అనుకోవడంలో వుంది. ఆ ప్రమాదం, వీటికి కారణం భగవంతు డ ఇక వాటినిగురించి చర్చించవలసిన అవుసరం లేకపోవటం మారిన పరిస్థితుల కనువైన మార్పులు తీసుకురావటానికి వీలులేకపోవటం. ఇటువంటి నమ్మకం వుండవలసిన అవుసరం ఇప్పుడు లేదు. అయినా మతం కావాలని అపేక్షపడే గుణం మానవునిలో ఎక్కడో వుంది. సమిష్టి మంచిని ఆదర్శంగా పెట్టుకొని దాన్ని సాధించటానికి మానవుని ఆవేశాలను

మలిపే 'ప్రజలమతం'పై అపేక్షను తీర్చగలుగుతుందా? ర్చగలిగితే మట్టుకు దీనివల్ల రెండు ప్రయోజనాలున్నాయి.

1. వ్యక్తి సుఖానికికాక, నిస్వార్థంతో కూడుకున్న చనలకు ఇది ఊతం ఇస్తుంది.

2. అపరిపక్వమైన ఈ ప్రపంచం పరిపూర్ణుడైన భగ సృష్టించాడనే భ్రాంతికి చోటు లేకుండా చేస్తుంది.

ఈ గ్రంథంలో మూడవ వ్యాసం 'ఆస్తికత్వం' ట్రీస్, కాన్ట్ మొదలైనవారు భగవంతుని అస్తిత్వాన్ని పంచటానికి ఉపయోగించిన హేతువాదాన్ని నిరసిం . అయితే ఆయన ప్రకృతిలో వొక పద్ధతి వుందని రించాడు. కాని ఈ పద్ధతి భగవంతునివల్ల కల్పించ కాదు. ప్రపంచలో ఎంతో అపరిపక్వత ఉంది. భగ న్ని నిర్మిస్తే ఇంత అపరిపక్వత ఎందుకు పదార్థాన్నిగాని, శక్తినిగాని భగవంతుడు సృష్టిం మేకాక, అవి ఆయన ఆధీనంలో లేవు. సాక్ష్యాన్ని పదార్థానికీ, శక్తికీ భగవంతుడు లోబడివున్నట్లు పిస్తాడు. ఆయనశక్తి గొప్పదే. కాని అనంతమైంది కాదు. ఆయన తెలివి మానవుల ఆలోచనలను మించిందే. ఆయన తనతో సహకరించవలసిన మానవుల సౌఖ్యాన్ని గురించి కొంతవరకు ఆలోచించేమాట నిజమే గాని, ఈ పనేకాక ఆయనకు ఇంకా మరికొన్ని పనులున్నట్లు కని పిస్తుంది. ఈవిధంగా ఆలోచించాడు మిల్. మిల్ ఆలో

చించిన ధోరణి విలియం జేమ్సుని బాగా ఆకర్షించినట్లు కనిపిస్తుంది.

౪

కొంతమంది విమర్శకులు మిల్ రచనల్లో సూత్రీ
లేదు అని అంటారు. ఒక చేత్తో ఇచ్చింది రెండవ
ఆయన తీసివేసుకున్నాడు అని అంటారు. ఆయన
నిర్మాణంలో వైరుధ్యాలు కనుపించేమాట నిజమే
ఆయన పరిస్థితి కొంతవరకు కారణం అని మనం చె
వచ్చు. ఆయన బెన్థామ్ నిర్మించిన భావ సౌధానికి వా
డయ్యాడు. ఆయన తండ్రి ఆయనకు ఈ వారసత్
అప్పటయ్యేందుకుగాను తగిన తర్ఫీదు ఇచ్చాడు. కా
సౌధం మిల్‌కి చాలలేదు. గాలీ వెలుతురూ అక్క
నకు తక్కువ అయినై. అయినప్పటికీ ఆ యింటిని
అనువైన మరొక ఇంటిని నిర్మించుకోలేని
ఆయనది. అందుకని తనకు సరిపడకపోయినా అక్క
కాలం వెళ్ళబుచ్చాడు. ఆయనలో కనపడే వై
మరొక కారణం ఆయన మేధాశక్తి, విమర్శనకు అను
గాని, సిద్ధాంత నిర్మాణానికి కాకపోవటం.

ఆయనలోని వైరుధ్యాలకు ఆయన పరిస్థితి కొంతవరకు కారణం అని చెప్పి ఆ పరిస్థితిని ఈ విధంగా వర్ణించాడు, క్యూరిన్; వి; షీల్డ్స్. 'ఆంగ్లేయ రాజకీయ మేధో చరిత్రలో జాన్‌స్టూవర్ట్‌మిల్ ధరించిన పాత్ర విచార కర

మైంది. వైరుధ్యం కలిగిన, పంధొమ్మిదవ శతాబ్దపు మధ్య
గానికి చెందిన ఆలోచనా పరంపరలన్నీ ఆయనలో ప్రతి
బించినై. ఆంగ్లేయ భావచరిత్రలో ఒక సంధిఘట్టం
ఆయన నిలబడడానికి ప్రయత్నించాడు. సుఖం,
ం అనుకునే ఉద్యమంలోకి జన్మించాడు మిల్.
ంలో తీవ్రవాద సంస్కర్తగా రూపొందాడు.
దాటేటప్పటికి ఆయన సంస్కరణాభిలాష కూడా
ంచింది. చివరికి ఆయన ప్రజాస్వామిక విధానానికే
కి అయ్యే స్థితికి వచ్చాడు.' ఈ దశలకు చెందిన
చనలన్నీ ఆయన సిద్ధాంత నిర్మాణంలో కనుపించి
కుల తాడనకు అవకాశాన్నిచ్చినై.



## 'పరిణామ తత్వవేత్త'

# హెర్బర్ట్ స్పెన్సర్

శారీరక విజ్ఞానం పెంపొందకముందు, తత్
పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొని తత్వశాస్త్రాన్ని
దించే వారు కాదు. చాలామంది మార్పులే అం
వారు కాదు. కొంతమంది మార్పుని అంగీకరించినా స్థి
వుండే వొక అనాది పదార్థంనుంచి వొచ్చే ఈ మా
వొక క్రమపద్ధతి వుందని వొప్పుకునేవారు కాదు. లామా
తరువాత డార్విన్ మొదలైనవారు శారీరకశాస్త్రంలో
పిన పరిశోధనల కృషిఫలితంగా తత్వవేత్తలదృష్టి వ
ఈ శాస్త్ర జ్ఞానాన్ని పునాదిగా తీసుకొని వారు భ
నిర్మించటానికి పూనుకున్నారు. అందులో
హెర్బర్ట్ స్పెన్సర్.

స్పెన్సర్ అప్పటికి వివిధ రంగాలలోవున్న జ్ఞానాన్ని సమన్వయపరచి, వొక తత్వశాస్త్రాన్ని సృష్టిం టానికి ప్రయత్నించాడు. అందువల్ల అతని తరువాతవొచ్చిన తత్వవేత్త లందరికీ, కొద్దిగానో గొప్పగానో ఊతం ఇచ్చిన వాడయ్యాడు. ఈయనను గురించి రాధాకృష్ణ పండితులు, 'శాస్త్ర సహాయంతో అనుభవాన్ని వాస్తవిక దృష్టితో చూడటం, తత్వవేత్తల ఆలోచనాశక్తిని దానికి కలిపి వొక

విధానాన్ని సృష్టించటం, దానికి కావలసిన ఆవేశం, మొదలైన లక్షణాలను సమన్వయ పరచగలిగిన శక్తి ఆయనకు అపారంగావుంది,' అన్నారు. స్పెన్సర్‌కి ముందు ఇంగ్లండులో ...చారంలోవున్న తాత్విక ఆలోచనలకు వొక విధానం ...ది వుండేదికాదు. ఈ లోటును స్పెన్సర్ జ్ఞానానికి, ...జ్ఞానం, శాస్త్రజ్ఞానం, తాత్వికజ్ఞానం అనే మూడు ...లుంటాయని చెప్పి, జ్ఞానాన్నంతా క్రోడీకరించి, ...ద్ధతికి తెచ్చి, పూరించాడు. ఆయన దృష్టిలో ఈ ...ంలు వొకదానికంటే వొకటి విశాలవంతమైనవి. ...దానికంటే వొకటి సమన్వయశక్తి హెచ్చుగా కలిగినవి. ...ప్రతికప్పుడు, విశ్వాన్నంతా ఆక్రమించగలిగిన జ్ఞానం ...ం కృషిచెయ్యాలి. దీనికి తగిన ఆవేశం పరిణామ ...వల్ల లభిస్తుంది,' అని ఆయన విశ్వాసం.

స్పెన్సర్ సిద్ధాంతాన్ని రెండు దశలుగా విభజించ... జీవితం ఏకత్వాన్నుంచి అనేకత్వానికి వృద్ధి చెందు...నేది ఇందులో మొదటిది. ఈ దశలో భేదభావం ...ం క్రమ క్రమేణా ప్రస్ఫుటం అవుతయి. ఇక ...వ, పైదశలోని అసమగ్రతను గ్రహించటం. ఈ అసమగ్రతను గ్రహించి స్పెన్సర్ ఈ భేదభావానికి వ్యతిరేకంగా నడుస్తున్న విధానాలను వర్ణించాడు. 'మొత్తం పరిణామంలో విభిన్నత్వం ఏకత్వంవల్లా, వైరుధ్యం ఐకమత్యంవల్లా, అభివృద్ధి నిరోధకతవల్లా సమన్వయ పడతాయి,' అన్నాడు.

ఈ దృష్టితో ఆయన తన తాత్విక సిద్ధాంతాన్ని నిర్మించాడు. ఈ సిద్ధాంతం, పరిణామం ఏవిధంగా అభివృద్ధి చెందబోతూవుందో సూచిస్తుంది. అంతవరకు నిజమే- కాని అలా ఎందుకు అభివృద్ధి చెందాలి అనే ప్రశ్నకు జవా చెప్పదు.

## 2

హెర్‌బర్ట్ స్పెన్సర్ 1820 లో డెర్బీలో జన్మిం అతని తండ్రి తీవ్రవాది. మానవశక్తికి మించిన ఏశక్తినీ, వంటి క్లిష్టపరిస్థితుల్లో నయినా అతను అంగీకరించేవాడుకా అతను 'ఏ సమ్మతమూ, ఏ మతమూ లేనివాడని' సన్నిహితు లొకరు అతన్ని వర్ణించారు. అతను తన కు రుని లాగు చాలా వ్యక్తిత్వం కలిగినవాడు. 'ఎవరి వొగ్గని వాడు,' అని తన జీవిత చరిత్రలో తన గురించి స్పెన్సర్ వ్రాసుకున్నాడు. "మా అమ్మ ప్రశ్న అర్థం కాకపోతే మెదలకుండా వూరుకునేవా 'ఆ ప్రశ్న ఏమిటి?' అని తిరుగుప్రశ్న వేసేవా దీని నిరర్థకత తెలిసికూడా జీవితపర్యంతం ఇలా గేపు

స్పెన్సర్ చేసిన తిరుగుబాటునూ, పట్టుదలనూ మనం పరికించినప్పుడు 'తండ్రికి తగినబిడ్డ' అని అనుకోవలసివస్తుంది.

స్పెన్సర్ 14 వ సంవత్సరంవరకూ చదువులేకుండానే వున్నాడు. పదమూడవఏట అతనిని చదువుకోసం పినతండ్రి వద్దకు పంపారు. కాని కొద్ది కాలంలోనే అతను అక్కడి

నుంచి పారిపోయాడు. అతను సగర్వంగా తన చదువుకురించి:
నా బాల్యంలోగాని, యౌవనంలోగాని నేను వాక్య
శ్లేషపాఠంకూడా చదువుకోలేదు. వ్యాకరణం అంటే
టో నా కిప్పటికీ తెలియదు.' అని చెప్పుకున్నాడు.
యోపడిలో అతను 'ఇలియడ్' చదవటానికి ప్రయ
ాడు. కాని ఆరు భాగాలకు పైన చదవలేక పోయా
)వరిదాకా చదివిందానికంటే ఎంత డబ్బు కావాలంటే
డబ్బు ఇచ్చి తప్పించుకోవటం మంచిది అనుకున్నా
అతను సైన్సువిూద ఏ పుస్తకమూ పూర్తిగా చదవ
ని అతని సెక్రెటరీ చెప్పాడు. ముప్ఫయ్యో సంవత్సరం
సూ తత్వశాస్త్రాన్ని గురించి అతను ఆలోచించనేలేదు
డు కాన్ట్‌ని చదవటానికి ఉపక్రమించి, అతను
?, పదార్థాలుకాక ఇంద్రియ జ్ఞానానికి సంః
అని చెప్పటం చూచి, అతను మతిహీను

జ్ఞానాన్ని ప్రోగుజేసేవాడు. క్లబ్ కి వొచ్చే పత్రికలనుంచి
సేకరించేవాడు. తనకు కావలసిన వొక్క విషయాన్నికూడా
దాటి పోనిచ్చేవాడు కాదు. తన ముఖ్యసూత్రం పరిణా
అది ముందు నిర్ణయించుకున్నాడు. ఇక దాని చుట్టూ
వలసిన అల్లికకు కావలసిన సామగ్రినంతా జేర్చి
పూనుకున్నాడు. అతని మెదడు తనకు కావలసిన
లను ఆకర్షించే అయస్కాంతంగా పని చేసింది.
విషయాలను అందినట్లు, అవి తరగతులవారీగా కు
పోసింది. బకిల్ ని గురించి వ్రాస్తూ స్పెన్సర్, 'అతను
ఉపయోగించుకోగలిగిన వానికంటే ఎక్కువ ప్రోగుజేశా
వాశాడు. మనం స్పెన్సర్ ని గురించి, 'అతను
వానికంటే ఎక్కువ ఉపయోగించుకున్నా
చు'.

సాధనను వినియోగిస్తోంది. మనలను అంధకారంలోకి దింపు
పంది. కాని దీనికి మించిన స్వభావం, మూలవస్తువు, పర
్యం ఏదోవుంది. ఇదే మనస్సుకే స్ఫురిస్తుంది. అదేమిటో
తం తెలియదు.

ఈ దృష్టితో చూస్తే శాస్త్రాన్నీ మతాన్నీ సమన్వయ
ం అసంభవమైన విషయంగా పరిగణించటానికి
సత్యం విరుద్ధభావాలను సమన్వయ పరచటంలోనూ
టంలోనూ లభ్యమౌతుంది. శాస్త్రం, తన నియ
దృగ్గోచరం అయ్యేవాటికీ, వాటి సంబంధాలకు
మే వర్తిస్తాయని అంగీకరించాలి, మతం నమ్మకాలను
బద్ధం చేసే ప్రయత్నం తనది అని అంగీకరించాలి.
తత్వాన్ని విస్తృత పరచబడిన మానవునిగాగానీ,
త్యాలనుచేసే రక్కసిగాగానీ, వర్ణించటం మాను
శాస్త్రం తనకు అందనిది లేదని చెప్పరాదు.
మే సర్వం అనుకోగూడదు. మనస్సూ, పదార్థం
స్తువుయొక్క రూపాలే అని చెప్పుకోవాలి.' ఈ
లోచిస్తే మతం, శాస్త్రం — ఈ రెండూ మాన
అవసరం అవటమేకాక, సమగ్రమైన వొక
విశిష్టసిద్ధాంతం ఆచరణలోకి రావటానికీ, విభిన్నంగా కనపడే
అనేక భావాలు వొక గొడుగు క్రిందకు రావటానికీ ఉపక
రిస్తాయి అని అంగీకరించక తప్పదు.

ఇదే స్పెన్సర్ ప్రత్యేకత. వివిధశాఖలు ప్రోగుజేసిన
జ్ఞానాన్ని సమన్వయ పరచటానికి అతను అహర్నిశలూ

పాటుబడ్డాడు. 1858 లో అతను తాను వ్రాసిన వ్యాసాలను పునర్ముద్రణకు దిద్దుకుంటూ వుండగా పరిణామ సిద్ధాంతాని శాస్త్ర శాఖలన్నిటికీ వర్తింప జెయ్యవచ్చునే భావం త క్కున మెరిసింది. పరిణామ సిద్ధాంతం, జాతి భేద తరగతులనేకాకుండా, గోళాలనూ, అంతస్థులనూ, స రాజకీయ చరిత్రనూ, నైతిక విలువలనూ, రససృష్టినీ నిర్వచించగలుగుతుందనే నమ్మకం కలిగి, దానిని టానికి తన జీవితాన్ని అంకితం చేశాడు.

అతడు ధనవంతుడు కాదు. కానప్పటికీ జీవి గురించి పెద్దగా ఆలోచించేవాడుకాదు. 'కాలక్షేపం చే లని నాకు లేదు. దానినిగురించి పెద్దగా ఆలోచించవ ఏమీ లేదు' అన్నాడు. 1862 లో అతను తన గ్రంథమైన 'ప్రాథమిక సూత్రాల'ను ప్రచు డార్విన్ వ్రాసిన 'జాతులపుట్టుక' అనే గ్రంథం గ్రంథంమీదా, పెద్ద దుమారం రేగింది. అంతకు అభిమానులను చాలామందని, ఈ గ్రంథ ప్ర స్పెన్సర్ కోల్పోయాడు. కాని స్పెన్సర్ మాత్రం తన ప మానుకోలేదు. మిత్రుల సహాయంతో కొనసాగించాడు. నలభై సంవత్సరాలు నిరంతరకృషిచేసి, తన 'తాత్విక సమ న్వయం' అనే గ్రంథ ప్రచురణ పూర్తి చేశాడు.

౪

'ప్రాథమిక సూత్రాలు'తో స్పెన్సర్ పేరు నలుదిశలా వ్యాపించింది. ఈ గ్రంథాన్ని పెక్కు యూరోపియన్ భాషల్లోకి తర్జుమా చేశారు. రష్యా భాషలోకి కూడా అనువదించబడింది. అతని భావాలు, రాజకీయ సాంఘిక రంగాలనే కాకుండా సాంస్కృతిక రంగాన్ని కూడా కదిలించినై. వీటి ప్రభావం, సారస్వత రంగంలో స్వాభావిక వాదానికి దోహదం చేసింది. 1869 లో ఈ గ్రంథం ఆక్స్‌ఫర్డులో పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడటం అతనికే ఆశ్చర్యం కలిగించింది. 1870 సంవత్సరం నుంచీ ఆర్థికంగా కూడా అతని గ్రంథాలు అతనికి లాభాన్ని చేకూర్చిపెట్టినై. కాని విచిత్రం ఏమిటంటే అతనికి పేరు ఎంత వేగంగా వచ్చిందో అంత వేగంగానూ మరుగున పడింది. అన్ని తరగతులవారూ అతన్ని క్రీగంట చూడ నారంభించారు. శాస్త్రకారులు అతని శాస్త్రజ్ఞానాన్ని కించపరిచారు. అతను చేసిన సేవను గుర్తించకుండా తప్పులను మాత్రమే బయట పెట్టారు. మతకర్తలు అతన్ని దుష్ప్రచారానికి గురిచేశారు. కార్మిక రాజకీయ వేత్తలు, సోషలిజంమీదా కార్మిక సంస్థల రాజకీయాలమీదా అతను వెలిబుచ్చిన అభిప్రాయాలకు కోపోద్రిక్తులయ్యారు. ధనవంతులు, సోషలిజంమీద అతను చేసిన వ్యతిరేక ప్రచారాన్ని మెచ్చుకుంటూ, అతని సిద్ధాంతాలకు మూలసూత్రమైన అపనమ్మకాన్ని నిరసించారు. మొత్తం మీద అందరూ ఏదో వొక రూపంలో అతన్ని విమర్శిం

చారు. అతను చాలా నిజాయితీపరుడు అవటంవల్ల ప్రతి తరగతినీ ఏదో వొక సందర్భంలో బాధపెట్టాడు. అదృష్టి మంచిలో చెడూ, చెడులో మంచీ వుంటుందని చెప్పే అతని సిద్ధాంతలోనే వుంది. కార్మికులనుగురించి దుర్భర పరిస్థితులకు జాలిపడుతూ, వారే యజమానులైతే అప్పటి యజమానులు ప్రవర్తించినట్లే ప్రవర్తిస్తారనటం ఇద్దరికీ కాకుండా పోయాడు. అదేవిధంగా స్త్రీలు పురుషులకు బానిసలుగా వున్నారని చెపుతూ, వారి శాఖల్లో వారూ పురుషుల్లాగే ప్రవర్తిస్తారన్నాడు. పర్యవసానం, అతను వృద్ధాప్యంలో ఏకాకిగా జీవితంగడపవలసి రావటం. వృద్ధాప్యంలో అతను మతసమ్మకాలూ, రాజకీయోద్యమాలూ మేధస్సుకు సంబంధించని అవుసరాలమీదా, ఆవేశాల మీదా నిర్మించబడ్డవి - అని సంతృప్తిపడి, ప్రపంచం నడకను సాక్షీభూతంగా చూస్తూ వూరుకునేస్థితికి వొచ్చాడు. అతని పుస్తకాలదారి పుస్తకాలదీ, ప్రపంచం దారి ప్రపంచానిదీ అయింది.

1903 లో అతని జీవయాత్ర సమాప్తి అయింది.

అన్ని తత్వశాస్త్రాల్లో వున్నట్టే, స్పెన్సర్ నిర్మించిన తత్వశాస్త్రంలో కూడా లోట్లు లేకపోలేదు. అతని తత్వశాస్త్రంలో వున్న లోటు ప్రపంచ పరిణామాన్ని యాంత్రికంగా వర్ణించే అన్నితత్వశాస్త్రాల్లోవున్న లోటే. ఈలోటు తరువాత ప్రసిద్ధి చెందిన హెన్రీ బెర్గ్‌సెన్ 'సృజనాత్మక పరిణామం' అనే తనగ్రంథంలో విశదీకరించాడు. 'స్పెన్సర్

వాస్తవికతను వర్తమాన రూపంలో చూస్తాడు. దానిని ముక్కలక్రింద విరుస్తాడు. గాలిలోకి ఎగురవేస్తాడు. మళ్ళీ ముక్కలను జతపరుస్తాడు. వాటి చైతన్యశక్తిని వ్యర్థ స్తాడు. ఈ పనంతా చేసి ఏదో క్రొత్త చిత్రాన్ని వాళ గీశాను అనుకుంటాడు. నూతనసృష్టి చేశాను అను ంటాడు' అన్నాడు. ఇది పరిణామశాస్త్రం కావచ్చు. పరిణామతత్వం కాదు. తత్వవేత్త జీవితోద్గమనాన్ని నిర్వ చించాలి. జీవితం లోతును అందుకోవాలి. జీవిత ప్రవాహం లోకి చొచ్చుకుపోవాలి. దానితో ఏకత్వం పొందాలి. అదే తానవ్వాలి.

## 'అతీతమానవ తత్త్వవేత్త'

## ఫ్రెడరిక్ నీష్షే

నీషేని గురించి తెలుసుకునేముందు ఆర్థర్ ఐ. నార్‌ను గురించి తెలుసుకోవటం అవసరం. ఎందుకంటే నీషే నిర్మించిన భవంతికి పునాది షోపనార్ సిద్ధాంతమే.

షోపనార్ సిద్ధాంతం, హెగెల్ తత్వశాస్త్రంలోని హేతువాదానికి వ్యతిరేకంగా నిర్మింపబడిన సిద్ధాంతం. షోపనార్‌కి హేతువాదం మీదకంటే మానవుని సంకల్పశక్తి మీద ఎక్కువ నమ్మకం. హేతువాదానికీ సంకల్పశక్తికీ చాలా తేడా వుందని చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను. హేతువాదానికి పునాది, పరిణామంలోని అవిచ్ఛిన్నత ఐతే, సంకల్ప శక్తికి పునాది విచ్ఛిన్నత. హేతువాదం శాంతినీ, సమన్వయాన్నీ కోరితే, సంకల్ప శక్తి పొందటంలోనూ, గందరగోళంలోనూ సంతృప్తిని పొందుతుంది. హేతువాదం ఘనీభవించిన ప్రవృత్తి కలిగింది. సంకల్పశక్తి నిత్యపరిణామానికి సంబంధించింది. ఈ విధంగా వాదించి సంకల్పశక్తి యొక్క ప్రాముఖ్యాన్ని నిరూపించటానికి ప్రయత్నించాడు షోపనార్.

షోపనార్ వాదంలో కొంతవరకు నిజం లేకపోలేదు. హేతువాదంలో వున్న సంకుచితత్వాన్ని మానవుని సంకల్ప

శక్తి కొంతవరకు సరిదిద్దగలుగుతుంది. పూర్తిగా హేతు వాదం మీద ఆధారపడిన సిద్ధాంతం స్వరూపం ఎప్పుడూ సమగ్రంగానే వుంటుంది. హేతువాదానికి అందని జీవిత ాలనుకూడా కలుపుకోగలిగితేతప్ప ఈ అసమగ్రతను చలేము. ఇంతవరకు నిజమే. కాని ఈ సంకల్పశక్తి ది' అని చెప్పి తన సిద్ధాంతానికే తాను అపచారం ుకొన్నాడు షోపనార్. ఈ సంకల్ప శక్తికి ప్రయోజన మనేది లేదు అని చెప్పటంలో మానవులలో నిస్పృహ రేగటం సహజం. ఇందుకు తోడ్పడ్డాడు షోపనార్.

'సంకల్పంగా భావంగా ఈ ప్రపంచం' అనే గ్రంథంలో తాను ప్రచారం చేస్తున్న సంకల్ప శక్తినిగురించి ఆయన ఈ విధంగా వ్రాశాడు:

'ఈ సంకల్ప శక్తి అనే దానికి జ్ఞానమనేదిలేదు. ఇది అతివేగంగా ముందుకు తోసుకుపోయే ఒక గుడ్డిశక్తి మాత్రమే. ఈ శక్తి స్వయంపోషకమైంది. ఈ ప్రపంచం యొక్క సారమిది; జీవితం, మన కన్నులకు కనిపించే ఈ ప్రపంచం, దీని ప్రతిబింబాలే. కాబట్టి శరీరాన్ని నీడ అనుస రించినట్లు సంకల్ప శక్తిని జీవితం విడవకుండా అనుసరిస్తూ వుంటుంది. సంకల్పశక్తి వుంటే జీవితముంటుంది; ప్రపంచ ముంటుంది. బ్రతకాలనే సంకల్పానికి జీవితమనేది ఎప్పుడూ ముడిపెట్టుకొనే వుంటుంది. అందువల్ల బ్రతకాలనే సంకల్పం వున్నంతకాలం బ్రతుకును గురించి విచారపడవలసిన అవసరం లేదు-మృత్యువు వచ్చి ఎదురుగా నిలబడినాసరే'

దీనినిబట్టి మనం తేల్చుకోవలసిందేమిటి? జ్ఞానం లేని గుడ్డిశక్తి అనాది వాస్తవికత అనీ, అదే ప్రాణంగానూ జ్ఞానంగానూ రూపాలు ధరిస్తూ వుందనీ షోపనార్ భావిం డని మనం తేల్చుకోవలసి వుంటుంది. షోపనార్ ని చిన ఈ వాస్తవికతకీ మామూలుగా అందరూ అ భౌతిక శక్తికీ తేడా యేమీ వున్నట్లు కనిపించదు. అం ఇటువంటి అజ్ఞానపూరితమైన శక్తికి జ్ఞానం ఎలా వచ్చిం ఎక్కడనుంచి వచ్చిందీ అనే ప్రశ్న వుండనేవుంది. భౌతిక వాదాన్ని ఎక్కడికక్కడ ఎదుర్కొనే ప్రశ్న ఇదే. షోపనార్ ఈ ప్రశ్నకు జవాబుగా: 'ఈ శక్తి అన్ని పదార్థాలలోనూ వుండి పనిచేస్తూ ఉంటుంది' అన్నాడు. ఇది పదార్థానికి విడిగా ఒకశక్తి వుండి, దాన్ని నడిపిస్తూ వుంది అనే దానికి జవాబు కాగలదేమో కాని, అజ్ఞానంగా ఉన్న శక్తికి జ్ఞానం ఎలా వచ్చిందీ అనే ప్రశ్నలకు జవాబు కానేరదు. అందువల్ల షోపనార్ చెప్పిన జవాబు విమర్శకులకు తృప్తిని ఇవ్వలేక పోవటంలో ఆశ్చర్యమేమీ లేదు.

నీషే, షోపనార్ వాదంలో వున్న బలాన్నీ, బలహీనతనూ రెంటినీ గ్రహించాడు. ఆ బలహీనతను నిర్మూలించి, సమగ్రమైన వాదాన్ని సృష్టించటానికి ప్రయత్నించాడు. షోపనార్ చెప్పిన సంకల్పశక్తి యొక్క ప్రాముఖ్యత నంగీకరించి, ఈ సంకల్పశక్తి గుడ్డిది అనే భావాన్ని మాత్రం త్రోసిపుచ్చాడు అలాచేసి, షోపనార్ లేపిన నిస్పృహనుంచి తన సిద్ధాంతాన్ని తప్పించాడు.

ఈ ఇద్దరి తత్వశాస్త్రాలకూ వున్న పోలికలనూ, భేదా
లను శిశిర్‌కుమార్ మైత్రా ఈ విధంగా వర్ణించాడు: 'నీషే
తత్వశాస్త్రం షోపనార్ సృష్టించిన స్వేచ్ఛావాదాన్ని పునా
దిగా తీసుకొని అభివృద్ధిచెందిన తత్వశాస్త్రం. షోపనార్
లో వున్న నిస్పృహ ఇందులో లేదు. షోపనార్‌వలె
సంకల్పమనేది దుష్టమైనదని అంగీకరించక, సంకల్పాన్ని
ఏవిధంగా అణచటానికి ప్రయత్నించినా అట్టి ప్రయత్నం
దుష్టమైందని భావించేవాడు. నీతినీ, మతాన్నీ అతను దుయ్య
బట్టడానికి ముఖ్యకారణం అవి - మానవుని సంకల్పశక్తికి
ప్రాముఖ్యతను ఇవ్వలేకపోయినవనే. షోపనార్‌కూ ఈయ
నకూ మరొక ముఖ్యభేదంకూడా వుంది. షోపనార్‌వలె నీషే
ఈ సంకల్పశక్తిని ప్రపంచానికంతటికీ చెందినదానిగా పరిగ
ణించక, వ్యక్తిగతమైన దానిగానే పరిగణించాడు. నీషే
తత్వశాస్త్రంలో వున్నది వ్యక్తే—అనవరతం పోరాడుతూ,
శాసిస్తూవుండే వ్యక్తే. అంటే సంకల్పశక్తితో కూడుకొన్న
వ్యక్తి అన్నమాట-సాంప్రదాయంతో, అదృష్ట దురదృష్టా
లతో నిత్యం పోరాటం సలిపే వ్యక్తిఅన్నమాట—తన్ను
తాను అధిగమించి అతీత మానవుడుగా రూపొందే వ్యక్తి
అన్నమాట.'

౨

నీషే అక్టోబరు 15, 1844 వ సంవత్సరంలో జన్మిం
చాడు. అతను బాల్యంనుంచీ చాలా అనారోగ్యకరమైన
మనిషి. బలహీనమైన కండ్లు, విపరీతమైన తల నొప్పులూ

అతనికి తండ్రినుంచి సంక్రమించినై. ఒకరాత్రి నీషే తం ఇంటిమెట్లెక్కుతూ అకస్మాత్తుగా తూలి వెనుకకు పడ్డా అతని తల నేలకు బలంగా కొట్టుకుంది. అప్పటినుంచీ మెదడు పక్షవాతానికి లోనయింది. ఈ స జరిగిన సంవత్సరంలోగానే అతడు మరణించాడు అప్పటికి ఏడేండ్లవయసు. ఆ వయసులోనే ఈ విషాద నాటకంలోని రంగాలనన్నిటినీ భయంతో వణుకుతూ చూశాడు. క్రిందపడి మూర్ఛపోయిన తన తండ్రిని గదిలోకి మోసుకొనివెళ్ళి పరుండబెట్టటం, నెలలతరబడి ఆయన పడిన బాధా, క్రమక్రమేణా ఆయన మెదడు ముక్కలుక్రింద నిడి పోవటం, మరణం, తదనంతరం కర్మకాండా, అంతా ఈ ఏడేండ్ల కుర్రవాడు కలవరపడే మనస్సుతో చూచాడు.

తండ్రి మరణానంతరం నీషే తల్లీ, ముత్తవతల్లీ, ఇద్దరు మేనత్తలమధ్య పెరిగాడు. ఈ పెంపకం పెద్దవాడైన తర్వాత అతనుఏకాంతవాసాన్ని అభిలషించటానికీ, తేలికగా స్నేహాలను చేసుకోలేకపోవడానికీ, మానవుని సంకల్పశక్తి మీద అతను వుంచిన ధృఢ విశ్వాసానికీ ఎంతవరకు దోహదం చేసిందో చెప్పటం కష్టం.

నీషే కవిత్వం, సైన్సు, గ్రీక్, లాటిన్ మొదలైన వన్నీ క్షుణ్ణంగా చదివాడు. అతను చదవనిది ఒక్క జీవితం మాత్రమే. ఈ పుస్తకాల చదువుతో అతని కళ్ళు మరీ బాధపెట్టసాగినవి. కాసేపుచదివి ఎంతోసేపు బాధపడేవాడు. చివరచివరికి వెలుతురునే చూడలేని స్థితికి వచ్చాడు నీషే.

సూర్యరశ్మి సోకినంతమాత్రానే నీషే. శరీరం నొప్పులతో ...ట్లిపోయేది. నిశిరాత్రి, ఏకాంతవాసం అతనికి ప్రాణహితులైనవి. ఈ అనుభవంతో అతనికి నిగ్రహాన్ని ...రం చేసే మతంమీద, విశ్వాసంమీద నడిచే జీవితం ... నమ్మకం పూర్తిగా సడలిపోయింది. మహర్షులు ...వుని ఆవేశాలను నిరసించారు, నిజమే. ఈ మహర్షులు అప్పనిసరియైన దానిని ఒకసుగుణంక్రింద ప్రచారం చేశారనుకోవటానికి అవకాశం లేదా అని ఆలోచించాడు నీషే. ఈ శరీరం తన పనులను తాను సక్రమంగా నిర్వర్తిస్తున్నంత కాలం దాన్ని తుచ్ఛమైందని ఈసడించటం దేనికి? అసలు 'పాపం' అనే భావంకూడా కొంతమంది అనారోగ్య పంతులు స్పష్టంగా, మిగిలినవారు గుడ్డిగా అనుసరిస్తున్నారేమో! మనం అనుకొనే నీతి వట్టి మోసమేనేమో! జీవిత లక్ష్యం సుఖాన్ని పొందటమైనప్పుడు బ్రతకటానికి సిద్ధపడటమంటే ఈ జీవిత స్వభావాన్ని అంగీకరించటమేకదా? అయితే, మతం దీని కనుకూలమైన పాత్ర నిర్వహిస్తూఉందా? లేదు. జీవితాన్ని అనుభవించమని అది చెప్పదు. పైగా రద్దుచేసుకోమని అది బోధిస్తూఉంది. మతం యొక్క ఈ స్వభావం గమనంలోకి వచ్చేటప్పటికి నీషే గుండెల్లో అగ్నిజ్వాలలు రగుల్కొన్నవి. అతను మతానికి ఎదురు తిరిగాడు.

జీవితం అనుభవించవలసిందే. ఈ అనుభవం ఎలా సంభవం? మతం మానవునిలోవున్న బలహీనతలను సమర్థిస్తూ ఉంది. సమర్థించటమేకాదు, వాటి సుగుణాల క్రింద

ప్రచారం చేస్తూఉంది. ఈ బలహీనతలను రూపుమాపి జీవితాన్ని హృదయ పూర్వకంగా అనుభవించాలంటే యేం చెయ్యాలి? మానవుడు సంకల్పశక్తిని వృద్ధిచేసుకోవాలి అనే నిర్ణయానికి వచ్చాడు నీషే. గట్టిగా సంకల్పిస్తే మానవుడు చెయ్యలేనిది లేదు. ఈ సంకల్పశక్తివల్ల తాను తలనొప్పులనూ, శారీరక బలహీనతలనూ అన్నిటినీ మాపుకొని జీవితాన్ని పూర్తిగా అనుభవించే సామర్థ్యాన్ని పొందవచ్చు.

ఈవిధంగా ఆలోచించటం ప్రారంభించాడు నీషే. అప్పుడప్పుడే ప్రపంచంలో అక్కడక్కడ పొడచూపుతున్న భావాలు అతని ఆలోచనలకు బలాన్ని చేకూర్చినై. సంకల్ప బలంవల్ల జబ్బులను నయం చేసుకోవచ్చుననే సంస్థలు అప్పుడే అమెరికాలో ప్రచారంలోకి వచ్చినై. ఇక, మన దేశంలాంటి దేశాల్లో సంకల్పబలానికి మహత్తరమైన శక్తు లున్నాయనే నమ్మకం అనాదినుంచీ వుండనేవున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఆపి, మరణంలోకీ, సంకల్ప బలంతో మళ్ళీ జీవితంలోకీ అనేకమంది యోగులు నిత్యం ప్రయాణం చేస్తూనే వున్నారు. జర్మనీలో షోపనార్, ఇంతకుముందు మనం చెప్పుకొన్నట్లు, ఈ భావాలమీదే తన తత్త్వశాస్త్రాన్ని నిర్మించాడు. షోపనార్ వర్ణించిన సంకల్ప శక్తిని తీసుకొని, అతనికివలె ఒక వ్యతిరేక సిద్ధాంతాన్ని కాక, నిర్మాణాత్మకమైన, ఉత్సాహపూరితమైన ఒక సిద్ధాంతాన్ని సృష్టించాడు నీషే — 'సంకల్ప శక్తిని మరణించటానికి కాదు, జీవించటానికి ఉపయోగించాలి

మానవుడు. బాధలనుంచి తప్పించుకోటానికి మరణాన్ని రుకోవడం పిరికితనం. ఎన్ని బాధలున్నా బ్రతకాలని రుకోవటమే గొప్ప' అన్నాడు. ఇటువంటి సంకల్పశక్తి ని, తన్నుతాను అధిగమించేటట్లు చేస్తుం దనుకోవ గానీ, భగవంతునిగా మారుస్తుందని అనుకోవటంలో ఆశ్చర్య మేముంది?

నీషేకు ఈ విశాల ప్రపంచంలో స్నేహితులనేవారు లేరు. ఒక్క వేగ్నర్‌తోమాత్రం కొన్నాళ్లు అతను స్నేహం చేశాడు. అదికూడా మధ్యలోనే తెగిపోయింది. అందుకనే – 'జీవించివున్నవారిలో గానీ మరణించిన వారిలో గానీ నాకు ఏ కాస్త సంబంధ మున్నవారూ కనిపించటం లేదు' అని అన్నా డతను. అతన్ని అనవరతం సాకుతూ వచ్చిన సోదరి వివాహం చేసుకొని వెళ్ళిపోవటంతో నీషే ఏకాంతవాసం ప్రారంభమయింది. జబ్బులవల్లా, ఏకాంత వాసంవల్లా నీరసించిన అతని మెదడు క్రమక్రమేణా స్వాధీనం తప్పిపోసాగింది. జనవరి 3, 1889 లో అతన్ని ఉన్మాదావస్థ ఆవహించింది. దేవతలకు ఎదురుతిరిగిన నీషే, దేవతల చలేకపోయాడు. ఉన్మాదావస్థలో పది ము ఈడ్చి కన్ను మూశాడు.

లందరూ అతనికి ముఖ్యంకాదు. తన్ను తాను అధిగమించ
గలిగిన శక్తిగల మనిషే అతనికి ముఖ్యం. చరిత్ర అం
అది సామాన్యమానవుని చరిత్ర కాదు; మేధావంత
చరిత్రే చరిత్ర. సామాన్యమానవుల సృష్టి ఏ పది పన
గురు మేధావంతుల సృష్టికి ఉపకరించడానికో జరు
అంతకంటే దానికి ప్రయోజనం లేదు. కాబట్టి:
వుడు ఒక మజిలీమాత్రమే; అసలు ఆదర్శం అతీత మా
వుడు' అంటాడు నీషే. జరత్రుష్ణ అనే గ్రంథంలో 'మాన
వుడు వంతెన మాత్రమే అయి, గమ్యస్థానం కాకపోవటమే
అతని గొప్పతనం' అన్నాడు. 'మానవునిలోని ఆకర్షణకు
అతను అనిత్యుడవటం, క్షీణదశలో వుండటం ముఖ్య
కారణం' అనికూడా అన్నాడు. మరొకచోట 'మానవుడు
అధిగమించవలసినవాడు' అన్నాడు. అందుకనే అతను
అతీత మానవుణ్ణి మెరుపుతీగతో పోల్చాడు. సామాన్యతను
రూపుమాపి ఈనాటి సంఘానికి వెలుతురు నిచ్చే శక్తి అతీత
మానవుని కున్నదని అతని ఉద్దేశ్యం.

సర్వనాశనంనుంచే నూతనసృష్టి జరగగల... నీషే
వాదం. బలహీనులను బాగుపరచడ మనే

బానిసలకు వర్తించే నీతి శాస్త్రంలోవి. యజమానులకు ర్తించే నీతి శాస్త్రంలో వీటికి స్థానం లేదు. యజమానులు ువలను సృష్టించేవారే కాని అనుసరించేవారు కాదు. ంగీకారంకోసం వీరు వేచి ఉండవలసిన అవసరం ఈ తెగకు ... క్తి శాసనకర్త. 'నాకు ుకరమైంది ... ంగా అపాయ కరమైనదై ండాలి' అని భా ... తత్వవేత్తని గురించి శిశిర కుమార్ మైత్రా ... ంగా వ్రాశాడు; 'నీషే నీతి శాస్త్రాన్ని నిర్మూలి ... టంతోనే ఆగలేదు. అధికారంలోకి రావాలననే సంకల్పం మీద ఆధారపడిన అతని సిద్ధాంతం తర్కాన్నీ తాత్వికదృష్టినీ కూడా రూపుమాపింది. అతను మంచికీ చెడుకీ వున్న భేదాన్ని నిర్మూలించినట్లే; సత్యానికీ అసత్యానికీ వున్న భేదాన్నికూడా రూపుమాపటానికి ప్రయత్నించాడు. కాని, ఇది సాధ్యమా? ఎవరివల్లా అయ్యేపని కాదు. అందుకని, ఆనాటికి సత్యమనుకున్నదానినీ, మంచి దనుకొన్నదానినీ అపహాస్యం చేసి, అధికారంలోకి రావలె ననే సంకల్పం సత్యమైందనీ, అతీత మానవత్వం మాత్రమే చిదనీ చెప్పాడు.'

౪

క్లెర్జీ రెట్, నీషే తాత్వికవ్యాసంగాన్ని మూడు దశలుగా విభజించి చర్చించాడు. ఈ విభజన ననుసరిస్తే నీషే యొక్క పరిణామం సుబోధకం కావటమేకాక, అతన్ని సమగ్రంగా అర్థం చేసుకోవడానికి వీలవుతుంది.

మొదటి దశ :

తత్వవేత్తగా నీషే తన జీవితాన్ని 1872 లో ప్రకటించిన 'విషాదగాథ పుట్టుక' అనే గ్రంథంతో ప్రారంభించాడని చెప్పుకోవచ్చు. ఈ గ్రంథంలో గ్రీకు జీవితం, స్వాతం యొక్క అంతర్గత ప్రాముఖ్యతను నీషే చర్చి గ్రీకు జీవితంలో రెండు విరుద్ధ లక్షణాలు కనిపిస్తాయి. ప్ కాలనే సంకల్పం ఇందులో మొదటిది. ఇది ఆ శాలకూ, ఉద్రేకాలకూ దేనికీ కట్టుబడకుండా ఉండాలనే ఆకాంక్షకూ దారితీస్తుంది. ఇక రెండవ లక్షణం: ప్రశాంతంగా, క్రమబద్ధకంగా, హేతుయుక్తంగా ఆలోచించటమనేది. ఈ లక్షణం ప్రకోపించినప్పుడు గ్రీకులు పూర్తిగా బుద్ధి ప్రయత్నంమీాదా, గత చరిత్రను పునశ్చరణ చేయటంమీాదా, వాస్తవికత్వానికి దూరమైన ఊహల మీాదా ఆధారపడుతూ ఉండేవారు. అప్పుడు కవులుగానీ, కళాకారులుగానీ, కర్మప్రియులుగానీ, వీరిలో కలిసివచ్చేవారు. ఈ రెండులక్షణాలు కలిసి వృద్ధి చెందినప్పుడే ఈజాతిలో రకరకాల ప్రముఖులు ఉద్భవించారు. ఇటువంటి సమన్వయం తననాడుకూడా అవసరమని నీషే భావించాడు. ఈ సమన్వయం తన మిత్రుడైన రిచ్చర్డ్ వాగ్నర్ ద్వారా సంభవమవుతుం దనికూడా ఆశించాడు. కాని, అలా జరగలేదు.

ఇక, ఈ దశలో వ్రాసిన, 'యాదృచ్ఛిక యోచనలు' అనే రెండవ గ్రంథంకూడా ఇటువంటి దృక్పథాన్నే బలపరిచింది.

రెండవ దశ :

ఈ దశ 1878 తో ప్రారంభమై 1882 తో అంతమైంది. ఈ దశలో 'మానవత్వం, అంతా మానవత్వం' 'వేకువ పొడుపు', 'ఆహ్లాదంతో కూడిన వివేకం' మొదలైన గ్రంథాలు వ్రాశాడు నీషే. ఈ గ్రంథాలలో ఆనాటి శాస్త్ర పరిశోధనలను మెచ్చుకొన్నాడు. కాని, అపనమ్మకానిదే అగ్రతాంబూలం. 'పరిపూర్ణ సత్యమనేది, నీతి అనేది లేదు. మత సిద్ధాంతాలను త్రోసి వెయ్యాలి. ఆ యా పరిసితుల్లో ఏ సిద్ధాంతాలు ఉపయోగపడుతవో ఆ సిద్ధాంతాలే మంచి సిద్ధాంతాలు; వాటినే మానవుడు అనుసరించాలి.' ఈ గ్రంథాలలో ఇటువంటి భావాలను వెలిబుచ్చాడు నీషే.

అతనికి క్రైస్తవమత మంటే నమ్మకముండేది కాదు. భగవంతుడు లేడని, అందువల్ల భగవంతునిలో నమ్మకముంచటంగానీ ప్రార్థించటంగానీ అపచారమనీ అతను చెప్పాడు. "ఏసుక్రీస్తు ప్రచారంచేసిన క్రైస్తవ మతమే చెడ్డది. పాల్ దానిని ఇంకా చెడ్డదానినిగాచేసి విడిచాడు. మతం ప్రేమ, కరుణ, సానుభూతి మొదలైన హంశాలకు అనవసరమైన ప్రాముఖ్యత నిస్తుంది. ఈ భావాలు, ఆత్మ విశ్వాసంతో, స్వశక్తితో స్వేచ్ఛాజీవిగా బ్రతుకవలసిన మానవుని అభివృద్ధిని నిరోధిస్తాయి, 'పాపం', 'తప్పు' అనే భావాలు అర్థంలేనివి. ఎందుకంటే ఈ చర్యలు చేసేవారికి స్వతంత్రత అనేది లేదు."

మూడవ దశ :

1883 నుంచి 1888 వరకు సాగిన ఈ దశలో నీషే ప్రసిద్ధిచెందిన అనేక గ్రంథాలను ప్రచురించాడు. 'జరతు ఈ విధంగా అన్నాడు' అనే గ్రంథం వీటిలో ముఖ్య ఈ గ్రంథంలోనే నీషే తన భావాలను విశృంఖ వెదజల్లాడు. 'అతీత మానవుడు' అనే భావం, 'శా ఆ వృత్తి' అనే భావం ఈ గ్రంథంలోవే. వీటి తరువాత 'మంచీ - చెడుపైన,' 'నీతియొక్క పుట్టుపూర్వోత్తరాలు' అనే గ్రంథాలు ప్రచురితమైనవి. ఈ గ్రంథాలు విలువలు మారాలి అనేభావానికి ప్రాముఖ్యత నిచ్చినయి. 'అధికారం కోసం కల్పం', 'ఏనార్కిస్టు' మొదలైన గ్రంథాలు నీషే తరువాత ప్రచురించిన గ్రంథాలు.

అతను రచించిన గ్రంథాలనుబట్టి ఒక సమగ్రమైన తత్త్వశాస్త్రాన్ని ప్రతిపాదించిన తత్త్వవేత్తగా మనం అతన్ని పరిగణించలేం. అతను కవి, సంగీత విద్వాంసుడు, వ్యాస రచయిత, భాషావేత్త కూడాను. ఇన్ని శక్తులతోపాటు ఒక తత్త్వశాస్త్రాన్ని నిర్వచించటానికి ప్రయత్నించిన మేధావి. అందువల్ల సంప్రదాయ సిద్ధమైన తత్త్వవేత్త కుండవల సమన్వయ శక్తిగానీ, ఓర్పుగానీ అతనికి లేవు. కాని, అతని శక్తికి అత్యద్భుతమైన ఆకర్షణ వున్నది. చదువరు లలో ఆలోచనలు రేపి ఉద్రూతలూపగల దా శక్తి. విలియం కెల్లీరైట్ తన తత్వశాస్త్ర చరిత్రలో ఈమాట అన్నాడు, 'అతను గట్టిగా ప్రచారంచేసిన అర్థసత్యాలకు, తప్పులకు

హెగెల్, అరిస్టాటిల్ మొదలైన తత్వవేత్తల అభిప్రాయాలకు వుండే విలువ వుండనిమాట నిజమే. కాని, ఆ క్షణం వేత్తలకంటే, ఉద్రేకపరచి ఆలోచింపజేసే శక్తి నీషేకి దీన్ని అంగీకరించాలి. అతనిరచనలను చదివినవారు ఆలోచనా పరంపరకు గురికాకుండా ఉండలేరు,' అన్నాడు.

౫

నీషేని, విల్‌డురాన్ట్, 'డార్విన్ బిడ్డ, బిస్మార్క్ సహోదరుడు,' అన్నాడు...డార్విన్ పరిణామవాదం నీషే సిద్ధాంతానికి పునాది అని మనం చెప్పుకోవచ్చు. 'జీవితం అనేది బ్రతుకుకోసం పోరాటం: ఈ పోరాటంలో అర్హులైన వారు బ్రతుకుతారు' అన్నాడు డార్విన్. డార్విన్ చెప్పిన ఈ సూత్రాన్ని మనం అంగీకరిస్తే బలం సద్గుణం; బలహీనత దుర్గుణం అవుతుంది. ఈ పోరాటంలో నిలబడగలిగిందీ, జయించిందీ మంచీ; నిలబడలేక పోయిందీ, అపజయం పొందిందీ చెడూ అవుతుంది. ఇక నీతి నియమాలకు చోటెక్కడ? తోసుకుపోవటమే మానవుని జీవిత పరమావధి. జయిస్తే, ఆ మానవుడు అనుసరించిన విధానాలన్నీ మంచివే అయివుండాలి? లేకపోతే ఎలా జయిస్తాడు...జయించటం అనేది ఎలా సంభవిస్తుంది?

ఇలాంటి సూత్రాల మీద నిర్మించబడిన సిద్ధాం పహనానికీ, ఎదటివాని మంచిని గ్రహించటానికి త్యానికీ, స్వార్థరాహిత్యానికీ చోటెక్కడ

ఉంటుంది? ఉండదు...... ఈ ఉపాయాలన్నీ గర్భితంగా ఉన్నాయి. డార్విన్ సిద్ధాంతంలో గర్భితంగా వున్న ఈ లక్షణాలను వృద్ధిచేసి విపులపరిచాడు నీషే... వాటికి ఆలోచనలను కొంత కలిపాడు. కెల్లీరెట్ ఇలా అన్నా 'రెండు జాతులమధ్య జరిగే పోరాటంగానీ ఒకే జాతిలో వ్యక్తులమధ్య జరిగే పోరాటంగానీ, నీషేకి, డార్విన్ చెప్పినట్లు బ్రతుకుకోసం జరిగే పోరాటంకాదు; అధికారంకోసం జరిగే పోరాటం. వారిలో జరిగిన మార్పులు పరిస్థితులకు అనుకూలం అవటంవల్ల ఈ పోరాటం జయం చేకూరదు: వారిలోని సంకల్పశక్తివల్ల ఈ పని జరుగుతుంది. ఈవిధంగా ఊహించి నీషే యాంత్రికదృష్టినీ, భౌతిక వాదాన్నీ త్రోసి రాజన్నాడు. అతని ఈ దృష్టి షోపనార్‌కీ, లామార్క్‌కీ, దగ్గరగా వుంటుంది. ఈ రూపాలన్నిటినీ సృష్టించేది మానవుని లోని సంకల్పశక్తే. అది పరిస్థితులను స్వప్రయోజనానికి వాడుకుంటుంది.' అని నీషేవాదం. అతని అతీత మానవుడు కూడా ఈపునాదిమీద సృష్టించబడినవాడే. అందువల్ల అతీత మానవుడు అనేభావం అభ్యుదయకరమైందయినా, అతను అతీత మానవునికి ఆపాదించిన గుణాలు తీవ్రమైన విమర్శకు గురి అయినై. అతను అతీతమానవుడు. అందరి కష్టాలనూ, తన కష్టాలుగా భావించేవాడు కాదు. ఇతరులకోసం తన సుఖాలను త్యజించేవాడు కాదు... ఇతరుల బాధలను సానుభూతితో చూసేవాడుకాదు. హెచ్. ఎ. రైబరన్ " అనే గ్రంథంలో చెప్పినట్లు 'నీషేకి, సామాన

బానిసలుగా బ్రతకటానికే జన్మించారు. కాకపోతే అతీత మానవుని సృష్టికి తోడ్పడగలరు. ఈ సృష్టి అభివృద్ధి చెందటానికి ప్రత్యేకపరిస్థితులు కావాలి. విశ్రాంతీ, సాహసం, అపనమ్మకం, విశృంఖలత్వం కావాలి. ఇవి సామాన్య మానవులకు వర్తించవు' ఈ విధంగా అతీతమానవుణ్ణి సామాన్య మానవులకు సంబంధం చేసేవ్యక్తిగా వర్ణించటంవల్ల లోకానికి మంచికంటే చెరుపే ఎక్కువ కలిగిందని మనం ఒప్పుకు తీరాలి. మామూలు మనుష్యులకు వర్తించే నియమాలేవీ అతీత మానవునికి వర్తించవని చెప్పి విశృంఖలత్వాన్ని అంగీకరించటంవల్ల ఫాసిస్టు సిద్ధాంతానికి, ఈ భావం ఉపకరించే అవకాశం కలిగింది.

1876 జూలైన గోడ్ అనే స్నేహితునికి ఉత్తరం వ్రాస్తూ తన స్థితిని ఈ విధంగా వర్ణించాడు నీషే.

"There Passed a wanderer through the dark.
His step was strong.
Down curving vase, o'er mounitain height
He stroke along
Beauteous the night -
He hastened on, nor did he heed
Wuresting, where his path might lead."

నీషేస్థితి చివరివరకూ ఈవిధంగానే సాగిపోయిందని చెప్పుకోవచ్చు.

# 'హేతువాద తత్వవేత్త'

# బెర్ట్రెన్డ్ రసెల్

ఒకొక్క సమయంలో ఆనుపూర్వికంగా వొచ్చే ఆచారాలనుబట్టి సంఘం నడవటం సంభవిస్తుంది. అప్పుడు వ్యక్తులు తాము అనుసరించే నీతి సూత్రాలను గురించి ఆలోచించి మంచిచెడ్డలను గుర్తించరు. కొన్ని ఆచార వ్యవహారాలు తాతతండ్రులనుంచీ వొస్తున్నాయిగనుక, అవి మంచివే అయి వుండాలనే వుద్దేశంతో వాటిని అనుసరించి, జీవయాత్ర సాగించటం జరుగుతుంది. ఈ దృష్టిలో కొంత వరకు సంఘానికిగానీ, వ్యక్తులకుగానీ మేలు జరిగే అవకాశం లేకపోలేదు. ఈ ఆచారాలుకూడా వొకప్పుడు అనుభవాన్ని బట్టి ఆలోచింపబడి సంఘ శ్రేయస్సుకోసం సిద్ధీకరించబడిన నీతులే. అందువల్ల సంఘానికి శ్రేయస్సుని కూర్చే ఛాయలు ఈ ఆచారాల్లో వుండకుండా వుండవు. కాని ఎప్పటికప్పుడు ఈ ఆచారాల ప్రయోజనాన్ని తిరగదోడి పరీక్షించుకుంటూ వుండకపోతేమట్టుకు, వీటివల్ల సంఘానికి అపకారం జరిగే అవకాశం లేకపోలేదు. పరిస్థితులూ, మానవ స్వభావం నిత్యం మారుతూ వుంటాయి అనే విషయం అందరూ వొప్పుకునే విషయమే. అలా మారటంవల్ల, ఈ మార్పును ఎప్పటికప్పుడు అజలోకి తీసుకొని నీతిసూత్రాలు స... బడుతూ వుండటమో, పాతసూత్రాల స్వభా-

అవసరం అయిన మార్పు జరగటమో జరుగుతూవుండాలి. ఇది ఎప్పటికప్పుడు అనుపూర్వికంగా వొచ్చే ఆచారాలను పునర్విమర్శ చేసుకుంటూ వుండటంవల్ల మాత్రమే జరుగు తుంది. అలా జరగనప్పుడు స్థిరపడిపోయిన ఆచారాలవల్ల నిత్య సంచలన స్వభావం గలిగిన సంఘానికి చెరుపు కలిగే అవకాశం ఎక్కువ అవుతుంది.

బెర్ట్రెన్డ్ రసెల్ ఈ ప్రపంచంలో అడుగు పెట్టినప్పుడు పరిస్థితులు ఈ విధంగానే వున్నాయి. అతని పూర్వతరంవా రయిన విక్టోరియన్లు తరతరాలనుంచీ వస్తున్న సాంప్రదాయా లను మన్నించినవారు. వాటిని గౌరవించి, ప్రశ్నించటానికి వీల్లేని పవిత్రతను వాటికి ఆపాదించి, వాటినిబట్టి తమ జీవితాలను మలుపుకున్నవారు. ఇటువంటి పరిస్థితుల్లో తర్కానికిగానీ, హేతువాదానికిగానీ ఎక్కువ అవకాశం లేకపోవటంలో ఆశ్చర్యం ఏమీలేదు. తన బుద్ధిబలంతో విమర్శనా కౌశలంతో, శాస్త్రజ్ఞానంతో, ఈ పరిస్థితిని మార్చటానికి పూనుకున్న ప్రముఖుల్లో రసెల్ వొకడు. ఈ ప్రముఖుల ప్రయత్నాన్నిగురించి, హెచ్. డబ్ల్యు. లెగెట్ అనే ఆయన ఈ విధంగా ప్రశంసించాడు — 'విక్టోరియన్లు సాంప్రదాయ ప్రోద్బలంతో తమ జీవితాలను నడుపు కున్నారు. ఈనాడు మనం హేతువాదం సహాయంతో మన జీవితాలను మలుపుకుంటున్నాము. ఈ ప్రయత్నం నిర్విఘ్నంగా సాగకపోవచ్చు; పూర్తిగా సార్థకం కాకపోవచ్చు. గత ఏభై సంవత్సరాలలో ఈ దృష్టి మనలను

పూర్తిగా మార్చివేసింది. తల్లిదండ్రులకూ పిల్లలకూ వుండ వలసిన సంబంధం, వివాహ సంస్థకు బయట వుండవలసిన సెక్సు సంబంధం, భార్యాభర్తలమధ్య ఉండవలసిసంబంధం, యజమానికీ, ఉద్యోగికీ, ఉపాధ్యాయునికీ, విద్యార్థికీ వుండ వలసిన సంబంధం - అన్నీ ఈ దృష్టితోనే నిర్ణయింపబడు తున్నాయి. ఈ మార్పు, సాహిత్యంలోనూ, తదితర కళల లోనూ, అలంకరణలోనూ, మనం ఉబుసుపోకకు కాలం గడిపే విధానాల్లోనూకూడా ప్రస్ఫుటంగా కనిపిస్తూవుంది.

ఈమార్పు సరైన కారణం లేకుండా జరిగిందను కోవటం పొరపాటు. ఇది జరగవలసే జరిగింది.

ఈ మార్పుకు ముఖ్యంగా ముగ్గురు రచయితలు కారణం. ప్రజలమీద వీరి ప్రభావం అద్వితీయమైంది. వీరే జార్జిబెర్నార్డ్‌షా, హెచ్. జి. వెల్స్, బెర్ట్రెండ్ రసెల్. బెర్నార్డ్‌షా విక్టోరియన్ సాంప్రదాయాలను అపహాస్యం చేసి, ఛునాదులను కదిలించాడు. హెచ్. జి. వెల్స్ వొక నూతన సంఘాన్ని వూహించి, చిత్రించి ప్రజలను ఉత్తేజ పరిచాడు. బెర్ట్రెండ్ రసెల్ స్వేచ్ఛాజీవితాన్ని, హేతు వాదాన్ని, ప్రచారంచేసి, తాను ప్రచారం చేస్తున్న దృష్టి ప్రకారం జీవిస్తూ సంఘందృష్టిని ఆకర్షించి మార్చాడు.... వీరి ముగ్గురి ప్రయత్నం వల్లా పూర్వ సాంప్రదాయాలు అవమానంపాలై, ఒక నూతనవిధానం అవుసరం అ భిప్రాయం ప్రజల్లో గాఢంగా వ్యాపించటం జరిగి-

అయితే మనం మరొక ముఖ్యవిషయం జ్ఞాపకం వుంచుకోవాలి. వీరిలో ఎవ్వరూ వొక రాజకీయోద్యమానికి గానీ, వొక నిర్ధారిత జాతీయ విధానానికిగానీ ప్రచారం చేసి పుష్టిని చేకూర్చినవారు కాదు. వీరి ప్రభావం సమకాలికులకు వొక దృష్టిని, వొక వైఖరిని, కలిగించుకోటానికి మాత్రమే సహాయపడింది. ఇది రసెల్‌కి ముఖ్యంగా వర్తిస్తుంది. రసెల్ సాంఘిక రాజకీయ ఆర్థిక సమస్యాపరిష్కారానికి సహిష్ణుత మీందా, హేతువాదం సామర్థ్యంమీందా ఆధారపడమని ఉద్బోధించేవాడు. ఈ గుణాలకు, ఎటువంటి చిక్కుసమస్యల నైనా పరిష్కరించే శక్తి వుందని అతని నమ్మకం.

వొక్క తత్వశాస్త్రంలో మినహాయించి, మిగిలిన శాఖల్లో రసెల్ సిద్ధాంతాలుగానీ, అభిప్రాయాలుగానీ, చెప్పుకోదగ్గ ఫలితాలను సాధించలేదనే చెప్పుకోవాలి. 1914-18 యుద్ధానికి వ్యతిరేకంగా అనేక కష్టనష్టాలకోర్చి రసెల్ శాంతి ప్రచారం చేశాడు. కాని యుద్ధంగానీ దాని ఫలితాలుగానీ ఆగలేదు. పిల్లల పెంపకాన్ని గురించి అతను రూపొందించిన కార్యక్రమం సాఫల్యం పొందలేదు. వివాహ సంబంధాన్ని గురించీ, వివాహం బయట వుండవలసిన సెక్సు సంబంధాలను గురించీ అతను వెలిబుచ్చిన అభిప్రాయాలు ఏ కొద్దిమందినికూడా ఆకర్షించలేదు. ప్రథమ దశలోనే బోల్షివిజాన్ని గురించి అతను చేసిన హెచ్చరికలను, అతని విమానులే ఉపేక్షింపరాని అభిప్రాయాలనుగా పరిగణించ

అయినప్పటికీ అతను ప్రచారం చేసిన 'శాస్త్రీయ సందేహ' పద్ధతి ప్రభావం రెండు తరాల వారిమీద ఎక్కువగా కనిస్తుందని అంగీకరించక తప్పదు. మాధ్యం, దౌర్జన్యం, దురహంకారం ప్రజల్లోతగ్గి, సహిష్ణుత, వివేకము, సానుభూతి పెంపొందుతూ వచ్చాయని అంగీకరించక తప్పదు. దీనివల్ల, భావ వైరుధ్యం ప్రమాదానికి దారి తియ్యకుండా, అసహన ద్వేషానికి దారి తియ్యకుండా క్రోధావేశం నాశనానికి దారి తియ్యకుండా మానవ స్వభావాన్ని అదుపులో వుంచుకోటానికి అవకాశం కలిగిందనే విషయం నిర్వివాదాంశం. ఈ అవకాశం కలగటానికి కారకుడు ముఖ్యంగా రసెలే. ఈ గౌరవం యెక్కువగా అతనికే దక్కాలి. రసెల్ చేసిన పనినిగురించి హెచ్. డబ్ల్యు లెగ్గెట్; 'అతను తత్వశాస్త్ర చరిత్రను పనికిమాలిన అనవసరమైన నిర్జీవమైన తుక్కునుంచి రక్షించటమేకాక, వివిదార్థాలను స్ఫురింపజేసే పులుముడునుంచీ, అర్థశూన్యత నుంచీ రక్షించే తేలిక భాషనుకూడా సృష్టించాడు' అన్నాడు. తత్వవేత్తల్లో, ఇతనంత తేలిక భాషలో ఇతనంత సూటిగా నిర్దుష్టంగా వ్రాయగలిగినవారిని వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చని ధైర్యంగా చెప్పవచ్చు.

౨

రసెల్ కుటుంబం ఇంగ్లండులోని ప్రఖ్యాతమైన, పురాతనమైన కుటుంబాల్లో వొకటి. ఈ వంశంలో అ- మంది ప్రసిద్ధపురుషులు జన్మించారు. ఈ వంశం

చానికి అనేకమంది రాజకీయ దురంధరులను అందించింది. రసెల్ తాతఅయిన, లార్డుజాన్ రసెల్ అనే ఆయన, ఒక ప్రముఖ మితవాత ప్రధానమంత్రి. ఆయన స్వేచ్ఛా వ్యాపారంకోసం, సర్వులకు చెందే ఉచిత విద్యావిధానంకోసం యూదుల విముక్తికోసం, అన్నిశాఖల్లోను స్వాతంత్ర్యం కోసం పోరాడిన ఉత్కృష్ట పురుషుడు. ఆయన తండ్రి విస్కవుంట్ ఏంబర్లే స్వేచ్ఛాప్రియుడు. తన కుమారుని పాశ్చాత్యదేశాలకు చెందిన ఏ వేదాంత శాస్త్రంతోనూ బాధపెట్టలేదు. అతనిని అతని ఆలోచనలకు విడిచిపెట్టాడు. అతనిని స్వయంగా ఆలోచించుకోటానికి పురికొల్పాడు. అతను రెండవ ఎరల్ రసెల్ వారసుడు. కాని వారసత్వ సాంప్రదాయంమీదవున్న విముఖత్వంవల్ల అతను ఈ వార సత్వాన్ని వొదులుకొని తన జీవితయాత్రకు స్వయంకృషి మీదే ఆధారపడ్డాడు. అతన్ని యుద్ధ సమయంలో అతను చేసిన శాంతి ప్రచారాన్ని పురస్కరించకొని, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం అతని ఉద్యోగానికి ఉద్వాసన చెప్పి నప్పుడు, అతను ప్రపంచ పౌరుడుగా దేశదిమ్మరిగా తిరిగి నప్పుడు, ప్రపంచం అతన్ని సంతోషంగా పోషించింది.

రసెల్ కృషీ, జీవితం ఎప్పుడూ దేనిదారి దానిదిగా వుండేదికాదు. ఎప్పుడూ పెనవేసుకునే వుండేవి. అతని కృషినీ జీవితాన్నీ స్థూలంగా మూడు దశలుగా విభజించ వచ్చు.

మొదటిది: మొదటి దశ 1914-18 యుద్ధంతో అంత ని చెప్పవచ్చు. ఈ కాలంలో, 'గణితశాస్త్ర

సూ[త్రాలూ' 'తాత్విక గణిత శాస్త్రానికి పరిచయం' మొద లయిన [గంథాలు [పచురించ బడిన్నై. అతని [పథమ వివాహం ఈ కాలంలోనే జరిగింది. ఈ వివాహం 1921 లో రద్దు అయింది. ఈ వివాహానికి రసెల్‌కి సంతతి లేదు.

రెండవది : ఈ దశలో రసెల్ ద్వితీయ వివాహం చేసుకున్నాడు. అమెరికా కవి రాబర్టు [ఫాస్టుని వివాహం చేసుకున్న, [పస్తుతపు విస్కవుంట్ ఏంబర్లే అయిన జాన్, ఈ వివాహానికి కలిగిన పు[తుడు. ఇతని జన్మ సంవత్సరం 1921. ఈ దశలో రసెల్ తన శక్తిని పిల్లల విద్యా విధాన సమస్యలపై కేం[దీకరించాడు. కుటుంబ విధానంమీాదా, [పపంచ పరిస్థితులమీాదా [గంథాలు రచించాడు.

అతని రెండవభార్య పేరు డోరారసెల్. వీరి రెండవ సంతానం కేట్ అనే వొక కుమార్తె. ఈ దశలో అతను 'విద్యను గురించి' 'వివాహం, నీతి' 'సుఖాన్ని జయించటం' 'విద్య, సాంఘిక నిర్మాణం' అనే [గంథాలు రచించాడు. అంతేకాక ఈ దశలో అతనూ అతని భార్యాకలిసి పిల్లలకు నూతన విద్యా విధానం వొకటి ఆచరణలో పెట్టటానికిగాను 'పురోగమన పాఠశాలల'ను నెలకొల్పి నడిపారు. ఈ పాఠ శాలల ముఖ్యసూ[తం చిన్నపిల్లలకు వారి [పవర్తనలో కొంత స్వాతం[త్ర్యం ఇవ్వటం. వీరు అనుసరించిన ఈ విధానం చాలామంది సాం[పదాయపరుల మనసు చీకాకుపరిచింది.

అతని ద్వితీయ వివాహం రద్దవటంతో ఈ పాఠశాలల్లో ప్రవేశపెట్టబడిన నూతన విద్యా విధాన పరిశోధన కూడా రద్దయింది.

మూడవది : ఈ దశలో రసెల్ చాలా విషయాల మీద గ్రంథరచన సాగించాడు. కాని క్రమ క్రమేణా అతని దృష్టిని తాత్వికసమస్యలు ప్రబలంగా ఆకర్షించాయి. ఈదశలో అతను, 'స్వాతంత్ర్యం, నిర్మాణం' సత్యార్థపరిశీలన 'పాశ్చాత్య తత్వచరిత్ర' 'మానవ పరిజ్ఞానము' మొదలయిన గ్రంథాలు వ్రాశాడు. ఆయన ఇంకా గ్రంథరచన చేస్తూనే వున్నాడు. క్రొత్త క్రొత్త దారులను పరిశోధిస్తూనేవున్నాడు. క్రొత్త క్రొత్త భావాలను వెదజల్లుతూనే వున్నాడు..

రసెల్ జీవితాన్నీ, గ్రంథాలను మనం పరిశీలించి చూచినట్లయితే, అతను ఎంత గొప్ప తత్వవేత్త అయినా, జీవితానికి విడిగా వుండటానికి అభిలషించే ఏకాంతవాసి కాదని మనకు స్పష్టంగా బోధపడుతుంది. అతని గ్రంథాలు ఎప్పటికప్పుడు అతను అభవిస్తున్న జీవితంలోనుంచీ. ఆ జీవితం సృష్టించిన పరిస్థితుల్లోనుంచీ మొలకలెత్తినవే. జీవితాను భవంమీద అతనికి తీరని ఆశవుంది. ఈ వయస్సులో కూడా అతను జీవితంపట్ల విముఖత్వాన్ని చూపటం లేదు. ఈజీవితోత్సాహం అతన్ని చిన్నప్పటినుంచీ విడిచిపెట్టకుండా వుంది. అతని కేంబ్రిడ్జి రోజులను వర్ణిస్తూ ప్రముఖ తత్వవేత్త వైట్ హెడ్, "మెరిసిన ప్రపంచం అనుభవించినట్లే మేమూ తేజస్సును అనుభవించాం. మొదట నా శిష్యుడు

గానూ, తరువాత నా సహచరునిగానూ-మిత్రునిగానూ, నేను అతని మేధస్సంపత్తియొక్క కాంతిని అనుభవించాను,” అన్నాడు, ‘శాస్త్రం,-తత్వం’ అనే తాను వ్రాసిన వ్యాసాలలో అతనిని గురించి వ్రాసిన గ్రంథంలో లేడీకాన్స్టన్స్ మల్లేసన్, ‘సన్నిహితంగా తెలుసుకున్నవారికి అతను, అనేక విరుద్ధ స్వభావాల కలయిక అయిన ఒక చిక్కు సమస్యగా కనుపిస్తాడు. కాని పరిచయ మాత్రులకు అతను చాలా సహజంగానూ, అత్యంత ప్రతిభ గలిగిన చమత్కార ప్రియుడుగానూ కనిపిస్తాడు,’ అని వ్రాసింది. రసెల్ తాత్విక పరిజ్ఞానంమాట అటుంచి, అతని సాహిత్య ప్రతిభ అమోఘమైంది. అతనిని గురించి ‘వైట్‌హెడ్ స్వల్పవిషయాలు జటిలపరిస్తే, రసెల్ ఎటువంటి జటిల విషయాన్నయినా, సులభపరుస్తాడు,’ అని తరచు అనుకోవటం కద్దు. అతను సులభంగా వ్రాయుటమేకాదు — అతని రచనల్లో వొక క్రొత్తదనం, ఒక ఉల్లాసం అడుగడుగునా కనుపించి అతని గ్రంథాలకొక వింత ఆకర్షణను చేకూరుస్తుంది. చదువరుల మనస్సులను పులకింప జేస్తుంది. దీనికితోడు సరిపోయే ఉదాహరణలను, చక్కని అలంకారాలనువాడి, ఎటువంటి జటిల సమస్యనైనా సాధారణ మానవునికి అర్థమయ్యేటట్లు చెయ్యవలసిన కౌశలంకూడా అతనికివుంది. అందువల్ల అతను ఏది వ్రాసినా పదిమందికి అందుబాటులో వుండి ఎక్కువమంది పాఠకులను ప్రోగుజేసుకో గలుగుతుంది.

## 3

రసెల్ సత్యాన్వేషణకు పూనుకున్న రోజులు, తత్వ శాస్త్రం అనుభవాన్ని వొదులుకొని కాకులుదూరని కారడవీ, చీమలుదూరని చిట్టడవీ ప్రవేశించి, దారీ తెన్నూ లేకుండా కొట్టుకుంటున్నరోజులు. అందువల్ల అన్వేషణ మార్గాలను శుద్ధిచేసి నిర్మలపరచటం ప్రథమ కర్తవ్యం అని అతను భావించటంలో ఆశ్చర్యం లేదు. ఈ విధానాన్నే అతను కఠినంగా అనుసరించాడు. తన అన్వేషణకు పూర్తిగా తర్కం మీందా, శాస్త్ర పరిజ్ఞానం మీందా, ఆధారపడ్డాడు. వీటిని - అందని వాటినన్నిటిని 'మిస్టిసిజం' క్రింద నిరసించాడు. ఇటువంటి వ్యక్తిని ఏ అసందిగ్ధం లేకుండా కచ్చితంగా కన పడే గణితశాస్త్రం ఆకర్షించటం సహజమే, స్వాభావికమే! ఈ శాస్త్ర స్వభావానికి అతని మనస్సు ఉప్పొంగింది. 'మిస్టిసిజం, తర్కం' అనే గ్రంథంలో అతనే ఈ శాస్త్ర వైవిధ్యాన్ని గురించి ఈ విధంగా వ్రాశాడు– 'గణితశాస్త్రం, సరైన దృష్టితో చూస్తే సత్యాన్ని పొదుగు కొని వుంటమే కాక, సర్వోత్కృష్టమైన సౌందర్యాన్నికూడా కలిగి వున్నట్లు మనకు తెలుస్తుంది. ఈ సౌందర్యం వొక శిలా విగ్రహం., సౌందర్యం మాదిరిగా నిర్లక్ష్యమైనదీ, నిష్టురమైన దీసీ! అంటే ఇది మానవ స్వభావాల్లో వున్న బలహీనతలను రేపకుండా, పవిత్రమైన సౌందర్యం'

ప్రథమ దశలో రసెల్‌ని గణితశాస్త్రం ఇంత గా ఆకర్షించింది. 'పరిపూర్ణ జ్ఞానం' అనేదీ 'శాశ్వత

సత్యం' అనేదీ ఈ శాస్త్రంలోనే వుందని అతను భావించాడు. తత్వశాస్త్ర ఆదర్శంకూడా, గణితశాస్త్రానికి మల్లే అనుభవానికి తూచా తప్పకుండా వుండే, పొల్లుపోని సత్యాన్ని ప్రకటించే ప్రకటనల ద్వారా పూర్ణత్వాన్ని పొందాలని ఆశించాడు. గణితశాస్త్ర సూత్రాలు కారణమునుండి కార్యమును విచారించేవిగా పరిగణింపబడాలని ఆనాటి అతని ఉద్దేశం. ఇటువంటి సూత్రాలు వస్తువులకు సంబంధించినవి కావు, వాటి సంబంధాలకు సర్వానికీ చెందిన సంబంధాలకు వర్తించేవిగా వుంటవి. అవి నిర్ధారింపబడిన, జరిగిన సంగతులకూ, సంఘటనలకూ స్వతంత్రంగా వుంటవి. ఈ ప్రపంచంలో వున్న ప్రతి ప్రత్యేక విషయములోనూ అవి మారవు; ఆ మార్పు వాటికి వర్తించదు. ఈ సూత్రం మాత్రం నిజాలుగా నిలబడే వుంటై.

ఈ విధంగా తత్వశాస్త్రాన్నంతా, ఈ విధమైన గణితశాస్త్ర చట్టంలోకి ఇరికించటం, ఆనాడు రసెల్ చేసినపని. ఇది ఏమంత సమంజసమైన, ఉచితమైన పనికాదని తరువాత అనుభవమే చెప్పింది. రసెల్‌ని గురించి వ్రాస్తూ నిల్‌డురాన్ట్ తాను వ్రాసిన కథలో, 'ఇద్దరు బెర్ట్రెన్ట్ రసెల్స్ ఉన్నారు. యుద్ధంలో మరణించిన అతను అందులో వొకడు. అతను గణితశాస్త్ర తార్కికుడు. ఇక రెండవవాడు ఆ ముసుగులో నుంచి ఉద్భవించినవాడు. ఇతన్ని ఇంచుమించు వొక మిస్టిక్ కమ్యూనిస్టుగా మనం పరిగణించవచ్చు' అన్నాడు.

నిజంగా 1914–18 ప్రపంచ సంగ్రామం రసె... చాలా మార్పుని తీసుకువచ్చింది. మనిషిని ఆమూ...

కదిలించి వొక నూతన వ్యక్తిగా రూపొందించింది. మేఘాల్లో నుంచి వొక్కసారిగా భూమిమీదకు దిగి యుద్ధాన్ని గురించీ, ప్రభుత్వాన్ని గురించీ, సోషలిజాన్ని గురించీ, విప్లవాన్ని గురించీ రసెల్ మాట్లాడటానికి పూనుకోవటం ఆశ్చర్యజనకమైన సంఘటనే! ఇందులో సందేహం లేదు; కాని ఈ మార్పు జరిగింది. ఈ తాత్వికుడు సౌదాంతర్గత భావాల్లోనుంచి కాలు బయటకు పెట్టాడు. రాజకీయవేత్తల మీద తన క్రోధాన్ని వెళ్ళగ్రక్కాడు. ఉద్యోగం పోయినా, సంఘం బహిష్కరించి హింసించినా ఆగలేదు. యుద్ధానికి వ్యతిరేకంగా శాంతి ప్రచారం చేశాడు.

దీనికి వొకటే కారణం. వేసుకున్న అన్ని ముసుగులనూ మించిన మానవత్వం ఉంది, ఈ తాత్వికునికి. శరీరం లేని మేధస్సు ముద్దగా వుండటానికి అతను ప్రయత్నించినా, అతను దయారసం కలవాడు. అతను అనుభూతుల ప్రోగు అవటమే దీనికి కారణం.

ఈ సందర్భంలో అతను ఆస్తి పుట్టుక దౌర్జన్యం మీదా, దొంగతనం మీదా ఆధారపడి వుందని ప్రచారం చేశాడు. 'మనుష్యులు ఎందుకు యుద్ధం చెయ్యటం?' అనే పుస్తకంలో, 'వ్యక్తిగత ఆస్తివల్ల సంఘానికి ఎటువంటి లాభమూ చేకూరదు. మనుష్యులు వివేకవంతులైతే వ్యక్తిగత ఆస్తిని రేపేరద్దు చేస్తారు. ఇప్పటి యజమానులకు కొద్ది పాటి జీవితాంతం వరకూ వుండే భుక్తికి మించి ఏ ప్రతిఫలం ండా రద్దుచేస్తారు,' అని వ్రాశాడు. ఈ వ్యక్తిగత న్ని ప్రభుత్వం నిలబెట్టి కాపాడుతూవుంది గనక

ప్రభుత్వం దోషభూయిష్ఠమైంది. కాబట్టి దాని అధికారాలను సహకార సంఘాలూ, ఉత్పత్తిదారుల సంఘాలూ తీసుకోవటం మంచిది. మూర్తిత్వం, వ్యక్తిత్వం మన సంఘాల వల్ల చదును చెయ్యబడుతున్నాయి. మానవాళికి ఎక్కువ రక్షణా, మానవజీవితంలో ఎక్కువ క్రమత్వం మాత్రమే ప్రభుత్వంతో రాజీపడే అవకాశాన్నిస్తాయి—ఈ విధంగా వాదించాడు.

ఈ రోజుల్లో 'స్వాతంత్ర్యాన్ని' గురించి అతను విపులంగా చర్చించాడు. మానవపురోభివృద్ధికి స్వాతంత్ర్యం ప్రథమావసరం అన్నాడు. వ్యక్తిస్వాతంత్ర్యం లేకుండా మూర్తివత్వం అభివృద్ధి చెందటానికిగాని, అసలు వుండటానికిగాని వీలులేదు. ప్రతి మానవులోని శక్తులూ విజృంభించి నవ్య నవ్య రూపాలను తొడుగుకొని జీవితాన్ని ఆనందమయం చెయ్యాలంటే మూర్తిమత్వం లభివృద్ధిచెంతే అవకాశాలను సృష్టించుకోవాలి. ఈ రోజుల్లో జీవితం విజ్ఞానం ఎంత చిక్కురు వొక్కురు అయిపోయినవంటే ఏ వొక్కడు వాటిని విడదీసుకోలేడు. ఈ పనీ స్వేచ్ఛాచర్చల వల్ల మాత్రమే అవుతుంది. సత్యం తెలుసుకోబడటానికి ఇంతకంటే ఉత్తమమార్గం లేదు... మానవులందరూ, ఉపాధ్యాయులు సహితం అభిప్రాయభేధాలను పురికొల్పుకొని చర్చల్లోకి దిగాలి. ఇటువంటి విభిన్నాభిప్రాయాల సంకలనంనుంచే తగాదాలను, వైరాలను, ద్వేషాలను పెంచని సత్యం ఉద్భవించటానికి వీలుంటుంది. ద్వేషం యుద్ధం మొద[illegible] పిడచగట్టిన అభిప్రాయాలవల్లా, మూర్ఖపు సమ[illegible]

తటస్థిస్తూవుంటై. స్వేచ్ఛగా ఆలోచించుకో నివ్వటం, మాట్లాడుకోనివ్వటం నవ్వుల మానసిక మలినాన్ని క్షాళన చెయ్యటానికి చాలావరకు ఉపయోగిస్తాయి.

ఈ పద్ధతి తప్పకుండా ఆచరించటానికి ముఖ్యమైన కారణం మనం అనుకున్నంత విజ్ఞానులం కాకపోవటమే! విల్‌మూరాన్ట్ రసెల్ యొక్క ఈ వైఖరిని ఈ విధంగా విపుల పరిచాడు. 'మనం ఇటీవలనే సార్వజనిక విద్యను ప్రారంభించాం. కాబట్టి మన ఆలోచనా విధానాలూ, మన సాంఘిక జీవనం దీనివల్ల ఇంకా శుభ్రపడలేదు. దీనికి కావలసిన సరంజామును మనం ఇప్పుడే సృష్టించుకుంటున్నాం. అనుసరించే విధానాలూ సాంకేతిక కొరముట్లూ, వెనుకదశకు చెందినవే అయివున్నాయి. మనం విద్య అంటే స్థిరపడిపోయిన జ్ఞానాన్ని విద్యార్థులకు అందివ్వటం అనుకుంటున్నామేగాని, శాస్త్రీయ దృక్పథాన్ని, అలవాట్లను ప్రోత్సహించటం అనుకోవటంలేదు. తెలివి తక్కువ వాని ముఖ్యలక్షణం త్వరగా వాక నిర్ణయానికి రావటం, తన అభిప్రాయాలు తిరుగులేని వనుకోవటం. శాస్త్రివేత్త నెమ్మదిగా నమ్ముతాడు. దిద్దుబాటుకు వీలు లేకుండా మాట్లాడడు. శాస్త్రిజ్ఞానం ఎక్కువైనకొద్దీ, ఈ విధానం వ్యాపించినకొద్దీ, సాక్ష్యంవున్న తవరకు నమ్ముతూ ఎప్పటికప్పుడు ఈ నమ్మకం పొరపా టవటానికి వీలుందనే స్పృహతో జీవించటం అలవా టవుతుంది. ఈ విధానాల విద్య అనేక చెరుపులను రూపుమాపే సాధనంగా

తయారవుతుంది. నూతన సంఘానికి సరిపోయే వ్యక్తులుగా తరువాతి తరంవారిని తీర్చి దిద్దుతుంది.'

రసెల్ విశ్వాసాన్నిబట్టి సక్రమమైన విద్య చెయ్య లేని పని అనేది లేదు. ఆర్థిక దురవస్థనీ, అంతర్జాతీయ పశుత్వాన్నీ పోగొట్ట గలిగేది దౌర్జన్య పూరితమైన విప్ల వమూ కాదు, కాగితంమీాదకు ఎక్కి కూర్చునే చట్టాలూ కాదు—ఈ విద్యావిధానమే.

౮

బెర్ట్రెండ్ రసెల్ అభిప్రాయాలు ఇటీవల చాలా విమర్శలకు గురి అయినై. అందులో ముఖ్యమైంది అతను తన తాత్విక విధానంలో మతానికీ నీతిసూత్రాలకు స్థానం చూపలేదనేది. దీనివల్ల నిరాశకూ, నిస్పృహకూ మాత్రమే పునాదులు వేసి ఫేసిస్టు సిద్ధాంతాలవంటి సిద్ధాంతాలకు అనుకూలమైన వాతావరణం సృష్టింపబడటానికి కారకు డయ్యాడనే అపనిందకూడా మోపబడటం జరిగింది. దీనికి వొక విధంగా సమాధానం చెప్పవచ్చు. రసెల్ జీవిత చరిత్రను వ్రాసిన లెగ్గెట్ అనే ఆయన కూడా ఈ అప నిందకు ఈ విధంగానే జవాబు చెప్పాడు.

రసెల్‌కి వ్యక్తిగతంగా మతంమీాద విశ్వాసం లేని మాట నిజమే. అందులో సందేహంలేదు. అతనే తన ప్రత్యేక వ్యాసాలలో, 'నాకు తెలిసిన అన్నిమతాలకూ నేను వ్యతిరేకుడనే! అంతేకాక అన్ని మత విశ్వాసా మరణించేవనే నా నమ్మకం' అని వ్రాశాడ

వ్రాసింతర్వాత ఆయన నమ్మకం ఏవిధంగా సడలినట్లూ దృష్టాంతరం లేదు.

కాని తన తాత్విక విచారంనుంచి మతాన్నీ నీతి సూత్రాలనూ, విలువలనూ దూరంగా ఉంచటానికి మాత్రం తన వ్యక్తిగతాభిప్రాయం కారణం కాదు. దీనికి కారణం తత్వశాస్త్రంలో వీటికి చోటు లేదనే అతని దృష్టి. అతను చరిత్రలో తత్వశాస్త్రం ఎప్పుడూ కలపటానికి వీల్లేని రెండు భాగాలుగా వుంటూ వొచ్చిందనీ, అందులో ప్రపంచ స్వభావాన్ని తెలుసుకోటానికి ప్రయత్నించే సిద్ధాంతం వొకటనీ రెండవది జీవితానికి అవుసరమైన రాజకీయ సిద్ధాంతాన్ని గానీ, ధర్మసూత్రాన్నిగానీ నిర్వచించటం అనీ, ఈ రెంటినీ సమన్వయ పరచలేక ఈ రెంటిలో ఏవొక్కదానికీ న్యాయం జరపలేక తత్వశాస్త్రం చీకాకుపడిపోయిందనీ వ్రాశాడు. తత్వశాస్త్ర చర్చలో నీతిసూత్రాలనుగానీ, విలువలనుగానీ, చొప్పించటానికి ప్రయత్నించటం, ఆ శాస్త్రానికి అన్యాయం చెయ్యటమేనని ఆయన అభిప్రాయం. 'ప్లేటో మొదలుకొని విలియం జేమ్సు వరకూ తత్వవేత్తలందరూ, మనుష్యులను ఏ సూత్రాలు నీతివంతంగా చేస్తాయో, ఆ సూత్రాల ప్రభావాన్ని తమ ప్రపంచ నిర్మాణవిధానం మీదపడేటట్టు చేసుకున్నారు. ఏ సూత్రాలు మానవుణ్ణి నీతిమంతునిగా ఉంచటానికి ఉపకరిస్తాయో ముందుగా నిర్ణయించుకొని, తరువాత వాటి ఉనికిని నిరూపటానికి తగిన కారణాలను ప్రోగుజేశారు' అని తన ౦ తత్వశాస్త్ర చరిత్రలో వ్రాశాడు. ఇక ఇలా

అన్నాడు 'మత సిద్ధాంతాన్ని తత్వశాస్త్రం నిరూపించ గలగటమో, నిరూపించలేకపోవటమో చెయ్యగలదని నేను అనుకోవటంలేదు.'

మానవాభివృద్ధికీ, మానవ స్వాతంత్ర్యానికీ పలు విధాల పోరాటం సాగించిన రసెల్ లాంటి ప్రముఖులకు విలువలు అనేవి లేవని ఎవ్వరూ అనలేరు. అయితే తత్వ శాస్త్రం జ్ఞానపరిశోధనకు మాత్రమే సంబంధించినది- అని అతని భావన అవటంవల్ల, అతని తత్వశాస్త్ర పరిధిలో వీటికి స్థానంచేకూరక పోయిందని మాత్రమే మనం చెప్పుకోవాల్సి వస్తుంది. అయితే తత్వశాస్త్రం ప్రయోజనం ఏమిటి? రసెలే ఈవిధంగా చెప్పాడు. 'తత్వవేత్తలు కారణాలూ, ఫలితాలూకూడా ఆనాటి సాంఘిక పరిస్థితులయొక్క, రాజ కీయాలయొక్క, సంస్థల యొక్క ఫలితాలు; తరువాత రాబోయేరాజకీయాలయొక్క, సంస్థలయొక్క కారణాలు. తన ఆదర్శం ప్రపంచాన్ని వర్ణించటంకాదు, ప్రపంచాన్ని గురించిన విజ్ఞానం మనకు ఎలావచ్చిందో, అసలు విజ్ఞానం అంటే ఏమిటో తెలుసుకోవటం - అని స్పష్టంగా చెప్పాడు, 'మానవవిజ్ఞానం' అనే పుస్తకంలో. మానవ విజ్ఞానం అంతా అనిశ్చితమైంది, కచ్చితంకానిది, పక్షపాత పూరితమైంది- అని ఈ పుస్తకం సారాంశం. విజ్ఞానం ముఖ్యంగా అనుభవంవల్ల సేకరించబడుతుంది. మనకు ఇంద్రియాలద్వారా కనపడే ప్రపంచాన్ని సూక్ష్మంగా పరిశీలించటంవల్ల కలిగే ఫలితం అది. ఇలా వచ్చిన విజ్ఞానాన్ని పరిశోధించే సాధ తర్కమూ, గణితశాస్త్రమూ. దీనినిమించి తత

సంబంధం పెట్టుకోవలసింది ఏమీలేదు. దీనినిమించి అది వెళ్తే, హేతువాదాన్ని, భావాలనూ, ఆలోచనలనూ, విజ్ఞానాన్ని వ్యక్తపరిచే భాషయొక్క శక్తిని దాటివెళ్ళినట్లే-అని అతని భావన. దీనినిబట్టి తాత్విక పరిశోధన ప్రతిఅంతస్థుకూ క్రమానుగతమైన సందేహాన్ని జోడించటం అతని తత్వశాస్త్రంలోని ముఖ్యసూత్రం - అని బోధపడుతుంది. ఈ సందేహం అనే తత్వశాస్త్రి విషయానికేగాక, అందుకుగాను వాడే భాషకుకూడా వర్తింపజెయ్యాలని అతని ఉద్దేశం. 'మనం ఈ ప్రపంచాన్ని గురించి చివరికి ఎంతవరకు తెలుసుకుంటామో చెప్పలేం. మనం తెలుసుకున్నదాన్ని వ్యక్తపరచటానికి వ్రాసే ప్రతి వాక్యాన్ని, ప్రతి భాషా సాంప్రదాయాన్ని పూర్తిగా విమర్శించి చూచుకుంటే తప్ప మనం ఎంతో కొంత తెలుసుకున్నాం - అనికూడా నిర్ధారణ చేసుకోలేం' అన్నాడు.



మిగిలిన విషయాలు అటుంచి, ఏ విషయాన్నయినా గుడ్డిగా నమ్మకుండా, ప్రతిదాన్నీ సందేహిస్తూ, పరీక్షించి విమర్శించిగాని దాని స్వభావాన్ని గురించి ఒక నిర్ణయానికి రాగూడదనే దృష్టి అతనివల్ల వ్యాప్తంలోకి వచ్చింది. ఈ దృష్టివల్ల అంధవిశ్వాసాలు అనేకం రూపుమాయటం, ప్రపంచంలో వున్న గజిబిజి ఎంతో అంతమొందటం జరిగింది. కాని దీనివల్ల ఒక ప్రమాదంకూడా రాకపోలేదు.

నమ్మకపోవటం ప్రతిదాన్నీ నిరసించటమే ప్రధాన

దృష్టిగా ప్రవర్తిల్లి ప్రజల్లో వ్యతిరేక భావన వర్ధిల్లింది. ఒక భావాన్ని హృదయపూర్వకంగా స్వీకరించి తన్మయత్వంలో ఆనందపడే శక్తి నశించడం జరిగింది. ఈఉద్దేశంతోనే అతని జీవిత చరిత్రను రచించిన లెగ్గట్ 'అతని పలుకుబడి ప్రతిదాన్నీ వ్యతిరేకించటంగానూ, నిరసించటంగానూ పరిణమిల్లింది' అని వ్రాశాడు. రసెల్ ప్రచారం చేసిన ఈ దృష్టి వొక నూతనసిద్ధాంత సృష్టికి తగిన వాతావరణాన్ని సృష్టించింది - అని చెప్పుకోవచ్చు. కాని వెంటనే ఆసృష్టి అతని నుంచిరాక అపనమ్మక వ్యాపకం మాత్రమే అతనివల్ల జరిగిందనికూడా చెప్పుకోవలసివస్తుంది.

రసెల్ కమ్యూనిష్టు తత్వవేత్త అయిన మార్క్సుని గురించికూడా కొన్ని నిశ్చితాభిప్రాయాలను వెలిబుచ్చాడు. అతను 'స్వాతంత్ర్యం, నిర్మాణం' అనే గ్రంథంలో వెలిబుచ్చిన అభిప్రాయాలను లెగ్గట్ ఈ రూపంలో క్రోడీకరించాడు.

'మార్క్సిస్టులు చారిత్రకమార్పు ఇంచుమించు ఆర్థిక గుణాలనుబట్టి కలుగుతుందని చెప్పారు. ఈ శతాబ్దంలోని మార్పు ముఖ్యంగా మూడుకారణాలవల్ల జరిగిందని రసెల్ నిర్వచించాడు. ఆర్థికనిర్మాణం, రాజకీయ సిద్ధాంతం, ప్రసిద్ధ పురుషులు ఈ కారణాలు అన్నాడు. ప్రసిద్ధ పురుషుల పాత్రను కార్లయిలు ఉత్ప్రేక్షించాడని చెప్పుకోగలమేగాని చరిత్రమీద వారి ప్రభావం ఎక్కువగానే వుంటుందని అంగీకరించి తీరాలి. 'బిస్మార్క్ గనక పసితనంలోనే మరణించి వున్నట్లయితే గత డెబ్బయి సంవత్సరాలు యూరప్

ఇప్పుడు జరిగినట్లే జరిగివుండేదని నేను నమ్మను.' అన్నాడతను. చివరికి యాదృచ్ఛికంగా జరిగే సంఘటనల ప్రభావానికి కూడా అతను కొంత ప్రాముఖ్యతను ఇచ్చాడు.

(2) మార్క్సుయొక్క ఆర్థికపరిశోధన తప్పయినా వొప్పయినా అతని ఉద్దేశం ధనవంతులు బీదవారిని దోచుకోవటం, నిర్మూలించటం అతని ఆదర్శం. కాని రసెల్ ఈ దోచుకునే విధానాన్ని నిర్మూలించటం కార్మికులను ఇంకా అధోగతిపాలు చేస్తుందని వాదించాడు. అధికారాన్ని చేపట్టినా తప్పకుండా తమ అధికారాన్ని ప్రత్యేక హక్కులనూ, ప్రయోజనాలనూ సాధించుకొని నిలబెట్టుకోటానికి వినియోగిస్తారు. కాని అరాజకం ప్రబలకుండా ప్రభుత్వాన్ని నడిపే తమకున్న అనుభవాన్నిబట్టి కాపాడి, ఆ పద్ధతి కొంత సమర్థనీయంగా జరిగిపోయేటట్టు చూస్తారు.

(3) డబ్బుయొక్క బలం ఎక్కడుందో మార్క్సు సరిగా గుర్తించలేకపోయాడని రసెల్ అభిప్రాయం. రసెల్ అంచనా ప్రకారం ఈనాటి ప్రపంచంలో ఆర్థికబలం, దాని వల్ల వచ్చే అధికారం భూమినుంచీ, ఖనిజసంపత్తినుంచీ, పరపతినుంచీ వొస్తుంది. శ్రామికులకు మల్లేనే చిన్న పెట్టుబడిదారులు పెద్ద పెట్టుబడిదారులవల్ల దోపిడీ చెయ్యబడుతూ, పీడింపబడుతూ వుంటారు. వ్యక్తిపరమైన గుప్తవ్యాపారంలేని సంఘంలో ఆర్థికాధికారంలేని నేప్పు ఎక్కువ అపకారం ...లేదేమోనని అతను ఆశించాడు, 'ఇప్పుడు ఫోర్డుని ... కారులను నిర్మించకుండా నిషేధిస్తే, ప్రపంచం

బాగుపడుతుందనుకునే భావం ప్రశ్నించదగ్గది,' అన్నాడు. అంటే తరువాత బరన్‌హామ్ సృష్టించిన 'మేనేజరియల్ విప్లవం' అనే సిద్ధాంతానికి నాంది పలికాడన్నమాట.

(4) మార్క్స్ ప్రవచించిన 'వర్గపోరాటం' మధ్య తరగతిని భయపెట్టి బెదరగొట్టి తిరోగమనవాదుల చేతుల్లోకి పంపి యూరప్‌లోని 'లిబరలిజాన్ని' చంపిందని రసెల్ అభిప్రాయం. రాజకీయ అభిప్రాయాలు ఆర్థిక పక్షపాత బుద్ధిని బట్టి ఏర్పడుతవిగాని, అందరి శ్రేయస్సునుబట్టి కాదని చెప్పి మార్క్స్ లోకానికి చాలా చెరుపు చేశాడని అతని విశ్వాసం.

ఈర్ష్యా ద్వేషాలతో కక్షలతో కుములిపోతున్న ఈ ప్రపంచం సుఖప్రదం, వాసయోగ్యం కావాలంటే పిల్లలను నేర్పుగా, మంచి పద్ధతులమీద తర్ఫీదు చెయ్యాలని అతను భావించాడు. ఈ ఉద్దేశంతో అతను పిల్లలకు పాఠశాలను నెలకొల్పి కొన్నాళ్ళు నడిపాడు. ఇక్కడ పిల్లలకు ఎటువంటి ప్రశ్నలు అడగటానికైనా స్వాతంత్ర్యం వుంది. ఆ ప్రశ్నలన్నిటికీ నిర్మొగమాటంగా, నిష్కపటంగా జవాబులు వచ్చేవి. ఏ పరిస్థితుల్లోనూ దాచటం అనేది వుండేది కాదు. శారీరక అంతస్థులో వారిని శిక్షించటం అనేది వుండేది కాదు. వారు ఎక్కడకు పడితే అక్కడకు వెళ్ళవచ్చు. ఏది చెయ్యదలచుకుంటే అది చెయ్యవచ్చు. ఒకరిపట్ల వొకరు మోటుగా వుండదలచుకున్నా వుండవచ్చు. వాళ్ళకు మత శిక్షణ అనేది వుండేది. బాలురూ బాలికలూ కలిసి స్నానాలు చేసేవారు. నగ్నంగా సూర్యరశ్మిలో తిరిగేవారు.

పిల్లలమీద ఏవిధమైన బాధ్యతా చూపకుండా, వాళ్ళను గాలికి వదలటం ఈ పాఠశాల ఉద్దేశమని ఎవ్వరూ భావించ నక్కరలేదు. సంఘంపట్లా, ఇతరుల పట్లా తమకు కొన్ని బాధ్యతలు వుంటాయనీ, వాటిని నెరవేర్చాలనీ వాళ్ళకి చిన్నప్పటినుంచీ నేర్పాలనీ, ప్రపంచపౌరులుగా సక్రమంగా తమ పాత్రను నిర్వర్తించడానికి, వారిని తయారు చెయ్యాలనే రసెల్ సంకల్పం. దీనికి తగిన వాతావరణం సృష్టింప బడేది; విద్య గరపబడేది. 1926 లో 'విద్యను గురించి' అనే గ్రంథం ప్రచురించాడు రసెల్. అందులో మంచి నడతకు శక్తి, ధైర్యం, సున్నితత్వం, తెలివితేటలు ముఖ్యావసరం అని చెప్పాడు. క్రమశిక్షణ పుటకనుంచీ ప్రారంభం కావాలి అన్నాడు. లేకపోతే, తరువాత తరువాత ఇతర అలవాట్లు అలవాటై కష్టసాధ్యం అవుతుంది అన్నాడు. సహజంగా బాల్యంలో తెలుసుకోవాలనే తృష్ణ వుంటుంది; దానికి తగిన అవకాశాలు తలిదండ్రులు కలిగించాలి.

రసెల్ బీకన్‌హిల్‌లో స్థాపించిన పాఠశాల జయప్రదం కాలేదు. దీనికి ఒక కారణం: సామర్థ్యం కలిగిన నిర్మాణ కర్త కాకపోవటం... దీనికి తగినట్లు అదే సమయంలో అత నికీ అతని భార్య డోరా రసెల్‌కీ అభిప్రాయ భేదాలు పొడ సూపాయి. ఈ భేదాలు 1934 లో విడాకుల కార్య క్రమంతో అంతమొందాయి. ఈ రోజుల్లో రసెల్ 'వివాహము, నీతి శాస్త్రము' అనే గ్రంథం ప్రచురించి, ఈ గ్రంథంలో వివాహాన్ని గురించి తనకున్న అభిప్రాయాలను వ్రాశాడు.

అతని దృష్టిలో వివాహం సంఘానికి నిరుపయోగ మైన సంస్థగానీ, పనికిమాలిన సంస్థగానీ కాదు. కాని భార్యాభర్తలను కఠిన నిబంధనలకు గురిచేసి వారి స్వాతంత్ర్యాన్నీ విశాల భావాలనూ అరికట్టే నిర్బంధ వ్యవస్థగా మాత్రం ఉండరాదు. వివాహవ్యవస్థ భార్యాభర్తలకు సుఖజీవనాన్ని ఇవ్వాలంటే చిన్నవాళ్ళకు సెక్సునిగురించీ, సెక్సు సంబంధాలను గురించీ ఎక్కువ విజ్ఞానాన్ని కలుగజెయ్యాలనీ, వివాహానికి పూర్వం సెక్సు సంబంధాన్ని గురించిన అనుభవం ఉండాలనీ; కోరినట్లు అయితే భార్యాభర్తలకు వివాహానికి బయట సెక్సుసంబంధం పెట్టుకునే స్వాతంత్ర్యం వుండాలనీ, విడాకుల నియమాలను, ఇప్పుడు ఇంగ్లండులో వున్నదాని కంటే సడలించాలనీ అతను వాదించాడు.

వివాహాన్ని గురించి రసెల్ వెలిబుచ్చిన అభిప్రాయాలు పెద్ద గాలిదుమారాన్ని లేపినై. పెద్దలు అనేకమంది అతని అభిప్రాయాలు నిరసించారు. అతను అవినీతిని ప్రచారం చేస్తున్నాడని దూషించారు. కాని ఈ అభిప్రాయాలను పొందుపరచిన అతని గ్రంథాలు మాత్రం విరివిగా ఖర్చు అయినై. అనేకమంది హృదయాలమీద అతని భావాలు తమ ప్రభావాన్ని ముద్రవేసినై.

౯

రసెల్లో రెండువిభిన్న లక్షణాలు కనిపిస్తాయి. గణిత శాస్త్రజ్ఞుడుగా, తత్వవేత్తగా అతను మిస్టిసిజాన్ని, ఆర్ద్రితను నిరసించాడు. కాని అతని సాంఘికతత్వ రచనల్లో ఇ

లక్షణాలూ విజృంభించి కనిపిస్తాయి. డ్యూరాన్ట్ చెప్పినట్లు అతని ఆర్థిక, సాంఘిక రచనల్లో, పై రచనల్లో చూపినంత నిర్దాక్షిణ్యమైన నిశిత విమర్శననుగానీ, అపనమ్మకాన్ని గానీ చూపడు. జీవితానికంటే నిద్దుష్టత ముఖ్యావసరం అనే అతని ఆవేశం రంగవల్లికలను చిత్రించి మనస్సులను ఉత్తేజపరుస్తుంది. ఈ భేదం అనుభవంవల్ల సంక్రమించిన భేదం అనిపిస్తుంది. అనుభవం జీవితాన్ని ఏ నిర్ణీత చట్టంలోనూ ఇరికించలేదని అతనికి బోధించింది. అతను వివిధదేశ నాగరికతలను పరిశీలిస్తూ చైనా దేశాన్ని సందర్శించినప్పుడు వెలిబుచ్చిన అభిప్రాయాలే దీనికి నిదర్శనం. 'నేను ఇదివరకు భావించినట్లు తెల్లజాతి ముఖ్యమైందని నేనిప్పుడు అనుకోవటం లేదు. యుద్ధంలో యూరప్ అమెరికాలు ఆత్మహత్య చేసుకున్నప్పటికీ, మానవజాతి నశించినట్లుకాదు. నాగరికత నిర్మూలం అయినట్లుకాదు. ఇంకా కొంతమంది చైనా దేశీయులు మిగిలివుంటారు. అనేక విధాలుగా చైనా గొప్ప దేశం-నేను చూచిన అనేక దేశాలకంటే గొప్పదేశం. జనాభా లెక్కలోనే కాక, సాంస్కృతికంగానే కాక, మేధస్సంపత్తి విషయంలోకూడా అది గొప్పదేశం. ఏదో ఒక చట్టంలోకి ఇరికించటానికి కాక ఉన్నదాన్ని ఉన్నట్లు, స్వాభావసిద్ధంగా గ్రహించిన హృదయంతో చూసేశక్తి ఈ దేశం నాగరికతకు గా, మరే దేశ నాగరికతకూ లేదు,' అని వ్రాశాడు.

ఏది ఏమైనప్పటికీ అతను ప్రేమించదగినవ్యక్తి. గణిత శాస్త్రాన్ని గురించి సూక్ష్మాతి సూక్ష్మంగా ఆలోచించ గలడు. గంభీరమైన తత్వశాస్త్రంలో లోతులను చూడగలడు. అయినప్పటికీ హృదయానికి చెందిన ఆవేశాలను చంపు కున్నవాడు కాదు. మానవాళికోసం అతని హృదయం ఎప్పుడూ స్పందిస్తూనే వుంటుంది.

—•••—

# 'మానవత్వ తత్వవేత్త'

## యం. యన్. రాయ్

యం. యన్. రాయ్ అసలు పేరు మానవేంద్రనాథ్ రాయ్. అతనికి మనిషి ముఖ్యం. ఏ వంకతోనైనాసరే, మనిషి స్వాతంత్ర్యేచ్ఛ అరికట్టబడగూడదని అతని ఉద్దేశం. నేడు మనిషి అనేకసిద్ధాంతాలమధ్య సతమతమౌతున్నాడు. అతని మానవత అనేక నెపాలతో సంకుచిత పడిపోతూవుంది. ఇది అతని అభివృద్ధికి దోహదకారి కాదు. ఒకవంక ఆధ్యాత్మిక వాదం భగవంతుని సృష్టించి, సృష్టి కార్యక్రమాన్ని అతని చేతుల్లో పెట్టి, మానవుణ్ణి అతని చేతుల్లోని కీలుబొమ్మను చేసి వొదిలింది. వేరొకవంక, భౌతికవాదం మలిన పరచబడటం వల్ల పుట్టిన ఆర్థిక సిద్ధాంతం, అతనిని తనకు బానిసను చేసుకుంది. ఈ విధంగా ఈ రెండు సిద్ధాంతాలూ, వ్యక్తిని నామమాత్రావశిష్టుణ్ణి చేసినై. అతనికి ప్రత్యేకత అనేది లేకుండాచేసి, తనదారిన తాను పోయే వొక పెద్ద యంత్రంలోని ములుకునిగా చేసినై. దీనివల్ల అతని సృజనాత్మకశక్తి నశించింది. అతను పతనమయ్యాడు. అతను చరిత్రను సృష్టించేవాడుకాక, చరిత్రకు బానిస అయ్యాడు. ఈ పరిస్థితిని ఈ విధంగా వర్ణించాడు, యం. యన్. రాయ్. 'అంతా ముందే నిర్దేశింపబడి వుంటే ...ను చరిత్రను ఏవిధంగా సృష్టిస్తాడు? సంఘటనలు

వొకదానినివొకటి అనుసరిస్తూ వుంటై. మానవునికి వాటితో ఎట్టి సంబంధమూ వుండదు. అతను ఆర్థిక దేవత చేతుల్లో కొరముట్టు మాత్రమే.' నేటి స్థితిని ఈ విధంగావర్ణించి ఇది కృత్రిమ వాతావరణాన్ని ప్రోత్సహిస్తూ వుందని చెప్పి యదార్థతను ఈ విధంగా పేర్కొన్నాడు. 'విప్లవం చెయ్య వలసిన అవశ్యకతను ఎప్పుడైతే గుర్తించామో, అప్పుడే మానవుని ప్రాముఖ్యతను అంగీకరించినట్లే తేలుతుంది. ధనికవాదం నశిస్తుంది; దాని స్థానంలో సామ్యవాదం పెరుగుతుంది అంటున్నాం. కాని ఇంతకుముందు ఉదహ రించిన ఆర్థికవాదం ఈ పని ఎలా జరుగుతుందో చెప్ప లేదు. కాబట్టి మార్క్సు ఈ ఆర్థిక సిద్ధాంతాన్ని సృష్టించి, విప్లవం జరిగే అవకాశం కలిగించటానికి, తన నమ్మకా న్నుంచి తానే తప్పుకోవలసి వచ్చింది. అందుకని చరిత్ర నిర్మాణ కృషిలో మానవుని అవుసరాన్ని అతను అంగీక రించాడు. అందుకని అతను ధనికవాదం చరమ దశకు వొచ్చి వున్నప్పటికీ, కార్మికులు విప్లవంచేసి దాన్ని నిర్మూ లిస్తే తప్ప, అది ఎల్లప్పటికీ మనగలదు అని చెప్పాడు,' అన్నాడు, 'రాడికల్ మానవవాదం' అనే గ్రంథంలో

అయితే మనిషికి ఈ శక్తి ఎక్కడనుంచి వచ్చింది? ప్రకృతి పరిణామ ఫలితంగా వొచ్చినవాడే కదా ఈ మనిషి? మరి ఇతర ప్రకృతిలో కనపడని ఈ శక్తి మనిషికి ఎక్కడ నుంచి వొచ్చింది? మనిషికి మెదడు అనేది ఏర్పడటంతో ఈ శక్తివచ్చింది. 'మెదడు మానవుడు సృష్టించిన ఉత్పత్తి సాధనాలన్నిటికన్నా బలమైనదీ, గొప్పదీ. ఈ

భావాలను సృష్టిస్తుంది. ఈ భావా లనేవి ఎటువంటి పని నైనా చెయ్యగలుగుతవి. కాబట్టి ప్రపంచ పరిణామంలో ఈ భావా లనేవాటికి ఉచిత స్థానం ఇవ్వకుండా ఏ సిద్ధాంతాన్ని నిర్వచించినా అది అసమగ్రమమే అవుతుంది. మానవుణ్ణి ఏదో వొక శక్తికి బానిసనుగా మాత్రమే తయారు చేస్తుంది. భావాల స్వభావాన్నీ వాటి శక్తినీ తెలుసుకొని వాటికి సముచిత స్థానాన్ని ఇవ్వకపోవటం వల్లనే పూర్వ సిద్ధాంతాలన్నీ ప్రపంచ చరిత్రలో మానవునికి తగిన స్థానాన్ని ఇవ్వలేకపోయినై. నేటి మానవుని పతనానికి ఇదే కారణం. మానవుని బుద్ధి బలానికి ప్రాధాన్యత ఇవ్వకపోతే 'సంఘటనల తీరు ముందే నిర్ణయింప బడినట్లు అంగీకరించ వలసి వస్తుంది. ఆ నిర్ణయం ఆర్థిక సూత్రాలవల్లనో, భగవంతుని వల్లనో జరుగుతుంది. ఇక సంఘటనలమీద మానవునికి ఏమి పెత్తనం ఉంటుంది? మానవుడు వాటిని ఏవిధంగా మార్చగలుగుతాడు? అలా చెయ్యలేనప్పుడు బ్రతుకుకోసం అతను చేసే ప్రయత్నం వృధాయే అవుతుంది. ఈ భూమిమీాది మానవుని చరిత్ర విషాదాంతకమే అవుతుంది,' అంటాడు యం. యన్. రాయ్.

ఇదొక విషవలయం. ఈవిషవలయం బ్రద్దలు కొట్టాలంటే మనం వొక ప్రశ్న వేసుకోవాలి. దినికి జవాబుకోసం మొట్టమొదటి ఉత్పత్తిసాధనం ఏవిధంగా సృష్టించబడిందో తెలుసుకోవాలి. అప్పుడుగాని మనిషి తన్ను తాను తెలుసు ...నే జ్ఞానాన్నీ, చరిత్రను మలపగలిగిన శక్తినీ ఏవిధంగా ...చాడో తెలుసుకోలేం. మొదటి ఉత్పత్తి సాధ

నాన్ని ఎవ్వరు సృష్టించారు? దీనిని మనం ఈవిధంగా ఊహించవచ్చు. పరిణామం వానరదశలో వున్నప్పుడు ఒక వానరం పండ్లకోసం చెట్టు ఎక్కక, చెట్టు కొమ్మను విరిచి, పండ్లను దానితో రాల్చుకుంది. ఈనాటి మన పరిస్థితినుంచి గమనిస్తే, ఈ విషయం చాలా స్వల్ప విషయంలా కని పిస్తుంది. కాని ఈ ఒక్కపని ప్రరిణామం నడకనే మార్చి వేసిందని మనం చెప్పుకోవచ్చు. బ్రతుకుకోసం మానవుడు చేసే ప్రయత్నానికి ఒక నూతన బలాన్ని చేకూర్చిందని చెప్పుకోవచ్చు. అయితే ఈ మొదటి ఉత్పత్తి సాధనం ఎవ్వరివల్ల సృష్టించబడింది? ఎక్కడ సృష్టించబడింది? మొదటి ఉత్పత్తి సాధనం వానరంవల్ల సృష్టించబడింది. వానరం మెదడులో సృష్టించబడింది. అంతేకాని ప్రకృతికి బయటకాదు. పరిణామానికీ బయటకాదు. ఇంతకుపూర్వం పరిణామం జరిగినట్టు జరగవలసివస్తే, చెట్టు ఎక్కకుండా, కోతి పండ్లను కోసుకోదలిస్తే తన చేతులనే క్రమక్రమేణా పొడుగుచేసుకోవలసి వుండేది. అలా జరక్క ఒక కోతి తన బుద్ధిబలం వుపయోగించి, తనకు బయటగా ప్రకృతిలో వున్న వొక కొమ్మను, తన ప్రయోజనానికి కొరముట్టుగా ఉపయోగించుకుంద. అప్పటినుంచీ ప్రకృతిలో వున్న వస్తువులను స్వీయాభివృద్ధికి వుపయోగించుకునే అధ్యాయం ప్రారంభం అయింది. బుద్ధిబలానికి ప్రాముఖ్యత ఎక్కువ అవుతూ వొచ్చింది. ఈ విధంగా భావాలకు, పరిణామంలో, ప్రముఖ పాత్ర వహించే స్థితి వచ్చింది.

పై విధంగా మొదటి ఉత్పత్తి సాధనాన్ని, భావాల శక్తినీ నిర్వచించి, పరిణామానికి దోహదం చేసే మానవాతీతశక్తి ఒకదానిని అవసరం లేకుండా చేశాడు యమ్. యన్. రాయ్. 'ఇలా వూహించటంవల్ల సాంఘిక తత్వశాస్త్రాన్ని మూఢనమ్మకాల బారినుంచి తప్పించటానికి వీలవుతుంది. భావాలపుట్టుకను శాస్త్రీయ దృక్పథంతో విశద పరచటానికి వీలవుతుంది. పరిణామంలో భావాలకు సముచిత స్థానాన్నిచ్చి విశాలమైన, తన్నుతాను పోషించుకోగలిగిన వొక నూతన తత్వశాస్త్రాన్ని నిర్మించటానికి వీలవుతుంది. ఇదే భవిష్యత్తు గలిగిన తత్వశాస్త్రం' అన్నాడు. దీనికి 'రాడికల్ మానవ తత్వశాస్త్రం' అని నామకిరణం చేశాడు.

తన శారీరక నిర్మాణానికి సంబంధంలేని ఉత్పత్తి సాధనాన్ని, ఇంతకుముందు మనం తెలుసుకున్న విధంగా, బాగా వృద్ధిచెంది మెదడు కలిగిన, ఆలోచించగలిగిన, జంతువు వొకటి సృష్టించింది. అయితే ఈ సృష్టికి ముందు, దానికి, ఈ సృష్టిని ప్రోత్సహించిన భావం వొకటి కలిగివుండి వుండాలి. అది మొదటి ఉత్పత్తి. మనం మాట్లాడుకునే ఆర్థిక ప్రభావాన్ని పరిశీలించినట్లయితే, సాంఘిక నిర్మాణం పునాది పడినప్పటినుంచే, ఇది ప్రారంభం అయినట్లు కనపడుతుంది. కాబట్టి భావాల జన్మస్థానం తెలుసుకోటానికి దీనినిదాటి వెతకవలసి వస్తుంది. నిజం చెప్పాలంటే, మనిషి మెదడులో పుట్టిన భావమే ఈ ప్రభావానికికూడా కారణం అని చెప్పకో వస్తుంది.

మానవ చరిత్రమీద అనేక ప్రభావాలుపడి, దానికి సరిహద్దులను ఏర్పరుస్తవనేమాట నిజమే. ఆ ప్రభావం ఏదో వొకటే అనుకోవటం మాత్రం ప్రమాదం. ఆర్థిక శక్తులనేకాక, భావాలను కూడా మనం అజలోకి తీసుకోవాలి. ఈపరిస్థితి దృష్టిలో వుంచుకునే యం. యన్. రాయ్, 'భావాల పరిణామశక్తి అర్థికాభివృద్ధి యొక్క తార్కిక క్రమం - ఈ రెండూ సమానాంతరంగా నడుస్తుంటై. ఈ రెండూ మానవుని స్వతంత్రేచ్ఛనుంచి ఉద్భవించినవే. కొంతకాలం గడిచింతర్వాత ఈ రెండూ వొకదానినొకటి ప్రోత్సహించుకుంటూ అభివృద్ధికి తోడ్పడతై. ఈ రెండూ శక్తులను కలుపుకు రాగలిగిన సిద్ధాంతాన్ని మనం నిర్మించ గలిగినప్పుడే, మానవుని వ్యక్తిత్వాన్ని భంగపరచకుండా సమగ్ర పురోభివృద్ధికి తోడ్పడగలం' అన్నాడు.

సంఘానికి రూపురేఖలు దిద్దగలిగిన శక్తిమంతుణ్ణిగా మనం మానవుణ్ణి పరిగణించటం మన ప్రథమకర్తవ్యం అని యం. యన్. రాయ్ ముఖ్యోద్దేశం. సాంఘిక నిర్మాణాన్ని మొత్తం మొత్తంగా పరిణామం చెదించగలిగిన శక్తి మనిషికి వుంది. దేనికోసం అతను మరో శక్తిమీద ఆధారపడవలసిన అవసరంలేదు. అందువల్ల ఏశక్తికీ అతను బానిసగా ఉండవలసిన అగత్యంలేదు.తనలో నిగూఢంగావున్న శక్తులను స్వప్రయత్నంవల్ల విజృంభింపజేసుకుంటూపోవటమే అతను చెయ్యవలసిన పని. అతను, తన స్వాతంత్ర్యాన్ని దేనికీ బలిపెట్టకుండా తన సాంఘిక బాధ్యతలను నిర్వర్తించ

స్వతంత్ర సంఘం అనేది స్వతంత్ర వ్యక్తుల కలయికగా మాత్రమే రూపొందగలుగుతుందిగాని, బానిసల కలయిక వల్ల కాదు కాబట్టి సాంఘిక బాధ్యతల నిర్వహణకూ, వ్యక్తి స్వతంత్రతకూ వైరుధ్యం లేదు; ఉండగూడదు.

ఈ అన్ని భావాలకూ అనుగుణంగా రాయ్ తన రాడికల్ మానవత్వ తత్వాన్ని రూపొందించాడు. తన తత్వ విచారణను తానే ఈ విధంగా వర్ణించాడు - "రాడికల్ మానవతత్వం అన్నిటికీ కొలబద్ద మానవుడే అని చెపుతుంది. ఇందులో క్రొత్త ఏమీ లేదు. రెండువేల అయిదువందల సంవత్సరాల క్రితం ప్రొటోగొరాస్ ఈ మాటే చెప్పాడు. అయినప్పటికీ మానవజాతి తన 'ఆత్మ'ను తాను మరచి పోయినట్లు కనుపిస్తుంది. మార్క్సు కూడా ఈ విముక్తి సూత్రాన్నే పునరుద్ఘాటించాడు కాని అతని శిష్యులుమాత్రం సమిష్టికోసం వ్యక్తి ఆహుతి అవ్వాలని బోధిస్తున్నారు. కారల్‌మార్క్సు మానవజాతికి మనిషే తల్లివేరు - అని చెప్పాడు. దీని అర్థం ఏమిటి? మనిషి ముఖ్యం - తరువాత మానవజాతి. తన శక్తులను విజృంభింప జేసుకోటానికిగాను తాను సృష్టించుకొన్న సంఘానికంటే తాను ముఖ్యం.

మానవ స్వాతంత్ర్యాన్ని నిరసించటంవల్ల, కొంత మంది పురోగమనం అనే భావాన్నే హేళనచేసే స్థితికి వస్తు న్నారు. కాలంలో వొకదాని తర్వాత వొకటిగా జరిగే సంఘటనల కలయికగా మాత్రమే చరిత్రను పరిగణిస్తూ. అసలు పురోగమనం అనేదే మిథ్య అంటున్నారు. ఈ దృష్టిని, మాటిమాటికీ అపజయాన్ని మాత్రమే

సాధించే పూర్వపు విప్లవ పద్ధతులు, మరీ బలపరుస్తు న్నాయి. అన్నిటికీ 'గ్రహచారం' అనుకునే మనస్తత్వాన్ని ప్రోత్సహిస్తున్నాయి. 'రాడికల్ మానవత్వ తత్వశాస్త్రం' విప్లవంలో వొక నూతన వైఖరిని సూచిస్తుంది. ఇది వొక తాత్విక విప్లవం. మెదడులో, భావాల్లో, మానవుని చైత న్యంలో జరిగే విప్లవం ఇది. దౌర్జన్యపూరితమైన పాత విప్ల వాలకంటే ఇది బలమైనది..."

౨

యం. యన్. రాయ్ మామూలు తత్వవేత్తలమల్లే వృద్ధిచెందినవాడు కాదు. అనేక రాజకీయాలలో పనిచేసి, అనేక దేశాలు తిరిగి, ఎనలేని అనుభవాన్ని గడించి, విస్తృతం అవుతున్న తన అనుభవాన్నిబట్టీ, అభివృద్ధి చెందు తున్న జ్ఞానాన్నిబట్టీ, మారుతూవొచ్చిన మనిషి. అతను తన పదునాల్గవయేట హిందూదేశపు విప్లవోద్యమంలో పాల్గొన్నాడు. బాంబులద్వారా, తుపాకుల ద్వారా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించగలం అనుకున్నాడు. వాటి సేకరణ నిమిత్తం ఇతర దేశాలకు వెళ్లాడు. చైనా, జపాన్, మొద లయిన తూర్పుదేశాలన్నీ తిరిగాడు. మెక్సికో వెళ్ళాడు. అక్కడ కమ్యూనిస్టుపార్టీని స్థాపించాడు. అక్కడనుంచి లెనిన్ పిలుపుమీద రష్యా వెళ్ళాడు. కమ్యూనిష్టు ఇన్టర్నేష నల్ వ్యవస్థాపకుల్లో వొకడయ్యాడు. ఆరోజుల్లో అతను లెనిన్ ముఖ్యసహచరుల్లో వొకడు. అక్కడవుండగానే

కమ్యూనిష్టుపార్టీ నడిపే విప్లవానికి సహాయపడటానికిగాను ప్రత్యేక ప్రతినిధిగా చైనావెళ్ళాడు. తరువాత వలసదేశాల్లో అనుసరింపవలసిన విప్లవమార్గాన్నిగురించి అతనికీ రష్యా నాయకులకూ అభిప్రాయభేదాలు వొచ్చినై. 1930 లో స్వదేశం వచ్చాడు. అతనికి ఆరుసంవత్సరాలు కఠిన ఖైదు విధించబడింది. జైలునుంచి బయటకు వచ్చేంతర్వాత అతను కాంగ్రెస్‌లో జేరి స్వాతంత్ర్యోద్యమంలో కృషి చెయ్యటానికి నడుం కట్టాడు. ఇక్కడ జరగవలసింది ప్రజాస్వామిక విప్లవమేగాని, కమ్యూనిష్టు విప్లవం కాదుగనక కాంగ్రెస్ స్థిరైన నాయకత్వం క్రింద నడిస్తే ఈ విప్లవాన్ని సాధించగలదు-అని నమ్మి పనిచేశాడు. కాంగ్రెస్‌లోనే తీవ్రవాద గ్రూపు నొకదాన్ని స్థాపించాడు. తరువాత తాను ఆశించి నట్లు జరుగక పోయేటప్పటికి వేరుగా రాడికల్ డిమోక్రటిక్ పార్టీని స్థాపించి, దానికొక కార్యక్రమాన్ని రూపొందించి ప్రచారంచేశాడు. తరువాత అనుభవంల్ల పార్టీ రాజకీయాలు తమ ఆదర్శాన్నే తాము సాధించలేవని గ్రహించి ఆ పార్టీని రద్దుచేశాడు. పార్టీలేని రాజకీయాలను 'నవ్యమానవవాదం' అనే పేరుతో ప్రచారంచేశాడు. దీనికే తరువాత తరువాత 'రాడికల్ మానవవాదం' అని నామకరణం చేశాడు. "ఈ మార్పుకి కారణం 'నవ్య' అనే మాట సాపేక్షం. అందుకని కాలంగడిచినకొద్దీ అర్థంలేనిదిగానీ, నేను భావించిన అర్థం స్ఫురింపజెయ్యలేనిదిగానీ, కావచ్చు. అందువల్ల 'నవ్య'కు 'రాడికల్' అనేమాటను వాడుకపరచాను" అన్నాడు.

పార్టీ రాజకీయాలకు దూరం అయినప్పటినుంచీ రాయ్ తన జీవితాన్ని తత్వపరిశీలనకు పూర్తిగా వినియోగించాడు. అనేక గ్రంథాలను రచించాడు. ఇంతవరకు ప్రచురించబడిన వాటిల్లో 'తర్కం, ఊహాగానం, విప్లవం' అనేది ఉత్తమగ్రంథం. నేటి పరిస్థితిని పరిశీలిస్తూ, ఇ. పి. డబ్ల్యు. డాకోస్టా అనే ఆయన ఇలా వ్రాశాడు; రాయ్‌ని గురించీ, రాయ్ సిద్ధాంతీకరించిన రాడికల్ మానవత్వ తత్వశాస్త్రాన్ని గురించి. "రాడికల్ మానవత్వం హిందూ దేశంలో వ్యాపించే అవకాశం వున్నట్లు కనుపించదు. ఈ విప్లవకారుడు ఓడిపోయే సమరాన్ని సాగిస్తున్నాడు. ఇది వొక విధంగా దురదృష్టం. రాయ్ తత్వ పరిశీలనలో కంటే, అనుభవైక రాజకీయాల్లో వుంటేనే మంచిది అనుకుంటాను. కాని దివ్య సౌధాల్లో కూర్చొని మాట్లాడని రాజకీయ తత్వవేత్త ఒక్కడైనా ఈ దేశంలో వుండటం చెప్పుకో దగ్గదే. రాడికల్ మానవత్వం ఒక తత్వశాస్త్రంగా వ్యాప్తిలోకి రాకపోయినా, రాయ్ వ్యక్తంచేసే అనేక భావాలు ఆచరణలోకి రావలసిన అవుసరం చాలా వుంది...."

## 3

భగవంతు డనేవాణ్ణి ఒకనిని సృష్టించుకొని ప్రపంచ సృష్టినీ, మనిషి భవిష్యత్తునూ, అతని చేతుల్లో పెట్టి మనిషికి వ్యక్తిత్వం అనేది లేకుండా చేసి, మానవుణ్ణి ఏదో వొక శక్తి చేతుల్లో కీలుబొమ్మను చెయ్యకుండా ఈ ప్రప

అర్థం చెప్పుకోవాలనీ, అందుకుగాను ఈనాటి భౌతికవాదం చేసినట్లు ప్రపంచంలోని కొన్ని విలువలను అంగీకరించకుండా ఉండకుండా మానవ స్వాతంత్ర్యాన్నీ నైతిక విలువలనూకూడా కలుపుకొనివచ్చే తత్వశాస్త్రాన్ని నిర్మించాలనీ, అది నేటి అవుసరమనీ యం. యన్. రాయ్ ఉద్దేశం. ఈ ఉద్దేశంతోనే అతను మాటిమాటికీ, 'మొత్తం ఉనికిని అంతా, సమగ్రంగా చుట్టుకు రాలేని తత్వశాస్త్రం, వ్యక్తి సమస్యలనూ, సాంఘికసమస్యలనూ పరిష్కరించలేదు. తన ప్రయత్నంలో తాను అపజయమే పొందుతుంది,' అని చెప్పేవాడు. ఇందుకు తత్వవిచారణకూ, శాస్త్రానికీ, సంఘానికీ వున్న సంబంధాని స్పష్టంగా నిర్వచించాలి అన్నాడు. సైన్స్ స్వభావం అందరికీ తెలిసిందే... దీనికి నీతిశాస్త్రాన్ని కూడా జోడించగలగాలి.

వేదాంతం నైతిక విలువను బోధించేమాట నిజమే. మానవుడు నైతికంగా బ్రతకాలని అది బోధిస్తుంది. అయితే ఈనైతిక విలువల పుట్టుకను అది సిద్ధాంతీకరించలేక మనిషికి విడిగా వుండే మరేశక్తికో, మరేకారణానికో ముడిపెడుతుంది. అందువల్ల 'మనిషి నీతిగా ఎందుకు బ్రతకాలి?' అనే ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేకపోయింది. మనిషి అవినీతిగా బ్రతకటంవల్ల, అనేక భౌతిక సుఖాలను పొందగలుగుతున్నాడు. నీతిగా బ్రతకదలచినవాడు అనేక కష్టనష్టాలకు లోను కావలసి వస్తూంది. ఎందుకిలా జరగాలి? ఈ ప్రశ్నకు పూర్వజన్మగానీ, రాబోయే జన్మగానీ జవాబుగా చెప్పటం అతని మనస్సుకు శాంతిని చేకూర్చటం లేదు.

కాని ఇప్పుడు పరిస్థితులు మారినయ్. మారిన ఈ పరిస్థితులను గురించి రాయ్ ఇలా అన్నాడు. 'సైన్సునీ, తత్త్వవిచారణనీ ఇక వేరు వేరుగా అట్టిపెట్టటానికి వీల్లేదు. ఈ రెంటి వైరుధ్యాన్నీ పోగొట్టటమే ఈ యుగం ప్రత్యేకత. ఇంతకు ముందు, కాలం ఆకాశం, పదార్థం, కారణత్వం, భావ ప్రపంచానికీ ఊహా తత్త్వపరిశీలనకూ అందుబాటులోకి వొచ్చినై. అందుబాటులోకి రావటమేకాదు; ఈ సమస్యలను అది పరిష్కరించింది కూడా... మామూలుగా మనం తత్త్వశాస్త్రం అని దేన్ని అంటున్నామో అది శాస్త్రంతో కలిసింది... దీనివల్ల ప్రకృతినీ, జీవితాన్నీ, సంఘాన్నీ-మొత్తం అన్నిటికీ వర్తించే విధానాన్నొక దాన్ని నిర్మించే అవకాశం కలిగింది. సమస్యల నన్నిటినీ భౌతిక పరిణామానికి నేడు అన్వయం చెయ్యవచ్చు. శాస్త్రజ్ఞానంతో నాటి పరిష్కార మార్గాలుకూడా తెలుసుకోవచ్చు. విలువలుకూడా సంగతులే గనక, సంగతులకూ, విలువలకూ వున్న భేదం నశించింది. కాబట్టి నేటి మానవుడు నైతిక విలువలను నిరసించవలసిన పనిలేదు. అవి తనలోనుంచి పుట్టుకువచ్చినవే'

నైతిక విలువలు నిజమైనవి. ఎక్కడినుంచో వూడిపడినవని మనం ఊహించి, వాటిని క్రీగంట చూడవలసిన అగత్యంలేదు. ప్రపంచం క్రమత్వం కలిగింది. ఆ క్రమత్వానికి సంబంధించినవే నైతిక విలువలు. కాబట్టి ఈ నైతిక స్వభావం వ్యక్తిపరమైంది. అందువల్ల వ్యక్తే దీన్ని ఆచరించగలడు. మన పూర్వీకులు దీనికి భిన్నంగా ఆలోచించారు. కొందరు నైతిక విలువలు ఆచరణలో కా

ముందు ఉత్తమ సంఘం అవసరం అనుకున్నారు. లిబరల్స్ మంచి జీవితం, మంచి న్యాయచట్టాలవల్ల మాత్రమే ఇది కలుగుతుంది అనుకున్నారు. సోషలిస్టులూ, కమ్యూనిస్టులు సమిష్టి యాజమాన్యం క్రింద ఆర్థిక పునర్నిర్మాణం జరిగితే, దీనికి తగిన వాతావరణం ఏర్పడుతుం దనుకున్నారు. దీని పర్యవసానంగా ఏదో వొక రూపంలో వున్న సమిష్టి భావానికి వ్యక్తి లోబడిపోయాడు; సమిష్టికోసం వ్యక్తి ఆహుతైపోయాడు; వ్యక్తికి వ్యక్తిత్వంపోయి వొక కొరముట్టుగా తయారయ్యాడు. వ్యక్తి ఇలా అయిపోవటంవల్ల భయంకర పరిస్థితులు ఏర్పడినై. రాయ్ చెప్పినట్లు, 'నేటి ప్రపంచ పరిస్థితులు, వినాశకరంగానూ, నీతి బాహ్యంగానూ, నీచస్థితిలోనూ వున్నయి. దీని పర్యవసానం సర్వవినాశనానికి దారి తీసే యుద్ధంగానో, నాగరికతను తుడిచిపెట్టే ఘోర దుస్థితిగానో పరిణమించేటట్టు వుంది... మనిషికి, తనమీద తనకు నమ్మకంపోయింది. కాబట్టి భవిష్యత్తు అంధకార బంధంగా కనిపిస్తూవుంది. ఇది నిజంగా విషమపరిస్థితి. నేడు మానవుని శక్తులు ఇంతకుపూర్వంకంటే బాగా విజృంభించి వున్నయి; అతనికి జ్ఞానం ఎక్కువైంది. దానితోపాటు శక్తికూడా ఇనుమడించింది. అయినప్పటికీ ఏదో ఎక్కడో అతనిలో కొరత పడ్డట్టు కనుపిస్తూవుంది. అతని సృజనాత్మక శక్తి కుంచుకొని పోతూవుంది. ముందుకు సాగిపోవాలనే అతని సహజతృష్ణ కుంటుపడింది. అతని మానసికస్థాయి, అతని న్యాయదృష్టి, అతని భౌతిక అభివృద్ధికి తగిన స్థితికిరాలేదు. నేటి విషమ ... ఇదే ముఖ్యకారణం?'

ఈవిషమ పరిస్థితినిదాటి మనిషిలోవున్న సృజనాత్మక శక్తివిజృంభించేటట్లు చెయ్యాలంటే, మనిషికి తనమీద తనకు నమ్మకంకుదిరేట్టు చెయ్యాలి. మనిషిని నీతిమార్గాన నిలబెట్టాలి. అలా నిలబడటంలో అతనికి ఆనందం కలిగేటట్టు చెయ్యాలి.

లిబరల్ తత్వశాస్త్రంలో 'నీతి'కి మంచి స్థానమే వుండేది. వ్యక్తి న్యాయదృష్టితో కూడుకున్నవాడు అనే ఉత్తమోత్తమమైన సూత్రం మీద అది నిర్మించబడింది. పాశ్చాత్య దేశాల్లో క్రైస్తవ మతం కూడా ఈ దృష్టినే ప్రచారం చేసింది. కాని ఈ దృష్టి, మానవుడు నీతిగా వుండటానికి కారణం పరమాత్మ అంశమైన 'ఆత్మ' అనేది వొకటి వుండటం – అని చెప్పుకోవటంవల్ల, మానవుని ప్రాధాన్యతను క్షీణింపజేసింది; మానవుణ్ణి పరమాత్మ చేతుల్లోవున్న ఆటవస్తువుగా మార్చింది. దీనివల్ల అతని స్వతంత్రత దెబ్బతిన్నది. దీనివల్ల మానవుడు తనకుతానుగా నీతిగా బ్రతకలేడనీ, అతను నీతిగా బ్రతకాలంటే, అతనికి అతీతంగా ఉండేశక్తికి లోబడి వుండాలనీ తేలింది. దీనివల్ల మతం తన ఆదర్శాన్ని తానే రూపు మాపుకుంది.

ఈ మతదృష్టికి విరుద్ధంగా లిబరల్స్ 'నీతిగాఉండటం ప్రయోజనకారి' అనే సిద్ధాంతాన్ని లేవదీశారు. కాని 'ప్రయోజనం అంటేఏమిటి?' అనే ప్రశ్న ఉదయించేటప్పటికి ఈ సిద్ధాంతం ముక్కలు ముక్కలైంది. ఒక్కొక్కరు వొక్కొక్క ప్రయోజనాన్ని స్థిరపరచుకోవటం, దానిని సాధించిపెట్టేదే నీతి అనుకోవటం జరిగింది. దీనివల్ల నీతి నిలబడటానికి ఆధారం లేకుండా పోయింది.

కాబట్టి మానవజీవితంలో నీతికి స్థిరస్థానం ఏర్పరచాలంటే దానిని మానవుని ఉనికిలోనే కనిపెట్టాలని యం.యన్ రాయ్ సంకల్పం.

నేటిశారీరక శాస్త్రం మానవుణ్ణి పూర్తిగా పరిశోధించింది. ఈనాడు మానవుడు పరిష్కరించబడని సమస్య కాదు. మానవుడు జీవితపరిణామంయొక్క ఫలితం. నీతిని మానవుని ఉనికిలోనే కనిపెట్టటానికి, 'ఆత్మ' అనేదాని పునాదులైన వాసనలనూ, ప్రేరణలనూ, పరిశీలించాలి. ఇవి క్రమబద్ధమైన ప్రకృతిలోనుంచి వచ్చినవే. ప్రాణం పదార్థంలోనుంచి వచ్చింది. అందువల్ల మనిషికి పునాది క్రమబద్ధమైన ప్రకృతే ప్రకృతి క్రమబద్ధమైన దనటంవల్ల, నీతి, హేతుతత్వం దీని లోనుంచి పుట్టనవే. అందువల్ల హేతువాదిగా వుండటం, నీతి పరుడుగా వుండటం మానవ స్వభావానికి సంబంధించిందే. దీనికోసం బయట వెతుకనక్కరలేదు అంటాడు రాయ్. "నీతికి మనిషిలోవున్న హేతుతత్వమే ఉనికి. అప్పుడే, అతను నిర్నిమిత్తంగా, స్వేచ్ఛాపూర్వకంగా నీతిబద్ధుడుగా ఉండగలడు. నీతిగా వుండటానికి మనిషిలోవున్న హేతుతత్వ స్వభావమే కారణం. దీనికి ఎవ్వరి 'ఆత్మ'కు వారికి నచ్చటమే ప్రోద్బలం. 'ఆత్మ' అంటే మనం తెలుసుకో లేనిదీ, మన ఊహకు అందనిదీకాదు. చైతన్య స్థాయిలో జరిగే జీవిత చర్యేఅది. మనిషిలో నిగూఢంగా వున్న హేతు తత్వం, స్నేహపూరితమైన సాంఘిక నిర్మాణానికి ఆధారం- అదే నీతియుక్తంగా వుండే సాంఘికవ్యవస్థకూడా. ఎందుకంటే ఉండటం అనేది హేతుతత్వ చర్యే."

౪

రాడికల్ మానవత్వం, అన్ని విలువలూ స్వాతంత్ర్యేచ్ఛనుంచి వెలువడేవే అని చెపుతుంది. స్వాతంత్ర్యేచ్ఛ అన్ని విలువలకంటే ముఖ్యమైంది. ఎందుకంటే మానవుని జీవితంయొక్క సారం అదే. కాబట్టి మానవుడు నీతిగా వుండాలంటే తన మానవతను కాపాడుకుంటే చాలు, భగవంతునికోసం వెతకనక్కరలేదు.

భూమిమీద కాలు మోపగానే తన బ్రతుకుకోసం మానవుడు పరిస్థితులతో పోరాటం ప్రారంభించాడు. అతను స్వతంత్రతకోసం చేసే ప్రయత్నానికి ఇదే నాంది. అప్పటినుంచీ మానవుడు సాధించిన విజయాలన్నీ ఈ కోర్కెలవల్ల ప్రోత్సహించబడ్డవే. మానవుని పరిస్థితులు అంటే విశ్వం అన్నమాట. విశ్వం అనంతం గనక స్వాతంత్ర్యం కోసం అతను చేసే ప్రయత్నం కూడా అనంతంగా సాగవలసిందే. జ్ఞానసేకరణకూ, పరిస్థితులను అర్థం చేసుకొని వాటిని జయించటానికీ కూడా ఈ కోర్కె పునాది అని మనం చెప్పుకోవచ్చు. స్వాతంత్ర్యంకోసం జరిపే ఈ పోరాటంలో మానవుడు 'సత్యం' తెలుసుకో గలుగుతాడు. సత్యం అనేది జ్ఞానంలో వుండేదేగాని, మనకి అందని వస్తువు ఏమీకాదు.

స్వాతంత్ర్యం, జ్ఞానం, సత్యం — ఇవి వొకదానికి వొకటి సంబంధించినవి. అందువల్ల నీతి బాహ్యమైన సాధనాలతో మనం స్వాతంత్ర్యాన్ని సాధించలేం. నీతిగా ఉండటం మనిషికి స్వభావసిద్ధమైన పని. అసా

కతకు పాల్పడితే మనం ప్రపంచ గమనాన్నుంచి వేరై ఇంకా బంధాలు పెనవేసుకుంటాం. అందువల్ల మనిషి దేన్ని సాధించాలన్నా, క్రమక్రమేణా వృద్ధిపొంది విముక్తి పొందాలన్నా, నీతిగా వుండటం ప్రథమ కర్తవం.

రాయ్ తన సిద్ధాంత లక్షణాలను పై విధంగా విడమరచి చెప్పి, తనయొక్క సిద్ధాంతం సమగ్రతను ఈ విధంగా ఉద్ఘాటించాడు 'రాడికల్ మానవత్వం నవ్యశాస్త్ర ప్రమాణాలమీద మానవుని ప్రాముఖ్యతను విశదపరుస్తుంది. మానవుణ్ణి గురించి ఇంతకుముందున్న అపోహలను నిర్మూలిస్తుంది. హేతుతత్వ, నీతిదాయక మానవసంఘం, మానవ స్వభావం అటువంటిదే అవటంవల్ల, వర్ధిల్లుతుందని చెపుతుంది. దీనికి పైనుంచి ఎటువంటి బలవంతం ప్రయోగించచనవసరం లేదు. ఈనాటి విషమ పరిస్థితినుంచి బయటపడే దారిని చూపుతుంది గనక ఈ తత్వాన్ని సాంఘిక తత్వశాస్త్రంగా పరిగణించవచ్చు. కాని ఇది మామూలు ప్రకృతి శాస్త్రినుంచి నిర్మించబడింది. పదార్థ ప్రపంచాన్నీ, మానసిక ప్రపంచాన్నీ ఇది కలుపుకొని వస్తుంది. దీని తత్వ విచారణ భౌతిక వాస్తవికతమీద ఆధారపడింది. సృష్టి స్వభావము క్రమబద్ధమైనది. ఈ తత్వంలో భావనా, ఇంద్రియజ్ఞానం సమన్వయం చెయ్యబడినవి. మనస్తత్వ శాస్త్రింతో, శారీరక శాస్త్రంతో జతపరుపబడింద. ఈ పని రసాయనికశాస్త్రింతో డ్పాడుతో జరిగింది. ఇది నీతిని హేతుతత్వంమీద ఆదార పడేటట్టు చేసింది. హేతు తత్వం ప్రకృతి స్వభావంఅయినట్లు నిరూపించింది.'

## ౫

ఈనాడు ప్రచారంలో వున్న ఆధ్యాత్మిక భౌతిక వాదాలు వ్యక్తిస్వాతంత్ర్యానికీ, నైతిక విలువలకూ, తగిన స్థానాన్ని నిరూపించలేక, అసమగ్ర సిద్ధాంతాలుగాతయారై మానవునికి సంతృప్తిని ఇవ్వలేకపోతున్నాయి. ఈ పనికి యం. యన్. రాయ్ పూనుకొని 'రాడికల్ మానవత్వం' అనే ఒక క్రొత్త సిద్ధాంతాన్ని రూపొందించాడని అతని వాదం స్పష్టపరుస్తుంది. ఇందుకు ఆధ్యాత్మికవాదంలో వున్న మంచి గుణాలనూ, భౌతిక వాదంలోవున్న మంచి గుణాలనూ జతపరచవలసిన అగత్యం అతను గుర్తించాడు. అతనే 'రాడికల్ మానవత్వం' అనే గ్రంథంలో, 'భౌతిక వాదానికీ, ఆధ్యాత్మిక వాదానికీ వున్న వైరుధ్యాన్ని మనం సమన్వయపరచాలి,' అన్నాడు. ఈ సమన్వయానికి అతను శాస్త్రపరిశోధనల సహాయం తీసుకున్నాడు. సైన్సు సహాయంతోనే ఈపని చేసి కృతకృత్యుడైనాడు.

రాయ్‌వంటి నిజాయితీపరులు ప్రపంచంలో చాలా తక్కువమంది ఉంటారు. తాను నిశితంగా ఆలోచించగలడు. ఆలోచించినదానిని ఆచరణలో పెట్టగలడు... ఇందుకు ఎటు వంటి త్యాగాలను చెయ్యటానికైనా, ఎటువంటి కష్టాలను ఎదుర్కోటానికైనా అతను సిద్ధమే. రష్యా నాయకులతో అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు, అంధకార బంధురమైన భవిష్యత్తును కౌగలించుకోటానికి అతను వెనుకంజ వెయ్య లేదు. కాంగ్రెస్ ఉద్యమం ప్రజోద్యమంగా బ్రిటిష్ వ

రేకత అనే ప్రజారంజకత్వంమీద నడచిపోతున్న రోజుల్లో దాన్నీ, మహాత్ముణ్ణీ విమర్శించి, దూషణ తిరస్కారాలను స్వీకరించటానికి సందేహించలేదు. తన క్రొత్త సిద్ధాంతం దృష్ట్యా పార్టీ రాజకీయాలవల్ల ఉపయోగం లేదని తెలుసుకొని, తన అనుచరకోటికి వ్యతిరేకంగా, తాను స్థాపించిన పార్టీనితానే రద్దుచేసుకున్న సాహసు డతను. నిరంతర సత్యాన్వేషణే అతని పరమావధి.

ఈ సత్యాన్వేషణ పూర్తిగా సైన్సుపరంగా జరిగినప్పుడు కృతార్థత చెందుతుందని అతని వాదం. అయితే, ఇంతకుముందు తత్వశాస్త్రం చేసినపని; ఈ నాడు సైన్సు చెయ్యగలదనీ; ఈ రెంటికీ పూర్వులు నిర్వచించిన భేదం కృత్రిమ మనీ అతను వాదిస్తాడు. ఈ విషయాన్ని గూర్చి 'సైన్సు తత్వశాస్త్రం' అనే గ్రంథంలో అతను ఇలా వ్రాశాడు-'నవీన శాస్త్ర సిద్ధాంతాలు అమితమైన తాత్వికప్రాముఖ్యత కలిగివున్నవి. ఇంతకుముందు సైన్సుకీ, తత్వశాస్త్రానికీ అవిచేసే పనిలో వున్న భేదాన్ని ఇవి నిర్మూలిస్తున్నవి. సైన్సు తన పూర్వపు అవధులను దాటి, ఇదివరకు తత్వశాస్త్రం పరిష్కరించటానికి పూనుకున్న సమస్యలను ఎదుర్కొంటూ వుంది. అనుపూర్వికంగా వేనినైతే మనం తత్వశాస్త్రంయొక్క స్థలం అనుకుంటున్నామో, ఆ స్థలంలోకి సైన్సు నేడు అడుగుపెడుతూ వుంది' ఇదే గ్రంథంలో అతను మరొకచోట, 'సైన్సు పూర్తి ఆలోచనతోగానీ, పూర్తి యదార్థసంఘటనలతోగానీ వ్యవహరించదు. ఈ సైన్సే నట్లు, మన అనుభవాలన్నిటినీ జతపరచి, ఒక తార్కిక

విధానం క్రిందకు తీసుకురావటం దానిపని. ఒకప్రక్క అనుభవాలను ప్రోగుజెయ్యటం, ఒకప్రక్క వాటిని కొన్ని సూత్రాలక్రిందకు తీసుకురావటం దానిపని... శాస్త్రకారుడు అనుభవాలను ప్రోగుజెయ్యటమే కాక, వాటిమీదకు తన మనఃప్రభావాన్ని ప్రసరింపజేస్తాడు,' అన్నాడు. ఇదేవిధంగా అతను, 'బయట ప్రపంచం' 'లోపల ప్రపంచం' అనే భేదాన్నికూడా నిరసించాడు. "నిజం చెప్పాలంటే 'బయట ప్రపంచం' అనేమాట అపార్థాన్ని కలిగించేమాట. ఎందుకంటే మనందరం మన అనుభవంలోకి వచ్చే ప్రపంచంలోని భాగాలమే,. మన శరీరాలూ, మన ఇంద్రియాలు, అన్నీ ప్రపంచంలోని భాగాలే. మనం బయటి వాళ్ళంగా ప్రపంచాన్ని చూడటంలేదు. మన మనస్సులూ, మన ఊహలూ, మన తెలివితేటలూ, బయట ప్రపంచంతో అవినాభావ సంబంధం కలిగివున్నవే. ఇవన్నీ ఒకటయ్యే ప్రపంచం," అన్నాడు.

అంటే, ప్రపంచానికి విడిగావుండే ఏ శక్తినీ అంగీకరించక, అన్నిటికీ మానవుణ్ణే ప్రాధాన్యుణ్ణి చేసి, ప్రపంచాన్నంతా ఒకటిగా చూసే స్వభావం గలది యం. యన్. రాయ్ 'రాడికల్ తత్వ తత్వశాస్త్రం' అని మనం క్లుప్తంగా చెప్పుకోవచ్చు.

—— ••• ——

# 'స్వాభావిక తత్వవేత్త'

# జీన్ పాల్ సార్త్రే

ఈ వాదం ఇటీవల పాశ్చాత్య దేశాలలో బాగా వ్యాపకంలోకి వచ్చింది. ముఖ్యంగా ఫ్రాన్స్‌లో దిగ్విజయ యాత్ర చేసింది. 1813 లో జన్మించిన కీర్కెగార్డ్ దీని వ్యవస్థాపకుడని చెప్పవచ్చు. తరువాత కారల్ జాస్పర్స్, గేబ్రియల్ మార్సల్, మార్టిన్, హీడెగర్ మొదలైనవారి చేతుల్లో ఇది వృద్ధిచెందింది. ఈ తాత్విక దృష్టికి ప్రజానురంజకత తెచ్చినవాడు జీన్‌పాల్ సార్త్రే.

ఈ తత్వం భావ, వాస్తవిక దృష్టులకు వ్యతిరేక చర్యగా ఆచరణలోకి వచ్చినట్లు కనుపిస్తుంది. ఈ సందర్భంలో వాస్తవికదృష్టి అంటే 'పదార్థం దానికి వర్తించే యాంత్రిక నియమాలూ నిజమైనవి' అనే అర్థం మనం చెప్పుకోవాలి. పదార్థం, ప్రాణం, మనస్సు అనే విభజన వీరు పైకి అంగీకరించినా, ఈ విభజన పదార్థంలో వున్న భేదాలవల్ల సంభవించినట్లుగా మాత్రమే పరిగణిస్తారు. వొక పెద్ద యంత్రంలో అతకబడిన భాగాలుగా మానవులు నిర్ణయించబడతారు. అతనికి స్వాతంత్ర్యం వున్నదనుకోవటం వొక భ్రమ; నిజంకాదు. సువిశాలమైన భౌతిక వాస్తవికతలో, మానవుని వ్యక్తిత్వం గణనలోకి తీసుకోవలసింది కాదు.

ఇది వాస్తవికతత్వం యొక్క దృష్టి. ఇటువంటి దృష్టికి స్వాభావికం తత్వ వ్యతిరేకం. ఈ దృష్టికేకాదు, చైతన్యం మూలపదార్థం అని చెప్పే భావవాదానికి కూడా ఇది వ్యతిరేకమే. ఈ చైతన్యం వ్యక్తిని ఆశ్రయించుకొని వున్నది కాదు. అయినప్పటికీ మానవుడు ఈ చైతన్యాన్ని పొంది వుండటంవల్ల వాస్తవికతలో అతను ముఖ్యస్థానాన్ని సంపాదించుకున్నాడు. అతను ఈ విశ్వంలో వొట్టి ప్రేక్షకుడు మాత్రమేకాదు. కొన్ని ప్రయోజనాలనూ, ఆదర్శాలనూ సాధించటానికి ప్రయత్నిస్తాడు అతను. ఈ దృష్టివల్ల మానవుని పాత్రకు కొంత వ్యక్తిత్వం సిద్ధించింది. కాని మానవునికున్న స్వతంత్రత సంగతి ఏమిటి? అతను, చైతన్యం రూపకల్పన చేసుకునే వొక ప్రదర్శన శాలగా, తన ఆశయాన్ని సాధించుకునే వొక సాధనంగా మాత్రమే పరిగణింపబడతాడు. అందుకని ఈ భావదృష్టివల్ల కూడా అతనికి స్వాతంత్రత ఆపాదించబడలేదు. భావంయొక్క అవుసరాన్ని తప్పనిసరిగా అంగీకరించటమే అతని స్వాతంత్ర్యం అయింది.

ఈ విధంగా భావవాదంలోనూ, వాస్తవిక వాదంలోనూ వ్యక్తికి స్వతంత్రత లేకుండాపోయింది. అతనికి ప్రాముఖ్యతేలేదు; విచిత్రతకు స్థానంలేదు. కాని జీవితంలో మానవునికి ఏదో స్వతంత్రతా, ప్రాముఖ్యతా వున్నట్లు కనిపిస్తుంది. 'ఈ రెండు వాదాలూ ఈ ఆరాటానికి అర్థం చెప్పవు. పైగా భావవాదం, మానవుణ్ణి భావంతో ఏకంచేసి మానవుణ్ణి మృత్యువుని అధిగమించేటట్లు చేస్తుంది. మానవుడు, నిజానికి మృత్యువుని, తప్పించుకోలేని సంఘటన

పరిగణిస్తాడు... స్వాభావిక వాదం, మానవుని ఉనికిని అపార్థ పూరితంచేసే ఈ రెండు దృష్టులమీదకూ జరిగిన తిరుగుబాటు,' అన్నారు రాధాకృష్ణ పండితులు, ప్రాచ్య పాశ్చాత్య దేశాల తాత్విక చరిత్ర అనే గ్రంథంలో.

ఈ తత్వానికి మూలపురుషుడు కీర్కెగార్డ్ అని మనం చెప్పుకున్నాం. ఆయన 1843 లో 'ఇదిగాని, అదిగాని' అనే గ్రంథం ప్రచురించాడు. ఈ గ్రంథమే ఈ వాదానికి పునాది అని చెప్పుకోవచ్చు... అయితే ఈ గ్రంథానికి బీజాలు అంతకుముందు లేవని నా అభిప్రాయం కాదు. ఈ వాదానికి సంబంధించిన భావాలు అనాదినుంచీ వొస్తూనే వున్నయ్. స్థూలంగా ఈ వాదం, 'కట్టుదిట్టాలలో ఇరికించ బడిన సిద్ధాంతాల నిర్మాణంమీదకు జీవితం చేసిన తిరుగు బాటు' అని అనుకోవచ్చు. అంతవరదాకా ఎందుకు? భావ నిర్మాణం మీదకు ఎదురు తిరిగిన, ఆలోచనాపరులు ప్రతి యుగంలోనూ ఉంటూనే వున్నారు. సిసీయిజం, రొమాన్టి సిజం, బెర్గోనిజం మొదలైన భావ ప్రవంతులన్నీ ఇటువంటివే. ఈ భావప్రవంతుల నవ్యవీచికే స్వాభావిక తాత్వికదృష్టి.

౨

కీర్కెగార్డ్ కాలంలో హెగల్ యొక్క భావాలు చాలా ప్రచారంలో వుండేవి. ఆ భావాలమీద తిరుగుబాటు చేసినవాడు కీర్కెగార్డ్. హెగల్ బాహ్య పరిస్థితికి ప్రాము ఖ్యత ఇస్తే, కీర్కెగార్డ్ ఆంతరంగిక పరిస్థితికి ప్రాధాన్యత

ఇచ్చాడు. భగవంతుడు ఈ ప్రపంచంలో తన్నుతాను పొందుతున్నాడనే హెగెల్ భావం ఆయనకు కంపరం పుట్టించింది. హెగెల్ సిద్ధాంతం మనిషినిగురించి తెలుసుకోటానికే కాక, భగవంతునికి తన్నుతాను తెలుసుకోటానికూడా ఉపకరించిందనే ప్రచారం ఆయన తీవ్రంగా నిరసించాడు. వ్యక్తి మానసిక జీవితం తెలుసుకోవటమే దుర్ఘటం అయినప్పుడు, భగవంతుని మానసిక జీవితాన్ని తెలుసుకోగలం అనుకోవటం హాస్యాస్పదమని ఆయన భావం. ముగించబడిన ఏ సిద్ధాంతమైనా తప్పనే ఆయన ఉద్దేశం. కాబట్టి వ్యక్తికి ఏ కించిత్తు స్వాతంత్ర్యం లేకుండాచేసి ఈ విశ్వంలో అతనినొక చిన్నకొరముట్టుగాతయారుచేసిన హెగెల్ సిద్ధాంతంమీద ఆయనకు ఏహ్యభావం కలగటంలో ఆశ్చర్యం ఏముంది? కీర్కెగార్డుకి మనిషి ముఖ్యం; ఏ మనిషికి ఆమనిషికే వొక ప్రత్యేకత వుందని అతని విశ్వాసం. అందువల్ల అందరినీ వొక మూసలోకి తెచ్చి అర్థం చెప్పుకోవటం పొసగదని ఆయనవాదం..., అంతేకాక 'వ్యక్తి' పూర్తి అయిన పదార్థంకాదు. నిత్యం పెరుగుతూ వుంటాడు. లోపలవున్న స్వాతంత్ర్యేచ్ఛవల్లా ఈ పెరుగుదల అనంతంగా జరుగుతూ వుంటుంది.

ఏరుకోగలగటం, నిశ్చయించుకోగలగటం అనే శక్తులను అంగీకరించటం ఆయన ముఖ్య సూత్రాల్లో ఒకటి. వొక నిశ్చయానికి రావటం ఎప్పుడూ ప్రమాదంతో కూడుకునే వుంటుంది. అయినా మానవుడు దీనికి స్థిరపడతాడు. 'నేను వొకనిశ్చయానికి రావటం అనేది నాకుసంబంధించిన

ఇందులో భగవంతుని ప్రమేయం లేదు' కీర్కెగార్డు దృష్టిలో అనిశ్చితమైన విషయాలు అనేకం వుండటానికి వీలుంది; అందులో మానవుడు ఏదో ఒకదాన్ని ఎంచుకుంటాడు. ఆ స్వాతంత్ర్యం అతనికి వుంది.

కీర్కెగార్డు శిష్యుల్లో ఈశ్వరవాదులూ, నిరీశ్వర వాదులూ కూడా వున్నారు. జీన్‌పాల్‌సార్త్రే నిరీశ్వర వాద కోవకు చెందినవాడు.

## 3

కీర్కెగార్డు సిద్ధాంతాన్ని ఈశ్వరవాద సిద్ధాంతంగా పరిగణించిన వారిలో ముఖ్యుడు కారల్ జాస్పర్స్. నిరీశ్వర వాద సిద్ధాంతంగా పరిగణించినవారిలో ముఖ్యుడు హీడెగర్. జీన్‌పాల్‌సార్త్రే హీడెగల్‌ని అనుసరించాడు. కాని ఆయన రచనల్లో హెగెల్, హుసరల్ మొదలైన తాత్వికుల స్పర్శ లేకపోలేదు. అందువల్లే ఆయన సిద్ధాంతానికొక ప్రత్యేకత వొచ్చింది. హీడెగర్, పూర్తిగా తాత్వికరచనలే చెయ్యటం వల్ల పలుకుబడి చాలా పరిమితమై వుండేది. సార్త్రే తన భావాలను నవలల ద్వారా నాటకాలద్వారా ఎక్కువ ప్రచారంలోకి తేగలిగాడు.

వ్యక్తుల విభిన్న జీవితాల్లో వున్న అనిశ్చయత, నిర్హేతుకత, అనవసరత, సార్త్రేని ఎక్కువగా కలవరపరచినట్లు కనుపిస్తుంది. 'ఒక ఆకారం, ఒక రంగూ కలిగిన వేరు

టి మనం అర్థాలు చెప్పుకునే అన్నిటికీ పునాది అయి

వుండవచ్చు. దాని స్వభావం, ఒక గొట్టంలాగా ఆహారాన్ని పైకి తేవటం అయివుండాలి. కాని వాక్యూక్లు వేరు వాక్యూక్లు రకంగా వుండటం మనం చూస్తున్నాం. ఈ విభిన్నతకు అర్థం లేదు' అంటాడు సార్త్రే. ఆయన దృష్టిలో ఏ ప్రత్యేక వస్తువుగానీ, ఉనికిగానీ ఈ ప్రపంచానికి అవుసరం లేదు. ఏ వొక వస్తువుకీ, దానిపై దానికీ హేతుపూరితమైన సంబంధం ఉండి ఉండాలని భావించగూడదు. అటువంటి సంబంధం వుండి వుండదు; అది అనవసరమైంది.

సార్త్రే తనలో తాను వుండేదానికీ, తనకోసం తాను వుండేదానికీ వుండే భేదాన్ని పాటించాడు. తనలో తాను వుండేదంటే, దానికీ మరిపై దానికీ సంబంధం వుండదు. ఇటు వంటిదాన్ని మనం సాధారణంగా 'భౌతిక వస్తువు' క్రింద జమకడతాము. తనకోసం తాను వుండేది ఇతరవస్తువులతో సంబంధం పెట్టుకుంటుంది. దీనిని మనం 'చైతన్యం' క్రింద పరిగణిస్తాము. ఇది వ్యతిరేకతవల్ల సాధించ బడుతుంది. చైతన్యం పొందటంఅంటే తనకుతాను దూరం అవటం. ఈ దూరం ఉనికికాదు; ఉనికికి వ్యతిరేకత. తనలో తాను ఉండటం అనేది అచైతన్యస్థితి. ఈ అచైతన్యస్థితికి, తన్ను తాను వ్యతిరేకించుకొని చైతన్యస్థితికి రావటానికి కారణం కనపడదు.

మనం చైతన్యం పొందటంవల్ల, మనల్ని మనం అధిగమిస్తున్నాం, మనల్ని మనం రద్దుచేసుకుంటున్నాం-అని కూడా చెప్పుకోవచ్చు. ఈ శూన్యానికి భయ-

మళ్ళీ చైతన్యాన్ని పోగొట్టుకోకుండా ఉండగలందులకు మనం రెండూ అవటానికి ప్రయత్నిస్తున్నాం; మనలో మనం, మనకోసం మనం జీవించే జీవకోటిగా తయారవుతున్నాం. కాని ఈ కలయిక అస్వాభావికం అవటంవల్ల అనంతాన్వేషణకూ, తీవ్రమైన ఆందోళనకూ గురి అవుతున్నాం.

ఇతరులను గురించి మనం తెలుసుకోటాన్ని సార్త్రే చిత్రంగా విమర్శించాడు. 'వ్యక్తులను వ్యక్తులుగా గుర్తించటానికి, మనం వారిని వస్తువులను గానే కాక, చైతన్యయుతులనుగా చూడగలగాలి. నేను వొక వ్యక్తిని తెలుసుకోగలిగినప్పుడు, అతను నాకు వొక వస్తువు మాత్రమే. అతన్ని చైతన్య పూరితునిగా గ్రహించగలగాలి అంటే మాత్రం అతనికి నేను వస్తువుగా వుండే పరిస్థితిని తెచ్చిపెట్టుకోవాలి,' అన్నాడు. దీనికి వొక ఉదాహరణ చెప్పాడు:

'నేను దొంగతనంగా వుండి మాటలను వింటున్నప్పుడు, అవతలివారు కనిపెట్టి నన్ను తీవ్రంగా చూస్తే, ఆ చూపులకు నే నొక వస్తువునైపోతాను. అప్పుడు అవతల మనిషి నన్ను తీవ్రంగా చూసే వ్యక్తిగామాత్రమే గోచరిస్తాడు. అతని చేతన శక్తి, నా చేతనశక్తికి గొడ్డలిపెట్టు. అంతకుముందు నా గుణాలన్నీ నా వైపుకు ఆకర్షించబడి వుంటాయి. అటువంటి సమయంలో మరొకవ్యక్తి ప్రవేశిస్తే, నా గుణాలన్నీ నానుంచి గుంజబడి అతనివైపుకు పోతై. అప్పుడు నేను వస్తువునే అవుతాను. అందువల్ల

మరొకవ్యక్తి ఎప్పుడూ నా సత్వాలను దొంగిలించే శత్రువే అవుతాడు నాకు' ఈ విధంగా విమర్శించాడు సార్త్రే. ఈ ధోరణిబట్టి చూస్తే వక్తి వ్యక్తికీ మధ్య సానుభూతి అనేది ఉండటానికి సార్త్రే సిద్ధాంతంలో, వీలు లేదని అనుకోవలసి వస్తుంది.

సార్త్రే సిద్ధాంతంలో స్వతంత్రతకు అగ్రస్థానంవుంది. మానవుని ఉనికికీ దీనికి అవినాభావ సంబంధం వుందని ఆయన అభిప్రాయం. చైతన్యయుతుడైన మానవుడు ఎప్పుడూ తనలోతాను వుండలేడు. తననుంచి తన్ను విడిపించుకొని, తన్ను తాను అధిగమిస్తాడు. ఇదే స్వతంత్రత. మనిషికి స్వతంత్రత అనేది అనిశ్చయమైన సంగతి కాదు. తప్పనిసరైనది. దానినుంచి అతను తప్పించుకోలేడు. ఆయన మాటల్లో 'మానవుడు స్వతంత్రంగా వుండటం అతని కర్మ.'

తన సిద్ధాంతాన్ని సార్త్రే వొకసారి నిరీశ్వర వాదం గానూ, మరొకసారి 'మానవతత్వం' గానూ వర్ణిస్తాడు. మానవుడు సర్వ స్వతంత్రుడు. తన భవిష్యత్తుకు తానేకర్త. ఇందులో భగవంతుని ప్రమేయం లేదు. కొంతమంది భగవంతుడు లేడని చెపుతూ, భావజగత్తో లేక కొన్ని విలువలతో కూడిన జగత్తో వొకటి వుందని చెపుతారు. ఇది అర్థంలేని వాదన. దివ్య[illegible]నం అనేది లేనప్పుడు ఇటువంటి జగత్తూ వుండదు. కాబట్టి నిజమైన నిరీశ్వర వాదం ఇటువంటి విలువలను కూడా నిరసించాలి. ఈ ఉద్దేశం

సార్త్రె బాహ్య విలువలనేవి లేవు అంటాడు. 'నన్ను నేను సృష్టించుకున్నట్టే, విలువలను కూడా సృష్టించుకుంటాను. విలువలను సృష్టించుకోటానికీ నాకు స్వాతంత్ర్యం వుంది; సృష్టించుకోకపోవటానికీ నాకు స్వాతంత్ర్యం వుంది.' అంటాడు సార్త్రె. ఇదీ అతని సిద్ధాంతంలోని నిరీశ్వరవాద పోకడ. ఇక అతని 'మానవత'ను విచారిద్దాం. సార్త్రె మానవత, మానవుడు ముఖ్యం అని చెప్పే మానవత కాదు. అన్ని విలువలనూ మానవుడే సృష్టిస్తాడు గనక ఆ మేరకు అతను మానవతను అంగీకరిస్తాడు.

అతని వాదంలోని ముఖ్యాంశాలివి: — 'నేను సర్వ స్వతంత్రుణ్ణి. అయితే నేను నా బాధ్యతనుంచీ, వేదననుంచీ తప్పించుకోలేను. నేను దేని చేతిలోని కొరముట్టునూ కాక పోవటంచేత, నా ఉనికికీ, నేను చేసే కర్మలకీ పూర్తి బాధ్యుడను నేనే. నా బాధ్యత చాలా పెద్దది. ఎందుకంటే నేను చేసుకునే నిశ్చయాలు నన్నే కాకుండా ప్రపంచాన్ని బంధిస్తవి. నాకోసమే కాకుండా మొత్తం ప్రపంచంకోసం నేను నిర్ణయాలను చేసుకునేవాణ్ణి అవుతున్నాను. ఎందుకంటే నేను నాకే కాకుండా మొత్తం ప్రపంచానికి ఏది మంచిదో దాన్ని ఏరుకుంటున్నాను. ఇది గురుతర బాధ్యత. అందువల్ల, ఈ బాధ్యత, నన్నెప్పుడూ విచారగ్రస్తుణ్ణే చేస్తుంది.

౪

ఈ స్వాభావికవాదం సంపూర్ణ తత్వశాస్త్రంగా, ఇంతవరకూ, రూపొందలేదు. ఇది అనుచరుల్లో ఒకదృష్టిని కలిగించటానికిమాత్రమే సహాయపడినట్లు కనిపిస్తుంది. ఇప్పుడున్న స్థితిలో ఈ వాదంలో, ఉపనిషత్తులు ప్రతిపాదించిన తాత్వికదృష్టికున్న విశాలత్వం లేకపోయినా, కొన్ని పోలికలు స్ఫుటంగా కనిపిస్తున్నాయి. రాధాకృష్ణ పండితులు ఈవాదాన్ని, తమ 'ప్రాచ్య పాశ్చాత్యశాస్త్రం' అనే గ్రంథంలో చర్చిస్తూ ఇలా అన్నారు. "స్వాభావిక వాదం అనేది పాతపద్ధతికి ఒకకొత్తపేరుమాత్రమే. ఉపనిషత్తులూ, బౌద్ధమతం మానవుడు ఆత్మజ్ఞానం పొందాలని చెపుతయి. అవి, మానవుడు అజ్ఞానికి లోనై వున్నాడని చెపుతయి. అజ్ఞానం స్వార్థానికి మూలకారణం; కర్మ స్వాధీనంలోవున్న కాలానికి కట్టుబడివున్న, ఈ ప్రపంచంలో మనం అజ్ఞాన ప్రేరితులమై మనం బ్రతుకుతున్నంతకాలం, కాలంచేతుల్లో కీలుబొమ్మలుగా మాత్రమే ఉండగలుగుతాము. అందువల్ల వేదనానుభూతి సర్వదా వుంటుంది. అన్వేషకుణ్ణి శూన్యం ఆవహిస్తుంది. అప్పుడు ఈ జీవితం, ఈ ప్రపంచం వ్యర్థంగా కనుపిస్తుంది. మానవుడు చరమదశకాదు; మానవుడు తన్ను తాను అధిగమించాలి. కష్టాలనుంచీ, దుఃఖాన్నుంచీ మానవుడు, నిత్యతత్వ స్పృహను పొందగలిగినప్పుడే, తప్పుకో గలుగుతాడు."

ఈ వాదంయొక్క అసమగ్రతను, ఆయన ఈ విధంగా విశదపరిచాడు: 'ఈ వాదంయొక్క బలం, దాని మానసిక తత్వవిచారణయొక్క ప్రతిభలో వున్నదేగాని, తార్కిక సంయమంలో లేదు. మానవుని ఉనికిని సారాన్నుంచి విడదీసి, వీరు మానవుని వ్యక్తిత్వాన్ని ఏవిధంగా సమర్థించగలుగు తున్నారో, నాకు బోధపడటంలేదు. సార్త్రే చెప్పినట్లు నేను సర్వస్వతంత్రుడనై, భగవంతుడనేవాడూ విలువలనేవీ లేనప్పుడు, నేను ఏవిధంగా ఎవ్వరికి బాధ్యుడనై వుండాలి? కాని వొకసంగతి మనం గుర్తుంచుకోవాలి. ఈ వాదంలో కొన్ని లోట్లు వున్నప్పటికీ, మానవుని వ్యక్తిత్వానికి, ప్రత్యేకతకూ, వీరిచ్చిన విలువమాత్రం మెచ్చుకోదగ్గది. మానవుడు కొరముట్టుగా పరిగణింపబడుతూ వొక వర్గం కోసమో, వొక ప్రభుత్వంకోసమో ఆహుతి కావటం ఘన మనే ప్రేరేపణ జరుగుతున్న ఈ రోజుల్లో మానవుని ఉనికికి వొక ప్రత్యేకత వుందనీ, మానవునికి బాహ్యజీవితమేగాక, ఆంతరంగిక జీవితం అనేది వొకటి వుందనీ, దీని స్వభావం సమిష్టి నియమాలకు అంతుపట్టదనీ చెప్పటం ప్రపంచానికి మేలు చెయ్యటమే అవుతుంది.'

# 'దివ్యజ్ఞాన తత్వవేత్త'
# జిడ్డు కృష్ణమూర్తి

తత్వవేత్తలందరిదీ వొకఎత్తు; క్రిష్ణమూర్తిది వొక ఎత్తు. అనేక గ్రంథాలు పఠించి, అనేక తాత్విక దృష్టులను నిర్వచించవచ్చు. ఎవ్వరికివారు తాము ప్రచారంచేసే దృష్టిని బలపరుచుకోవటానికి కొంత అనుభవాన్నీ, దానికి తోడునిచ్చే ప్రముఖుల అభిప్రాయాలనూ ఆసరాగా తీసుకోవచ్చు. ఇది మామూలుగా జరిగే పని. క్రిష్ణమూర్తి మామూలు మనిషికాదు; మహాపురుషుడు. అందువల్ల అతని ధోరణి ప్రత్యేక విశిష్టత కలిగింది.

క్రిష్ణమూర్తి దృష్టి సంపూర్ణమైన అపనమ్మకంమీద నిర్మించబడింది. బెర్ట్రెండ్ రసెల్ చెప్పే అపనమ్మకం కొంత దూరం వెళ్ళి ఆగుతుంది; క్రిష్ణమూర్తి కోరే అపనమ్మకం అటువంటికాదు. మనిషి అంతర్గోళాలను కదిలించవలసిన అపనమ్మకం ఇది. మనిషి నరనరాలకూ ఎక్కవలసిన అపనమ్మకం ఇది; ఈ అపనమ్మకం సర్వవ్యాప్తమయింది. ఇతరులు చెప్పేదాన్ని నమ్మకపోవటం తేలికే. ఇతరులు వెలిబుచ్చే అభిప్రాయాలు తప్పనుకోవటం ఒకవిధంగా సుఖాన్నే ఇస్తుంది. పరోక్షంగా తన్నుతాను వందించుకోవటం ఇది. తనమీద తనకున్న సదభిప్రాయాన్ని పెంచు

కోవటం ఇది. కాబట్టి అపనమ్మకం యింతటితో ఆగితే ప్రయోజనం లేదు. అపనమ్మకం విశ్వవ్యాప్తం కావాలి. నీ అభిప్రాయాలను కూడా నువ్వు శంకించుకోవాలి. నిన్ను నువ్వే నమ్మకుండా పోవాలి. అప్పుడుమాత్రమే నువ్వు సత్యం తెలుసుకోగలుగుతావు... ఇదీ కృష్ణమూర్తి దృష్టి.

సాధారణంగా మన తత్వవేత్తలు పూర్తి నమ్మకం సత్యాన్ని తెలుసుకోటానికి మార్గం అని చెపుతారు. కృష్ణమూర్తి దృష్టి దీనికి పూర్తిగా వ్యతిరేకమైంది. అందువల్లనే అతను ఎటువంటి ఉత్తమ గ్రంథమైనా, ఎంతటి ఉత్తమ పురుషుడైనా ఇతరులకు సత్యశోధన చేసిపెట్టలేడు, అని మాటిమాటికీ చెపుతుంటాడు. అన్నిటినీ శంకించటమే మార్గం అంటాడు. ఈ దృష్టి నేటి మానవుని కల్లోల మనస్సుకు చాలా చేరువుగావుండే దృష్టి. నేటి మనిషి, వ్యక్తుల వల్లా, సిద్ధాంతాలవల్లా, భావాలవల్లా, రకరకాలుగా మోసగించబడి కుమిలిపోతున్న మనిషి. ఇటువంటి మనిషిని, 'నీ అపనమ్మకాన్ని సానబెట్టు.' అని చెప్పే కృష్ణమూర్తిమాటలు ఇట్టే పట్టేస్తాయి. 'ఎవర్నీ నమ్మవద్దు; నన్నూ నమ్మవద్దు.' అని చెప్పేమాటలు, అతనిమీద నమ్మకాన్ని కలిగేటట్టు చేస్తాయి.

క్రిష్ణమూర్తి ఈ స్థితికి ఎట్లా వచ్చాడు? అతని సాధన ఏమిటి? అతను అనుసరించిన మార్గం ఎటువంటిది? ఈ ప్రశ్నలకు జవాబులు 'విముక్తి జీవితం' అనే గ్రంథంలో తనే చెప్పుకున్నాడు. రెనెఫౌమెరె అనే గ్రంథకర్త క్రిష

మూర్తిని గురించి వ్రాస్తూ, అతని పరివర్తనాక్రమాన్ని వర్ణించే ఘట్టాన్ని పై గ్రంథాన్నుంచి ఈవిధంగా ఉదహరించాడు. ఇవి కృష్ణమూర్తి మాటలే!

'నేను నా ప్రియురాలిని ఏవిధంగా పొందగలిగానో చెప్తాను. నేను చాలాకాలంనుంచీ, ఇతరుల అధికారం మీదా, ఇతరుల ఉపదేశాలమీదా, ఇతరుల విజ్ఞాన బోధల మీదా ఎదురుతిరిగివున్నాను. నేను స్వయంగా సత్యాన్ని కనిపెట్టేవరకూ, దేన్నీ సత్యం అని నమ్మదలచలేదు. నేను ఎవ్వరిభావాలనూ వ్యతిరేకించలేదు. కాని వారి అధికారాన్నిగానీ, వారిజీవిత విధానాన్నిగానీ అంగీకరించనూ లేదు. అన్ని సిద్ధాంతాలతోనూ, అన్ని నమ్మకాలతోనూ, అన్ని మూఢవాదాలతో, ఇదీ అదీ ఏమిటి, సమస్తంతోనూ అసంతృప్తినిచెంది ఎదురు తిరిగేస్థితికి వచ్చేవరకూ నేను సత్యాన్ని కనుక్కోలేకపోయాను.'

తరువాత తన నీస్థితికి తెచ్చిన మార్గాన్ని ఈ విధంగా వర్ణించాడు:

'చాలా కాలం నేను ఈ గమ్యస్థానంకోసం వెతికాను. ఈ అన్వేషణలో సాలిగూడులో చిక్కుకున్న ఈగకు వలె తమ కోర్కెలలో తాము చిక్కుకొని, ఇరుకుకొని పోయిన జనాన్ని చూశాను. నేను ఆలోచించగలిగినప్పటి నుంచీ, తమ ఆలోచనలలో తాము మునిగి, నిరుపయోగమైన జీవితంలో ఊపిరాడక కొట్టుకుంటున్నవారిని చూశాను. నేను ఎక్కడికి వెళ్ళినా, తమ సుఖం తాము ప్రోగుజేసుకున్న

వస్తు సముదాయంమీద ఆధారపడి వుంటుందనుకొనే తాపత్రయాలకు లోనై ప్రవర్తిస్తూవున్నవారే కనిపిస్తూ వుండేవారు. ప్రాపంచిక సుఖాలను అన్నిటినీ పొందుతూ కూడా, తమ సుఖాలకు తామే బానిసలు అవటంవల్ల, జీవితాలను గందరగోళ పెట్టుకునేవారిని చూశాను. ఎక్కువగా ప్రేమిస్తూ, ప్రేమిస్తూ స్వతంత్రంగా వుండటం చేతగాక, తమ ప్రేమకు తామే బానిసలైనవారిని చూశాను. విజ్ఞానం వల్ల వివేకవంతులైనవారిని చూశాను. కాని వారు వారి విజ్ఞానానికి బందీకృతులు. మతంలో మునిగి తేలుతున్నవారిని చూశాను. వారు తమ సాంప్రదాయాలకూ, తెలుసుకోలేని దాన్ని గురించిన భయానికీ దాసులు.

ఈ విధంగా వివిధవ్యక్తులను పరిశీలిస్తూ, వాసు, భయం, నమ్మకం, స్వార్థ్యం అనే గోడలను నిర్మించుకొని, మళ్ళీ వాటిని పడగొట్టి వాటినుంచి తప్పించుకోగలందులకు చేసే ప్రయత్నాలను గమనించాను. ఇవన్నీ చూస్తూ తాము ఏ భగవంతులను పూజిస్తున్నారో ఆ భగవంతులనుంచీ, ఏ భాష్యకారులను అనుసరిస్తున్నారో ఆ భాష్యకారులనుంచీ తప్పించుకుంటే తప్ప వారి శ్రమకు ప్రతిఫలం దొరకదని నేను గ్రహించాను.

నా చిన్నతనంనుంచీ నేను తిరుగుబాటు చేశాను. నాకేదీ తృప్తిని ఇవ్వలేదు; నేను విన్నాను; పరీక్షించాను. కాని మాటలు నాకు తృప్తిని ఇవ్వలేవు. మాటల వెనుక వున్నదాన్ని తెలుసుకోదలిచాను, ఇందుకు ఎవ్వరిమీదా ఆధారపడలేదు.'

కృష్ణమూర్తి మామూలు దారులన్నిటితోనూ అసంతృప్తిచెంది, అన్నిటికీ స్వశక్తిమీందే ఆధారపడ్డాడు; సొంతంగానే తెలుసుకోటానికి ప్రయత్నించాడు. ప్రపంచం అంతా తిరిగాడు. ధనవంతులను చూశాడు; బీదవాళ్ళని చూశాడు; సంఘ సంస్కర్తలను చూశాడు; రాజకీయవేత్తలనుచూశాడు; మత ప్రవక్తలను చూశాడు; కమ్యూనిష్టు నాయకులను చూశాడు. కాని ఎవ్వరూ అతని ఆరాటాన్ని తీర్చలేకపోయారు. ఈ అనుభవాన్ని గురించి అతనీ విధంగా చెప్పాడు:

'వీటిని పరికించటంవల్ల నేను పరోక్షంగా అనుభవాన్ని గడించాను. సుఖాన్వేషణలో వొక సంతోషాన్నుంచి ఇంకొక సంతోషానికీ, వొక వినోదాన్నుంచి ఇంకొక వినోదానికీ నడిచాను. కాని నేను కోరిన సుఖం మాత్రం నాకు లభించలేదు,...అప్పుడు నేను హిందూదేశానికి వచ్చాను. ఇక్కడి ప్రజలుకూడా పాత సాంప్రదాయాలను అనుసరిస్తూ, స్త్రీలను హింసిస్తూ తమ్ముతాము మోసగించుకుంటూ జీవయాత్ర సాగిస్తూవుండటం చూశాను. ఇలా చేస్తూవుంటూనే మొహం నిండా విభూతిరేఖలను పూసుకొని తమ్ముతాము గొప్ప దైవభక్తి పరాయణులుగా పరిగణించుకుంటూ వున్నారు. హిందూదేశంలో పవిత్రగ్రంధాలు అనేకం ఉండి వుండవచ్చు. వేదాంత నిధులు అనేకం వుండి వుండవచ్చు. పెద్ద దేవాలయాలు వుండి వుండవచ్చు. కాని ఇవేమీ నాకు ఆత్మసంతుష్టిని ఇవ్వలేదు; యూరప్‌లోగాని, హిందూదేశంలోగాని నాకు సౌఖ్యం దొరకలేదు.

సౌఖ్యం అనేది వున్నది అని నాకు తెలుసు. అందు కని దానికోసం ఇంకా వెతికాను. సౌఖ్యం అనేది వున్నదనే భావన ఒక్క మేధస్సుకీ ఆవేశానికీ చెందిన నమ్మకం మాత్రమే కాదు. లోపల మరుగున వర్ణించటానికి కుదరని సంపూర్ణత్వంవంటిది అది. అది వున్నదని మాత్రం మనకు నిర్ధారణగా తెలుస్తుంది.

నేనీ స్థితిలో కాలిఫోర్నియా వెళ్లాను. అక్కడ వొక ఆదర్శం అనేది లేకపోతే అందరికివలె నేనూ గజిబిజిలో చిక్కుకొని చీకాకుపడవలసి వస్తుందని గ్రహించాను. ఇది మనస్సులో వుంచుకొని, చిన్న చిన్న గమ్యస్థానాల నన్నిటినీ నా దృష్టి పథంలోనుంచీ నెట్టివేసి 'శాశ్వతానందా'న్ని నా ఆశయంగా స్థిరపరచుకున్నాను. నేను శాశ్వతానందాన్ని అనుభవించదలిచాను. నేను జీవితాన్ని జలద్వారంలో రుచిచూడ దలిచాను. ఆదినీ అంతాన్నీ ముడివెయ్యదలిచాను. మనిషికీ అతని గమ్యస్థానానికీ మధ్యనవున్న అంతరాన్ని నేను నిర్మూలించ నిశ్చయించుకున్నాను. ఈ ఉద్దేశంతో, నేను ఇంతకుముందు నిలబెట్టుకున్న అడ్డంకుల నన్నిటినీ పడగొట్టు కోవటం మొదలుపెట్టాను. నేను అంతకుముందు పోగుజేసుకున్నదాని నంతటినీ వొదిలించుకో నారంభించాను. ఈ ప్రయత్నం సాగినకొద్దీ నేను నెమ్మదినెమ్మదిగా నా గమ్యస్థానాన్ని చేరుకో గలిగాను.'

తా నేవిధంగా గమ్యస్థానం జేరుకో గలిగిందీ చెప్పి, కృష్ణమూర్తి, 'మీరు కష్టాల్లో దుఃఖంలో అనుమానంలో

సతమత మాతున్నారు గనక మీకూ దారిచూపుతాను,' అని అన్నాడు. 'కాని నేను మీకు దిక్సూచిగా మాత్రమే సహాయపడగలను. మీ కోర్కెను నెరవేర్చుకోటానికి తగిన బలం వుండాలి. అందుకు మీఅంత మీరే ప్రయత్నించాలి. ఈ కోర్కె మీ ఆత్మనుంచి రావాలి. అది మీ అనుభవం ఫలితం అయివుండాలి. అలా అయినప్పుడే అది సఫలం అవుతుంది,' అన్నాడు.

కృష్ణమూర్తిది విచిత్రసృష్టి. మామూలు మత సాంప్రదాయాలకు భిన్నమైన దృష్టి అతనిది. ఏ అధికారానికీ తల వొగ్గ వద్దని చెప్పే అతని వాణి నేటి యువకుల మనస్సులకు సన్నిహితమైనది. తత్వశాస్త్రల వేదాంత భాష్యాల చీకాకునుంచి తప్పించి తిన్నని, సుస్పష్టమైన బాటను మానవాళికి చూపింది. పార్టీలూ, సిద్ధాంతాలూ, చివరికి భావాలు కూడా మానవుని మానవత్వాన్ని కుదించేవేనని అతని విశ్వాసం. మానవుని మానవత్వం వీటి అన్నిటికంటే గొప్పది. ఆ స్పృహను పదిలంగా వుంచుకున్నప్పుడే మానవుడు సత్యానికి చేరువకు చేరుకో గలుగుతాడు. ఈ గమనంతోనే 'విద్య-పరమార్థం' అనే తన ఉపన్యాసంలో, 'విధానానికి కాక, వ్యక్తికి మనం ప్రధాన్యత ఇవ్వాలి. వ్యక్తి తన సంపూర్ణత్వాన్ని అర్థం చేసుకో నంతవరకూ, అది వామపక్ష విధానం అయినా, కుడిపక్షవిధానం అయినా, ప్రపంచానికి క్రమత్వాన్నిగానీ, శాంతినిగానీ సిద్ధింపజెయ్య లేవు,' అన్నాడు. అదే ఉపన్యాసంలో వేరొకచోట, 'స్వంత ఆలోచనను, హృదయ స్పందనను మనం పూర్తిగా

జీర్ణించుకో లేకపోతే, మన జీవితాలు అసంపూర్ణంగావుండి పోతాయి. జీవితంపట్ల సమగ్రదృష్టిని ప్రోత్సహించ నంత వరకూ, విద్యకు విలువ వుండదు,' అని విశ్లేషించాడు.

## ౨

కృష్ణమూర్తి 1895 లో మదనపల్లిలో జన్మించాడు. అతని తండ్రి కొన్నాళ్ళు ప్రభుత్వోద్యోగిగా పనిచేశాడు. తరువాత కోల్పోయాడు. అతనికి పిల్లలు తొమ్మిదిమంది. కృష్ణమూర్తి ఎనిమిదవవాడు. ఉద్యోగాన్ని కోల్పోయిం తర్వాత కృష్ణమూర్తి తండ్రి మద్రాసులోని అడయార్‌లో వుంటూ వుండేవాడు. కృష్ణమూర్తి, అతని సోదరుడు నిత్యానందకూడా అక్కడే వుండేవారు.

అవి దివ్యజ్ఞాన సమాజం అనిబిసెంట్ అధ్యక్షత క్రింద దిన దిన ప్రవర్ధమానం అవుతున్న రోజులు. అప్పు డామెతో దివ్యజ్ఞాన సమాజ స్థాపకుల్లో ప్రముఖుడైన లెడ్‌బెటర్ కూడావుంటూ వుండేవాడు. అప్పుడు వొకరోజు దివ్యజ్ఞాన సమాజం లైబ్రేరియన్ కృష్ణమూర్తినీ అతని సోదరుడైన నిత్యానందనీ సముద్రతీరంలో తిరుగుతూ వుండటంచూచి అధ్యక్షురాలి సమక్షంలోకి తీసుకువచ్చాడు. లెడ్‌బెటర్ యోగదృష్టి కలవాడని ప్రతీతి. అతను ఈ పిల్లలనుచూచి కృష్ణమూర్తికి అద్వితీయమైన ప్రతిభవుందని ప్రకటించాడు. వెంటనే అనిబిసెంట్, తండ్రి అనుజ్ఞతో ఈ ఇద్దరు పిల్లలనూ దత్తస్వీకారం చేసుకుంది. దీనికి ప్రబలమైన

కారణం వొకటి వుంది. ఆధ్యాత్మికశక్తులు కలిగిన కొందరు మహానుభావులతో ఆమె యోగ సంబంధం కలిగివుండేదట. వారు ఆమెకు బుద్ధుడూ జీసస్ క్రీస్తులవంటి వొక ప్రవక్త ఆవిర్భవింప నున్నాడని చెప్పారట. అందుకని ఆమె ఇటు వంటి శక్తులను బీజరూపంలో పొందివున్న రూపంకోసం వెతుకుతూవుంది. ఆ చిహ్నాలు ఆమెకు కృష్ణమూర్తిలో కనుపించినై.

రాబోయే ప్రప్రపంచ ప్రవక్తకోసం దారిని శుభ్రత పరచడానికి 1911 లో అనిబిసెంట్ 'తూర్పున నక్షత్రం' అనే వ్యవస్థనొకదాన్ని నెలకొల్పింది. దీనికి కృష్ణమూర్తిని అధ్యక్షునిగా చేసింది. తరువాత ఈపిల్లల పెంపకంలో బిసెంట్‌కీ, కృష్ణమూర్తి తండ్రికీ కొన్ని అభిప్రాయభేదాలు వొచ్చాయిగాని చివరికి బిసెంట్ ఈ పిల్లలను తనదగ్గరే ఉంచుకోగలిగింది. బిసెంట్ కృష్ణమూర్తిని 'తూర్పున నక్షత్రం' అనే వ్యవస్థకు అధ్యక్షునిగా చెయ్యటమేకాక, రాబోవు ప్రపంచ ప్రవక్త అవిర్భవించటానికి అతను నిర్దేశించబడిన ఆకృతి అని కూడా ప్రకటించింది.

తరువాత కృష్ణమూర్తి జీవితాన్ని తీర్చిదిద్దేసంఘట నలు, వొకదానివెంట వొకటి చకచకా జరుగుతూవొచ్చినై. కృష్ణమూర్తి సోదరుడు నిత్యానంద 1925 లో కాలి ఫోర్నియాలో మరణించాడు. ఈ మరణం కృష్ణమూర్తి హృదయాన్ని పూర్తిగా కలచివేసింది. ఆనాటి తన స్థితిని అత నీవిధంగా వర్ణించాడు; "నా సోదరుడు మరణించాడు.

నేను ఏకాంతంగా రోదించాను. నే
ఆయన గొంతూ, ఆనందప్రదమైన ఆయ
వుండేవి. ఆయనను వెతుకుతూ దారే పోయే
పోదయు డెక్కడైనా కనుపించాడా!' అని
వాణ్ణి. కాని ఎవ్వరూ నాకు శాంతిని ఇవ్వలేక
నేను వేడుకున్నాను, ప్రార్థించాను, కాని భగవంతుడు
మౌనం వహించాడు.... నేను బాధపడ్డాను. నేను ఇం
ముందు బంధించబడిన అన్ని బంధాలనుంచీ విముక్తి పొందటం ప్రారంభించాను. చివరికి నా ప్రియురాలిని పొందగలిగాను; విముక్తి మహాసముద్రాన్ని జేరుకోగలిగాను. దాన్ని నాలో స్థాపించుకో గలిగాను."

ఈవిధంగా విముక్తిని పొందింతర్వాత, అతని అభిమానులలో భక్తులలో అనేక ప్రశ్నలు తలలెత్తినై. ఇక కృష్ణమూర్తి భావికార్యక్రమం ఏమిటి? ప్రపంచం వేచి వున్న ప్రవక్తను నేనే అని చెపుతాడా? ప్రపంచ ప్రవక్త కోసం తయారైవున్న దుస్తులను ధరిస్తాడా? అంతకుముందే ఈ ప్రవక్తకోసం నిర్మించబడివున్న సంస్థల అధికారాన్ని స్వీకరిస్తాడా?' ఇటువంటి ప్రశ్నలనేకం అతని భక్తులనుకలవరపెట్టసాగాయి. మొదట్లో అతనుకూడా ఈ విషయాలను గురించి ఏమీ ప్రస్తావించేవాడుకాదు. దానివల్లభక్తుల కుతూహలం మరీయెక్కువైంది. అతనిమీద వొత్తిడికూడా ప్రారంభం అయింది. అంటే నెమ్మది నెమ్మదిగా మేఘాలు క్రమ్ముకున్నాయి అన్నమాట. ఇక తుఫాను చెలరేగక తప్పే దేముంది?

కృష్ణమూర్తి

తనకోసం స్థాపించబడిన సంస్థలను రద్దు
సంస్థలైనా మానవాభ్యుదయాన్ని అరి
. ప్రపంచ ప్రవక్తకోసం నిర్మించబడిన
త్రం' అనే సంస్థను రద్దుచేశాడు. ఈపని అతని
ఆశాభంగాన్ని రేపింది. సత్యంకోసం తన
వాదులుకోటానికి సిద్ధపడ్డాడు కృష్ణమూర్తి. ఈ
ర్భంలో అతను చెప్పిన మాటలు గమనించ దగ్గవి.
సత్యం మార్గంలేని ప్రదేశం. ఏదోవొక మార్గంవల్లగానీ, మతంవల్లగానీ, శాఖవల్లగానీ, దాన్ని చేరుకోలేం. ఇది నా ఉద్దేశం. దీనిని నేను బేషరతుగా పూర్తిగా అనుసరిస్తాను...

నేను సత్యస్వరూపుణ్ణి గనక నా అనుచరులు నన్ను అర్థం చేసుకోవాలనీ, స్వతంత్రులుగా వుండాలనీ నేను కోరుచున్నాను! నన్ను అనుసరించి; నన్నొక పంజరంగా చేసి, ఒక మతాన్నిగానీ, ఒక శాఖనుగానీ, నానుంచి సృష్టించవద్దని కోరుచున్నాను. వారు మతభయాన్నుంచీ, ఆధ్యాత్మిక భయాన్నుంచీ, మోక్షం భయాన్నుంచీ, ప్రేమభయాన్నుంచీ జీవిత మరణాల భయాలనుంచీ, విముక్తి పొందాలని నేను కోరుతున్నాను. చిత్రకారుడు, తనకు ఆనందాన్నిస్తుంది గనకా; తనకు తాను రూపం ఇస్తుంది. గనకా చిత్రాలు వేస్తున్నట్లే, నేనీపనికి పూనుకుంటున్నాను. అంతేగాని ఇతరుల దగ్గరనుంచి ఏమీకోరి కాదు.'

అతను తనచుట్టూ అల్లుకొన్న భ్రమలను అతి ధైర్యంతో తొలగదీసుకున్నాడు. ఈ ప్రయత్నంలో భక్తు

లనూ, పదవులు తెచ్చే గౌరవాన్నీ, ధనాన్నీ పోగొట్టుకున్నాడు. తనదృష్టి మలినపడకుండా వుండగలందులకు కష్టపరంపరలను ఎదుర్కోటానికే సిద్ధపడ్డాడు. అతనికోసం సృష్టించబడిన సంస్థలు మూలపడినై. ప్రస్తుతం కృష్ణమూర్తి వినదలచిన వారికి ఉపన్యాసాలిస్తూ ప్రపంచం అంతా తిరిగే వొక పథికుడు మాత్రమే. ఏ ఆధారాలూ లేకుండా అలా నిలబడి వున్నాడు.

## 3

కృష్ణమూర్తి పరిశీలన ప్రకారం ప్రపంచంలోని భీభత్సానికి మూలం 'నేను' అనేదృష్టి. మానవుడు నేను అనే దృష్టిని ఏర్పరచుకొని, సరిహద్దులను సృష్టించుకుంటున్నాడు. ఈ సరిహద్దులు తనకూ మిగిలిన ప్రపంచానికీ కట్టని గోడలుగా వ్యవహరించి, వైరుధ్యాన్ని సృష్టించి, మానవుని మానవతను గాయపరుస్తూ వున్నై. అందువల్ల మానవుడు తనకుతానే బంధీకృతుడై గిల గిల తన్నుకుంటున్నాడు. 'మనం మనంగానే ఉండిపోవటం తప్పనిసరి అవుతూవుంది. మనం మనలో బంధిపడ్డాం. ఇతరులతో సాన్నిహిత్యాన్ని పొందలేకపోతున్నాం. మనం పొందే సాన్నిహిత్యం కృత్రిమమైంది. సంకుచితంగా నిర్మించబడింది. తర్క-సంజనితమైంది; మాటల మీద ఆధారపడింది. అంతేగాని కల్మషరహితమైంది కాదు; సహజమైందికాదు. లోపల వొకరి కొకరం అంటీపట్టని వాళ్ళంగా తయారయ్యాం. మన చైతన్య ప్రవంతి ప్రత్యక్ష

పరిశీలకు అందకుండా తప్పించుకుంటూ వుంది,' అని అతని భావన. నేను అనే భావన 'నేను వున్నాను' అనుకోవటంతో ఆగక, 'నేను నేనే. ఏ ఇతరుడను కాదు,' అనే భావనతో గర్భీభూతమై ఉంటుంది. ఇతర సృష్టినుంచి ఈ భావన ప్రతి వ్యక్తినీ వేరుపరుస్తూవుంది. ఈ వేరుపడటం అనేక అనర్థ కాలను పురికొల్పుతూవుంది. ఇప్పుడు నేను ఉన్నాను- అనుకోండి. అనేక కారణాలవల్ల నాకొక దృష్టి ఏర్పడివుంటుంది. ఆ దృష్టితోనే నా కుటుంబ సభ్యుల్ని కొలుస్తా, అందర్నీ ఈ దృష్టికి అనుకూలంగా మలుపుకోటానికి ప్రయత్నిస్తా. తరువాత నా కుటుంబానికి ఒకటి శ్రేయస్సు అనుకొని నిర్ధారించుకుంటాను. దానికి అనుకూలంగా వ్యవహరిస్తాను. దానికి అనుకూలమైనవన్నీ నిజాలు; మిగిలినవన్నీ అసత్యాలు. ప్రపంచంలోవున్న ప్రతివ్యక్తి ఈ విధంగానే ప్రవర్తిస్తాడు. ఇక అల్లకల్లోలం కాక ఏముంది? అడుగడుక్కీ వైరుధ్యం, సంఘర్షణా కాక ఇంకేమి తటస్థపడుతుంది? మానవుడు సంకుచితపడి ముడుచుకొనిపోక, ఇంకొక విధంగా జరగటానికి వీలేమి ఉంది?

కొందరు 'నేను' అనుకోవటం 'శృంఖలాలను సృష్టించుకోవటంకాదు,' అని వాదించ వచ్చు. కాక మరేమిటి? ఏ వ్యక్తి అయినా నేను అనుకోవటంలో తనకు తాను ముడిపెట్టుకోవటం జరుగుతూవుంది. నన్ను నేను ఏది అనుకుంటున్నానో, అదిగా వుండి పోవటం జరుగుతూ వుంది. నేను అనే భావన తమ్ము విశాల పరుస్తుందని

కొందరు అనుకోవచ్చు. నేను అనుకోవటంవల్లనేగదా నేను జ్ఞానాన్ని సంపాదించుకో గలుగుతున్నాను. నేను ధనాన్ని పోగుజేసుకో గలుగుతున్నాను. నాకు నేను వృద్ధి పొందే సాధన చేసుకో గలుగుతున్నాను. మేడలూ మిద్దెలూ నిర్మించుకో గలుగుతున్నాను— ఈ విధంగా ఆలోచనను విస్తరింపజెయ్యవచ్చు. కాని ఇది వొట్టి భ్రమ. ఈ దృష్టితో నీవు నిర్మించుకుంటున్న వన్నీ గోడలే; బంధాలే. నీ మానవత్వాన్ని చిదిమివేసే ఆయుధాలే! ఈ తర్కాన్ని గురించిన కృష్ణమూర్తి ఆలోచనలను, రెనెఫొరె ఈ విధంగా వర్ణించాడు: 'నేనీ విధంగా విశాల పడుతున్నకొద్దీ, నా చుట్టూ పన్నబడిన వల బిగుసుకు పోతూవుంటుంది. నా నిర్వచనకు నేను అతుక్కుపోయిన వాణ్ణి అవుతాను. దీనికి వ్యతిరేకంగా వున్నదాన్నంతా మరచిపో గలిగితే, ఇది నాకు సుఖాన్ని ఇవ్వవచ్చు. నాకు నేను పరిపూర్ణుణ్ణి అనీ, ఎదురులేనివాణ్ణనీ అనుకోవచ్చు. కాని నా హద్దులు నాకు జ్ఞాపకంవచ్చే వొక తరుణం వస్తుంది. అప్పుడు అతి అపాయకరమైన పోలికలు మనస్సును రగులుస్తాయి. నేను ప్రోగుజేసుకున్న ధనకనక వస్తు వాహనాదులను చూచుకొని నేను కొంతకాలం మురుసుకో వచ్చు. కాని ఈ కలలనుంచి మేల్కొనే తరుణం వస్తుంది. అప్పుడు నేను పోగుజేసుకున్నవన్నీ ఈ అనంత సంఘటనల, రూపాలమధ్య ఎంత స్వల్పమైనవో చటుక్కున బోధపడుతుంది. అప్పుడు నేను నన్ను ఎంత గట్టిగా పట్టుకు కూర్చుంటే, అంత పతనం అవుతాను. వాటికోసం, వాటి

సంరక్షణార్థం ఎంత గట్టిగా పోరాడితే, అంత గాఢంగా పెనవేసుకొని, అంత కఠినఖైదుకు లోబడి పోతాను.

నన్ను నేను ప్రత్యేక పరచుకోవటంవల్లే భయం అనేదికూడా ఉత్పన్నం అవుతుంది. దానితో మానవత్వమే పీగిపోతుంది.'

ఇదే ఉద్దేశాన్ని కృష్ణమూర్తి 'సరైన విద్య' అనే ఉపన్యాసంలో ఇలా విపులీకరించాడు. "అనుభవాన్ని మనం వ్యక్తిపరంగా అన్వయం చేసుకున్నంతకాల, 'నేను' అనే భావాన్ని బలపరచిన వాళ్ళమే అవుతాం. ఈ భావం తన ప్రతిస్పందనంద్వారా, ప్రతిక్రియద్వారా తననుతాను స్థిరం చేసుకున్నంతకాలం, సంఘర్షణనుంచి, మోఅమయాన్నుంచి, వేదననుంచి అనుభవానికి విముక్తి అనేది వుండదు. 'నేను' అనే ప్రవృత్తినుంచి, అంటే అనుభవం తనదిగా భావించే ప్రవృత్తినుంచి, తెలుసుకోవటం ద్వారా బయటపడ్డప్పుడే స్వతంత్రత అనేది లభిస్తుంది. ప్రతిక్రియలతో నిండివుండే 'నేను' అనేది, అనుభవానికి అధికారి కానప్పుడే, అనుభవానికి పూర్తి ప్రాముఖ్యత సిద్ధిస్తుంది. అప్పుడు అనుభవం సృష్టిగా పరిణమిస్తుంది. వికసిస్తుంది; విజృంభిస్తుంది."

అయితే ఈ 'నేను' నుంచి విముక్తిని పొందటం ఎట్లా? 'నేను' వల్ల కలిగే భయాన్ని నిర్మూలించుకోవటం ఎట్లా? మానవుడు తన మానవతను విశృంఖలంగా విజృభింప చేసుకోవటం ఎట్లా?

## ౪

ఈ 'నేను'ని గురించి ఇంకా విపులంగా తెలుసుకుందాం. ఈ 'నేను' అనే భావన కాలంలోనూ, ఆకాశంలోనూ అనేక రూపాలను ధరిస్తుంది. ముందు ఆకాశంలోని దాని విస్తరణనుగూర్చి తెలుసుకుందాం.

కృష్ణమూర్తి అభిప్రాయాన్ని బట్టి ఆకాశంలోని దీని విస్తరణకు రెండు వైఖరులున్నాయి. ఇందులో మొదటిది: తన్నుతాను విస్తరించుకోవటం. రెండవది: ఇతర వ్యక్తుల విస్తరణ ప్రయత్నాలను భంగపరచటం. తన్నుతాను విస్తరించుకునే ప్రయత్నంలో సెక్సు కార్యక్రమాలకూ, తదితర కార్యక్రమాలకూ మానవులను లోబరచుకోవటం వొకటి. ఇదేకాకుండా స్నేహాలూ, ప్రేమలూ, ఆవేశంతో కూడుకున్న ఆధారాలూ ఇందులోకి వస్తయి. వైజ్ఞానికంగా పాండిత్యం, జ్ఞానసముపార్జనా తృష్ణా ఈ కోవకు చెందినవే! దీని గుణంలో మార్పు కనిపిస్తూ వుండటంకూడా కద్దు. అనేకులు ధనాన్ని సంపాదించి, తరువాత ఆధ్యాత్మిక గౌరవం కోసం తంటాలు పడుతూవుండటం మనం చూస్తూవుంటాం. ఇది పై మార్పుకి ఉదాహరణ.

నేనుగా విస్తరించటం త్వరలోనే హద్దులను తాకుతుంది. అప్పుడు పరోక్ష విస్తరణ ప్రారంభం అవుతుంది. ఇది అధికారం పునాదిగా నిర్మించబడిన వైజ్ఞానిక సామ్రాజ్య స్థాపనద్వారా జరుగుతుంది. ఇతరులను తన వశంలో ఉంచుకోటానికి అధికారం వినియోగించబడుతుంది. ఈ సామ్రా

జ్యంలో, వొకవ్యక్తి మనస్సును వశపరచుకోవటం ద్వారా, అతనికిచెందిన సమస్తాన్నీ వశపరచుకోవచ్చు. ప్రియుడు, తన ప్రాణాలను అర్పించిన ప్రియురాలు ఏ నిరంకుశ ప్రభువుకీ తీసిపోదు. కుటుంబం, కులం, వర్గం, దేశం మొదలైనవీ అనుభవించే అధికారం ఇటువంటివే.

ఇక రెండవ వైఖరిని విచారిద్దాం. ఇతరుల ప్రయత్నాలనూ, ఇతరుల అధికారాలనూ నిర్మూలించటానికి చేసే ప్రయత్నాలన్నీ దీని క్రిందకే వస్తాయి; యుద్ధాలకు చేసే ప్రయత్నాలూ దీని క్రిందకే వస్తయి. లోకరూఢిగా వస్తున్న నీతులన్నీ దీని క్రిందకే వస్తయి. సహిష్ణుత నెపంతో మన అల్పభావాలన్నీ గౌరవించబడాలనుకోవటం వంటివి దీని క్రిందకే వస్తవి. ఇక కాలంలో జరిగిన విస్తరణ. ఇందులో అవిచ్ఛిన్నంగా ఉండిపోవాలనే కోర్కె ముఖ్యమైంది. ఈ కోర్కెలో మూడురకాలున్నాయి. (1) స్వకీయం (2) సిద్ధాంతికం (3) మార్పు రానివ్వకపోవటం. స్వకీయ విస్తరణ, నాలుగు కాలాలపాటు మనే వస్తువులను ప్రోగుజేసుకోవటం ద్వారా, శాశ్వతంగా వుంటవనుకునే భావాలు మొదలైన వాటితో సంబంధం ఏర్పరచుకోవటం ద్వారా, దేశంమొదలైన స్థిరంగా వుండేవాటితో ఏకీభావం కుదుర్చుకోవటం ద్వారా, జరుపుకోటానికి ప్రయత్నం జరుగుతుంది. భగవంతుని ఆదిమధ్యాంత రహితునిగా ఊహించి ఆయనతో ఏకత్వాన్ని భావించుకోవటంవల్ల కూడా ఈ పని జరుగుతుంది. మార్పు అంటే బలమైన వ్యతిరేకతను మానవుడు చూపడానికీ, చిరంజీవత్వంకోసం ఆశపడటానికీ కూడా ఇదే

కారణం. ఈ ప్రయత్నంలో సృజనాత్మకశక్తిని కోల్పోయి నవ్యత్వాన్ని వొదులుకొని పిడచగట్టుకొని పోవటానికి కూడా అతను సంసిద్ధుడౌతాడు. తనకు శాశ్వతత్వాన్ని వాగ్దానం చేసిన ఎవ్వరికైనా దాసుడవటానికీ, తన మనస్సుని మూత వేసుకొని, హృదయాన్ని ఆపుకొని జీవచ్ఛవం అవటానికీ అతను కించిత్తుకూడా సందేహించడు. ఎటువంటి నిరంకుశత్వాన్నయినా సహిస్తాడు.

కాని ఎన్ని చేసినా 'నేను' అనే భావాన్ని నిలుపుకొని సుఖపడాలంటే మాత్రం అది జరగనిపని. తన సంరక్షణకోసం తాను సేకరించుకున్న వస్తువులన్నీ అతనికి భారమే అవుతవి. ఈ సేకరించుకోవాలనే కోర్కెకు అంతం అనేది వుండదు. ఈ కోర్కెలు వొకదానినుంచి మరొకటి పుడుతూనేవుంటై. 'నేను అనే భావన, దురాశ స్వాధీన పరచుకోవాలనే వాంఛ వొక వలయంలోని భాగాలు. ఇది విషవలయం. త్రిప్పినకొద్దీ తిరుగుతూనే వుంటుంది.' తన్ను తాను వృద్ధిచేసుకుంటూ ఇది అనంతంగా పోతూనే వుంటుంది. అందువల్ల సుఖప్రాప్తికి ఇది దారికాజాలదు. అందుకు 'నేను' అనే దృష్టిని నిర్మూలించటంకంటే వేరుదారి లేదు. ఇది జరగటానికి వీల్లేని పని కాదు. కృష్ణమూర్తి దృష్టిలో 'నేను' అనే దానికి వస్తుతత్వంగానీ, కాల నిర్ణీతంగానీ, లేదు. అది విలువగలిగినదై శాశ్వతంగా వుండేదికాదు. అది కొన్ని సంఘటనల గొలుసు మాత్రమే; నిలకడలేని కొన్ని సంఘటనల సుడిగుండం మాత్రమే. దానికి వాస్తవికత లేదు. ఆ బుడగను ఎప్పుడు చిదిపివేసినా చిదిపి వెయ్యవచ్చు.

'నేను' అనే ఈ భావం దానిని నిర్మూలించాలనే సంకల్పంవల్ల నిర్మూలింపబడదు -అంటాడు కృష్ణమూర్తి. ఈ సంకల్పం మరికొన్ని అలవాట్లను సృష్టిస్తుంది. ఈ అలవాట్లు తమ్ముతాము వృద్ధిచేసుకుంటూ తిరుగుతుంటయి అంటాడు కృష్ణమూర్తి. పౌలే కృష్ణమూర్తి అభిప్రాయాలను ఈవిధంగా క్రోడీకరించాడు: 'అనుభవం మానవుణ్ణి ఈ విష వలయాన్ని గుర్తించేటట్లు చెయ్యక, బ్రతుకుకోసం ఒక క్రొత్త యాంత్రిక 'నిర్మాణాన్ని క్రొత్త అలవాట్లతో సృష్టిస్తుంది. కాని జీవితం అనంతంగా కదిలిపోతూ వుండటం వల్ల ఈ క్రొత్త అలవాట్లుకూడా, దానితాకిడివల్ల, ఎప్పుడో వొకప్పుడు బద్దలవక తప్పదు. అటు మానవుడు ఆ ముక్కలను మళ్ళీ అతుకుతూ వుంటాడు. ఇట్లా బద్దలవుతూ వుండటం, అతుకుతూ వుండటం నిరంతరం జరుగుతూనే వుంటుంది ... ఈవిధంగా అతికి మానవుడు ఇక చెదరని విధానం దొరికిందని ముచ్చట పడతాడు. ఇక పూర్వపు ఆవేదనలు రావు అనుకుంటాడు. ఆవేదనలను అధిగమించాను అనుకుంటాడు. కాని వెంటనే ఇది భ్రమ అని తెలుసుకుంటాడు...' కాబట్టి సంకల్పంవల్ల 'నేను' అనే భావాన్నుంచి ముక్తి దొరకదు. కృష్ణమూర్తి వేరొకచోట చెప్పినట్లు, 'సంకల్పంవల్లకాక ఆత్మజ్ఞానం మాత్రమే దీనికి తోడ్పడుతుంది. మనం అనుభవించే బాధలు ఈస్పృహనూ దానివల్ల కలిగే అవకాశాన్నీ గుర్తుకు తెస్తవి.' ఇటువంటి జ్ఞానం, ప్రయత్నంయొక్క నిష్ఫలతను గమనంలోకి తెచ్చి 'నేను' అనే భ్రమను తొలిగిస్తుంది. ఈ పరిణామంయొక్క

అపకారాన్ని మనం గ్రహించినప్పుడు అది దానంతట అదే రాలిపోతుంది. దాన్ని అర్థం చేసుకోవటంలోనే, దానినుండి విముక్తిని పొందే లక్షణం నిగూఢంగావుంది. కాని ఈ విముక్తి మనం చిక్కుకొనివున్న భ్రమయొక్క సంపూర్ణ తత్వాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నప్పుడే అది తొలగి పోతుందని మరచిపోగూడదు. మన నిత్యకృత్యాల నిర్వీర్యత మనకు గాఢంగా తగిలినప్పుడే ఈ పని జరుగుతుంది. ఈ స్థితి వొట్టి తర్కంవల్లగానీ, హేతువాదం వల్లగానీ, కాదు. మన మనోవీధిలో అనేక ఆలోచనలు వుంటాయి. అనేక నిర్ణయాలు జరుగుతుంటై: ఈ ఆలోచనలకూ, నిర్ణయాలకూ విరుద్ధమైన అలవాట్లను మాత్రం మనం వొదులుకోలేం. భౌతిక జీవితంలో వాటిని అనుసరిస్తూనే వుంటాం. కాబట్టి ఈ 'నేను' అనే భావబంధాన్నుంచి విముక్తిపొంది సత్యాన్ని తెలుసుకోవటానికి ఆత్మజ్ఞానమే మార్గం. దీన్ని విచ్ఛిన్నం చెయ్యాలనే సంకల్పంవల్ల ప్రయోజనం లేదు.

ౘ

కృష్ణమూర్తి పసిపిల్ల వానికంటే నిష్కల్మషంగా ఆలోచించగలిగిన శక్తిమంతుడు. ఏదో వొకటి కావాలనే ప్రయత్నంనుంచి విరమించి ప్రతిక్షణం జీవితాన్ని అనుభవించమని చెప్పటం అత్యద్భుతమైన, అతి రమణీయమైన భావ విజృంభణ! ఈ స్థితిలో మానవుడు అన్ని నీతులకూ అతీతుడౌతాడు. నీతిశాస్త్రాలన్నీ మానవుణ్ణి ఏదో వొకటి కమ్మని ప్రోద్బలించేవేగా! అందువల్ల అవన్నీ మానవుని

మానవతను ఎంతవరకో కొంతవరకు సంకుచిత పరిచేవే! ఈ దృష్టి నేటి మానవుణ్ణి కూకటి వేళ్ళతో మార్చివేసి నూతన మానవుణ్ణి సృష్టిస్తుంది. కాలానికి కట్టుబడివున్న మన మనస్సులు కృష్ణమూర్తి అనుభవించే స్థితిని పూర్తిగా అర్థం చేసుకోలేవు. ఈ స్థితిని అనుభవించే కృష్ణమూర్తిలాంటి దివ్య వ్యక్తులను వర్ణించి చెప్పమని అడిగే ప్రయోజనం లేదు. ఎందుకంటే కాలానికి కట్టుబడివున్న సాధనలకు అదిఅందదు. అది నిత్యపరిణామ జనితమైంది; నిత్యనూతనమైంది. దానిని మాటలలో ఇమడ్చటం సత్యేతరమైన పనే అవుతుంది.

ఏదో వొక ఆదర్శాన్ని పెట్టుకొని, దాన్ని సాధించటానికి ఏదోవొక మార్గాన్ని అనుసరించటం మొదలుపెడితే, కొంత జీవితాన్ని మన అనుభవంలోకి రాకుండా చేసుకోవ కోవటమే అవుతుంది. అందువల్ల అనుభవం సంకుచితం; జీవితం కృత్రిమం అవుతుంది. దీనివల్లవర్తమానానికీ భవిష్యత్తుకీ సంబంధించిన పనుల్లో వైరుధ్యం ఏర్పడుతుంది. మనిషి పతనం అవుతాడు. కాబట్టి మనిషి పరిపూర్ణుడు కావాలంటే జీవితం ప్రతిక్షణం అనుభవించబడాలి; ఏ క్షణానికి ఆ క్షణమే నూతన జీవితానికి ప్రారంభం కావాలి. ప్రయోజనం ఏ పనికి ఆ పనిలోనే వుంది. పూర్వపు పనులతో ముడి పెట్టవలసిన అవుసరంలేదు. గతంలేదు; అదేవిధంగా భవిష్యత్తులేదు. భవిష్యత్తుతోపాటు, మరణం, మరణాంతర జీవితం, పునర్జన్మ మొదలైన అన్ని సమస్యలూ అంతర్థానమైతే ఈ జీవితం తొల్లి అయినప్పుడే మానవుడు మరణం

అంటే భయపడతాడు. ఈ జీవితం పరిపూర్ణం అయినప్పుడు అతడు దేనికీ భయపడడు. మనిషి పూర్ణుడైతే 'నేను' అనే భావం పూర్తిగా నశిస్తుంది. తన వ్యక్తిత్వ ప్రతిభను పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకొని, దాని స్పృహనుంచి తప్పుకోగలుగుతాడు. తననుంచి తాను విముక్తి పొందగలగటమే అర్థం చేసుకోటానికీ, వివేకానికీ పునాది. ఇది జీవితాన్ని నిరసించటంకాదు; జీవితంమీద విముఖత్వాన్ని ప్రకటించటం కాదు; స్వేచ్ఛను దుర్వినియోగ పరచుకోవటం కాదు; నీతి బాహ్యమైన అధోగతికి దిగజారటం కాదు; వైరుధ్యాన్నుంచి సంపూర్తిగా, సమగ్రంగా విముక్తిని పొందటం. అప్పుడు వ్యక్తికి 'వాస్తవికత'తో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. నిజమైన అనుభవం అప్పటినుంచే ప్రారంభం అవుతుంది. వైరుధ్యాలలో నలిగిపోతున్న మానవుని శక్తి కేంద్రీకృతం అవుతుంది. లోపలివాడు లోతులను త్రవ్వకొని, గాఢమైన నిశ్శబ్దతలో ప్రవేశించి ఇతరులచేత దోచుకోబడటానికిగానీ, ఇతరులను దోచుకోటానికిగానీ వలను పడని స్థాయికి వస్తాడు. ఇదివరకువలె కాకుండా ఆలోచనా, ఆవేశం ఒక్కటై కాలాన్నే అధిగమిస్తుంది. మానవుని శక్తులన్నీ ఏకమైతే, నిజమైన ప్రేమ ఉద్భవిస్తుంది. ఈ ప్రేమ తన ప్రభావాన్ని ప్రసరించటానికి దేనినీ ఏరుకోదు. దేనినీ బంధించదు. అది సూర్యభగవానునికివలె సమస్త జీవకోటికీ తన కాంతిని ఇస్తుంది. సీతాకోక చిలుకా, క్రిమీ, మహర్షీ, పాపీ అందరూ దానికి వొకటే. దారినపోయే అందరికీ దా

తన సువాసనలను విరజిమ్మే పుష్పంవంటిది అది; తనకాంతి ప్రసరించే ప్రతివస్తువునీ ప్రకాశింపజేసే జ్యోతి అది,- అన్నాడు కృష్ణమూర్తి. ఏవో కొన్ని సూత్రాలను అనుసరించటంవల్ల, ఆలోచనలను అనుసరించటంవల్ల ఈ పని జరుగదు. 'విషయాలు ఉన్నతీరునే వాటితో ప్రసక్తి పెట్టుకుందాం. ఉన్నదాన్ని గుర్తించి పరిశీలించటంవల్లే బుద్ధి మేల్కొంటుంది. ఒక పద్ధతిని అనుసరించటంవల్ల ఆ పద్ధతికి ప్రాముఖ్యత ఎక్కువ అవుతుంది. క్రమశిక్షణలో వున్న ప్రమాదంకూడా ఇటువంటిదే. దానిలో చిక్కుకుపోయిన మనుష్యులకంటే, విధానమే ప్రాముఖ్యతకు వస్తుంది. ప్రేమకు ఉండవలసినస్థానాన్ని క్రమశిక్షణ ఆక్రమిస్తుంది. క్రమశిక్షణ ద్వారా, నిరోధంద్వారా స్వాతంత్ర్యం ఎప్పటికీ సిద్ధించదు. స్వాతంత్ర్యం అనేది ఒక గమ్యంకాదు; సాధించుకోవలసిన లక్ష్యంకాదు. స్వాతంత్ర్యం అంతంలోవుండే లక్షణంకాదు. ఆరంభంలోనే వుంది...' అన్నాడు కృష్ణమూర్తి. 'సరైన విద్య' అనే ఉపన్యాసంలో ఒకరీతికి కట్టుబడకుండా వుండటం అసంభవం అనే విమర్శకు ఇలా జవాబు చెప్పాడు. 'వ్యక్తి యొక్క ఈ సంపూర్ణ అభివృద్ధి, వికాసం, అరాచకానికి దారి తీస్తాయని కొందరు చెపుతారు. కాని అలా దారి తీస్తాయా? ప్రపంచంలో ఇప్పుడు ఏర్పడిన కల్లోలం తనను తాను అర్థంచేసుకునేటట్లు వ్యక్తికి బోధించకపోవటం మూలానే ఏర్పడింది. ఏదో మిడిమిడి స్వాతంత్ర్యం ఇచ్చినప్పటికీ, ఒకరీతికి కట్టుబడి వుండాలనీ, ఇప్పుడు ప్రచారంలో

వున్న విలువలను ఏదో వొక రూపంలో అంగీకరించాలనీ బోధించబడుతూవుండటం వల్లనే ఈ కల్లోలం ఏర్పడింది. ఈ నిర్బంధానికి వ్యతిరేకంగా చాలామంది తిరుగుబాటు చేస్తున్నమాట నిజమే. కాని ఈ తిరుగుబాటు స్వార్థం కోసం చేసే ప్రతిక్రియగా మాత్రమే ఉంటూవుంది. ఇది దురదృష్టం. దీనివల్ల చీకటి మరింత పెనవేసుకుపోతూవుంది. ఇలా వ్యతిరేక ప్రతిక్రియలద్వారా కాకుండా, జీవితం యొక్క సంపూర్ణ గమనాని అర్థంచేసుకోవటం ద్వారా దీని నుంచి బయటపడాలి. సమీకరణా, సంపూర్ణసిద్ధి లేకుండా మనుష్యుడికీ మనుష్యుడికీ మధ్య సంపూర్ణ సహకారం సాధ్యం కాదు. ఈ సమీకరణ, సంపూర్ణసిద్ధీ వ్యక్తికి కలిగించటానికి ఉత్తమవిద్య సహాయపడాలి. మానవ సంబంధాల్లో సమూలమైన మార్పు తీసుకురావటం అసాధ్యం కాదు.'

— ••• —





# 'గణితశాస్త్ర తత్వవేత్త' వైట్ హెడ్

వైట్ హెడ్‌ను గురించి అనేక అపవాదులు ప్రచారంలో ఉన్నాయి. అందులో ముఖ్యమైనది, 'శాస్త్ర పరిశోధనలను భగవంతుని ఉనికిని నిరూపించటానికి వినియోగించు కొంటున్నా'డనేది. విశ్వభారతికి చెందిన సయ్యద్ ఆయ్యూబ్ ప్రాచీన పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో ఆయనను గురించి వ్రాస్తూ, 'వైట్ హెడ్ సైన్సులోకి మిస్టిసిజాన్ని ప్రవేశ పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడని కొందరు విమర్శిస్తున్నారు. ఇది పొరపాటు' అన్నాడు.

ఈ పొరపాటు పడటానికి కొంతవరకు ఆస్కారం లేక పోలేదు. వైట్ హెడ్ 'ప్రపంచంలో జరిగే అన్ని సంఘటనలకు సైన్సు అర్థం చెప్పగలదు' అనే నమ్మకం లేనివాడు, 'జీవితంలోని కొన్ని ముఖ్యమైన అనుభవాలను సైన్సు తనలోకి తెచ్చుకోలేకపోతుంది' అని అతని వాదం. అందువల్ల, నేటి సైన్సు ప్రపంచాన్ని సమగ్రంగా చిత్రించే సిద్ధాంతాన్ని సృష్టించలేదని ఆయన విశ్వాసం. ఇదే భావాన్ని సయ్యద్ అయ్యూబ్ ఈ విధంగా వివరించాడు: "ఆయన తత్వశాస్త్రం శాస్త్ర పరిశోధనలకు విశాలమైన అర్థం కల్పించి, వాటికి సంబంధించిన క్షేత్రాలలో వాటి

సామర్థ్యాన్ని అంగీకరిస్తూ, అంతటితో ఆగక, మరికొన్ని మానవుని అనుభవాలను అంగీకరించేటట్లు చేయటానికి ప్రయత్నిస్తుంది" అని అన్నాడు. ఈ ప్రయత్నంవల్ల తన్ను అంటిపెట్టుకుని ఉన్న మౌఢ్యం సడలి తన ధర్మాన్ని తాను బాగా నిర్వర్తించుకునే అవకాశం సైన్సుకు కలుగుతుంది. వైట్ హెడ్ దృష్టిలో సమస్తానికీ వర్తించే సూత్రాల విమర్శే తత్వశాస్త్రం. ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రకం సూత్రాలు ప్రచారంలో ఉంటాయి. ఈ సూత్రాలు సర్వానికి వర్తిస్తాయని ఆనాటివారు అనుకోవడంకద్దు. కాని, ప్రపంచం అనుభవం నిత్యం మారుతూ ఉండటంవల్ల ఈ సూత్రాలుకూడా మారుతూ ఉండాలి. అలా మారనప్పుడు సూత్రాలు వెనకపడడం, ప్రపంచం ముందుకు నడవటం జరుగుతూ ఉంటుంది. కాబట్టి ఎప్పటికప్పుడు ఈ సూత్రాలను విమర్శించి చూచుకోవలసిన అవసరం ఉంది - —తత్వశాస్త్రం చేయవలసిన పని ఇది - అని వైట్ హెడ్ అభిప్రాయం,

ఈ దృష్టితో పరిశీలిస్తే, మన యుగంలో తాత్వికుల విమర్శలకు గురికావలసిన సూత్రాలు శాస్త్రీయ దృక్పథం క్రింద చలామణి అవుతున్న విశ్వాసాలు - అని తేలుతుంది. పదిహేడవ శతాబ్దపు శాస్త్రీయ దృక్పథం సామాన్య మానవులనేకాక, విద్యావంతులను, మేధావులను కూడా అతి చిత్రంగా లోబరచుకుంది. ఈ దృక్పథం మనిషికి ప్రాముఖ్యతనే లేకుండా చేసింది. మనిషిని యంత్రం క్రింద జమ

కట్టింది. అయిన్‌స్టిన్, మింకోవిస్కీ, శ్రోడింగర్, హీసెన్‌బర్గ్ మొదలైన ప్రముఖ శాస్త్రవేత్తలు సైన్సుసృష్టించిన ఈ దృష్టిని కొంతవరకు సడిలించటానికి ప్రయత్నించినా, వారి కృషి ఫలించలేదనే చెప్పుకోవాలి. సైన్సుయొక్క ఈ విజయానికి అది పురికొల్పిన సంకుచిత సూత్రాలే కొంతవరకు కారణమని చెప్పుకోవచ్చు. ఇంద్రియాలవల్ల అనుభవంలోకి వచ్చిన వాటినే అంగీకరించి, మిగిలినవాటిని త్రోసివేయటం తేలికే. తేలికేకాదు, సామాన్య మానవునికి బాగా అర్థమయ్యేదీ, నచ్చేదీకూడా ఈ పద్ధతే. కాని, ఇట్లా యాంత్రికంగా ఆలోచించటం సామాన్యులను ఆకర్షించగలిగినప్పటికీ ప్రపంచ పరిణామానికి గానీ, మానవుని పురోభివృద్ధికిగానీ తోడ్పడదు. పైగా ఈ దృష్టి నైతిక విలువలకుగానీ, ఆధ్యాత్మిక విలువలకుగానీ ఈప్రపంచంలో చోటు లేకుండా చేస్తుంది; ఈ దృష్టి మహర్షుల అనుభవాలను అంగీకరించకపోవడమేకాక, అందానికీ లలిత కలళలకు కూడా ఈ ప్రపంచంలో సముచిత స్థానాన్ని చూపలేకపోయింది. దీనివల్ల మన ఆలోచనలకూ, ఆవేశాలకు వైరుధ్యం ఏర్పడింది. ఇవి పరస్పరం సహకరించుకొని, అభివృద్ధి చెందడానికిబదులు ఒకదాని కొకటి విరుద్ధంగా నిలబడి, ఒకదాన్ని మరిచిపోయినప్పుడే రెండవదాన్ని అనుభవించి ఆనందించగలిగే స్థితికి మానవుణ్ణి దిగజార్చాయి. ఈదృష్టిని విమర్శించటానికి పూనుకున్నాడు వైట్ హెడ్.

అయితే సైన్సును విమర్శించే బ్రాడ్లీ, బెర్గ్‌సన్ ఎడ్డింగ్టన్ మొదలైన వారికీ వైట్‌హెడ్‌కీ కొంత భేదం

ఉంది. పై వారందరూ సత్యాన్ని తెలుసుకోవడం మనస్సు వల్లకాదని వాదిస్తారు. అదిఎటు ప్రయత్నించినా, ఎంత ప్రయత్నించినా వైరుధ్యాలలో చిక్కుకుని గమ్యస్థానాన్ని కోల్పోతుందని వారు భావిస్తారు. మనస్సు భ్రాంతులతో మాత్రమే సంబంధం పెట్టుకుంటుందనీ, అందువల్ల సత్యాన్ని తెలుసుకోవాలంటే మరొక రకమైన అనుభవాన్ని తెచ్చుకోవాలనీ వారు చెబుతారు. ఈఅనుభవమే 'ఇన్‌ట్యూయిషన్' అని వారి ఉద్దేశం. వైట్ హెడ్ ఈవిధంగా ఆలోచించడు. జీవితంలోని అతిముఖ్యమైన కొన్ని అనుభవాలను సైన్సు అజలోకి తీసుకోవటంలేదని ఆయన అంగీకరిస్తాడు. కాని, ఈ సమస్యలను పరిష్కరించగలిగిన శక్తి హేతువాదాని కుందని ఆయన విశ్వాసం. 'భ్రాంతిని, వాస్తవికత్వాన్ని సత్యాన్ని, అసత్యాన్ని విమర్శించి తెలుసుకోగలిగిన శక్తి హేతువాదానికుంది. ఈ పని హేతువాదం చేయగలదు:' అంటాడువైట్ హెడ్. అందుకనే సైన్సులో మిస్టిసిజాన్ని చొప్పించాలనేకోరిక ఆయనకు లేదని మనం మొదట్లో చెప్పు కున్నాం. సైన్సు లేపిన వైరుధ్యాలుగానీ, సృష్టించిన సార్వజనీన సూత్రాలుగాని సరిదిద్దటానికి వీలుకానివని ఆయ నడు- 'ప్రకృతిలో వర్డ్స్‌వర్త్ కనిపెట్టిందీ, సైన్సు కనిపెట్టలేక పోయిందీ ఏమిటి?......సైన్సు శ్రేయస్సుకోసే నేనీప్రశ్న అడుగుతున్నాను: సైన్సు సృష్టించిన సూత్రాలు మార్చ డానికి వీలులేనివని, బాగుపరచటానికి వీలులేనివని నే ననుకోడం లేదు. సైన్సు పుట్టిం చిన భావాలు కొన్ని హద్దుల్లో మాత్రమే నిజమవుతాయని అనుకోవడానికి

వీల్లేదా ? హద్దులు సైన్సుకే సంకుచితమైనవి అని అనుకోవ డానికి వీలులేదా ?' ఈవిధంగా ప్రశ్నించి సైన్సు శ్రేయస్సు కొరకే విమర్శలకు పూనుకున్నట్లు వైట్ హెడ్ చెప్పాడు.

## ౨

వైట్ హెడ్ తత్వశాస్త్రం రెండు రకాల ఆలోచన లను వ్యతిరేకించడంవల్ల ప్రస్తుతరూపాన్ని పొందగలిగింది. ఆ ఆలోచనలు ఇవి:- 1. న్యూటన్ చెప్పిన భౌతిక రూపాల స్థావరం. 2. ప్రకృతినుంచి మనస్సును విడదీయటం అనే కార్టీసియన్ సిద్ధాంతం.

ఈ రెండు సిద్ధాంతాలను ఆయన వ్యతిరేకించాడు. ఆయన ముఖ్యంగా ప్రకృతిని రెండువిధాలుగా వ్యతిరే కించటం ద్వారా ప్రసిద్ధి కెక్కాడు. ప్రకృతిని రెండువిధా లుగా వ్యతిరేకించడానికి ఆయన వ్యతిరేకం. 'ప్రకృతిని పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పే ఎలక్ట్రానుల స్వభా వంగానూ, కాంతిపుంజముగాను, కవులూ, చిత్రలేఖకులూ వర్ణించేసూర్యాస్తమయం, కోకిలగానం మొదలైనవాటితో ఉన్న దానినిగానూ విభజించటం తప్పు' అని ఆయన ఉద్దేశ్యం. ఈ రెండవరకం ప్రకృతిని సైన్సుఅంగీకరించదు. సైన్సుయొక్క ఆవైఖరిని విమర్శిస్తూ "మనకు కనపడేదంతా నిజమే. 'ఇదినిజం అదినిజం' అని ఏనుకోవడంలో అర్థంలేదు. మనకు మాలెక్యూల్సు, విద్యుచ్ఛక్తి అలలు ఎంత నిజమో

సూర్యాస్తమయ శోభ, కోకిలగానం ఒలికించే అమృత ధారలూ అంత నిజం" అని అన్నాడు వైట్ హెడ్.

కళోపాసనకు పదార్థ విజ్ఞానశాస్త్ర స్వభావము, కళా కారుల స్వాభావము ఒకటి కానక్కర్లేదు. మనం కోరేదల్లా శాస్త్ర పరిశోధనలజ్ఞానం, కళను స్ఫురింపజేసే సౌందర్యం ఒకదానికొకటి వ్యతిరేకంగా నిలబడకూడదనే. ఈ సమ గ్రతను సాధించడానికి వైట్ హెడ్ నిరంతర కృషి చేశాడు. మనస్సునీ, పదార్థాన్నీ సమన్వయ పరచడానికి వీలులేని విరుద్ధశక్తులుగా పరిగణించగూడ దనేది ఆయన మూల సూత్రం.

*  *  *  *

ఆయన 'రాన్స్ గేట్'లో 15 ఫిబ్రవరి, 1861 వ సంవత్సరంలో జన్మించాడు. 'షెర్బోరన్' స్కూలులోనూ, 'కేంబ్రిడ్జి'లో ఉన్న 'ట్రినిటీ' కాలేజీలోనూ విద్య నభ్య సించాడు. మాంచెస్టర్, సైంట్ ఆండ్రూస్, మెడ్విల్ యేల్ మొదలైన విశ్వవిద్యాలయాలనుంచి గౌరవ పదవులను పొందాడు. 1911 వరకు ఆయన ట్రినిటీ కాలేజీలో గణిత శాస్త్రోపన్యాసకుడుగా పనిచేశాడు. తర్వాత లండన్ యూని వర్సిటీ కాలేజీలో 1914 వరకు ఉపన్యాసకుడుగా ఉన్నాడు. 1924 తత్వశాస్త్రోపన్యాసకుడుగా 'హార్వర్డ్' వెళ్ళాడు. 1937 లో ఉద్యోగవిరమణ చేశాడు.

ప్రముఖ గణితశాస్త్రజ్ఞుడుగా ఆయనకు అనేక గౌర వాలు దక్కినై. స్వభావసిద్ధంగా ఆయన ఆధ్యాత్మిక చింతన

కలిగినవాడు. ఆయనికి గణితశాస్త్రం పరంజ్యోతికి సంబంధించిన భాషగా కనపడుతుంది అనటంలో అతిశయోక్తి లేదు. అందువల్ల ఆయన అభిమానులలో ఆధ్యాత్మిక దృష్టికలవారే ఎక్కువగా ఉన్నారు. జీన్స్, ఎడ్డింగ్‌టన్, మిల్లికన్ మొదలైనవారిని ఎక్కువమంది ఎందుకు అభిమానిస్తున్నారో, వైట్‌హెడ్‌ని కూడా అందుకే అభిమానిస్తున్నారు. సైన్సు పట్ల చూపుతున్న ఆధ్యాత్మిక దృష్టే ఈ అభిమానానికి కారణం. 'వైట్‌హెడ్ పదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు కాదు, గణిత శాస్త్రజ్ఞుడు అని జ్ఞాపకం ఉంచుకుంటే అతన్ని అర్థం చేసుకోవడం తేలిక' అని కొంతమంది మేధావులు భావిస్తారు.

ఆయన డిసెంబరు 30, 1947 వ సంవత్సరంలో నిర్యాణం పొందాడు. భావచరిత్రకు ఆయన తన తత్వశాస్త్రంద్వారా సహాయంచేశాడు. ఆయన తన భావాలను వెలిబుచ్చటానికి అనేక నూతనపదాలను సృష్టించి వాడాడు. అందువల్ల ఆయన ఆలోచనలో ఉన్న జటిలతవల్ల ఆయన అభిప్రాయాలను అర్థంచేసుకోవడం కొంచెం కష్టమే అవుతుంది. ఆయనను గురించి 'లండన్‌టైమ్స్' "ఇంతటి ఉన్నతమైన భావాలను, ఇంత జటిలమైన భాషలో ఇంతవరకు ఎవ్వరూ చెప్పిఉండలేదు." అని వ్రాసింది. కాని ఆయన భాషలో సునిశితమైన హాస్యం, Vivid ophoism ఉన్నాయి. అందువల్లనే 'జస్టిస్ ఫ్రాంక్‌ఫర్లన్, 'ఆలోచనా శక్తిని కదిలించే గ్రంథాలను చదవదలచినవారు వైట్‌హెడ్ యొక్క సాంకేతిక విజ్ఞానానికి సంబంధించని గ్రంథాలలో ఉన్న

ఆకర్షణను గ్రహించకుండా ఉండలేరు,' అని వ్రాశాడు. 'న్యూయార్క్-టైమ్స్' ఆయనను ఈ విధంగా వర్ణించింది: "అతను పాత సాంప్రదాయాలకు సంబంధించిన పండితుడని అనుకుంటారు. కాని, నిజానికి వర్తమానానికి చెందినవాడే. అతను 'రెలిటివిటీ'ని గురించీ, క్వాంటమ్ సిద్ధాంతాన్ని గురించీ శాస్త్రజ్ఞులతో చర్చించగలడు. ప్రపంచాన్నీ, పదార్థాన్నీ తెలుసుకోవడానికి మామూలు మనుష్యులకు అర్థమయ్యే దారులను సూచించగలడు..."

## 3

వైట్ హెడ్ తత్వవేత్తగా మారిన గణితశాస్త్రజ్ఞుడు. అందువల్ల మిగిలిన తత్వవేత్తలవలె గాక, గుర్తులను ఎక్కువగా ఉపయోగిస్తాడు. మామూలు పాఠకునికి ఆయనను అర్థం చేసుకోవడానికి ఇదికొంత క్లిష్టత కల్పించేమాట వాస్తవం. కాని ఇది తప్పనిసరి. 'వైట్ హెడ్ తాత్విక పరిణామం' అనే గ్రంథంలో ఆయనను గురించి వ్రాస్తూ లారెన్స్ అనే ఆయన, "స్పష్టతకంటే సమగ్రత ఆయన రచనల్లో ఎక్కువగా ఉంది," అని వ్రాశాడు. గణితశాస్త్రజ్ఞుడవటంవల్ల ప్రతిమాటను తూచి వాడటం, ప్రతిమాటకూ నిర్దుష్టమైన అర్థం ఒకటి ఉండేటట్లు చూడటం ఆయన అలవాటు. కాని తత్వవేత్తగా జిజ్ఞాసా పథంలో అడుగుపెట్టేటప్పటికి ఆయనకు అనేక దారులు; అనేక అర్థాలు స్ఫురింపమొదలుపెట్టాయి. అప్పుడు తన పరిశోధనా క్షేత్రాలను,

తా ననుసరించే విధానాన్ని స్పష్టతకోసం సంకుచితపరచు కోవడమా, లేక విశాలమైన గ్రహణశక్తి అలవరచుకోవడమా? విరుద్ధ సిద్ధాంతాలలో సంభవానుకూలమైన వివిధ దృక్పథాలను, అస్పష్టంగా ఉన్నవాటిని, గమనంలోకి తీసుకోవడమా? అనే సమస్య అతన్ని ఎదుర్కొంది. ఈసమస్యను వైట్ హెడ్ వెంటనే పరిష్కరించలేక పోయాడు.

మొదట్లో విశాలత్వానికంటే, స్పష్టతకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. తాను పరిశోధించాల్సిన క్షేత్రాన్ని సంకుచిత పరచుకున్నాడు. ప్రకృతి పరిశోధనకు, నైతిక విలువలకు, జ్ఞానానికి సంబంధించిన సమస్యలకు, ఏమీ సంబంధం లేదనే నమ్మకంతో అన్వేషణ ప్రారంభించాడు. తన అన్వేషణ ఫలితాన్ని "ప్రకృతి శాస్త్రంమొక్క తత్వార్థం' అన్నాడు. ఈ తత్వశాస్త్రం ప్రకృతికి సంబంధించింది మాత్రమే. ప్రకృతి అంటే ఏమిట? ఇంద్రియాల ద్వారా మనం తెలుసుకోగలిగిందే ప్రకృతి. ఈ విధంగా ప్రారంభదశలో వైట్ హెడ్ మనస్సుని, ఆలోచనని, ప్రకృతికి సంబంధించని విషయాలుగా తన పరిశోధనలనుంచి వెలివేశాడు. ఈ సందర్భంలో 'ప్రకృతి భావన' అనే రచనలో ఆయన ఇలా వ్రాశాడు: 'మనం మన ఇంద్రియాల ద్వారా తెలుసుకో గలిగింది ప్రకృతి. ఇందులో ఆ లోచన కానివిషయం, ఆలోచనలకోసం స్వయం సంపూర్ణంగా ఉండేవిషయం, ఒకటి ఉన్నట్టు మనం గ్రహిస్తాం. ఆలోచనకోసం స్వయంసంపూర్ణంగా ఉండే ఈ వస్తువు ప్రకృతి శాస్త్రానికి పునాదిగా ఉంటుంది. 'ప్రకృతి సంపూర్ణ

విధానం' అని మనం అనుకోవచ్చనే దీనిభావం. దీని పరస్పర సంబంధాలు, అవి భావించబడినవనే సత్యాన్ని బహిర్గతం చేయవలసిన అవసరంలేదు.

ఈ విధంగా భావనకు సంబంధం లేకుండా స్వాతంత్రంగా ఉండగలదు ప్రకృతి. మనస్సుకి ప్రకృతి మూసివేయబడిన పదార్థమని చెప్పుకోవడంద్వారా ప్రకృతి స్వయం సంపూర్ణమైనదనే భావాన్ని నేను వ్యక్తపరుస్తున్నాను."

వైట్ హెడ్ వెలిబుచ్చిన పై భావాలనుబట్టి ప్రథమంలో ఆయన మనస్సునీ ప్రకృతినీ విడి పదార్థాలుగా భావించాడని కొందరు ఊహించవచ్చు. కాని, ఇలా అనుకోవటం పొరపాటు ప్రకృతిశాస్త్ర పరిశోధనకు మనస్సుతో నిమిత్తం లేదని మాత్రమే ఆయన అభిప్రాయం. ఆయనే వేరొకచోట ఈ ఉద్దేశాన్ని ఇలా విపులీకరించాడు: 'ప్రకృతిని ఈవిధంగా స్వయంసంపూర్ణమైనదాన్నిగా భావించడంతో ప్రకృతినీ, మనస్సునీ విడదీసే సిద్ధాంతాన్ని నేను బలపరుస్తున్నట్లు ఎవరూ అనుకోకూడదు. ఇంద్రియాలు ప్రోగుచేసే జ్ఞానంవల్ల ప్రకృతిని వివిధవిషయాలతో కూడుకొని ఉన్నదాన్నిగానూ, మనస్సుకు సంబంధం లేకుండా ఈ వివిధ విషయాల సంబంధాలు భావనలో రూపొందడానికి వీలున్న దాన్నిగానూఅర్థం చేసుకోవచ్చు.'

ఆలోచనలను గురించి ఆలోచించకుండా ప్రకృతిని గురించి ఆలోచించవచ్చని ఆయన అభిప్రాయం. ప్రకృతి

తత్వశాస్త్రానికి సంబంధించిన ఆలోచన ఇటువంటి ఆలోచన. ఇటువంటి ఆలోచన, ఆలోచనను గురించిన ఆలోచనను, బహిష్కరించడమే కాక, నైతిక విలువలకు, సాంస్కృతిక విలువలకుకూడా చోటివ్వాదు.

ప్రథమదశలో ఈవిధంగా ఆలోచించాడు వైట్ హెడ్. కాని, క్రమేణా మనస్సునుగురించి తదితర విలువలను గురించీ ఆలోచించక తప్పలేదు ఆయనకు. చివరికాయన అటు ప్రకృతినీ, ఇటు మనస్సునీ కలుపుకొనివచ్చే ఒక సమగ్ర సిద్ధాంత సృష్టికి కృషిచేసి చరితార్థుడైనాడు. ఈ పరిస్థితి నిలా వర్ణించాడు లారెన్స్: 'గ్రహించడానికి, భావించటానికి, అగాధమైన భేద ముందనే ఊహతో వైట్ హెడ్ తత్వశాస్త్రం ప్రారంభమైంది. ఈ పరిస్థితి ఎటువంటి సమస్యలను సృష్టించిందీ అంటే వీటిని పరిష్కరించడానికి విరుద్ధంగా కనపడేవాటిని సమన్వయ పరచక తప్పిందికాదు వైట్ హెడ్‌కు. చివరకు వేటిప్రత్యేకతను వాటి కుంచుతూ వాటి సన్నిహితత్వాన్ని నిరూపించాడు వైట్ హెడ్. దీని పర్యవసానం ఒక సమగ్రమైన తత్వశాస్త్ర సృష్టి. ఇందులో మామూలుగా కనపడే సమస్యలకు క్రొత్తసమాధానాలు దొరుకుతాయి. అక్కడక్కడా కొన్ని లోపాలున్నా ఇటీవలి మరే సిద్ధాంతానికీ లేని సమగ్రత ఈ శాస్త్రాని కుంది.'

వైట్ హెడ్‌లో వచ్చిన మార్పుకి లారెన్స్ మూడు ముఖ్యమైన కారణాలని సూచించాడు. మొదటి కారణం వ్యక్తిగతమైంది. సిద్ధాంతంలో మసలే వైరుధ్యాలమాట

అటుంచి, తనకై తాను సృష్టించుకున్న హద్దులు వైట్‌హెడ్ ఆలోచనా శక్తిని ఇబ్బందిపెట్టి, మనస్సును కలవర పెట్టాయి. రెండవది:- మొదటినుంచీ వైట్‌హెడ్ తాత్విక దృష్టిలో రెండు ముఖ్య లక్షణాలు అంతర్గతంగా ఉంటూనే ఉన్నాయి. మొదటిదశలో ఈ లక్షణాలు సమన్వయింప బడకుండా దేనికవే స్వతంత్రంగా ఉంటూ వచ్చాయి. ఒక దానికొకటి వ్యతిరేకంగా నిలబడి పోటీపడిన సమయాలు కూడా లేకపోలేదు. ఇందులో మొదటి లక్షణం ప్రకృతి మనస్సుకు అవగాహన అవుతుందని. రెండవలక్షణం-ప్రకృతి తనకు తానుగా కొంత అస్తిత్వాన్ని అట్టిపెట్టుకోగలదని. ఈ రెండు లక్షణాలూ క్రమక్రమేణా వృద్ధిచెంది, తమతో పాటు వైట్‌హెడ్ దృష్టిని మార్పుకు గురిచేస్తూ వచ్చాయి. ఇక చివరికారణం పదార్థం అని చెప్పుకోవడంతో వచ్చిన మార్పు అన్నమాట.

మొదటినుంచీ వైట్‌హెడ్ పదార్థాలు పరస్పర సంబంధం కలవి అనే అభిప్రాయంతోనే ఉన్నాడు. ఇప్పుడు పదార్థాన్ని శక్తిగాను, శక్తిని పదార్థంగానూ మార్చ వచ్చని సైన్సుచూపింది. దీనివల్ల ప్రపంచంలోజరిగేఅన్నిటినీ 'జీవితం' అనే మాటకిందికి తీసుకు రావటానికి అవకాశం కలుగుతూవుంది. దీనితో వైట్‌హెడ్‌లో వచ్చిన మార్పు సహజమూ, తప్పనిసరీ ఐంది.

౪

ఈ ప్రపంచం అంగాంగీ సంబంధంకలదని వైట్ హెడ్ భావన. అందుకనే తన తత్వశాస్త్రాన్ని 'ఒక నిర్మాణాన్ని ప్రతిపాదించే తత్వశాస్త్రం' అని అన్నాడు. ఈ దృష్టితో అతను గీసిన ప్రపంచం బొమ్మను పరిశీలిద్దాం.

ఈ ప్రపంచం మూలపదార్థం ఏమిటి? ఏ ఏ రాళ్ళతో ఇది నిర్మించబడింది? ఏ రాళ్ళతో నిర్మించబడినా, ఈ రాళ్ళు మార్పులేనివి కావనీ, ఎప్పటికప్పుడు పెరుగుతూ, కదులుతూ, కలుస్తూ ఉండేవేననీ ఒప్పుకోవాలి. వీటిని సంఘటనలు అని గాని; 'సందర్భాలు అనిగాని పిలువవచ్చు. వైట్ హెడ్ ఇలా అన్నాడు: "సిద్ధిని పొందిన అనేక సంద ర్భాల క్రింద మనం ప్రపంచాన్ని విడగొట్టవచ్చును. ఇవి ఈ ప్రపంచాన్ని నిర్మించిన మూలకేంద్రాలు." కాని ప్రపంచం ఈ సందర్భాలవల్ల నిర్మించబడినా, ఈ సంద ర్భాలు ఏకత్వస్వభావం కలిగినవేఅయినా, సూటిగా, తేలిగ్గా అర్థం చేసుకోవడానికి వీలైనవి కావు. ఈ సందర్భాలతో కూడిఉన్న ప్రపంచం ఈ క్రింద ఉదహరించబడిన మూడు లక్షణాల సమ్మిశ్రిత ప్రభావంవల్ల సంభవమైంది.

1. సృజనాత్మకశక్తి, ఈ శక్తివల్ల ఎప్పటికప్పుడు నూతనత్వం సంభవించడానికి అవకాశం కలుగుతుంది.

2. మానసిక రూపాలకుచెందిన క్షేత్రం. ఈ రూపాలు వాటంతటవి వాస్తవికమైనవి కావు. కాని వాస్తవికమైన ప్రతిదాంట్లోనూ ఉంటాయి.

3. సృజనాత్మక శక్తియొక్క సందిగ్ధ స్వభావాన్ని అసందిగ్ధ స్వేచ్ఛగా మార్చిన వాస్తవిక సంయమం. ఈ వాస్తవికమైన అలౌకిక వస్తువునే మానవులు భగవంతు డంటున్నారు.

వీటినిగురించి ఇంకా విపులంగా తెలుసుకుందాం.

## సృజనాత్మకశక్తి:

ఈ ప్రపంచంలోకి క్రొత్తదనం ప్రవేశించడానికి కారణభూతమైనదాన్ని సృజనాత్మక శక్తిగా పరిగణించాడు వైట్ హెడ్. అయితే, ఇది సృష్టించబడిన వస్తువులనుంచి వేరైంది కాదు. అటువంటి ప్రతి వస్తువుకీ ఇది సంబంధించే ఉంటుంది. 'ఈ సృజనాత్మక శక్తిని సృష్టించబడిన వస్తువుల నుంచి విడదీయడానికి వీల్లేదు. సృష్టించబడిన వస్తువులు సృజనాత్మక శక్తితోనే ఉంటాయి. ఒక వస్తువుయొక్క సృజనాత్మకశక్తి దానితో వుండే సృజనాత్మక శక్తిగా పరిణమిస్తుంది. అలా పరిణమించి ఇంకొక దశలోకి అడుగు పెడుతుంది. అప్పుడది మరొక నూతన వస్తువుయొక్క సృజనాత్మక శక్తి అవుతుంది. ఈ విధంగా సృజనాత్మకశక్తికి సంబంధించిన క్రియలో సంధికాలం అనేది ఒకటి సంభవిస్తుంది. ఈ కాలం భౌతిక ప్రపంచంలో తాత్కాలికంగా క్రమపద్ధతిలో కనిపించే మార్గాల రూపాలలో ప్రదర్శిత మౌతూ ఉంటుంది.'

వైట్ హెడ్ చెప్పిన ఈ మాటల్లో గమనించదగిన అనేక ముఖ్య విషయా లున్నాయి. అవి ఇవి:

1. భౌతిక ప్రపంచంలోనూ దాని బయట కూడా వస్తువుల కుండవలసిన పరస్పర సంబంధం.

2. చారిత్రకక్రమం—అంటే వర్తమానం గతంలో నుంచి పెరిగిందనే భావం.

సృష్టించబడిన వస్తువులకూ సృజనాత్మ శక్తికీ ఉన్న సంబంధాన్ని, వర్తమానం గతంలోనుంచి పుట్టుకొచ్చిందనే భావాన్ని తరచి చూస్తుంటే ఈ ప్రపంచం ఏదో అసందర్భంగా జరగడానికివీల్లేదని బోధపడుతుంది. ఈ ప్రపంచంలో అసందర్భం అనేది లేదు. కాకపోతే సందర్భశుద్ధిలో తరతమ భేదాలుండవచ్చు. గతానికీ, వర్తమానానికీ భేదం వర్తమానం లోనికి ప్రవేశపెట్టబడిన క్రొత్తదనం మాత్రమే.

సృష్టించబడిన వస్తువునుంచి సృజనాత్మక శక్తిని విడదీయడానికి వీల్లేకపోయినప్పటికీ, దానంతట దాన్ని వాస్తవమైన దానిగా పరిగణించడానికి వీలులేదు. ఎందుకంటే, దాని కొక స్థిరస్వరూపం లేదు. అది కామరూపం కలిగింది.

**మానసిక రూపాలు :**

మానసిక రూపాలు వాటంతట అవి వాస్తవికమైనవి కావు. కాని వాస్తవికమైన అన్ని వస్తువుల్లోనూ ఉదహరించబడి ఉంటాయి. 'సైన్సు - నేటి ప్రపంచం' అనే గ్రంథంలో వైట్ హెడ్ ప్రస్తావించిన 'శాశ్వత వస్తువులు' ఇవే అని మనం చెప్పుకోవచ్చు.

'వాస్తవమైన దాన్ని తెలుసుకోవాలంటే మానసిక క్షేత్రంతో కొంత సంబంధం పెట్టుకోవలసి ఉంటుందనే

విషయం నేను సమర్థించ దలచిన తత్వశాస్త్రానికి పునాది. మొత్తం తాత్విక దృష్టిలో ఈ రెండు క్షేత్రాలూ నిగూఢంగా ఉంటాయి. మానసిక క్షేత్రానికి సంబంధించిన లక్షణాలే సర్వానికీ అనువర్తించే లక్షణాలుగా పరిగణింపబడతాయి. వీటినే నేను శాశ్వత వస్తువులంటాను' అని అన్నాడు వైట్‌హెడ్.

ఈ మానసిక రూపాలు అన్ని సంఘటనలలోనూ ఉంటాయి. ఉండి వాటిని అధిగమిస్తాయి. ఏ విధంగా అధిగమిస్తాయి? ఇవి అన్నిటికీ వర్తించే స్వభావం కలిగినవవడం వల్ల తాము ఏ సంఘటనలలో అయితే ఉంటున్నవో వాటిని అధిగమించి ప్రవర్తించగలుగుతున్నాయి. దీనివల్ల వాస్తవిక సంఘటనలు శాశ్వత వస్తువులు పరస్పరం ఆధారపడి ఉంటాయని మనం చెప్పుకోవలసి వస్తున్నది. వీటికి ఒకదాని సహాయం మరొకదానికి అవసరమని కూడా చెప్పుకోవలసి వస్తున్నది.

అంతేకాదు, తత్వశాస్త్రంలో శాశ్వతవస్తువుల పరిస్థితి, వాస్తవరూపాన్ని ధరించే అవకాశాన్ని కలిగిఉండటం, ప్రతి వాస్తవిక సందర్భం, స్వభావం, ఆ సందర్భంలో అవకాశాలు ఏవిధంగా వాస్తవిక రూపాన్ని పొందినవో వర్ణించడం ద్వారా నిర్వచింపబడుతుంది. ఈ విధంగా అవకాశాల నుంచి ఏరుకోవటంవల్ల వాస్తవికత రూపొందుతుంది అని చెప్పుకోవచ్చు.

దీన్నిబట్టి శాశ్వత వస్తువు అని మనం చెప్పుకునేది ఏకత్వం కలిగిందే కాక భిన్నత్వం కలిగింది కూడాను. అది

ప్రవేశించే విధానాలలో భిన్నత్వం కలిగింది. ప్రవేశం పూర్తయ్యేవరకూ అన్నిప్రదేశాలలోనూ ఏకత్వం కలిగింది.

ఈ శాశ్వత వస్తువును గ్రహించడానికి మనం మూడు ముఖ్యవస్తువులను గమనంలో ఉంచుకోవాలి. (1) దాని ప్రత్యేక వ్యక్తిత్వం, (2) వాస్తవిక సందర్భాలరూపాన్ని పొందటానికి అనువైన ఇతర శాశ్వతవస్తువులతో దానికున్న సాధారణ సంబంధాలు, (3) ప్రత్యేక వాస్తవిక సందర్భాలలో దాని ప్రవేశాన్ని ప్రకటించే సామాన్య సూత్రం.

ఈ మూడు లక్షణాల్లో రెండుసూత్రాలు ఇమిడి ఉన్నాయి. (1) ప్రతి శాశ్వతవస్తువు, గుణాన్నిబట్టి చూస్తే ఏకత్వం కలిగింది. (2) ఏ శాశ్వత వస్తువూ, అది ఉదహరించే మరొక శాశ్వతవస్తువునుంచి విడదీయబడడానికి అనువైందికాదు. ఈ దృష్టితో చూస్తే ప్రతి శాశ్వతవస్తువూ అనేకత్వం కలిగింది.

భ గ వం తు డు :

భగవంతుని గురించిన వైట్ హెడ్ అభిప్రాయాలను లారెన్స్ 'వైట్ హెడ్ యొక్క తాత్విక పరిణామం' అనే గ్రంథంలో అతి సమర్థతతో క్రోడీకరించాడు. ఆ అభిప్రాయాలను నేనిక్కడ పొందుపరుస్తాను.

'ఈ వాస్తవిక ప్రపంచంయొక్క లక్షణాలనుగురించిన తాత్విక విచారణ భగవంతుని ప్రవేశపెట్టడంతో స్ఫూర్తి అవుతుంది. ఒక సందర్భంలో అరిస్టోటిల్ని గురించ వైట్ హెడ్ ఇలా వ్రాశాడు: 'తన తత్త్వశాస్త్రం పూర్తి అవ-

డానికి భగవంతుణ్ణి ప్రవేశపెట్టవలసిన అవసరం ఉందని అరిస్టోటిల్ గమనించాడు. మత ప్రయోజనాలకు సిద్ధంగా ఉన్న భగవంతుణ్ణి సృష్టించే ప్రయత్నం అతన్ని ఎక్కువ దూరం తీసుకువెళ్ళలేదు. వక్రమైన ఇతర ఆలోచనలు లేకుండా ఏ సాధారణ తత్వశాస్త్రమైనా అరిస్టోటిల్‌కంటే ముందుకు అడుగు వెయ్యగలుగుతుందా అనేది సందేహాస్పదం.'

కాని తత్వశాస్త్రానికి అవసరం అయిన భగవంతుడు మత ప్రయోజనాలకు సక్రమంగానే సిద్ధంగా ఉండగలడనే నమ్మకం కలగటానికి అతనికి ఎక్కువకాలం పట్టలేదు. 'తయారవుతున్న మతం' అనే గ్రంథం చివరిభాగం, భగవంతుని వర్ణనతో కూడుకొని ఉన్న ఒక పద్యకావ్యంగా తయారైంది. భగవంతుడు 'ఆదర్శప్రాయమైన సహచరుడు'. ఎందుకంటే అతనివల్లే ఈ ప్రపంచం ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతూ ఉంది. క్రమత్వం యొక్క రూపాలన్నీ అతని వివేకంమీద ఆధారపడి ఉన్నాయి. అఘాతమైన వాస్తవికతను చేరుకోవడానికి దారిని చూపించే జ్యోతి — నిరంతరం వెలిగే జ్యోతి అతను. ఈ విధంగా భగవంతుని వర్ణనలు సాగిపోయినై.

తరువాత భగవంతుణ్ణి ప్రవేశపెట్టడానికి కారణం ఇలా చెప్పాడు వైట్ హెడ్. 'తాత్వికంగా సందిగ్ధంగా ఉన్నది, స్పష్టంగా అసందిగ్ధంగా ఉండిఉండాలి. ఏ తాత్విక తర్కానికీ సంబంధంలేని స్పష్టమైన హద్దుఒకటి ఉండి ఉండటమే దానికి కారణం.'

దీని అర్థం ఇది. ఒక వాస్తవిక సందర్భ నిర్మాణంలో పనిచేసే మిగిలిన హద్దులు, ఆ సందర్భానికి అర్థంచెప్పే తాహతు కలిగి ఉండవు.

ఇదే అభిప్రాయాన్ని 'తయారవుతున్న మతం' అనే గ్రంథంలో ఇంకా విపులీకరించాడు— "విశాలత్వం కలిగిన రూపాలకు చెందిన క్షేత్రంలో ఉన్న అవకాశాలు సృజనాత్మకశక్తిని సందిగ్ధంగా విడిపెడతాయి. తాను ఏ వస్తువు నుంచి ఉద్భవించిందో, వాటిని ఆ సందిగ్ధపరిస్థితుల్లో సమన్వయ పరచలేక, సందిగ్ధంగా విడిచిపెట్టి ఊరుకుంటుంది. ఈ ప్రపంచంలో క్రమవిధానాన్ని ప్రవేశపెట్టిన అసందిగ్ధతకు, మారని తన క్రమత్వ ప్రభావాన్ని అన్ని దశల మీద పడేటట్లు చేసే ఒక వాస్తవికమైన స్వరూపం కావాలి."

ఇదే భగవంతుడని వేరే చెప్పనవసరంలేదు. అతను పరిపూర్ణుడు. విలువల అవకాశాలను నిర్ణయించడంలో పరిపూర్ణుడు. 'భావంలో సమన్వయపరచబడిన ఆదర్శ ప్రపంచం భగవంతుని వర్ణనమాత్రమే. ప్రతి సృజనాత్మక చర్యకూ హద్దులను నిర్ణయించే, క్రమవిధానం కలిగిన, పరిపూర్ణత్వం కలిగిన సత్యస్వరూపుడు భగవంతుడే.'

అతను వాస్తవిక సత్యం. ఆ సత్యంలోనుంచి మిగిలిన లక్షణాలను విడదీయలేం. ఈ విధంగా చెప్పి, వైట్ హెడ్ ఐహిక ఆముష్మికాల సన్నిహితత్వాన్ని బలపరచాడు. అంతే కాదు, విలువకీ, సత్యానికీ తాదాత్మ్యం ఉద్ఘాటించి,

భగవంతుని తాత్త్వికఆవసరాన్ని విపులపరచాడు. ఈ ప్రపంచం నిజమైంది. ఎందుకంటే ఇది క్రమబద్ధమైందికాబట్టి. అంటే దీని అభివృద్ధిలో ఒక పద్ధతి ఉన్నదికాబట్టి. ఈ ప్రపంచం మనకు అర్థం అవుతూ ఉన్నదంటే, హేతువాదానికి లోబడుతూ ఉందంటే, ప్రకృతిలో క్రమవిధానాన్ని ఆచరింపజేసే ఒకశక్తి ఉన్నదనే మనం అనుకోవాలి. "ఈ లౌకిక ప్రపంచంలో విలువను పొందగలిగేటట్లు చేయడమే భగవంతునివల్ల కావలసిన ప్రయోజనం. 'విలువ', వాస్తవికంలో నిగూఢంగా ఉంది. వాస్తవిక స్వరూపాన్ని పొందటంలోనే కొంత స్వార్థపరత్వం గోచరిస్తుంది.... ... ఈ ఆనందమే 'విలువ'ని అనుభవించటం."

ఈ విధంగా తన తత్వశాస్త్రంలోకి భగవంతుణ్ణి ప్రవేశపెట్టాడు వైట్ హెడ్. ఈ పని ఆయన అభిమానులను అనేకులను నిర్విణ్ణులను చేసింది. రసెల్, మిస్ స్టెంబ్లింగ్, మర్ఫీ మొదలైన అనేకమంది మేధావులను ఈ పని కలవరపెట్టింది. కాని, దీని బీజాలు ప్రథమ దశనుంచీ వైట్ హెడ్‌లో ఉన్నాయని మనం గమనించాలి. లారెన్స్ ఇలా అన్నాడు. 'తప్పనిసరిగా తమలో తాముగా ఉండే వస్తువులు అని తర్కం నామకరణం చేసిన వస్తువులను అంగీకరించిన తరువాత, ఏ తత్వశాస్త్రానికైనా కొన్ని తలుపులు తెరుకొని ఉన్నట్టే. తలుపులు తెరుచుకొని ఉన్న తరువాత, వాటితోపాటు మరికొన్ని ప్రవేశిస్తాయి. పైగా ఈతలుపులు ఒకసారి తెరుచుకొన్నవంటే మళ్ళీమూయలేం.

తాత్త్వికభావ పరంపర ప్రవేశిస్తుంది. ఆ ద్వారబంధం ద్వారా అవి కొన్ని ప్రవేశించిన తరువాత, శుభ్రంగా ఉన్నశాస్త్రం అనే ఇంటిని అవి చిందర వందర చెయ్యటంలో ఆశ్చర్యంలేదు. ఇక ఈ అవకాశం కల్గించినందున రసెల్, మిస్ స్టెబ్బింగ్‌లాంటి వారు కలవరపడక ఏం చేస్తారు? ఇటువంటివారికి జవాబుగా వైట్‌హెడ్ 'నిశితమైన మేధస్సు కలవారు, కొన్ని సార్వజనీక సూత్రాలు సృష్టించి, గూడులో కదలకుండా కూర్చుని ఉంటారనే సంగతి మనకందరికీ తెలిసిన విషయమే. వారు వ్యక్తిత్వ బలంవల్ల, మనలను వాళ్ళసూత్రాలకు అంటిపెట్టుకొని ఉండేటట్లు చేస్తారు.'

సృజనాత్మక శక్తి దానంతట అది రూపంలేనిది. వాటంతట అవి, శాశ్వతవస్తువులు, అలౌకికమైనవి; సారంగా ఉండేవి, చలనరహితంగా ఉండేవి, ఇందులో ఏ ఒకటీ తమ కలయికకు కారణమైన గుణాలను పొందిలేవు. ఈ కలయికకు కారణం స్పష్టంగా కనుపించే గత సందర్భాలలో ఉన్నట్టు కూడా చెప్పలేం. అయితే గతించిన సంఘటనలు హ్యూం చెప్పినట్లు ఒకదానికి ఒకటి సంబంధంలేకుండా ఉన్నాయని కాదు అభిప్రాయం. అవిచ్ఛిన్నతా ఒప్పుదలా కనిపిస్తూనే ఉన్నాయి. అలౌకిక పరిస్థితి అనేక అవకాశాలను అందిస్తుంది. అందులోనుంచి ఏరుకోవడంద్వారా వర్తమానం రూపొందుతుంది. క్రొత్తను గతంతో సమన్వయం చేయటం అనేది భగవంతుని ప్రవేశపెట్టడంవల్లనే తెలియజెప్పడానికి వీలవుతుంది.

అటు భగవంతుణ్ణీ, ఇటు శాస్త్రజ్ఞానాన్నీ కలుపుకు రాగలిగిన తత్వశాస్త్రాన్ని సృష్టించాడు వైట్ హెడ్. ఈ ప్రయత్నంలో భావవాదాన్ని వాస్తవిక పునాదులమీద నిలి పాడు. ప్లేటోకివలె ఆయనకూడా ప్రత్యక్షానుభవానికి అందిన ప్రపంచంతోపాటు, శాశ్వతవస్తువులను కలిగివున్న మరొక ప్రపంచంకూడా వున్నదని విశ్వసించాడు. ఆయనను గురించి జె. వి. యల్. కేసర్లే 'తత్వశాస్త్రం' అనే గ్రంథంలో ఈ విధంగా వ్రాశాడు—'ఇరవైయో శతాబ్దపు తత్వవేత్తలలో పూర్వ తత్వవేత్తలకువలె గొప్ప సిద్ధాంతాన్ని నిర్మించిన వాడు వైట్ హెడ్. ఆయన సృష్టించిన విశ్వం అతి విశాల మైంది. అతిసహజమైన ఆలోచన ప్రతిబింబం అది. హేతు వాదం మీద ఆధారపడిన సాంస్కృతిక విలువలను నెట్టి వెయ్యకుండా, శాస్త్రవిధానాల ఫలితాల ప్రయోజనాన్ని సమర్థిస్తూ సైన్సుని వ్యాఖ్యానించాడు. వైట్ హెడ్ నిర్వ చించిన విశ్వంలో మానవుల అన్నిరకాల అనుభవాలకూ చోటువుంది. అన్నిరకాల సాధంపులకూ చోటు ఉంది. మాన వుడు ఒకప్పుడు నిక్కచ్చిగా, వొకప్పుడు ఆకతాయిగా, వొక ప్పుడు భౌతికవాదిగా, వొకప్పుడు ఆధ్యాత్మికవాదిగా, ఒక ప్పుడు శాస్త్ర దృక్పథం కలవాడుగా, వొకప్పుడు ప్రయోజన దృక్పథం కలవాడుగా, ఒకప్పుడు కళోపాసకుడుగా, ఒకప్పుడు మతోపాసకుడుగా, ఇంతకు ముందునుంచీ వుంటున్నట్టే వుంటూ, తన కాంక్షలను పెంపొందించుకోవచ్చు.'

ఇంత విశాల తత్వశాస్త్రాన్ని సృష్టించదలుచుకున్నాడు గనుకనే ఈ ప్రపంచంలో వున్న అన్నిటికీ, వొక దానితో వొకదానికి అవినాభావ సంబంధం వున్నదని ఆయన చెప్పాడు. ఒకదానిమీద వొకటి ఆధారపడి వుంటాయని చెప్పాడు. కనుకనే ఈ ప్రపంచం ఒక నిర్మాణం అని ఆయన భావించాడు. అందులోవున్న సంబంధాలన్నీ దాని తునకలే అన్నాడు. తన తత్వశాస్త్రానికి 'ఏకనిర్మాణాన్ని ప్రతిపాదించే తత్వశాస్త్రం' అని పేరు పెట్టాడు.

— ... —

# 'సృజనాత్మక తత్వవేత్త'

# హెన్రీ బెర్గ్‌సన్

డార్విన్ పరిణామవాదం ప్రపంచంలో యాంత్రిక దృష్టిని ప్రవేశపెట్టింది. ఈ దృష్టివల్ల మనిషికి స్వాతంత్రత అనేది లేకుండాపోయింది. మానవుని పరిణామం అదృష్టం మీద ఆధారపడి, ప్రపంచానికి అర్థంలేకుండా పోయింది. దీనికి వ్యతిరేకమైన దృష్టి బెర్గ్‌సన్‌ది. బెర్గ్‌సన్ మనకు కనపడే అన్నివస్తువుల వెనుకా సృజనాత్మక శక్తి వొకటి వుందనీ, దీనివల్లమానవునికి స్వాతంత్రత అనేది వొస్తూవుందనీ, భావించాడు. చూడటంవల్లా, భావించటంవల్లా, సత్యం తెలియదు. ఎందుకంటే పరిణామం అనుక్షణం జరుగుతూనే వుంటుంది గనుక ఈ చూడడం, భావించడం పరిణామాన్ని నిలబడివున్న దాన్నిగా పరిగణించటంవల్ల ప్రమాదాలకు దారితీస్తాయి. అయితే సత్యాన్ని తెలుసుకునేది ఎట్లా? 'ఇన్ట్యూషన్'వల్ల అంటాడు బెర్గ్‌సన్. అంటే తాదాత్మ్యం వల్ల అని మనం అర్థం చెప్పుకున్నా ఇబ్బందిలేదు అనిపిస్తుంది.

తత్వశాస్త్ర చరిత్రలో ఈ విభిన్న దృక్పథాలు అనాదినుంచీ వొస్తూనే వున్నాయి. ఒక యుగంలో ఒక దానికీ, ఇంకొక యుగంలో రెండవదానికీ ప్రాముఖ్యత

హెచ్చుతూ వుంటుంది. జ్ఞానం పెరిగితే ఆ పెరిగిన జ్ఞానాన్ని పై రెండు దృష్టులు గలవారూ వినియోగించుకోగలుగుతున్నారు. ఒక వస్తువునుంచి ప్రారంభించి, దానికి సంబంధించిన నియమాలను మిగిలిన అన్ని రూపాలకూ వర్తింపజెయ్యటం, తత్వశాస్త్ర చరిత్రలో మామూలుగా జరిగిన పనే-జరుగుతున్న పనే. కాని డార్విన్ పరిశోధనల తరువాత, వస్తువుకి సంబంధించిన నియమాలు మిగిలినవాటికి వర్తింపజెయ్యటం ఆచారమై, మనిషిని వొక యంత్రంక్రింద జమకట్టి సిద్ధాంతాలను నిర్మించటం పురోగమనంగా భావించటం జరుగుతూ వొచ్చింది. ఈ దృష్టి స్పెన్సర్ చేతుల్లో పరాకాష్ట నందుకుంది. అందుకనే ఆయన్ని డార్వినిస్టు తత్వవేత్త అన్నారు. నిజం చెప్పవలసి వస్తే స్పెన్సర్ పారిశ్రామిక నాగరికతను ప్రతిబింబించిన తత్వవేత్త. పారిశ్రామిక నాగరికతను ఆయన మితిమీరి ప్రశంసించాడు. ఆయనదృష్టి పదార్థచలనంతో నిమగ్నమై వున్న ఇంజనీరుదృష్టి. ఆయనది సృజనాత్మకశక్తియొక్క స్పందనానికి పరవశుడయ్యే శాస్త్రజ్ఞుని దృష్టికాదు. కాని కాలం మారింది. ఈ తత్వశాస్త్రం ప్రచారంలోకి వచ్చేటప్పటికి అందులోవున్నగుణాలేకాకుండా దోషాలుకూడా విజ్ఞుల అనుభవంలోకి వచ్చినై. దీనికితోడు నూతన పరిశోధనా ఫలితాల తాకిడికి పైదృష్టి బీటలు వారజొచ్చింది. బెర్గ్‌సన్, సిద్ధాంతానికి అనుకూలంగా ఏర్పడిన పరిస్థితులను విల్‌డురాన్ట్ చక్కగా వర్ణించాడు- "ఆయన తత్వశాస్త్రానికి బలం రావటానికి భౌతిక దృష్టిస్థానే జీవశాస్త్రదృష్టి ప్రచారం కాబడటం వొక కారణం అనీ,

చలనంలేని పదార్థంద్వారా కాక, నిత్యచలనం కలిగిన జీవితం ద్వారా, సృష్టిరహస్యాన్ని తెలుసుకోవటానికి జరిగే ప్రయత్నాల ప్రోద్బలం రెండవకారణం అనీ మనం చెప్పుకోవచ్చు. అంతేకాదు. ఈ రోజుల్లో పదార్థం ప్రాణాన్ని ఇముడ్చుకుంది. విద్యుచ్ఛక్తినీ, ఆకర్షణ శక్తినీ, ఎలెక్ట్రాన్స్‌ని పరిశీలించినకొద్దీ పదార్థ విజ్ఞానశాస్త్రం స్వభావమే మారిపోతూవుంది. నేడు, మనస్తత్వాన్నిపదార్థ విజ్ఞానశాస్త్రం స్థితికి తీసుకువచ్చేబదులు, పదార్థ విజ్ఞానశాస్త్రాన్ని చైతన్యం కలిగినదాన్నిగానూ, పదార్థాన్ని ఆధ్యాత్మిక స్వభావం కలదాన్నిగానూ, చూడటం ఆచారమవుతూవుంది. శక్తికంటే ప్రాణాన్ని ముఖ్యమైన దాన్నిగానూ, ఎక్కువ విశాలమైన దాన్నిగానూ, పరిగణించాలనే భావం పోషనార్ది. ఈ అపనమ్మకంతో వున్న ప్రపంచాన్ని తన వాగ్ధాటివల్లూ, ఆవేశంవల్లూ ఈ దృష్టికి త్రిప్పింది బెర్గ్‌సన్"

పరిణామం సృజనాత్మకశక్తితో కూడుకొని వుంటుందని బెర్గ్‌సన్ వాదం. అందువల్ల అది భగవంతుని వల్లగానీ, పదార్థంయొక్క నియమాల వల్లగాని ముందే నిర్ణయింపబడి వుండదు. సృజనాత్మకశక్తియొక్క ప్రోద్బలంవల్ల పరిణామం నిర్నిమిత్తంగా జరిగిపోతూ వుంటుంది. అందువల్ల ఏ నియమాలూ దానికి వర్తించవు. అందువల్ల మానవునికి స్వతంత్రత అనేది కలగటం సంభవించింది.

డార్విన్ సిద్ధాంతానికి స్పెన్సర్ చేసిన వ్యాఖ్యానానికి సంబంధించిన మరొక వ్యాఖ్యానం వుంది. అది వీస్‌మన్ మొదలైనవారు ప్రచారంచేసిన వ్యాఖ్యానం. ఈ వ్యాఖ్యానం

ప్రకారం "మార్పులనేవి 'జరమ్ప్లాసం'లో నిర్నిమిత్తంగా జరుగుతవి. అక్కడనుంచి, గతానుగతికంగా శరీరంలో వొచ్చే మార్పులను గమనంలోనికి తీసుకోకుండా, ఆ యా వ్యక్తుల 'జరంప్లాసం' కి సంక్రమిస్తూ వుంటవి. బ్రతుకుకి ఈ మార్పులు దోహదం చేసినట్లయితే, అవి ఒకరినుంచి వొకరికి సంక్రమిస్తూ నిలబడిపోతై." ఈ వాఖ్యాన్ని బెర్గ్ సన్ అంగీకరించాడు. కాని 'ఈ మార్పులు ఎలా వస్తవి?' అనే ప్రశ్నకు వీరూ సరైన జవాబు ఇవ్వలేదు. మరి మన మనస్సులకు తృప్తికలగాలంటే ఈ ప్రశ్నకుకూడా జవాబు దొరకాలి గదా! దీనికి బెర్గ్ సన్ పూనుకున్నాడు. లామార్క్ భావాన్ని ఆధారంగా తీసుకొని, 'సృజనాత్మకశక్తి' దీనికి కారణం అన్నాడు. 'జరంప్లాసం'లో వచ్చే మార్పులకు ఈ శక్తి కారణమనీ, అక్కడినుంచీ ఆ మార్పులు వొకరినుంచి వొకరికి సంక్రమిస్తాయనీ ఆయన సిద్ధాంతీకరించాడు. ఈ సృజనశక్తిచేసే ప్రయత్నం తెలిసి చేసేదిగా వుండనవసరం లేదు. మొక్కలలో ఇది తెలియకుండానే తన పనిని తాను నిర్వర్తించుకుంటుంది. ఈ ప్రయత్నం వ్యక్తిగతంగా జరగవలసిన పని లేదు-ఒక రకానికి చెంది, సాముదాయకంగా జరగవచ్చు. ఎందుకంటే ఇది జీవకోటి కంతటికీ సంబంధించిన గుణం.

ఈ విధంగా స్పెన్సర్ చెప్పినట్లు మార్పులకు కారణం పరిసర పరిస్థితులు కాదు అని తేల్చాడు బెర్గ్ సన్. వీరిద్దరి భేదాలను తెలుసుకోవటానికిఒకచిన్న ఉదాహరణచెపుతాను. కన్ను ఏవిధంగా పరిణామం చెందిందీ అనే విషయం మీద

ఈ ఇద్దరూ తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. వాటిని పరిశీలిద్దాం.

వెలుతురు, తేలికగా చలించే వొక కణంమీద తరచు పడడంవల్ల, ఆ కణం కంటి రూపాన్ని ధరించిందని స్పెన్సర్ చెపుతాడు. ఈ వ్యాఖ్యానాన్ని బెర్గ్‌సన్ అంగీకరించడు. ఆయన, ఈ నిర్మాణం ఏ కణంలోనుంచి పెరిగిందో, దానిలో వున్న జీవంయొక్క వొత్తిడివల్ల ఈమార్పు జరిగిందని చెపుతాడు.

తర తరాలను, వొకదానితో వొకదానిని కలిపేది ఈ జీవశక్తే. దీనివల్లే ఈనాటి మానవుడు అనాది మానవునితో సంబంధం ఉంచుకోగలిగి వున్నాడు. ఒక తరాన్నుంచి ఇంకొక తరానికి ఈ జీవశక్తి ప్రవహించటానికి, వ్యక్తి వొక వంతెన మాత్రమే. ఈ జీవశక్తి, అడ్డుల నన్నిటినీ అధిగమించి, అందిన సాధనాలను ఉపయోగించుకుంటూ, ముందు ముందుకు ప్రయాణిస్తూ పోతూ వుంటుంది.

బెర్గ్‌సన్ ఈవిధంగా ఊహించి యంత్రంగా పరిగణింపబడే స్థితికి వొచ్చిన మానవుణ్ణి, ఉద్ధరించాడు. ప్రపంచానికి సమగ్రమమైన అర్థం చెప్పామనే ప్రమత్తతతోవున్న భౌతికవాద తత్వవేత్తలకు పెద్ద కుదింపు కలిగించి, తిరిగి తిరిగి ఆలోచించవలసిన అవుసరాన్ని సృష్టించాడు. ఆయన తాత్వికరంగ ప్రవేశంతో భౌతికవాదులకు తమ సిద్ధాంతాలను పునర్విమర్శ చేసుకోవలసిన అగత్యం కలిగింది.

## ౨

బెర్గ్‌సన్ 1859 వ సంవత్సరంలో పారిస్‌లో జన్మించాడు. అంటే జాన్‌డ్యూయీ ఆయనా వొకే సంవత్సరంలో జన్మించారన్నమాట. మొదట్లో డ్యూయీకిమల్లే బెర్గసన్ కూడా విలియం జేమ్స్ పలుకుబడిలోవున్నవాడే. అందువల్లే కొంతమంది విమర్శకులు ఆయన్ని డ్యూయీతోనూ, జేమ్సు తోనూ పోలుస్తూ వుండటం తటస్థపడుతూ వుంటుంది. కొంతమంది విమర్శకులు ఆయన్ని 'ప్రెగ్మాటిస్టు'గా పరిగణించటానికికూడా ఇదేకారణం. కాని మొదటినుంచీ జేమ్స్‌కీ ఆయనకు అభిప్రాయభేదాలు వుంటూనే వున్నాయి. ఈ భేదాలు ఆయన, జేమ్సు వ్రాసిన 'ప్రెగ్మాటిజం' అనే గ్రంథంయొక్క ఫ్రెంచి అనువాదానికి వ్రాసిన పీఠికలో స్పష్టంగా కనుపిస్తూనే వున్నయి. అయితే డ్యూయీ, జేమ్సు లకూ, ఆయనకూ పోలికలు లేకపోలేదు. పోలికలు లేకపోతే జేమ్స్ పుస్తకానికి ఆయన పీఠిక వ్రాయటమే జరిగేదికాదు. డ్యూయీ జేమ్సులకుమల్లే, బెర్గసన్ కూడా స్థిరత్వం కంటే మార్పుసత్యమైందనీ కాలాన్ని మాయాకల్పితమైందానిగా కాక, నిశ్చయమైందాన్నిగా పరిగణించాలనీ, మానవునికి స్వతంత్రత అనేది వున్నదనీ, ఆలోచనలూ, భావాలూ మనం కష్టించి పని చెయ్యటానికి ఉపకరిస్తాయనీ అంగీకరిస్తాడు. కాని సత్యం తెలుసుకోడానికి, ఆలోచనా విధానాలు ప్రయోజకత్వం కొలతబద్దగా తీసుకోవటం ఆయన వొప్పుకోడు. అందుకనే ఆయనను 'ప్రెగాటిస్టు' గాగాని, 'ఇన్స్టు)

మెంటలిస్టుగా' గాని పరిగణించగూడదు. బెర్గసన్ దృష్టిలో ఆలోచనలూ, భావనలూ సత్యాన్ని పలచబరచటమే కాక, తప్పుగా ప్రతిబింబిస్తాయి. నిత్యం మారే సత్యాన్ని, ప్రతిబింబాలైన ఆలోచనలు తెలుసుకోలేవు. అది 'ఇన్ట్యూషన్'కి మాత్రమే అందుతుంది.

బెర్గ్సన్ మొదటి వధువు తత్వశాస్త్రం కాదు— సైన్సు అనో సాహిత్యం అనో చెప్పుకోవాలి. ఆయన తన ఉపాధ్యాయవృత్తి మొదట్లో చిన్న చిన్న స్కూళ్ళలో జరిపాడు. తరువాత పారిస్ వచ్చి, తత్వశాస్త్రోపాధ్యాయుడుగా ఖ్యాతి గడించాడు. 1889-1897 మధ్య లైసీహెన్రీ (iv)లో తత్వ శాస్త్రాచార్యుడుగా పనిచేశాడు. అటుపిమ్మట మూడు సంవత్సరాలు 'ఎకోలేనార్మల్ సుపీరియర్'లో అధ్యాపన చేసి 1900 నుంచి 1920 వరకూ 'కాలేజ్ డిఫ్రాంసు'లో ఆచార్యుడుగా ఉన్నాడు. అప్పటికి ఆయన పేరు దశదిశలూ మ్రోగింది. ప్రపంచం అనే ఖైదునుంచి మానవ జాతిని ఉద్ధరించడానికి ప్రభవించిన ప్రవక్తగా ఆయన్ని అనేకులు ప్రశంసించదొడగారు. అందువల్ల ఆయన ఉపన్యాసాలకు ముందుగా సీటు రిజర్వు చేయించుకుంటేతప్ప దొరకని స్థితి వొచ్చింది. 1914 లో జరిగిన ప్రపంచయుద్ధంలో అతను ప్రభుత్వం తరఫున స్పెయిను, అమెరికా సందర్శించాడు. శాంతి నెలకొనబడినతర్వాత 'లీగ్ ఆఫ్ నేషన్స్'కి చెందిన మతిమంతుల సహకారాన్ని అపేక్షించిన, అంతర్జాతీయ సమితికి అధ్యక్షత వహించాడు. ఆయన అనేక సంస్థల్లో, ముఖ్యంగా 'ఫ్రెంచ్ ఎకాడమీ,' 'ఎకాడమీ ఆఫ్

సైన్సెస్' అనే సంస్థల్లో సభ్యుడుగా పనిచేశాడు. 1928 లో అతనికి, సాహిత్యంలో 'నోబుల్ ప్రయిజ్' ఇవ్వబడింది. అనేక గౌరవాలను పొందిన ఆయన చివరిరోజుల్లో తాను సంపాదించిన పేరు క్రమక్రమేణా క్షీణించి పోవడం చూస్తూ కాలంగడిపి 1941 లో ఇహలోకాన్ని వదిలిపెట్టాడు.

## 3

భౌతికవాదిగా జీవితాన్ని ప్రారంభించి, దానితో తృప్తిచెందక, ఘర్షణపడి, భావవాదిగా అభివృద్ధి చెందిన వారిలో బెర్గుసన్ వొకడు. బెర్గుసన్ తన తాత్విక జీవితాన్ని, స్పెన్సర్ అనుయాయుడుగా ప్రారంభించాడు. స్పెన్సర్‌ను క్షుణ్ణంగా చదవటంవల్ల ఆయన సిద్ధాంతంలో వున్న లోట్లను బెర్గుసన్ గ్రహించగలిగాడు. మొదటిభక్తులు చివరి విమర్శకులుగా తయారవుతారనుకోటానికి ఇదొక నిదర్శనం. స్పెన్సర్‌ని చదివినకొద్దీ, భౌతికవాద నిర్మాణంలోవున్న మూడు అతుకులు, ఆయన్ని కలవరపెట్టసాగాయి. అవి, జీవితానికీ పదార్థానికీవున్న సంబంధం, శరీరానికీ మనస్సుకీ వున్న సంబంధం, స్వాతంత్ర్యానికీ అస్వాతంత్ర్యానికీ వున్న సంబంధం. ఈ సంబంధాలను తరచినకొద్దీ ఆయనకు అసంతృప్తీ, అపనమ్మకం వృద్ధి! కాజొచ్చినై. పదార్థాన్నుంచి ప్రాణం వొచ్చిందని భౌతిక వాదులు చెపుతారు. ఎలా వొచ్చిందనే ప్రశ్నకుమాత్రం వందసంవత్సరాలనుంచి తర్జన భర్జనలు జరిపీ, అనేకవేల పరిశోధనలు జరిపీ, ఈనాటికీ సరైన జవాబు చెప్పలేకపోతున్నారు భౌతికవాదులు. అదే

విధంగా మెదడుకీ ఆలోచనకూ సంబంధం వున్నదని అంగీక రించినప్పటికీ, ఆ సంబంధం ఎటువంటిదో నారిప్పటికీ తేల్చి చెప్పలేకున్నారు. మనస్సు పదార్థమై, ప్రతిమానసిక చేష్టా కొన్ని నిర్గుణ సంఘటనల ఫలితం అయితే, చైతన్యంవల్ల వొచ్చే ప్రయోజనం ఏమిటి? మనస్సు అనేది ఏర్పడవలసిన అవుసరం ఏమివొచ్చింది? ఇక అస్వాతంత్ర్య స్థితిమాత్రం పూర్తిగా అర్థంఅయిందా? ఈక్షణం, సృజనాత్మక శక్తి అనేది లేక, పూర్వక్షణాన్నుంచి నిర్నిమిత్తంగా ఉద్భ వించిందేఅయితే, పూర్వక్షణాన్నుంచీ, అంతకు ముందు క్షణం ఆముందు క్షణాన్నుంచీ ఉద్భవించిందే అయితే, ఈ కనపడే ప్రపంచంఅంతా ఏ పొగ తునకనుంచో ఉద్భ వించిందే అయితే, ఈ పరిణామానికి అర్థం ఏముంది? కాళిదాసూ, షేక్సుపియర్ రచనలకూ, రష్యావిప్లవానికీ, మహాత్మా గాంధీగారి పుట్టుకకూ, హైడ్రోజన్ బాంబుకీ ఈ పొగతునకే కారణం అనుకోవటంలో అర్థం ఏముంది? ప్రశ్నించడానికి వీలైనపరిస్థితి ఇది. ఈ అతుకులు సరిగ్గా అతకనట్లు కనిపిస్తూనేవుంది. కాని ఎక్కువమంది తమకు అనుకూలంగా ఉండబట్టి నమ్మారు- బెర్గుసన్ ప్రశ్నించాడు. ఎదురు తిరిగాడు. ఇతరులకులేని సాహసం ఆయన చూపాడు.

ఈ సాహసం ఆనాడు ప్రచారంలో వున్న లోట్లను వ్రేలెత్తి చూపింది బెర్గుసన్‌కి. ఈ లోట్లను సరిజెయ్యటానికి పూనుకున్నాడు బెర్గుసన్. ఈ ప్రయత్నమే ఆయన ప్రతి పాదించిన సృజనాత్మక తత్వశాస్త్రంగా రూపొందింది. ఈ తత్వశాస్త్రంయొక్క ముఖ్యలక్షణాలను పరిశీలిద్దాం:

## ప్రాణం - పదార్థం:

నేటి శాస్త్రపరిశోధనలను బట్టి పదార్థం అంటే కదలిక అని నిర్వచనం చేసుకోవలసిన అవసరం కలుగుతూ వుంది. ఇప్పుడు 'యాటం' మారని ఘనపదార్థంకాదు. అది కదలికలతో కూడుకొనియున్న వొకచిన్న ప్రపంచం. ఘన వస్తువులలో కూడా కదలిక వుందని అనుకోవటం వొకప్పుడు చాలా గొప్పభావంగా పరిగణింపబడుతూ వచ్చింది. ఇప్పుడు కదలికే పదార్థాన్ని సృష్టిస్తూవుంది అనుకునే స్థితికి వచ్చాం. కార్‌నెట్ నిర్మించిన లా ప్రకారం బయటగావున్న భౌతిక ప్రపంచంయొక్క కదలిక క్రమక్రమేణా తగ్గిపోతూవుంది. సూర్యగోళానికి సంబంధించిన శక్తియొక్క ఉన్నతరూపాలు క్రమక్రమేణా వేడిస్థితికిదిగజారి ఆకాశంలో కలిసిపోతున్నాయి. ప్రాణం అనేది, హీనస్థితికి దిగజారిపోయే పదార్థానికి వ్యతిరేక విధానం. పనికిరాకుండా పోతున్న శక్తిని, నిలవచేసి ఉపయోగపడేటట్టు చెయ్యటానికి ప్రాణం సహాయపడుతుంది. కూరగాయలు ఈ శక్తిని కొంత తమలో నిలవచేసుకుంటై. జలపాతంవల్ల వృధాగా పోయేశక్తిని హైడ్రోఎలెక్ట్రిక్ ప్లాంట్ నిలవచేస్తుంది. పశువులు, దుంపలూ కాయగసరులూ తిని, వాటిలోని శక్తిని తమ శరీరాల్లో నిలవచేస్తవి. అంటే సూర్యగోళానికి చెందిన శక్తిని కొద్దిగా గుంజుకొని నిలవ చెయ్యటానికిగాను, మొక్కలూ జంతువులూ సృష్టించబడ్డాయని చెప్పుకోవలసి వస్తుంది. దీనినిబట్టి పదార్థానికి చెంది క్రిందకు నడిచే ఉద్యమానికి ఇది వ్యతిరేకంగా ఉద్గమించే

ఉద్యమమని తేలుతుంది. ప్రాణంధరించే ఈ విభిన్నరూపాలు ఈ ఉద్యమానికి చెందిన వివిధ దశలను సూచిస్తాయి. ఈ ధోరణిలో ఆలోచించి బెర్గ్‌సన్ పరిణామానికి యాంత్రిక దృష్టిగానీ, భౌతికవాదంగానీ సరైన వ్యాఖ్యానం కాదని నిర్ణయించుకున్నాడు. ఇదేవిధంగా పరిపూర్ణత అనేభావాన్ని కూడా ఆయన నిరసించాడు. 'ఈ జీవశక్తి రసాయనిక నియమాలనుబట్టి నడిచేదికాదు. హేతుపూర్వకమైన ప్రణాళికకు అనుగుణంగా నడిచేదీకాదు. సృజనాత్మక ప్రేరణతో ఒక కవిగా, కళాకారునిగా వ్యవహరిస్తుంది' అని అన్నాడు.

బెర్గుసన్ ఈ విశ్వం అనంతంగా పెరుగుతూ వుంటుందని భావించాడు. అన్నీ ముందే నిర్ణయించబడి వుంటవనుకుంటే ఏ క్రొత్తదీ జరగటానికి వీల్లేదని వొప్పుకోవలసివస్తుంది. పరిపూర్ణత్వం అంగీకరిస్తే, దానినిబట్టి ఈనాటి పరిస్థితీ, ఫలితం ఏనాడో నిర్ణయించబడి వుంటాయని సిద్ధాంతీకరించుకోవాలి. అంటే మొదటిదృష్టిని తిరగవేసిచూస్తే ఈ రెండవదృష్టి ప్రత్యక్షం అవుతుంది అన్నమాట. ఈ రెండు దృష్టులకూ బెర్గ్‌సన్ వ్యతిరేకే. 'భవిష్యత్తు తలుపులుఎప్పుడూ తెరుచుకునే వుంటాయ'ని బెర్గుసన్ నమ్మకం. జీవితం ఎప్పటికప్పుడు క్రొత్తదనాన్నీ, నవ్యసృష్టినీ తెచ్చుకుంటూ వుండగలదు. క్రొత్తక్రొత్త పథకాలను వేసుకుంటూ, తలుచుకున్నప్పుడల్లా మార్గాన్ని మార్చుకుంటూ ప్రయాణం సాగించగలదు.

సృజనశక్తే ఈ ప్రపంచపరిణామానికి కారణం అని చెప్పినా, ఆయనలో ద్వైతభావంయొక్క ఛాయలున్నా

యని కెల్లీ రైట్ వ్రాశాడు. 'పదార్థం - జ్ఞాపకశక్తి' అనే గ్రంథంలో, బొమ్మలుగా అమర్చబడిన పదార్థం, మెదడు ద్వారా మనస్సుకి అందజెయ్యబడుతుందనీ, మెదడు జ్ఞాపకాలను పురస్కరించుకొని అందులోనుంచి కొన్నిటిని ఏరుకుం టుందనీ వ్రాశాడు. ఈ భావం, పదార్థం మనస్సు ఒకదాని మీద వొకటి తమ ప్రభావాన్ని చూపుకుంటాయి అనే ద్వంద్వసిద్ధాంతాన్ని స్ఫురింపజేస్తూవుంది. 'సృజనాత్మక మైన పరిణామం' అనే గ్రంథంలో జీవనశక్తిని పదార్థానికి వ్యతిరేకదశగా సాగిపోయే దాన్నిగానూ, పదార్థాన్నుంచి, నిర్మాణాలను నిర్మించే దాన్నిగానూ, ఈ నిర్మాణాల్లో క్షీణించిపోయే శక్తిని కేంద్రీకరించి కాపాడే దాన్నిగానూ వర్ణించాడు. ఈ దృష్టి, జీవనశక్తికీ పదార్థానికీ వున్న వైరుధ్యాన్ని సూచించటంవల్ల, ద్వంద్వ సిద్ధాంతంయొక్క ఛాయలను స్ఫురింపజేస్తూ వుంది - అని అనుకోవటానికి ఆస్కారం కలిగించింది.

కాని మరికొన్నిచోట్ల ఆయన చేసిన వ్యాఖ్యానాల వల్ల, ఈ వైరుధ్యభావం పైకి కనపడేది మాత్రమేనేమో అని అనిపిస్తూవుంది "సత్యం కాలానికి చెందింది. ఆకాశం వల్ల సంకుచితపడని కాలానికి చెందింది. అది ఎప్పుడూ పెరి గేదీ, విశాలపడుతూవుండేదీ, స్వాతంత్ర్యమైందీనీ. పదార్థ విజ్ఞాన శాస్త్రానికి చెందిన పదార్థం, మనం మామూలుగా వ్యవహరించే భౌతిక వస్తువులూ సత్యమైనవికావు. అవి నిజ మైన చలనంయొక్క అపభ్రంశపు రూపాలు. లౌకిక లాభాల కోసం, మన మెదడువల్ల సృష్టించబడిన అపభ్రంశాలు.

ప్రపంచం బయటవున్నకాలం మనలో వున్నదానికి వ్యతిరేకమైందికాదు” ఈ విధంగా ఆలోచించిన మేధస్సం పన్నుని 'ద్వైతి' అని అనుకోవటం సాహసమేమో అని అనిపిస్తుంది. కాని ఆ అపవాదు ఆయనపట్ల నిలచివుంది.

క్రమక్రమేణా హీనస్థితికి వస్తున్న శక్తి ఎప్పటికైనా ఈ సూర్యగోళ విధానం విచ్ఛిత్తి అయితీరుతుందని సూచిస్తుంది. దీనినుంచి రక్షించబడే అవకాశా న్నొకదాన్ని బెర్గ్‌సన్ నిర్వచించాడు. ఈలోగా భూమిమీద సృజనాత్మకమైన పరిణామం జరుగుతూవుంది. ఇదేవిధంగా ఇతరగోళాలలోనూ, బహుశా సూర్యమండలంలోనూ జరుగుతూవుండివుండవచ్చు. సూర్యగోళ విధానం విచ్ఛిత్తి అవుతూవుండగా వేరొక విధానం నిర్మించబడుతూ వున్నట్లు కనుపిస్తూవుంది. పరిణామం, విచ్ఛిత్తీ ఈ రెండూ నిరంతరం వొకదాని ప్రక్కన వొకటిగా ఈ ప్రపంచంలో జరుగుతూనేవుంటవి కాబోలు! ప్రతి ప్రాణం కలిగిన నిర్మాణంలోనూ, శక్తిని పోగుజేసి అది అభివృద్ధిపొందే అవకాశం వుండటమే ఈ ప్రపంచం విచ్ఛిత్తి కాకుండా వుంటుం దనుకోవటానికి నేటి ఆశ! దీనికి అవకాశాన్ని కలిగించింది బెర్గ్‌సన్ సిద్ధాంతం.

మనస్సు - మెదడు :

బెర్గ్‌సన్ దృష్టిలో మనస్సూ మెదడూ ఒకటి కాదు. చైతన్యం అనేది మెదడు మీద ఆధారపడి వుంటుంది; దానితోపాటు రాలిపోతుంది-తాను వ్రేలాడుతున్న మేకుతో పాటు కోటు జారిపడినట్లు, మెదడునుంచే చైతన్యం అనేది

ఉద్భవించినా, రెంటికీ భేదముంది. నదీగమనం, దాని జన్మ స్థానాన్నుంచి వేరైనట్లే, చైతన్యం మెదడునుంచే వేరైంది. "చైతన్యం అనేది ప్రత్యక్షంగా మెదడుకు సంబంధించిందనీ అందువల్ల మెదడువున్న జీవులకే ఇది వున్నట్లనీ, అది లేని వాటికి ఇది లేనట్లూ మనం గ్రహించాలనీ కొంతమంది చెబుతారు. ఇది తప్పు అభిప్రాయమని తేలికగా నిరూపించ వచ్చు. జీర్ణశక్తి అనేది ప్రత్యక్షంగా కడుపుకి సంబంధిం చింది గనక కడుపువున్న జీవే జీర్ణంచేసుకోగలదని సిద్ధాంతీక రించినట్లు వుంటుంది ఇది. ఇలా ఆలోచించటం తప్పు. ఎందుకంటే జీర్ణించుకోవడానికి కడుపుగానీ, మరే ప్రత్యేక అంగంగానీ ఉండవలసిన అవుసరం లేదు. ప్రత్యేక అంగా లనేవి ఏమీ లేకపోయినప్పటికీ, 'ఏమీబా' జీర్ణం చేసు కుంటుంది. కాకపోతే అభివృద్ధితోపాటు కృషివిభజన జరుగుతుంది. కొన్ని కొన్ని అంగాలకు కొన్నికొన్ని పనులు అంకితం చెయ్యబడతయి. ఈ విధంగా జీర్ణంచేసుకోవడం అనేది కడుపుకి సంబంధించిందిగా తేలింది. అదేవిధంగా మనిషిలో చైతన్యంఅనేది మెదడుకు సంబంధించిందే. కాని దీనినిబట్టి చైతన్యం అనేది ఉండటానికి మెదడు తప్పనిసరి అని అనుకోవలసిన పని లేదు. మనం పరిణామంలో క్రింది దశలకు వెళ్ళి పరిశీలిస్తే ఈ విభజన కనుపించక అంతా ఒకే వాకనిర్మాణంగా కనుపిస్తుంది... కాబట్టి సిద్ధాంతరీత్యా ప్రతిజీవికీ చైతన్యం ఉంటుంది. సూత్రప్రాయంగా ప్రాణం ఉన్నచోట చైతన్యం ఉంటుందని చెప్పకోవచ్చు—"

అయినప్పుడు మనస్సునిగురించీ, ఆలోచననుగురించీ మనం 'పదార్థం' 'మెదడు' అనేధోరణిలో ఎందుకు ఆలోచిస్తున్నాం? దీనికి వొక కారణం కనుపిస్తుంది. మనస్సులో ఒక భాగం వుంది. ఈ భాగం లౌకిక వ్యవహారాలను తీర్చిదిద్దే ప్రయత్నంలో ఏర్పడింది. అంటే పదార్థాలతోనూ వస్తువులతోనూ దానికి సంబంధం. ఈ రంగంనుంచే అది నియమాలనూ, భావరూపాలనూ తెచ్చుకుంటుంది. అందువల్ల జీవస్రవంతిని అది ముక్కలుగా మాత్రమే చూడగలుగుతుంది. అందువల్ల ముఖ్యసూత్రాన్ని అది గమనంలోకి తీసుకోలేక పోతూవుంది.

కాని మానసిక జీవితానికి భౌతిక నియమాలను వర్తింపచెయ్యటం మన తప్పు; దీనివల్ల దారీతెన్నూ లేని దుర్గమారణ్యం ప్రవేశించటంకంటే జరిగేది ఏమీలేదు. మానసిక జీవితానికే పదార్థ విజ్ఞానాన్నిజత పరిస్తే వొచ్చే చిక్కు కొంచెం ఆలోచిస్తే తేలిగ్గా బోధపడుతుంది.

అయితే, ఈ జీవిత ప్రవాహాన్ని, ఆలోచనద్వారా, మనస్సుద్వారా కాకపోతే పట్టుకునేది ఎలా? కాసేపు ఆలోచించటం మానివేసి అంతర్ముఖులమై మనస్సులోవున్న సత్యం మీద దృష్టిని నిలిపితే, మనకు ఏమి కనిపిస్తుంది? మనస్సు - పదార్థంకాదు; కాలం - ఆకాశంకాదు; కర్మ-అకర్మకాదు; స్వతంత్రత - యాంత్రికస్వభావం కాదు. జీవితం సూక్ష్మాతి సూక్ష్మంగావున్న ప్రవాహంగా కనుపిస్తుంది—ముక్కలు ముక్కలుగా కాదు. ఈ ప్రత్యేక అనుభవం, ఒకవస్తువు మీద దృష్టిని కేంద్రీకరించటం, అదే

ఇన్ట్యూషన్. ఇందులో అనిర్వచనీయమైంది ఏమీ లేదు. మనస్సు చెయ్యగలిగిన ప్రత్యక్ష పరీక్షే ఇది.

అయితే ఆలోచన అనేది ఒక వ్యాధి అని బెర్గ్‌సన్ భావం కాదు. మెదడు మానవులను మోసంచేసే స్వభావం కలది అని కాదు ఆయన ఉద్దేశం. అది భౌతిక ప్రపంచంతో సంబంధం పెట్టుకుంటుంది. ఆకాశానికి చెందిన ప్రపంచం తోనూ, మనస్సుయొక్క జీవితంయొక్క భౌతిక లక్షణాల తోనూ, ఆకాశ రూపాలతోనూ అది సరిపెట్టుకుంటుంది. ఇన్ట్యూషన్ జీవితాన్ని మనస్సుని ప్రత్యక్షంగా అనుభవం లోకి తెచ్చుకుంటుంది. వాటి బాహ్యరూపాలతో కాక అంత ర్గత ఉనికితో సంబంధం పెట్టుకుంటుంది.

## సృజనాత్మక శక్తి:

ఈవిధంగా ఊహించి డార్విన్ స్పెన్సర్లు ప్రచారం చేసిన, యాంత్రిక దృష్టినుంచి మానవులను తప్పించాడు బెర్గ్‌సన్. బెర్గ్‌సన్ దృష్టిని విల్‌డురాన్ట్ ఇలాసమీక్షించాడు: "భౌతిక భాగాలతో కూడుకొని నిస్సహాయంగా యంత్రం లాగా నడిచిపోవటంకాక, పరిణామంలో ఇంకేదో వున్నట్లు కావలసినంత సాక్ష్యం వుంది. జీవితం తత్ నిర్మాణంకంటే గొప్పది. అది వృద్ధిచెందగలిగిన శక్తి. తన్నుతాను పునరు జ్జీవింప చేసుకోగలిగిన శక్తి. పరిస్థితులను కొంతవరకు తన ఇష్టంవొచ్చినట్లు మలుపుకోగలిగిన శక్తి... ఏదోశక్తి బయట వుండి నడపటంవల్ల ఈ పనులు జరగటం లేదు. ఉన్నది ఏదో దానిలోనే వుంది. మొత్తం ప్రయోజనానికి అనుకూ

లంగా ప్రతిభాగం తనకు తానుగా ఒక నిశ్చయానికివచ్చి నడుస్తూ వున్నట్లు కనుపిస్తుంది."

జీవితం అనేది ముందుకు ముందుకు వెళ్ళటానికి చేసే నిరంతర కృషిగా కనుపిస్తుంది. ఈ ఉద్గమనంలో వొకపద్ధతి వుంది. ఒక క్రమం ఉంది. ఈ క్రమం తనకుతానుగా తెచ్చుకుండే. ఎక్కడనుంచో వచ్చిందికాదు. దానికి అనుక్షణం తన నిర్మాణానికి సంబంధించిన పదార్థాన్ని తనమూలాన వచ్చే బద్ధకాన్ని, అలసటనీ, మరణాన్ని ఎదుర్కొని పోరాడవలసి వస్తుంది. నిలబడటం అయినా, పదార్థాన్ని, దాని నియమాలనూ జయించటమే! ఇక కదలటం, ముందుకు వెళ్ళటం, వెతకటం మొదలైన వాటిసంగతి చెప్పనే అక్కర లేదు. ఇవన్నీ ప్రయత్నంమీద సాధించబడినవే. ఈ ప్రయత్నం అనేదే లేకపోతే చైతన్యం, ఇన్‌స్టింక్ట్‌గా, అలవాటుగా, నిద్రగా జారి వూరుకుంటుంది. కాబట్టి మనం ఇంతవరకు వొదిలిపెట్టిందీ, ముఖ్యంగా తెలుసుకోవలసిందీ, మనకు కన పడే భాగపరంపరకాదు-వాటిలో అంతర్లీనంగా వుండే జీవ శక్తి అని బోధించాడు బెర్గ్‌సన్.

ఒకప్పుడు జీవశక్తికూడా పదార్థానికిమల్లే చలనరహితంగా వుండేది. కదిలితే ఏ అపాయం వస్తుందో అని ముడుచుకొని కూర్చునివుండేది. కాని ఈ స్థితిలో దానికి శాంతి చేకూరలేదు. ఇక తెగించి తన పయనం మొదలుపెట్టింది. దానికి రక్షణాశక్తికంటే స్వతంత్రేచ్ఛ బలమైంది. విజృంభించింది. అపాయాలను ఎదుర్కోవటంలో వున్న ఆనందం కనిపెట్టింది. లీలలు ప్రారంభించింది. తన సృజనాత్మక

శక్తిని ఎప్పటికప్పుడు వృద్ధిచేసుకుంటూ పయనిస్తూ వుంది. ప్రతివ్యక్తీ, ప్రతిజాతీ ఈ జీవశక్తికి క్రీడారంగాలు; అవి తన్నుతాను పరిశీలించుకునే క్షేత్రాలు.

ఈ జీవశక్తియొక్క లీలలు ఇకముందు ఏవిధంగా పరిణమిస్తాయో, ఎవరు చెప్పగలరు? పదార్థం మీద అది పూర్తి జయాన్ని సాధించవచ్చు-అంటే మరణాన్నే జయించవచ్చు. కాలం కలిసివస్తే అది చెయ్యలేని పనిఅంటూ వుండకపోవచ్చు. ఇంతవరకు ప్రాణం, మనస్సు సాధించిన విజయాలను గమనిస్తే ఈ సంగతి మనం తేలిగ్గా నమ్మగలం. ఆకర్షించే ఈ దృశ్యాన్ని బెర్గ్‌సన్ తన 'సృజనాత్మక పరిణామం' అనే గ్రంథంలో ఇలా వర్ణించాడు. "చెట్టునుంచి జంతువూ, జంతువునుంచి మనిషీ వృద్ధిచెందాడు. ఇప్పుడు మానవకోటి అంతా వొక సైనికదళంగా ఉరకలెత్తుతూ వుంది. అన్ని అడ్డులను తొలగదీసుకుంటూ, ఎటువంటి ఎదురోకులనైనా ఛేదించుకుంటూ ముందుకు పరుగులెత్తుతూ వుంది. అది మరణాన్ని మాత్రం ఎందుకు జయించలేదు!"

౪

మనస్సుయొక్క శక్తిని నిర్వచించటంలోనూ, సత్యం తెలుసుకోవటానికి 'ఇన్ట్యూషన్' అవుసరమని చెప్పటంలోనూ, మన పూర్వుల తత్వశాస్త్రానికి దగ్గర్లో వున్నట్లు కనుపిస్తాడు బెర్గ్‌సన్. కాని మనస్సుకి, కనుపించేది నిజంకాదని చెప్పటం వల్లా, మామూలు మనిషికి కనుపించేది నిజంకాదు అనటం వల్లా, బెర్గ్‌సన్ తాత్వికదృష్టి, మనపూర్వ ఆధ్యాత్మిక

వాదంలాగే అకర్మను బలపరిచిందని కొంతమంది విజ్ఞులు భావిస్తున్నారు. తన పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో రసెల్ ఆయనను గురించి, "కర్మకోసం కర్మచెయ్యటం అనేది ఈ ప్రపంచంలో జరగవలసినసుకృతం అని బెర్గ్‌సన్ భావించాడు. స్వచ్ఛమైన ఆలోచనను ఆయన కలక్రింద కొట్టివేశాడు... కర్మ చెయ్యటానికి ఏదోవొక ఆదర్శం లీలగానైనా కావాలను కునే వారికి దానిని మనం కోరుతున్నాం గనక, అది క్రొత్తదై వుండదు – అని జవాబు చెప్పాడు. ఈ విధంగా మనం 'ఇన్‌స్టింక్ట్' చేతుల్లో కొరముట్లుగా తయారయ్యాం. జీవ శక్తి మనలను వెనకనుండి నెడుతూవుంటే, మనం ముందుకు వెళ్తూవున్నాం. ఆదర్శంలేని కర్మను కోరుకునేవారికి బెర్గ్‌సన్ ఈ తాత్వికదృష్టి ఆనందాన్ని ఇవ్వవచ్చు. కాని ఏదోవొక ఆదర్శంతో ప్రేరేపించబడి కర్మకు దిగాలనుకున్న వారికి మాత్రం ఇందులో తాము ఆశించింది కనుపించదు. కాబట్టి దీనిని నమ్మవలసిన కారణం లేకపోయినందుకు వారు విచారించరు," అని వ్రాశాడు. కాని ఆయన వాదంలో కొంత బలంవుంది. అందుకనే ఆయన సిద్ధాంతాన్ని ఒకప్రక్క విమర్శిస్తూ, రెండవప్రక్క 'ఆయన ఈ శతాబ్దపు ఫ్రెంచ్ తత్వవేత్తల్లో ప్రముఖుడు' అని అంగీకరించాడు రసెల్. తన తరువాత వొచ్చిన తత్వవేత్తలందరిమీద బెర్గసన్ ప్రతిభ కొద్దో గొప్పో పడుతూనేవుంది. రసెల్ చెప్పినట్లు "ఆయన పలుకుబడి విలియంజేమ్స్ మీదా, వైట్‌హెడ్ మీదా కనుపిస్తుంది. సోరెల్, బెర్గ్‌సన్ యొక్క నిర్హేతుక వాదాన్ని విప్లవ పూరితమైన శ్రామికోద్యమానికి ఆదర్శం వుండక

పోవటాన్ని సమర్థించటానికి వినియోగించాడు. తత్వవేత్తల మీదే కాక, రాజకీయవాదుల మీదే కాక, బెర్నార్డుషావంటి రచయితలమీద కూడా బెర్గ్‌సన్ పలుకుబడి కనుపిస్తుంది. 'మరల మెథుసిలాకు' అనే బెర్నార్డ్‌షా గ్రంథం బెర్గ్‌సన్ సిద్ధాంతాన్ని సమర్థించే గ్రంథమే" మరొకచోట బెర్గ్‌సన్ తాత్విక దృష్టిని ఈ విధంగా క్రోడీకరించాడు రసెల్. "ఈ విశ్వం రెండు వ్యతిరేక ఉద్యమాల ఘర్షణ. జీవశక్తి పైకి నడుస్తూవుంటుంది. పదార్థం క్రిందకు జారుతూవుంటుంది. ప్రాణంవొక గొప్పశక్తి; పదార్థాన్ని ఎదుర్కోటానికీ, విచ్ఛిన్నం చెయ్యటానికీ, చివరికి, తనకోసం వినియోగించుకోటానికీ ఇది అనాదిగా ఏర్పడివుంది. అనేక నిరోధాలను ఎదుర్కోవలసివచ్చి, ఇది పాయలు పాయలుగా చీలిపోయింది. ఇది పదార్థంతో కొంతవరకు రాజీపడుతూ తన స్వాతంత్ర్యతను కాపాడుకుంటూ వుంటుంది. ఇది ఎప్పటికప్పుడు తను బహిర్గతం అవటానికి క్రొత్తదారులనూ, ఎక్కువ స్వేచ్ఛనూ పొందటానికి ప్రయత్నిస్తూ వుంటుంది ?

—o—

# 'నిస్సంకల్ప తత్వవేత్త'
# ఆర్ధర్ షోపనార్

నీషే తత్వశాస్త్రాన్ని పరిశీలించే సందర్భములో షోపనార్‌ని గురించి తెలుసుకున్నాం. షోపనార్ ప్రభావం నీషేమీద మొదటి రోజుల్లో కనిపించేదని అనుకున్నాం. షోపనార్ ప్రభావం ఒక్క నీషేమీదే కాదు, తరువాత పేరులోకి వచ్చిన అనేక తత్వవేత్తలమీదా కనుపిస్తుంది. ఆయన అన్నిటికంటే సంకల్పం ముఖ్యమైందని చెప్పాడు. "ఈ అభిప్రాయం ఏదో ఒకరూపంలో నీషే, బెర్గ్‌సన్, జేమ్స్, డ్యూయీలలో కనుపిస్తుంది. అంతేకాదు; దీనికి తత్వవేత్తల తత్వశాస్త్రాలకు విడిగా ఎక్కువ ప్రచారంవుంది. చరిత్రలో సంకల్ప బలం ఎక్కువైనమేరకు జ్ఞాన బలం తగ్గుతూ రావటం సహజమే. మన యుగంలో వచ్చిన మార్పులలో ఈయనవలన వచ్చిన ఈ మార్పు ముఖ్యమైంది. దీనిని మొట్టమొదట రూసో, కాన్ట్ సిద్ధపరిచారు; నగ్నంగా ప్రదర్శించిందిమాత్రం షోపనారే! అందువల్ల తాత్విక చరిత్రలో ఈయనకు సముచిత స్థానం వుంది" అన్నాడు రసెల్.

ఆయన నిరాశావాది. ఇదికూడా ఆయన ప్రత్యేకతే అని చెప్పకోవచ్చు. ఎందుకంటే తత్వవేత్తలు మామూలుగా ఆశావాదులు. ఈ ప్రపంచానికి ఏదో ఒక అర్థంచెప్పి,

ఏదో ఒక ఆదర్శం నిర్వచించి దాన్ని సాధిస్తే ఎప్పటికప్పుడు అనుభవంలో వున్న కష్టాలు తీరుతవి అని చెపుతారు. షోపనార్ అలా కాదు. ఇటువంటి సంకల్పమే ప్రపంచంలో కనిపించే భీభత్సానికంతకూ కారణం అని చెపుతాడు. ఈ సంకల్పాన్ని రాహిత్యం చేసుకోవటంకంటె మానవుడు చెయ్యగలిగింది ఏమీ లేదు అంటాడు. ఏదో ఒకటి జరగాలని సంకల్పిస్తాం. అది జరుగుతుంది. కాని సమస్య అంతటితో తీరిపోతుందా? ఎట్లా తీరుతుంది? తీరిపోదు. అది మరొక సమస్యను సృష్టిస్తుంది. దాన్ని పరిష్కరించటానికి మానవుడు సంకల్పించవలసి వొస్తుంది. ఇలా నిరంతరం జరిగిపోతూ వుండవలసిందే. ఇక సంకల్పించటంవల్ల ఎవ్వరికేమి లాభం వొస్తూవుంది? ఆయన ఆలోచనలకు దారి ఇది. ఈ దృష్టి మానవుణ్ణి నిర్వీర్యుణ్ణి చేసి వదులుతుందని కొందరు విమర్శించారంటే, మరి విమర్శిస్తారు.

ఆయన దృష్టి, బెర్గ్‌సన్ దృష్టివలె మన [illegible]త్మిక దృష్టికి కొంతవరకు దగ్గరలో వున్నట్లు కనుపిస్తుం[illegible]. ఉపనిషత్తులూ, బౌద్ధం, ఆయన దృష్టిని కొంతవరకు [illegible]లిపినై. తన తత్వశాస్త్రానికి కాన్ట్, ప్లేటో; ఉపనిషత్తులూ, [illegible]నాదులని ఆయనే వివరించాడు. ఈ వివరాన్ని రసెల్ [illegible]విధంగా వ్యాఖ్యానించాడు. "ఆయన అనుకున్నట్లు ప్లేటో ప్రభావం ఆయన మీద ఎక్కువగా వున్నట్లు కనుపించదు. స్వాభావికంగా ఆయన గ్రీకు సంస్కారానికి చేరువలో వున్నట్లు కనుపిస్తాడు. సంస్కరించటంకంటే సాక్షీభూతంగా ఉండటం, జయించటం కంటే శాంతిని కోరుకోవడం మొదలైన

లక్షణాలు కలిగిన ఈ తత్వం, అలిసిపోయిన వారియొక్కా వికలాంగులయొక్కా తత్వం. సంస్కారణాభిలాషా, జయాభిలాషా నిరర్థకమైనవని ఆయన అభిప్రాయం"

ఆయనకు ఈ ప్రపంచానికి ఏ అర్థమూ గోచరించలేదు. ఇక దేనికోసం ఈ సంకల్పం? మరి సంకల్పం అనేది ప్రపంచంలో వుంది. దానివల్ల ఏ ప్రయోజనమూ జరగకపోగా, భీకర భీభత్సమే జరుగుతూవుంది. ఈ మాటలే ఆయన చెప్పాడు. చాలామందిలో లోపం భావించి కప్పిపుచ్చుకునే భావాలను, ఆయన ధైర్యంగా చెప్పాడు. అది నిరాశావాదంగా పరిణమిస్తే దానికి ఆయన చెయ్యగలిగింది ఏముంది, ఆవిధంగా ఆలోచించటానికి కూడా ప్రపంచం తావిస్తూవుంది అని చెప్పటంకంటే? ఆయన తత్వశాస్త్రం యొక్క లక్షణాలను రసెల్ ఇలా సంక్షిప్తపరచి చెప్పాడు- "చారిత్రకంగా చూస్తే షోపనార్‌ని గురించి రెండు లక్షణాలు ముఖ్యమైనవని మనం చెప్పుకోవాలి. అందులో ఒకటి ఆయన నిరాశావాదం; రెండవది జ్ఞానంకంటే సంకల్పం అగ్రమైనదనే ఆయన అభిప్రాయం. ఆయన నిరాశావాదం ప్రపంచంలో జరిగే చెడుఅంతకీ అర్థం చెప్పగలమనే భ్రమ లేకుండానే తాత్విక నిర్మాణానికి పూనుకునే అవకాశం కలిగించింది. అంటే అన్నిటికీ అర్థం చెప్పగలమనే, చెప్పాలనే దృష్టిని సడలించి, అంతవరకు సహాయపడింది- ప్రపంచానికి. సైన్సుదృష్ట్యా ఆలోచిస్తే ఈ ప్రపంచం నిర్గుణం. ఆశా నిరాశా రెండూకూడా, అభ్యంతర మార్గాలే. ఆశ ఈ ప్రపంచం మనలను సుఖపెట్టటానికి వున్నదని చెపుతుంది.

నిరాశ ఈ ప్రపంచం మనలను దుఃఖపెట్టటానికి వున్నదని చెపుతుంది. సైన్సు ఈ రెండిటినీ అంగీకరించదు. ఈ ప్రపంచం మనలను సుఖపెట్టటానికీ లేదు; దుఃఖపెట్టటానికీ లేదు. అది వుంది. ఇందుకు వున్నదని నిరూపించటానికి శాస్త్రీయంగా సాక్ష్యం లేదు. సుఖపెట్టటానికనో, దుఃఖపెట్టటానికనో అనుకోవటం మన స్వభావాన్ని సూచిస్తుంది. అంతమట్టుకే. అయితే ఎక్కువమంది తత్వవేత్తలు ఆశావాదులుగా వుంటు న్నారు గనుక దృష్టికి సత్యం గోచరం అయ్యేటట్టు చెయ్య టానికి షోపనార్ వంటి వారి ప్రయోజనం ప్రపంచానికి వుంది.”

ఇక ఆశావాదులు చేసే తప్పు కంటే నిరాశవాదులు చేసే తప్పు పెద్దది-అని మనం ఎలా అనగలం ? కాబట్టి నిరాశా వాది అని మనం షోపనార్‌ని విమర్శించ వలసిన అవసరం లేదు. ఆయన తన సిద్ధాంతాన్ని సమర్థతతో నిర్మించగలి గాడా లేదా ? ఆయన భావాలకు అనుభవ రీత్యాగానీ, సిద్ధాంతరీత్యాగానీ బలం వుందా లేదా? అని మాత్రమే మనం ఆలోచించాలి. ముందు ఆయన జీవితాన్ని తెలుసు కుందాం.

౨

ఆర్థర్ షోపనార్ జననం 1788. ఆయన తల్లీ తండ్రీ వ్యాపారస్థుల కుటుంబానికి చెందినవారు. వారిది జర్మనీ దేశానికి చెందిన డాన్జింగ్. అది ఒకప్పుడు స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ వుండేది. ప్రష్యా దానిని ఆక్రమించుకున్నప్పుడు

షోపనార్ తండ్రి కోపోద్రిక్తుడై, నిరసనగా ఆ పట్టణాన్ని విడిచిపెట్టి 1793 నుంచీ హాంబర్గులో నివాసం ఏర్పరచుకున్నాడు. 1793 నుంచి 1797 వరకూ షోపనార్ తన తండ్రితో అక్కడేవుండేవాడు. తరువాత రెండుసంవత్సరాలు పారిస్‌లోనూ, 1803 నుంచి 1805 వరకూ ఇంగ్లండులోని వొక బోర్డింగ్ స్కూల్లోనూ ఆయన కాలక్షేపంచేసి తన తండ్రిని సంతోషపెట్టడానికి హాంబర్గులో కొన్నాళ్ళు గుమాస్తాగిరీ చేశాడు. పరిస్థితులు ఇలా వుండగా 1809 లో ఆయనతండ్రి మరణించాడు. అప్పటినుంచీ ఆయన సారస్వత కృషికి పూనుకున్నాడు. తండ్రి జీవించివుండగా అణగిమణగి వున్నకోర్కె అప్పుడు విజృంభించి కార్యరూపం ధరించింది. త్వరలోనే ఆయన గ్రీకు, లాటిన్, ఇటాలియన్ మొదలైన భాషల్లో పాండిత్యం సంపాదించాడు. ప్లేటో కేన్ట్ మొదలైన తత్వవేత్తల గ్రంథాలను ప్రత్యేక శ్రద్ధతో పఠించాడు. ఆయన పాండిత్యాన్ని గురించి కేల్లీరెట్, "బహుశా, ఆయనకు ముందున్న జర్మన్ తత్వవేత్తల్లో, ప్రాచీన నవీన తత్వశాస్త్రాలను ఆయన పరిశోధించినంతగా మరెవ్వరూ పరిశోధించి వుండరు. ఆయన ప్రాశ్చాత్య తత్వశాస్త్రాన్నే కాదు, అనువాదాలద్వారా హైందవ తత్వశాస్త్రాన్ని కూడా పరిశోధించాడు" అని వ్రాశాడు.

షోపనార్ తల్లి చాలా చిత్రమైన మనిషి. ఆమె కూడా సాహితీపరురాలే ... వ్యాపారాన్ని ఉద్యోగాన్ని వదులుకొని తన కుమారుడు సాహిత్యరంగంలో అడుగుపెట్టటానికి ఆమె అంగీకరించింది. తండ్రి సమర్థించని తన అభి

లాషను తల్లి సమర్థించి ఉత్సాహపరిచింది గనక షోపనార్‌కి తల్లిమీంద ఎక్కువ మక్కువ వుండేదని ఎవ్వరూ భ్రమపడ నక్కరలేదు. వారిద్దరికీ ఎప్పుడూ పడేదికాదు. దీనికి కారణం లేకపోలేదు.

భర్త చనిపోయిన పిదప షోపనార్ తల్లి, వీమర్‌లో నివసించేది. అక్కడ ఆమె గ్రంథరచన చేస్తూ అనేకమంది సాహిత్యవేత్తల సాంగత్యంతో కాలం గడుపుతూవుండేది. ఆమెకు కుమారుడంటే ఇష్టలేదు. కుమారుని తప్పులు గోరంతలు కొండంతలుగా ఆమెకు కనుపించేవి. కుమారునికి ఆమె గడుపుతున్న జీవితం ఇష్టంవుండేదికాదు. ఆయన పెరిగినకొద్దీ తల్లితో అభిప్రాయ భేదాలుకూడా పెరుగుతూవచ్చినై. చివరికి వొకరితో వొకరికి సంబంధంలేని స్థితికి వొచ్చాయి, వారి పరిస్థితులు.

అప్పటికే, టీక్, నోవలిస్, హాఫ్‌మన్ మొదలైన ఊహావాదులతో ఆయనకు పరిచయం ఏర్పడింది. వారి ప్రభావంలో వుండి క్రైస్తవమతం అంటే నిరసనా, గ్రీకు సంస్కారం అంటే సానుభూతీ ఆయన కుదుర్చుకున్నాడు. భారతీయ తాత్త్వికదృష్టిమీద ఆయనకున్న అభిమానాన్ని ఫ్రెడెరిక్ ష్లెగెల్ బలపరచటం, దానితో ఆయనకు తనమీద తనకున్న నమ్మకం పెరగటం ఈరోజుల్లోనే జరిగింది. 1809లో ఆయన గోటిన్గెన్ విశ్వ విద్యాలయానికి వెళ్లాడు. అక్కడ కాన్ట్‌ని అభిమానించటం నేర్చుకున్నాడు. అక్కడ నుంచి బెర్లిన్ వెళ్లి శాస్త్ర విద్యను అభ్యసించాడు. అక్కడ ఫిచే ఇచ్చిన ఉపన్యాసాలను విన్నాడు గాని, ఆయన మీద గురి

కుదరలేదు. 1819లో ఆయన బెర్లిన్‌లో ఉపన్యాసకుడుగా వుండి, హెగెల్ ఉపన్యసించే సమయంలో తన ఉపన్యాసాలు వుండేటట్లు ఏర్పాటు చేసుకున్నాడు. పర్యవసానంగా, ఆయన ఉపన్యాసాలు వినటానికి ఎవ్వరూ రాకపోవటం; తత్ఫలితంగా ఆయన బెర్లిన్ విడిచిపెట్టి, ఫ్రాంక్‌ఫర్ట్‌లో నివాసం స్థిరపరచుకోవటం జరిగింది. ఫ్రాంక్‌ఫర్ట్‌లో నివాసం ఏర్పరచుకోవటానికి మరొక కారణం కూడా దోహదం చేసినట్లు కనుపిస్తుంది. 1831 లో బెర్లిన్‌లో కలరా జాడ్యం ఎక్కువగా వ్యాపించింది. హెగెల్ ఈ జాడ్యంతోనే మరణించాడు. ఈ పరిస్థితి నుంచి తప్పించుకోవటానికి ఆయన బెర్లిన్ విడిచిపెట్టి ఫ్రాంక్ ఫోర్టులో స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు. కారణం ఏదయినా ఆయన తన చివరి కాలం ఫ్రాంక్ ఫోర్టులో గడిపాడు. అక్కడ ఆయన ఏ విధంగా కాలం గడిపాడో రసెల్ తన పాశ్చాత్య తత్వ శాస్త్ర చరిత్రలో కన్నులకు కట్టినట్లు వర్ణించాడు.

ఆయన ఇక్కడ వున్న కాలంలో ఒక పెంపుడు కుక్కను పెంచాడు. దానికి 'ఆత్మ' అనే పేరుపెట్టాడు. రోజూ రెండు గంటల పాటు నడిచేవాడు. పెద్ద పైపు తాగేవాడు. లండన్ నుంచి వచ్చే 'టైమ్సు' పత్రికను చదివేవాడు. తన పేరు ప్రఖ్యాతుల సాక్ష్యాల కోసం అనేక మంది విలేఖరులను పనిలో వుంచేవాడు. ఆయన ప్రజాస్వామిక విధానానికి వ్యతిరేకి. 1848లో జరిగినవిప్లవానికి ఆయన వ్యతిరేకి. ఆయనకు ఆధ్యాత్మిక వాదంలోనూ, మ్యాజిక్‌లోనూ నమ్మకం

ఆయన తనచదువుల గదిని కాంట్ యొక్కా బుద్ధునియొక్కా బొమ్మలతో అలంకరించుకున్నాడు..."

షోపనార్ తన సిద్ధాంతంద్వారా నిరాశనూ, నిష్ప్రయోజకత్వాన్నీ ప్రచారం చేసినంత మాత్రాన, ఆయన దానికి, అనుగుణంగా జీవించాడని ఎవ్వరూ భ్రమపడనక్కర లేదు. అందుకనే ఆయన సిద్ధాంతంలో ఆయనకే నమ్మకం లేదు అని విమర్శించాడు రసెల్. "ఆయన మామూలుగా తృప్తిగా భోజనం చేసేవాడు- అదీ మంచిహోటల్లో. చిన్న చిన్న ప్రేమకలాపాలను చాలాజరిపాడు ఆయన. ఆయనచీటికీ మాటికీ తగాదాలు ఆడేవాడు; పైగా లోభికూడాను... ఆయన జీవితంలో సుగుణాలు కనిపెట్టటం చాలాకష్టం. ఒక్క జంతువులమీాద మాత్రం చాలా అనురాగం చూపే వాడట. నిరాడంబరతనూ, విముఖత్వాన్ని ప్రచారంచేసిన వ్యక్తి, జీవితంలో ఇలా వుండటం నిజంగా చిత్రమైన విషయమే... తన సిద్ధాంతంలో తనకు నమ్మకంవుంటే, దానిని ఆచరణలో పెట్టకుండా ఎలా వుండగలరు ఎవ్వరైనా?"

అంతేకాదు; తమ జీవితాలను అతి జాగ్రత్తగా నడిపిన వారిలో ఆయన వొకడు. ఇతరప్రముఖ రచయితలకువలె ఆయన తనకు కావలసిన డబ్బుకోసం తన గ్రంథాల విక్రయంమీాద ఆధారపడలేదు. ఆయనకు తండ్రిదగ్గరనుంచి కొంతఆస్తి వొచ్చింది. దానినే జాగ్రత్తగావాడి కాలక్షేపం చేశాడు. ఒక కంపెనీలో షేర్లు కొని దానివల్ల వచ్చే లాభాన్ని వినియోగించుకునేవాడు. ఆ కంపెనీ దివాళా తీసి.

నప్పుడు మిగిలిన వాటాదార్లు నూటికి డెబ్భయివంతులు తీసు కోటానికి అంగీకరిస్తే, ఈ వొక్కడూ అంగీకరించక పోట్లాడి తనపూర్తి మొత్తాన్ని తెచ్చుకోగలిగాడు.

ఆయన చివరిరోజులను ఈ విధంగా వర్ణించాడు విల్ డురాన్ట్–1848 లో జరిగిన సంఘటనలవల్ల నిస్పృహాజెందిన యూరప్ ఖండం, ఆయన తత్వశాస్త్రం వైపుకు దృష్టిని మరల్చింది. అంతటితో ఆయన ప్రఖ్యాతి పెరిగింది... అప్ప టికి ఆయన తన ప్రజానురంజకత్వాన్ని అనుభవించలేని ముసలితనానికి రాలేదు. తననుగురించి ప్రచురించబడిన అన్నివ్యాసాలూ ఆయన అతిశ్రద్ధగా చదివేవాడు. తనను గురించి ప్రచురించబడిన విమర్శలను ఎప్పటికప్పుడు తనకు పంపుతూ వుండవలసిందనీ, దానికయ్యే పోస్టేజిఖర్చు తానే భరిస్తాననీ మిత్రులందరికీ ఉత్తరాలు వ్రాశాడు. ఈ విధంగా నిరాశావాదియైన షోపనార్ ముసలితనంలో ఆశావాదిగా మారాడు. భోజనం అవగానే పిల్లనగ్రోవి వాయిస్తూ కూర్చునేవాడు. ప్రపంచంలోని అన్ని దిశలనుంచీ ఆయనను చూడటానికి అభిమానులు వొచ్చిపోతూ వుండేవారు. తన కృషికి తానే ఆనందపడుతూ, షోపనార్ సెప్టెంబరు 21, 1860 న పరమపదించాడు. ఒకరోజు ఆయన భోజనానికి కూర్చున్నాడట, కూర్చున్నప్పుడు బాగానే వున్నాడట, ఎంతసేపూ అలాగేకూర్చొనివుంటే, ఇంటి యజమానురాలు వొచ్చి చూచి మరణించాడని తెలుసుకుందిట. ఈ విధంగా నిశ్శబ్దంగా తరలిపోయాడు షోపనార్.

## 3

షోపనార్ స్వభావాన్నీ, ఆయన వ్యక్తిత్వాన్నీ అర్థం చేసుకోవటం కష్టం అన్నాడు కెల్లీరైట్. అదినిజమే. తాను నిర్మించిన సిద్ధాంతానికి అనుగుణంగా బ్రతకక్కపోవటంవల్ల వచ్చిన చిక్కు-ఇది-అని నేను అభిప్రాయపడుతున్నాను. ఈ వైరుధ్యం మనిషిని వికృతం చేస్తుంది. వ్యక్తిగా షోపనార్‌కి ఈపనే జరిగిందని నా అనుమానం. తల్లితో పోట్లాట్టానికీ, ఒకస్త్రీని గడపలో గోలచేసిందనే నెపంతో మెట్లమీద నుంచి క్రిందకు త్రొయ్యటానికీ, అర్థంలేని తదితర వ్యాప కాలకూ వైరుధ్యం వల్ల వికృతం అయిన ఆయన స్వభావం కారణం అయివుండవచ్చునని మనం ఊహించవచ్చు. అయితే అసలు తన సిద్ధాంతానికి అనుగుణంగా బ్రతకలేక పోవటానికి కారణం ఏమిటి? వాస్తవికత భయంకరం అయిందనే నిర్ధారణకు ఆయన ఎందుకు వచ్చాడు? ఆనాటి ఆయన స్వభావానికి కారణంఏమిటి? ఈ ప్రశ్నలకు అనేకులు అనేక రకాలుగా జవాబులు చెపుతారు. దీన్ని ఊహకు వదలటం తప్ప ఇదమిద్ధమని మనం తేల్చుకోలేం. ఈ సంద ర్భాన్ని రసెల్ ఇలా పరామర్శించాడు.

"నాకు సంకల్పం వున్నదనుకోవచ్చు. విశ్వానికి సంకల్పం వున్నదనుకోవచ్చు. నా సంకల్పం, విశ్వానికున్న సంకల్పం ఒకటేనని అనుకోవచ్చు ... ఇంతవరకు షోపనార్ చెప్పింది పద్ధతిగానే వుంది. అక్కడనుంచే పెడతిరిగింది. ఇంతవరకు విశ్వసంకల్పాన్నే భగవంతుడని షోపనార్

అనబోతున్నాడనీ, ఈ విశ్వసంకల్పంతో ఏకీభవించటమే ఆదర్శం అనీ, భగవంతునితో ఏకమవటమనీ అనబోతున్నాడనీ మనం భావిస్తాం. కానీ షోపనార్ అలా అనడు. అనక 'ఈ విశ్వసంకల్పం క్రూరమైంది; అసలు సంకల్పం అనేదే క్రూరమైంది; మన బాధలన్నింటికీ అదే కారణం. జీవితానికి బాధ అనేది తప్పదు. జ్ఞానం ఎక్కువైనకొద్దీ ఈ బాధలు ఎక్కువ అవుతై. ఈ సంకల్పానికి ఏది నెరవేరితే సంతృప్తి అనేది కలుగుతుందో, అటువంటి ఆదర్శం అనేది ప్రపంచానికి లేదు. మరణానికి ఎప్పుడో ఒకప్పుడు లోబడక తప్పదని తెలిసే, ఏవో సాధించాలని తాపత్రయపడతాం. ఈ ప్రపంచంలో సుఖంఅనేది లేదు. ఎందుకంటే కోర్కె తీరక పోతే బాధపడతాం; తీరితే, అది మరొక కోర్కెను రేపుతుంది' అనే రీతిని తర్కం ప్రారంభించాడు షోపనార్.

ఈ తర్కానికి ఆయన స్వభావమే కారణంగాని, వేరుకారణం లేదు అంటాడు రసెల్.

* * *

షోపనార్ తత్వశాస్త్రం హెగెల్ యొక్క హేతువాదానికి వ్యతిరేకంగా తయారైన సిద్ధాంతం. హేతువాతువాదం అవిచ్ఛిన్నతను నమ్మితే, సంకల్పవాదం విచ్ఛిన్నతను నమ్ముతుంది. 'హేతువాదం శాంతినీ, సమన్వయాన్నీ వాంఛిస్తే, సంకల్పవాదం ఆరాటాన్నీ, పోరాటాన్నీ వాంఛిస్తుంది. హేతువాదం చలనంలేనిదైతే, సంకల్పవాదం నిత్యచలనం గలిగింది,' అన్నారు శిశిరకుమార్ మైత్రాగారు,

ప్రాచ్యపాశ్చాత్య తత్వచరిత్రలో, షోపనార్ సిద్ధాంతాన్ని పరిశీలిస్తూ.

హేతువాదం యొక్క, సంకల్పవాదంయొక్క పై పరిశీలనను బట్టిచూస్తే సమగ్రాభివృద్ధికీ, ప్రపంచాన్ని చక్కగా అర్థం చేసుకోటానికీ ఈ రెండూ అవసరమేనేమో అనిపిస్తుంది. ఈ మాటనుకూడా శిశిరకుమార మైత్రాగారే అన్నారు. "హేతువాదాన్ని, సంకల్పవాదం సరిదిద్దవచ్చు. హేతువాదంమీదే పూర్తిగా ఆధారపడితే అది అర్థసత్యానికే దారితీస్తుంది. హేతువాదం అజలోకి తీసుకోని వాటిని గురించి చెప్పటానికి మరొకవాదం అవసరం అవుతుంది. ఈ విధంగా షోపనార్ నిర్వచించిన 'సంకల్పం' కొంతవరకు ఉపకరిస్తుంది" అన్నారు వారు.

అయితే 'సంకల్పం' అంటే షోపనార్ ఉద్దేశం ఏమిటి ? షోపనార్ లెక్కలో 'సంకల్పా'నికీ 'హేతువాదా' నికీ వున్న భేదం ఏమిటి ? ఈ విషయం స్పష్టంగా తేలాలి. సంకల్ప భావప్రపంచం, అనే గ్రంథంలో సంకల్ప స్వభావాన్ని, సంకల్పానికీ, భావానికీ వున్న సంబంధాన్ని ఈ విధంగా విపులపరిచాడు షోపనార్. "ఈ సంకల్పానికి, దానంత దాన్ని పరికించినట్లయితే, జ్ఞానం లేదని బోధపడుతుంది. అదివొక గుడ్డి ఆవేశంలాంటిది ... సంకల్పం అనేది తనలో తాను వుండేది: ఈ ప్రపంచంలోపల వుండేది: ఈ ప్రపంచంయొక్క సారాంశం అది. జీవితం ఈ సంకల్పం యొక్క ప్రతిబింబమే. మనకు బ్రతకాలనే సంకల్పం వున్నంతవరకూ, బ్రతుకునుకూర్చి భయపడవలసిన అవసరం

లేదు. కాబట్టి నీడ శరీరాన్ని ఏ విధంగా అనుసరించి వుంటుందో, అదేవిధంగా జీవితం సంకల్పాన్ని అనుసరించి వుంటుంది. సంకల్పం ఉంటే జీవితం ఉంటుంది; ప్రపంచం ఉంటుంది. జీవించాలనే సంకల్పానికి జీవితం ఎప్పుడూ అంకితం చెయ్యబడే వుంటుంది. బ్రతకాలనే సంకల్పం వున్నంతవరకూ, మృత్యువు ఎదురుగా వచ్చి నిలబడినా మనం భయపడవలసిన అవసరంలేదు"

సంకల్పాన్ని గురించి షోపనార్ చెప్పిన నిర్వచనం ఇది. దీన్ని ఉదహరించి, 'దీని అర్థమేమిటి?' అని ప్రశ్నించు కొని ఇలా జవాబు చెప్పాడు శిశిరకుమారమైత్రాగారు. 'ఈ సంకల్పం అనేది తనలో తాను వుండేది. భావంఅనేది దానికి సంబంధించిన విషయం... ఇది మొదటిది. ఇక రెండవది: ఈ తనలో తానుగా వుండేది జ్ఞానంలేనిది, గ్రుడ్డి ఆవేశంగా వుండేది అనే విషయం. అయితే దీనినిబట్టి నిర్నిరోధకమైన, చైతన్యంలేని వొక గ్రుడ్డి ఆవేశం అనాది సత్యమనీ, అదే జీవితంగానూ, చైతన్యంగానూ రూపొందుతూ వుందనీ తేలు తుంది. అయితే భౌతికశక్తికీ దీనికీ భేదం ఏముంది? ఇది భౌతికవాదమే కావచ్చు. అన్ని యుగాలలోనూ భౌతిక వాదాన్ని ఎప్పుడూ వొకచిక్కు ఎదుర్కొంటూ వుంది. పదార్థంలోనుంచిగానీ, శక్తిలోనుంచిగానీ, చైతన్యం ఎట్లా ఆవిర్భవించింది అనే ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసి రావటమే ఈ చిక్కు.

మరి ఈ చిక్కును ఏమన్నా విడదియ్యగలిగాడా షోపనార్? ఈ ప్రశ్నకు 'లేదు' అనే జవాబు చెప్పుకో

వాలి. అన్నింటిలోనూ, వొకశక్తి చైతన్యంగానో అచై తన్యంగానో అంతర్భాగంగా వున్నది అని చెప్పి జవాబు చెప్పాను అనుకున్నాడేగాని, నిజంగా చిక్కు విడనేలేదు. శక్తి అంతర్భాగాన వున్నంతమాత్రాన అచైతన్యాన్ని చైతన్యం ఎట్లా చెయ్యగలుగుతుంది, అచైతన్యంలో చైతన్యం ఛాయలు లేనప్పుడు? కాబట్టి చిక్కు చిక్కుగానే ఉండిపోయింది షోపనార్ తత్వశాస్త్రంలో.

* * *

షోపనార్‌కి, నిరాశాతత్వం, సత్యం దుష్టమైనదని భావించటంవల్ల వచ్చినట్లు కనుపిస్తుంది. సత్యం దుష్టమైన దనుకోవటం అర్థంలేని పని. దుష్టమైనదిగనుక సత్యాన్నుంచి తప్పుకోవాలి. అలా తప్పుకోవటానికి వీలుందా! లేదు. ఇక ఏమిచెయ్యాలి? ఈవిధంగా ఆయన నిరాశావాదం వృద్ధి చెందింది. ఈ నిరాశావాదానికి హిందూ తత్వశాస్త్రానికి ఆయనమీాదవున్న పలుకుబడే కారణం అని కొందరు చెపు తారు. కాదని మనం గట్టిగా, నిర్మొగమాటంగా చెప్ప వచ్చు. హిందూ తత్వశాస్త్రం సత్యం దుష్టమైనదనిగానీ, దానితో ఏకమవటం అవాంఛనీయమనిగానీ ఎప్పుడూ చెప్పదు. పైగా సత్యంతో వొకటి అవటమే మానవుని ఆదర్శమని అంటుంది. "ఉపనిషత్తులు ఈ శరీరంతోనే బ్రహ్మాన్ని పొందవచ్చని చెపుతాయి. బ్రహ్మం అంటె సచ్చిదానందం అని చెపుతారు. ఛాందోగ్యోపనిషత్తు 'విచారం గానీ, రోగంగానీ, మరణంగానీ మహర్షులకు కనుపించవు.

వారు అన్నిటినీ చూస్తారు: అన్నింటినీచూచి సర్వవిధాలా సమస్తమైనవాటినీ పొందుతారు' అన్నది. ఇది నిరాశా వాదం ఎలా అవుతుంది? నిరాశావాదానికీ దీనికీ చుక్కెదురు."

అయితే ఉపనిషత్తుల ప్రభావం ఆయనమీద ఎట్లా వున్నట్లు? భావాన్ని ప్రేమించటంలోనూ, ధ్యానంద్వారా శాంతినీ నిశ్శబ్దతనూ కోరుకోవటంలోనూ ఆయనమీద ఉపనిషత్తులకున్న ప్రభావం గోచరిస్తూంది. ధ్యాన జీవితం మీద అయనకున్న మమకారం హిందూ శాస్త్రంవల్ల వచ్చిందేనని మనం ఘంటాపథంగా చెప్పవచ్చు. వివిధ రూపాలలో భావాన్ని వర్ణించిన ఘట్టాలే ఆయన రచనల్లో ఉత్తమమైనవి. ఈప్రభావం హిందూతత్వశాస్త్రందే. ఇదే విషయాన్ని కెల్లీరైట్ మరొకవిధంగా చెప్పాడు. "ఆయన ప్రఖ్యాతిగడించింది ఆయన ప్రచారం చేసిన నిరాశావాదం వల్ల అని చాలామంది అనుకుంటారుగాని అది నిజంకాదు. భావవాదానికి ఆయన చేసిన నిర్వచనం, మరికొన్ని విష యాలూ ఆయనకు ప్రఖ్యాతిని గడించి పెట్టినవి" అని అన్నాడు.

౪

ఆయన వ్రాసిన పుస్తకాలలో ముఖ్యమైంది 'సంకల్ప భావప్రపంచం' అనేది 'హేతువాదానికి, నాలుగు లక్షణాలు కలిగిన పునాది' 'నీతికి ఆధారం' 'ప్రకృతిలో సంకల్పం' మొదలైన పుస్తుకాలుకూడా ఆయన వ్రాశాడు. ఈ పుస్తు

కాలలో ఆయన వెలిబుచ్చిన భావాల లక్షణాలను ఇప్పుడు విడివిడిగా తెలుసుకుందాం.

హేతువాదం :

ఆయన మొదట వ్రాసింది 'హేతువాదానికి నాలుగు లక్షణాలు కలిగిన పునాది' అనే పుస్తకం. ఈ పుస్తకం ఆయన తరువాత వ్రాసిన' సంకల్ప భావ ప్రపంచం' అనే పుస్తకానికి పీఠికవంటిదని భావించాడు. ఈ పుస్తకాన్ని గురించి 'సంకల్ప భావప్రపంచం' పీఠికలో, దాని పరిచయం లేకుండా ఈ పుస్తకాన్ని అర్థంచేసుకోవటం కుదరదు. అందులో వున్న విషయాలు ఇందులో ముందుగా చెప్ప బడినట్లే భావించబడి, ఈ పుస్తకం ప్రారంభించబడింది' అని వ్రాశాడు. ఈ పుస్తకంలో ఆయన ముఖ్యంగా చెప్ప దలిచింది ఇది: కారణంగా పరిగణిస్తే హేతువాదానికి నాలుగు రూపాలు వున్నట్లు కనుపిస్తుంది. తెలుసుకోటానికి ఉపకరించేదీ, ఉన్నదీ, మారుతూవున్నదీ, కర్మచెయ్య టానికి ఉపకరించేదీ. ఇవీ ఆ నాలుగు రూపాలూ. గణిత శాస్త్రానికి సంబంధించన హేతువాదానికీ, తర్కశాస్త్రానికి సంబంధించిన హేతువాదానికీ భేదం వున్నదని చెప్పటం ఈ పుస్తకంయొక్క ప్రత్యేక లక్షణం. మొదటిది ఇన్ట్యూ షన్ మీాదా, రెండవది ఊహమీాదా ఆధారపడి వుంటాయని ఆయన నిర్వచించాడు.

అయితే దీనికంటే సంకల్పం ముఖ్యమని ఆయన ఎప్పటికప్పుడు చెపుతూనే వున్నాడు. ఈ పరిస్థితిని, ఇలా

నిర్వచించాడు కెల్లీరైట్—"జ్ఞానం మొత్తం ఈ హేతు వాదానికి లోబడివుంటుంది. జ్ఞానం పైన ఉదహరించిన నాలుగు రకాల్లో ఏదో వొకరకం క్రిందకు వస్తుంది. ఈ సిద్ధాంతం అన్నిటా వర్తిస్తుంది. ఆలోచనకు అందిన కారణం లేకుండా ఏదీ జరగదు. కాని హేతువాద బద్ధమై వున్న ఈ జ్ఞానంకంటే ముఖ్యమైంది సంకల్పం. ఇది హేతు వాదానికి అందనిది. ఇన్ట్యూషన్‌వల్ల తెలిసేది. ఈ సంకల్పం అనేదే లేకపోతే జ్ఞానం అనేదే సేకరించబడదు. ఈ విధంగా వాదించాడు షోపనార్. దీనినిబట్టిచూస్తే 'ఆవేశాలకు హేతు వాదం బంటు' అనే హ్యూమ్‌యొక్క సిద్ధాంతాన్ని షోపనార్ తన సంకల్పసిద్ధాంతానికి జోడించాడని అనుకో వలసి వస్తుంది.

**భావప్రపంచం :**

'సంకల్ప భావప్రపంచం' అనే పుస్తకం 1818 లో ప్రచురించబడింది. ఈ పుస్తకం అతి ముఖ్యమైందనీ, దీనికి ఆదరణ ఎక్కువగా లభిస్తుందనీ షోపనార్ అభిప్రాయ పడ్డాడు. కాని పుస్తకం విడుదలఅయిన వెంటనే ఆయనకు పెద్ద ఆశాభంగంకలిగింది. ఆపుస్తకం ఉనికినే గ్రహించనట్లు ప్రవర్తించారు అందరూ. 1844 వరకూ ఈపుస్తకానికి రెండవ ముద్రణ ప్రాప్తి లభించలేదంటే, దీనిని ప్రథమంలో పాఠకలోకం ఏవిధంగా స్వీకరించిందీ మనం ఊహించుకోగలం.

కాన్ట్ తత్వశాస్త్రం షోపనార్‌ని ఎంతవరకు కదిలించిందీ ఈ పుస్తకం నిరూపిస్తుంది. ఆయన ఈ పుస్తకానికి

పీఠిక వ్రాస్తూ కాన్ట్ తత్వశాస్త్రంలో పరిచయం, ఈ పుస్తకాన్ని అర్థం చేసుకోవటానికి ముఖ్యం అని వ్రాశాడు. అంతే కాదు. ఉపనిషత్తులు తన నేవిధంగా మలిపిందీ ఆయన ఈ విధంగా పేర్కొన్నాడు. "ఉపనిషత్తుల జ్ఞానాన్ని పొందటం గొప్పఅవకాశం అనినేను భావిస్తున్నాను. ఇంకా యావనంలోనే వున్న ఈ యుగం ఈ అవకాశాన్ని కలిగివుండటం దాని అదృష్టం. ఎందుకంటే 15 వ శతాబ్దంలో గ్రీకు వాఙ్మయం ఎంత గాఢంగా ప్రపంచ హృదయంమీద హత్తుకుందో, అంత గాఢంగానూ ఈ వాఙ్మయం హత్తుకో గలదని నా విశ్వాసం. మరొక విషయం. పాఠకుడు ఈ వాఙ్మయాన్ని తెలుసుకొని వున్నట్లయితే, నేను చెప్ప బోతున్న విషయాలను తేలిగ్గా అర్థం చేసుకోగలడని నేను తలుస్తున్నాను. ఈ ప్రపంచంలో ఉపనిషత్తుల పఠనంకంటే ఉన్నతమైంది ఇంకేదీ లేదు. నా జీవితానికి శాంతిని ప్రసాదిస్తూవుంది ఈ విద్య. మరణానికి కూడా శాంతిని ప్రసాదించగలదు..."

ఈ పుస్తకాన్ని మనం, భావప్రపంచం, సంకల్ప ప్రపంచం, దుష్టప్రపంచం అనే మూడుభాగాలుగా విభజించి పరిశీలించటం సులభం. ఇందులో మొదటిభాగం భౌతికవాద విమర్శ మనస్సుని పదార్థంగా ఎలా నిర్వచించగలం. మనస్సు ద్వారా మాత్రమే మనం పదార్థాన్ని తెలుసుకున్నప్పుడు ? కాబట్టి ఈ సృష్టి రహస్యాన్ని ముందు పదార్థాన్ని తరువాత ఆలోచననూ విమర్శించిచూడటంవల్ల తెలుసుకోలేం. మనం ప్రత్యక్షంగా, దగ్గరగా వున్నదానిని తెలుసుకోవటంద్వారా

ఈ పనిని ప్రారంభించాలి. అటువంటిది ఏమిటి? మనమే కాబట్టి మనం మనల్ని తెలుసుకోవటంతో ఈ అన్వేషణ సాగాలి. "మనం బయటనుంచి పరీక్షను ప్రారంభించి సత్య స్వభావాన్ని గ్రహించలేం. మనం ఎంత నిశితంగా పరిశీలించినా బొమ్మలనూ, పేర్లనూ మాత్రమే తెలుసుకోగలుగుతాం. ఈ అన్వేషణ లోపలనుంచే జరగాలి. లోపలికి ప్రవేశిద్దాం. మన మనస్సుల మూలస్వభావాన్ని అర్థంచేసుకుంటే బహుశా బయట ప్రపంచానికి తాళపుచెవి దొరుకుతుందేమో!" అన్నాడు షోపనార్. ఆయన తత్వశాస్త్రనిధిని సమీపించటానికి ఈ దృష్టే తాళపుచెవి. ఇక ఈ పుస్తకం లోని రెండవభాగాన్ని విమర్శించి చూద్దాం. ఈ భాగం సంకల్పానికి చెందింది. ఇంచుమించు తత్వవేత్తలందరూ మనస్సుయొక్క సారాంశం, ఆలోచనలోనూ, చైతన్యం లోనూ వున్నదని చెప్పారు. షోపనార్ దృష్టిలో ఇది తప్పు, "మన మనస్సుల పైభాగం మాత్రమే చైతన్యం. భూమికి వలెనే మనస్సుల విషయంలోకూడా మనకు తెలిసింది పై భాగమే" మెదడుకి సంబంధించిన ఈ చైతన్యంక్రింద, చైతన్యం కలిగిందిగా గానీ, లేనిదిగా గానీ వుండే సంకల్ప శక్తి వుంటుంది. ఇది జీవశక్తి; కర్మను నిర్నిరోధకంగా ప్రేరేపించే శక్తి; ఆగని కోర్కెకు సంబంధించిన శక్తి. ఈ శక్తిని మేధస్సు నడుపుతున్నట్లు స్థూలదృష్టికి కనుపిస్తుంది. కాని పరీక్షగా చూస్తే తన యజమానికి దారిచూపే సేవకుడు ఆయన్ని నడుపుతున్నట్లే ఇది సంకల్పశక్తిని నడుపుతూ

వుందని తేలిగ్గా బోధపడుతుంది. ఈ సంకల్పశక్తి కుంటి వాణ్ణి భుజములమీద మోసుకుపోయే గ్రుడ్డివాని వంటిది."

తర్కం ఈ సంకల్పశక్తిముందు దిగదుడుపే. మనం ఒక విషయం అక్కర్లేదు అనుకుంటాం. ఎందుకంటే దానికి అనువైన కారణాలు ప్రోగుజేసుకున్నాం గనుక. అంతేకాదు. అది మనకు కావాలిగనక దానికి అవుసరమైన కారణాలను ప్రోగుజేస్తున్నామని షోపనార్ ఉద్దేశం. తత్వాలూ, సిద్ధాంతాలూ కూడా ఇదేవిధంగా నిర్మించబడ్డాయని ఆయన వాదం. కాబట్టి ఆయన దృష్టిలో తర్కం నిష్ప్రయోజనమైంది. తర్కంతో ఎవ్వరూ ఎవ్వర్నీ అంగీకరింపజెయ్యలేదు ఈ ప్రపంచంలో. తార్కికులుకూడా తమ తర్కాన్ని సంపాదనకు మాత్రమే వినియోగిస్తారు. మరి మనిషిని వొప్పించాలంటే, ఏం చెయ్యాలి? అతని స్వార్థాన్ని కోర్కలనూ, సంకల్పాన్నీ కదిలించాలి—రేపాలి.

స్వభావం అనేదికూడా సంకల్పంవల్ల ఏర్పడేదేగాని మేధస్సువల్ల కాదు. ప్రయోజనం, దృష్టి-వీటిఅవతల కొసే స్వభావం. అందువల్ల 'మేధస్సుకంటే హృదయం' మీద ఆధారపడటం మంచిదని సామాన్యులు అనుకోవటం మంచిదే. స్వభావమే కాదు. శరీరంకూడా సంకల్పశక్తివల్ల ఏర్పడిందేనని షోపనార్ విశ్వాసం; విల్ డురాన్ట్ ఈ సందర్భంలో ఇలా అన్నాడు. "సంకల్ప శక్తివల్ల ప్రేరేపించబడిన రక్తం, పిండంయొక్క శరీరంలో సుడులను సృష్టించి తన స్థానాలను తాను నిర్మించుకుంటుంది. ఈ సుడులు గాంభీర్యాన్ని పొదుపుకొని, నరాలుగానూ, Arteries గానూ

పరిణమిస్తయి. ఇదేవిధంగా తెలుసుకోవాలనే సంకల్పం మెదడునూ, స్వాధీనం చేసుకోవాలనే సంకల్పం హస్తాలనూ, తినాలనే సంకల్పం జీర్ణశక్తినీ, రూపొందించినై ... ఈ రూపాలు-సంకల్పరూపాలూ, శారీరక రూపాలూ-నిజంగా చెప్పాలంటే ఒకే పరిణామంయొక్క ద్విముఖాలు.

ఈ విధంగా అన్నిటికంటే సంకల్పశక్తి ముఖ్యమైందని ఈ భాగంలో నిరూపించటానికి ప్రయత్నించాడు షోపనార్. దీనినిబట్టి బయటప్రపంచాన్ని ఏ విధంగా నిర్వచించాలో తెలుసుకుందాం. ఇతరులు శక్తియొక్క రూపం సంకల్పం అనుకున్నచోట, ఈ దృష్టినిబట్టి సంకల్పంయొక్క రూపమే శక్తి అని అనుకోవలసి వస్తుంది. కారణత్వం అంటే సంకల్పమే, సంకల్పం మనలోవున్న విశ్వకారణం గనక వస్తువుల్లోనూ అది వుంటుంది. ఈ విధంగా కారణాన్ని సంకల్పంగా అర్థంచేసుకుంటే తప్ప కారణత్వం ఒక గారడీగా ఉండిపోతుంది.

ఇదే మొక్కలకూ వర్తిస్తుంది. పరిణామంలో వెనుకకు పోతున్నకొద్దీ మేధస్సు కనుపించదు. సంకల్పం ఉంటూనే వుంటుంది. సంకల్పం బ్రతకటానికి సంకల్పం. జీవులకు ప్రాణంమీద ఎంత మమకారం! సంకల్పం బ్రతకటానికి సంకల్పంగనుక ఎప్పటికైనా అది మృత్యువును జయిస్తుందేమో!

ఇక దృష్టప్రపంచానికి సంబంధించిన నాలుగవ భాగాన్ని పరిశీలిద్దాం. ఈ ప్రపంచం సంకల్పం అయితే,

ఈ ప్రపంచం బాధలతో కూడిందని మనం ఒప్పుకోవాలి. ఎందుకంటే సంకల్పంలోనే అసంతృప్తి అనేది నిగూఢంగా వుంది. అది ఎప్పుడూ తాను పొందనిలేని అంతటిదాన్ని కోరుతుంది. తీరిన ప్రతి కోరిక వెనుకా, తీరని పదికోర్కెలు వుంటాయి. ఏ పదికోర్కెలు తీరకపోతేనో ఒక కోర్కె తీరుతుందని చెప్పుతున్నా ఇబ్బంది లేదు. కోర్కెకు హద్దులు లేవు. తీరటానికి హద్దులున్నాయి. కాబట్టి ఈ ప్రపంచం కష్టమయమైందీ, దుష్టమైందీనీ. అంతేకాదు. కష్టం అనేది ప్రోత్సహించేదీ, సత్యమైందీ కనకా, సుఖం కష్టం లేకుండా చేసే స్థితీగనకా, ఈ ప్రపంచం అతి దుష్టమైందని ఘంటాపథంగా చెప్పుకోవచ్చు. పైగా జ్ఞానం ఎక్కువైనకొద్దీ ఈ కష్టం ఎక్కువ అవటం దీని ప్రత్యేక లక్షణం." ఇలా చెప్పి చివరికి, ప్రపంచం నిత్యపోరాటంతో నిండివుండేది గనుక దుష్టమైందని తేల్చాడు షోపనార్. ఎక్కడచూచినా ప్రకృతిలో సంఘర్షణ, పోటీ, పోరాటం ప్రత్యక్షంగా కనుపిస్తూ వుంది. ప్రతివొక్కరూ, ఇతరుల వస్తువులకోసం, స్థలంకోసం కాలంకోసం పోరాడటం అందరికీ అనుభవంలోవున్న విషయమే. ఈ విధంగా చిత్రించి ఈప్రపంచం వాసయోగ్యం కాదని ఈ పుస్తకంలో తేల్చాడు షోపనార్.

"మనం వివాహం చేసుకునీ దుఃఖ పూరితులమే; చేసుకోకా దుఃఖ పూరితులమే. మనం పది మందితో కలసి వుండీ దుఃఖ పూరితులమే; ఒంటరిగా వుండీ దుఃఖ పూరితులమే. మనసు వేడి కోసం కలిసి ఉండ బుద్ధవుతుంది. కలిసిఉంటే విడిగా ఉండ బుద్ధవుతుంది. ఎటుగా వుండీ

దుఃఖం మనలను విడువదు. ఇది నిజంగా విచిత్రమైనస్థితి. దుఃఖాన్నుంచి మనం తప్పించుకోలేం. పరిస్థితి ఇలా వుండగా ఆశాభావం ఎలా కలుగుతుంది? ఈ ప్రపంచం విషాదాంత నాటకం ఆడటానికి రంగస్థలంగా అమర్చ బడిందని అనుకోక తప్పేదేముంది? వీటి అన్నిటిమీద మృత్యువొకటి నోరుతెరుచుకుని కబళించటానికి సిద్ధంగా ఉంటుంది.

## ప్రకృతి సంకల్పం :

ఈపుస్తకం 1836 లోనూ 1841 లో 'నీతిశాస్త్రంలో రెండు సమస్యలు' అనే పుస్తకం ప్రచురింపబడ్డాయి. ఆనాటికి ఆయనకు కొంత ప్రజానురంజకత్వం అబ్బింది. అనేకమంది పాఠకులూ రచయితలూ ఆయనపట్ల సాను భూతిని చూపటం మొదలుపెట్టారు. ఈ సహృదయత ఫలి తంగా ఆయన 1851 లో రెండు వ్యాససంపుటాలను ప్రచు రించాడు. క్రమ క్రమేణా ఆయన పలుకుబడి హెచ్చింది. ఇలా పలుకుబడి హెచ్చటానికి ఆనాటి ష్లీర్ మాఖర్. ఫిఛే, షెల్లింగ్, హెగెల్ మొదలైన ప్రముఖ తత్వవేత్తలపై పాఠకులకు వున్న మమకారం తగ్గటం ఒక కారణంకావచ్చు. మొత్తానికి ఏ కారణంవల్ల నయితేనేం, ఆయనకు శిష్యులు ఏర్పడటం ప్రారంభం అయింది. మొదట్లో సామాన్యులూ, పిదప పండితులూ ఆయనను ప్రశంసించటం మొదలు పెట్టారు.

౫

ఏ తత్వవేత్త తత్వశాస్త్రంలో నయినా లోట్లు చూపటం తేలికే. అదేవిధంగా షోపనార్ తత్వశాస్త్రంలో కూడా లోట్లు చూపవచ్చు. కాని ఆయన తత్వశాస్త్రంలో మంచిబలం, ఆకర్షణ వున్నవనేసంగతి ఎవ్వరూ మరచిపోకూడదు. ఆయనను గురించి వ్రాస్తూ కెల్లీరైట్ 'ఆయన వ్రాసిన దాంట్లో అసత్యం అనేది తరచుగా కనపడదు' అన్నాడు. అసంపూర్ణత వుండవచ్చు. అది ఎవ్వరిలోనైనా ఉండేదే. "ఈనాటికీ షోపనార్ ఆలోచనలను రేపే తత్వవేత్తగా వున్నాడు. ఒకవేళ ఆయన ఎప్పుడైనా పొరబడినా, ఆ పొరపాటును సరిదిద్దటాని గాఢమైన ఆలోచన కావలసి వస్తుంది. దానివల్ల బుద్ధికిపదును కలుగుతుంది. ఆయనపూర్తి అసత్యాన్ని ఎప్పుడూ పలకలేదు. ఆయన చెప్పిందాంట్లో ఎంతో కొంత సత్యం ఎప్పుడూ వుంటునే వుంటుంది. ఆయన నిరాశావాదం కూడా తేలికగా కొట్టి వేయవలసిన సిద్ధాతం కాదు. నిశితంగా ఆలోచించ వలసిన సిద్ధాతం. తత్వశాస్త్రాభ్యాసకులందరూ, త్రీవంగా విచారించ వలసిన స్థితిలో వుంది ఆయన నిరాశావాదం," అన్నాడు కెల్లీరైట్ తాను వ్రాసిన నవ్య తత్వచరిత్రలో షోపనార్‌మీద వ్రాసిన వ్యాసాన్ని ముగిస్తూ.

షోపనార్ నిర్వహించిన పాత్రను విల్‌డురాన్టు ఇలా వర్ణించాడు. "ఆయన తత్వశాస్త్రంలో మోమోటమి, ఎరగని నిజాయితీవుంది. దానిముందు ఆశావాదాలు అనేకం,

క్రుత్రిమ సిద్ధాంతాలుగానూ, మోసంతో కూడుకున్నవిగానూ కనుపిస్తవి. షోపనార్, ఇన్స్టింక్ట్ యొక్క బలాన్ని పదిమందికీ తేలిసేటట్లు చేశాడు. ఆయన మన రహస్య హృదయాలను మనకే విప్పిచూపాడు. మన కోర్కెలే మన తత్వశాస్త్రాలకు మూలాధారాలన్నాడు. ఈవిధంగా విమర్శించి ఆలోచనను సరిగ్గా అర్థంచేసుకోటానికి సహాయం చేశాడు." డురాన్టు ఇలా ముగించాడు.

"చివరికి, ఉత్ప్రేక్షలు అనేవివున్నా, జీనియస్ యొక్క అవుసరాన్నీ, కళలయొక్క విలువలనూ, షోపనార్ పునరుద్ఘాటించాడు. చివరికి మంచిఅనేది సౌందర్యమేననీ, చివరికి ఆనందం అనేది, సౌందర్యాన్ని స్ృష్టించటంలోనే వుంటుందనీ ఆయన నిర్వచించించాడు. హెగెల్ మార్క్స్, బకిల్ మొదలయిన తత్వవేత్తలు మానవ చరిత్రలో జీనియస్‌కి స్థానం లేకుండా చెయ్యటానికై ప్రయత్నించారు. కార్లయిల్, గొతేవంటి వారితో కలిసి, షోపనార్ వారి ప్రయత్నాన్ని నిరసించాడు. ప్రముఖులు నిష్క్రమించిన ఈ యుగంలో వీరులను పూజించటం అనేది ప్రచారం చేశాడు. ఎన్నిపొరపాటులు వున్నప్పటికీ చరిత్రలో వారితో పాటు ప్రముఖస్థానాన్ని సంపాదించుకున్నాడు. షోపనార్ కూడా."

— ... —

# 'వైయక్తిక తత్వవేత్త'
# నికొలస్ బర్డ్యావ్

బెర్గ్సన్, షోపనార్ కీవలెనే మానవునికి స్వాతంత్ర్యం లేని పరిస్థితిని తెచ్చిపెట్టే తత్వశాస్త్రాలను అనేకులు ఎదుర్కొని మానవునికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చే రకరకాల తత్వశాస్త్రాలన్ను సమర్థించారు. అందులో నికొలస్ బరడ్యావ్ ఒకడు.

నికొలస్ బర్డ్యావ్ జన్మచేత రష్యాదేశానికి చెందినవాడైనా రష్యానుంచి వెళ్ళగొట్టబడి, ఎక్కువ కాలం పారిస్‌లోవుండి తత్వశాస్త్రంలో కృషిచేశాడు. ఆయనకు మానవుల్లో వున్న సృజనాత్మకశక్తి ముఖ్యం. ఆ శక్తిని అజలోకి తీసుకోని, ఆ శక్తి బహిర్గతం అవటానికి అవకాశం ఇవ్వని, ఏ సిద్ధాంతానికైనా ఆయన వ్యతిరేకుడే. ఆయనను గురించి, ఆయన చేసిన సేవయొక్క ప్రత్యేకతను గురించి 'తత్వశాస్త్రం' అనే గ్రంథంలో శ్రీ జె. వి. యల్. కేసర్లే ఇలా వ్రాశాడు. "ఆయన ఆలోచన, రష్యాదేశంయొక్క క్రైస్తవిసిజానికీ, పాశ్చాత్యదేశాల తాత్వికసృష్టికీ మధ్యన సమన్వయపరిచేదిగావుండేది. ఈ రెంటినీ కలిపేదిగా వుండేదని చెప్పుకోవచ్చు. సైన్సులోనూ, తత్వశాస్త్రంలోనూ కూడా పాశ్చాత్యులు ముగిసిన ప్రపంచానికి అర్థం చెపుతున్నట్లు ప్రవర్తించడం ఆయన నిశితంగా విమర్శించేవాడు. అంతకుముందే

వొక సిద్ధాంతం తయారయివుంటే ఇక దానిని అనుసరించటం కంటే మానవునికి గత్యంతరం ఏమున్నది ? ఈ ప్రపంచం ముగింపబడి వున్నది అనుకున్నా మానవుని స్థితి అభాసే అవుతుంది. అందుకని ఆ దృష్టిని ఏ మాత్రం సహించేవాడు కాదు బెర్డ్యావ్.

పాశ్చాత్యులు పేర్కొన్న నైతిక విలువలనుకూడా బర్డ్యావ్ ఇదేవిధంగా విమర్శించేవాడు. కేన్టులాంటి తత్వవేత్తలు కొన్ని నైతికనియమాలకు అనుగుణంగా బ్రతకటం మంచి జీవితం యొక్క లక్షణంఅని బోధించారు. ప్రయోజన వాదులు కొన్ని నిశ్చితమైన ఆదర్శాలను పెట్టుకొని వాటిని అనుసరించటం మానవుని ఆదర్శం కావాలని ప్రచారం చేశారు. కాని ఎవరూ 'మంచి జీవితం' అనేది సృజనాత్మక శక్తిని పెంపొందిచుకోవటం అని గానీ, దానికి ఏదో ఒక రూపంలో సంబంధించి వుండేదని గానీ చెప్పలేదు. ఇది శోచనీయంఅని బెర్డ్యావ్ ఉద్దేశం. పాశ్చాత్యులు వాస్తవికత్వం కంటే నిశ్చితమైన భావాలను ప్రతిపాదించి పొరపాటు చేశారని ఆయన విమర్శించేవాడు.

౨

నికొలస్ బర్డ్యావ్ 1874 వ సంవత్సరంలో ఒక సైనిక కుటుంబంలో జన్మించాడు. ఒక సైనిక విద్యాలయంలో ప్రయిమరీ విద్య నభ్యసించాడు. కళాశాలలో ప్రవేశించగానే, సోషలిస్టు సంఘంలో పనిచేస్తున్నాడనే

నెపంతో, దేశంనుంచి బహిష్కృతు డయ్యాడు. దీనివలన ఆయన ఉన్నత విద్యాభ్యాసం కుంటుపడింది. కాని ఆయన విద్యారంగంలో చెయ్యదలచిన కృషికేమీ అంతరాయం కలుగలేదు. నైతిక ఇతివృత్తాలంటే ఆయనకు ఎక్కువ ఇష్టంగా వుండేవి. అయినప్పటికీ ఆయన కృషి బహుముఖాత్మకమైంది. ఆయనను గురించి జెంకోవిస్కీ, రష్యా తత్వశాస్త్రం చరిత్రలో ఇలా సమీక్షించాడు.

"బెర్డ్యావ్ తాత్వికచింత మార్క్సిజంతో ప్రారంభమయింది. కాని త్వరలోనే మార్క్సిజాన్ని గురించి పునరాలోచించవలసిన అవసరం ఆయనకు కలిగింది. మిగిలిన కొంతమంది రష్యన్ మార్క్సిస్టులవలెనే ఆయనకూడా భావవాదాన్ని చేపట్టాడు. అయితే కొంతకాలం వరకూ ఈ భావవాదానికి మార్క్సిజంయొక్క సాంఘిక కార్యక్రమాన్ని జోడించి నడిపాడు. తరువాత మెర్జ్కోవిస్కీ పలుకుబడితో భావవాదాన్నుంచి మతసిద్ధాంతంలోకి అడుగుపెట్టాడు. 1916 లో ఆయన 'సృజనశక్తి అర్థం' అనే గ్రంథం మాస్కోలో ప్రచురించాడు. ఈ గ్రంథ ప్రచురణతో ఆయనలో మరొకమార్పు ప్రస్ఫుటం అయింది. ఆ మార్పు మత సిద్ధాంతంలోవున్న స్వాభావికతను వదలి, మిస్టిసిజాన్ని అనుసరించటంలో వచ్చిన మార్పు. 1918-22 మధ్య, అంటే రష్యావిప్లవం జరిగే రోజుల్లో ఆయన 'అసమాన తత్వశాస్త్రం' అనే గ్రంథం ప్రచురించాడు. ఈ గ్రంథం సోవియట్ సిద్ధాంతానికి వ్యతిరేకమైన భావాలు గలది. ఈ గ్రంథం బెర్లిన్‌లో ప్రచురించబడింది. 1922 వ సంవత్సరంలో

బెర్డ్యావ్ మొదలైన భావతాత్వికులు రష్యానుంచి బహిష్కరించబడ్డారు. అప్పుడాయన బెర్లిన్‌లో మకాంపెట్టి, అక్కడ మతతాత్విక సంస్థనొకదాన్ని స్థాపించి, దాని అభివృద్ధికై కృషి చేశాడు. 1925 లో ఈ సంస్థ పారిస్‌కి మార్చబడింది. అప్పటినుంచీ పారిస్‌లోనే కాలం గడిపాడు బెర్డ్యావ్. ఆయన ముఖ్యగ్రంధాలన్నీ అక్కడే ప్రచురించబడినై.

బర్డ్యావ్ రచనా స్వభావాన్ని గురించి జెంకోవిస్కీ ఈ అభిప్రాయం వెలిబుచ్చాడు — "రాజకీయ సాంఘిక రచనలు చెయ్యాలనే కుతూహలం బెర్డ్యావ్‌లో ఎక్కువగా కనుపిస్తుంది. ఆయన ప్రఖ్యాతి ప్రపంచం అంతా వ్యాపించటానికి ఇదొక కారణం అని నేను అనుకుంటాను. అయితే పెద్దపెద్ద జీవిత సమస్యలను ఎదుర్కొనే గుణం, తాత్విక దృష్టి ఆయనకు ఎప్పుడూ వుంటూనే వుండేవి. ఈ లక్షణాలు భవిష్యత్తునుగురించి ఆయన చేసే నిర్వచనంతో, బోధనలతో జోడింపబడి వుండేవి. బెర్డ్యావ్‌కి బోధించే స్వభావం ఎక్కువ. విమర్శించటం, అంగీకరింప జెయ్యాలనే కోర్కె ఆయనలో ఎక్కువ. ఆయనలో నైతిక ప్రచార దృష్టి ఎక్కువ."

ఆయన సమన్వయశక్తి అద్భుతమైంది. ఎంతమంది మేధావుల ప్రభావాలనో ఆయన సమన్వయం చేసుకొని జీర్ణించుకోగలిగాడు. రష్యాలో సోలొయొవ్, నెస్‌మెలొవ్; రొజొనొవ్, మెరెజ్‌కోవిస్కీ మొదలైనవారూ; పాశ్చాత్య దేశాల్లో, షోపనార్, నీషే, బోహమే మొదలైనవారూ

ఇందులో కొందరు. బెర్డ్యావ్ మొదటినుంచీ అంత్యం వరకూ ఊహాప్రియుడే — కల్పనాశక్తికి దోసిలి ఒగ్గిన వాడే. ఈ లక్షణం ఆయన తత్వశాస్త్రంలో కనుపిస్తుంది. ఆయన తత్వశాస్త్రంలో దీనితోపాటు స్వాభావిక తత్వ శాస్త్రం యొక్క ఛాయలుకూడా కనుపిస్తూనే వుంటాయి. ఇన్ని ప్రభావాలు ఆయనమీద వున్నప్పటికీ ఆయన అన్వేషణ ఆయన అన్వేషణే. ఆయనకు తన మార్గమే తనకు గొప్పది కూడా. ఆయన సత్యాన్ని తనలోనే వెతుక్కున్న విశిష్ట మార్గానువర్తి. అందువల్ల ఆయన అనుభవాలు ఆయనవి. ఆయన ఆవేశాలు ఆయనవి. ఆయన విలువలు ఆయనవి. ప్రతి సమస్యనూ ఆయన వైయుక్తికంగాతప్ప, వేరువిధంగా చూసేవాడుకాదు. తన సొంత దృష్టితోనే ప్రతిదాన్నీ కొలిచేవాడు. తన్ను అధిగమించి వెళ్ళేవాడుకాదు. ఈ విధానానికి దానికి వుండే ప్రయోజనం దానికి వున్నా, కొన్ని అవధులుకూడా వున్నాయి. సృజనాత్మక శక్తి అనేది ప్రతివ్యక్తిలోనూ ఉంటుందనీ, అది వ్యక్తికీ, వ్యక్తికీ మారుతూ తుంటుందనీ భావించటమే బెర్డ్యావ్ తాత్విక దృష్టికి మూలాధారం. ఈ దృష్టికి అనుకూలంగా ఎప్పటి కప్పుడు నూతన అనుభవాలను తెచ్చుకుంటూ, నూతన అనుభూతులను పొందుతూ, వాటికి అందమైన రూపాలనిస్తూ 1948 లో కాలధర్మం చెందాడు బర్డ్యావ్.

## 3

పాశ్చాత్యులు బరడ్యావ్‌ని సాంప్రదాయ సిద్ధుడైన తత్వవేత్తగా పరిగణిస్తారు. ఇది కొంతవరకు మాత్రమే నిజం. సాంప్రదాయ సిద్ధమైన తత్వశాస్త్రాలను ఆయన జీర్ణించుకున్న మాట నిజమే. కాని బోహమే, బాడర్, షెల్లింగ్ మొదలైన తత్వవేత్తల సిద్ధాంతాలనుకూడా ఉదహరించ గలిగిన విశాలత్వం ఆయనకు వుంది. అవుసర మైనప్పుడు సాంప్రదాయాలకు వ్యతిరేకంగా ఆలోచించి, నవ్యమార్గాలను అనుసరించటానికి ఆయన ఏమాత్రం వెనుకంజ వేసేవాడు కాదు. అందుకనే క్రైస్తవ మతంలో శాశ్వతంగా వుండేదాన్నీ, ప్రపంచం అంతటికీ వర్తించేదాన్నీ సమర్థిస్తున్నానని ఆయన తన్నుగూర్చి భావించటానికి అవకాశం ఏర్పడింది. బెర్డ్యావ్ సిద్ధాంతాన్ని అర్థం చేసుకోదలచినప్పుడు మనం మరొకసంగతి కూడా గుర్తుంచుకోవాలి. 'ఉనికికన్నా స్వాతంత్ర్యం ముఖ్యమ'ని ఆయన అంగీకరించాడంటే, సిద్ధాంత నిర్మాణంలో కూడా ఆయన 'విముక్తి'ని అనుభవించే స్థితికి వచ్చాడని మనం గ్రహించాలి. ఈ విముక్తిని అనుభవించబట్టే, ఆయన భావాలను నాలుగు మూలలూ నిర్ణయించబడిన వొక సిద్ధాంతంలో ఇమడ్చటం అలవికానిపని అవుతూవుంది. అందుకనే కొంతమంది ఆయనను, నిత్యనూతన మార్గాలను అనుసరించే పథికునిగా భావిస్తారు. ఈ కారణంవల్ల ఆయన సిద్ధాంతాన్ని తెలుసుకోవటానికి ఆయన ముఖ్యాలోచనలను తెలుసుకొనటంకంటే

వేరు మార్గం లేదు. ఈ సందర్భంలో జెంకోవిస్కీ వెలి బుచ్చిన అభిప్రాయాలు గమనించ దగ్గవి. ఆయన ఇలా అన్నాడు. "బెర్డ్యావ్ తాత్విక భావాలను సిద్ధాంతీకరించి చెప్పటం కష్టం. వాటిల్లో వైరుధ్యా లున్నాయనీగాదు; తాత్విక సిద్ధాంతాలకు ఆయన వ్యతిరేకి అవటమూ కాదు; దీనికి కారణం. దీనికి కారణం ఆయన ఆలోచనా విధానం లోనే వుంది. ఆయనే అంగీకరించినట్లు, ఆయన తుంపులు తుంపులుగా ఆలోచించేవాడు. ఆయన వొక్కొక్క పుస్తకం ఒక్కొక్క భావానికి సంబంధించి వుంటుంది. ఆ భావమే ఏరుకోటానికి ప్రత్యేక కారణం ఏదన్నా వుంటుందా అంటే ఈ విధంగా పెట్టిన భావాన్ని ఆధారంగా తీసుకొని, ఆయన అనేక తాత్విక సిద్ధాంతాల విమర్శకు పూనుకుంటాడు. ఆయన ముఖ్య గ్రంథాలైన 'సృజనశక్తి అర్థం' 'దాస్యం విముక్తి' 'మానవుని విధి' ఈ పద్ధతిన వ్రాయబడినవే. ఈ పుస్తకాలలో ఆయన వొక సిద్ధాంతాన్ని సృష్టించటానికి ప్రయత్నించాడనుకునే భ్రమ ఎవ్వరికీ వుండవలసిన అవసరం లేదు. వొక గ్రంథానికి చెందిన వొక భావాన్ని వర్ణించే టప్పుడుకూడా ఏదోవొక సందర్భంలో, మామూలుదృష్టితో ఊహించలేని భాగం వొకటి అద్భుతగలటంకూడా కద్దు, ఆయన రచనల్లో. దానికీ అంతకుముందు ఆయన అనుస రిస్తున్న ఆలోచనా సూత్రానికీ సంబంధం వున్నట్లుకూడా కనుపించదు స్థూలదృష్టికి."

కాబట్టి ఆయన వెలిబుచ్చిన భావ పరంపరలోని సూత్రంకోసం వెతకటం వ్యర్థం అవుతుంది. ఆయన వెలి

బుచ్చిన భావాలను విడివిడిగా తెలుసుకోవటం మంచిది. దానికి ఆయన భావాలను నాలుగు రకాలుగా విభజించవచ్చు. ఆ తీరున పరిశీలిద్దాం.

నైతిక విలువలు:

బర్డ్యావ్ ఈ ప్రపంచాన్ని గురించీ, మతాన్ని గురించీ అనేక అభిప్రాయాలను వెలిబుచ్చినా, ముఖ్యంగా ఆయనను నీతి శాస్త్రవేత్తగా మనం పరిగణించవచ్చు. ఆ నైతికరంగంలో కూడా ఒక శాస్త్రకారుడుగా ఆయన మాట్లాడడు. ఆయన రచనలలో 'కల్పన'కు పాలు ఎక్కువ. ఆయన నిర్వచించిన నైతిక విలువలు ఎటువంటివి ? వాటికి ఆధారం ఏమిటి ? అనే ప్రశ్నలకు ఆయన ప్రత్యుత్తరాలు ఇవి:-

తన్నుతాను వ్యక్తపరుచుకోవటం, ప్రత్యేకపరచుకోవటం, ఇతరులనుంచి, వేరు పరచుకోవటం బర్డ్యావ్ భావనకు ఆధారం అనేది స్పష్టంగా కనుపిస్తుంది. అందుకనే జనంలో ఇంకిపోయిన అన్నిరూపాలమీాదా ఆయన విప్లవం చేశాడు. అందుకనే ఆయన 'జీవితం అంతా నేను విప్లవకారుణ్ణే' అని అనగలిగాడు. భావాల సంఘర్షణ సంభవించినప్పుడు, తన ఆవేశాలనే అనుసరించేవాడు బర్డ్యావ్. మిగిలిన ఆలోచనలన్నీ ఈ ఆవేశాల మార్గాలను అనుసరించేవి. అంటే బర్డ్యావ్‌కి, తన అనుభవం, తనఆలోచనా ముఖ్యం. వాటిని తేల్చుకున్న మరుక్షణం మిగిలినవన్నీ వాటిని అనుసరిస్తాయి.

తాను ప్రచారం చేసిన నైతిక విలువలను ఆయన వాళ్ళసారిగా కనిపెట్టలేదు. క్రమక్రమేణా ఆయన ఆ స్థితికి వచ్చాడు. ప్రథమ గ్రంథంలో నైతిక చైతన్యంయొక్క అంతర్గత స్వాతంత్ర్యాన్ని ఆయన పూర్తిగా గ్రహించలేదు. అందువల్ల ఆదర్శానికి శాస్త్రం అంగీకారం కావాలన్నాడు. మానవుని ఆదర్శంపట్ల, అవసరం సానుభూతిని చూపినప్పుడు, స్వాతంత్ర్యం బహిర్గతం అవుతుందని ఆయన చెప్పాడు. 'కనిపెట్టబడిన అవుసరం, స్వాతంత్రతం' అనే మార్క్సు భావాన్ని ఆ రోజుల్లో ఆయన అంగీకరించాడు. కాని సంవత్సరంలోనే ఆయన అభిప్రాయం మార్పుకు గురి అయింది. ఒక వ్యాసంలో ఆయన నైతికనియమం యొక్క శాశ్వత తత్వాన్నీ, పరిపూర్ణతనూ సమర్థించాడు. 'ఈ నైతిక నియమం ప్రపంచంనుంచి పుట్టిందికాదు. ప్రపంచానికి ఇవ్వబడింది' అన్నట్లు నిర్వచించాడు. 'మానవుని స్వాతంత్ర్యం అవుసరానికి సంబంధించింది కాదు. నైతిక నియమం స్వాతంత్ర్య రంగానికి సంబంధంచిందిగాని అవుసర రంగానికి కాదు' అన్నాడు. ఈ భావాలన్నీ భావవాదానికి దారితీసేవే. కాని ఈ రోజుల్లోకూడా నూతనభావాలు ఛాయలు ఆయనలో కనిపిస్తూనే వుండేవి. అప్పుడే " 'నీవు' అనే కల్పనను నిర్మూలించవలసిన తరుణం వొచ్చిందనీ, మానవునికీ మానవునికీ వున్న సంబంధం, ఎవ్వరికి వారికి సంబంధంనుంచి వుత్పన్నమైనదే" అని వ్రాశాడు ... అంటే ఆయన అనుసరించదలచిన నూతనమార్గం పునాది ఈ కాలంలోనే వెయ్యబడ్డదని మనం నిర్ధారణ చేసుకోవచ్చు.

'సృజనశక్తి అర్థం' అనే పుస్తకంలో బర్డ్యావ్ ఊహించిన నైతిక చైతన్యం యొక్క మరొక నూతన అంతస్థు వర్ణించబడింది. ఈకాలంలో ఆయన దృష్టిలో ప్రవేశించిన 'ద్వంద్వం' ఆయన్ను చివరవరకూ వెన్నాడుతూనే, వుంది రూపభేదాలతో. "ఈ ప్రపంచం పాప పంకిలమైంది. దీనిని మనం విడచిపెట్టాలి. ఈ ప్రపంచాన్నుంచి విముక్తి పొందాలనే ఆవేశమే ఈ పుస్తకరచనకు కారణం" అని ఆయనే తన ఆదర్శాన్ని నిర్వచించుకున్నాడు. దీనిని బట్టి సృజనశక్తి విజృంభణకు నైతికరంగం అవసరమని ఆయన భావిస్తున్నట్లు స్పష్టపడింది. ఈ 'ద్వంద్వ'ము ఆయన్ని విడిచిపెట్టలేదు. ఇదికాక ఈ పుస్తకం మానవుణ్ణి అనేకవిధాల ప్రశంసించింది 'మానవుని శాశ్వత చైతన్యం ఈ సూర్యగోళానికేకాక, మొత్తం విశ్వానికంతటికీ మానవుడే పునాది అని చెపుతుంది' అని వ్రాశాడు. "మానవుని ఆదర్శము విముక్తికాదు; సృష్టించడం" అన్నాడు. "పూర్వపు మతాలు మానవుణ్ణి ఈ విధంగా పరిగణించేవి కాదు. ఈ విధంగా మానవుణ్ణి పరిగణించటంవల్ల, ఒక క్రొత్త మతైక చైతన్యం ఉద్భవించటానికి అవకాశం కలుగుతూ వుంది-తద్వారా తనశకం వొకటి ఆరంభం అవుతూవుంది" అని ఆయన ఆశించాడు.

ఇటువంటి తత్వవేత్త, భగవంతుణ్ణి సృష్టించిన సిద్ధాంతాలు మానవ దాస్యాన్ని బోధించాయనీ, ఆ స్థితి మానవుడు దిగజారరాదనీ బోధించాడంటే ఆశ్చర్యం ఏముంది ? ఆయనకు మానవుడే పునాది. మానవుని సృజ

నాత్మకశక్తే ఈ రూపాలకూ, ఈ లీలకూ కారణం. 'సంఘంలో యజమానికీ సేవకునికీ వున్న సంబంధం, తాత్విక రంగంలో భగవంతునికీ భక్తునికీ ఆపాదించబడింది' అని ఈ ధోరణికి తన నిరసనను తెలిపాడు. మానవునిపట్లా, అతనికున్న స్వాతంత్ర్యం పట్లా, పెద్ద కుట్ర జరుగు తున్నట్లుగా భావించి దానిని ఎదుర్కోవటానికి నడుంకట్టాడు బెర్డ్యావ్.

మత సిద్ధాంతాలు :

నైతిక విలువలలో కనుపించిన పరిణామమే, బర్డ్యావ్ యొక్క మత సిద్ధాంతాలలోనూ కనుపిస్తుంది. మొదట్లో ఆయనకు మతంలో విశ్వాసమే ఉండేదికాదు. ఆయన ప్రారంభవిద్య ఇందుకు ఏ విధంగానూ సహాయపడిన విద్యకాదు. ఆయన సైనిక కుటుంబానికి చెందినవాడని ఇది వరకే తెలుసుకున్నాం గనక ఆయన చిన్నతనం ఇటువంటి అభిప్రాయాలను ప్రోత్సహించేదికాదని మనం గ్రహించవచ్చు. ఆయన్ని మొదట కదిలించింది బైబిలుకాదు; షోపనార్ తత్వశాస్త్రం. తరువాత, మార్క్సిజాన్ని పూర్తిగావిడనాడిన తరువాత, చర్చి ఆయనను ఆకర్షించింది. కాని ఆ చర్చి ఎటువంటిది ? మత పరమైన నూతన చైతన్యంతో తొణికిస లాడేది. చారిత్రక క్రైస్తవమతమంటే ఆయనకుగిట్టేదికాదు. ప్రపంచ చరిత్రకు సంబంధించిన నూతన యుగం ప్రారంభ మైనదనే నెపంతో, చారిత్రక క్రైస్తవ మతాన్ని ఆయన త్రోసిపుచ్చాడు. బెర్డ్యావ్ని ఆకర్షించిన ఈ నూతన

వెలుగులు అతిసుందరమైనవి. ఇందులో కాలాకాశాలకు తావు లేదు. ఇందులో అలౌకికమైన, కాలాతీతమైన 'భూమి' వుంటుంది... అన్నీ పవిత్రతకూ, పుణ్యాదృష్టికీ ముడివడి వుంటై. ఈ విధంగా వొక విప్లవం ప్రారంభమయిందని ఆయన ఉద్బోధించాడు. ఈ విప్లవంవల్ల, "మతానికి సంబంధించిన నూతన సూత్రంవొకటి ప్రపంచంలోకి అడుగు పెడుతూ వుంది. ఉనికినిమార్చే నూతన భావవీచికలు వీవ నారంభించినై" అని ఆయన భావించాడు.

'విముక్తి తత్వం' అనే పుస్తకంలో మతంలేకుండా తత్వశాస్త్రం మనలేదని ఆయన ఉద్ఘాటించాడు. మత జీవితానికి అంగంగాఉండి తత్వశాస్త్రం పని చెయ్యాలని సిద్ధాంతీకరించాడు. ఈ రోజుల్లో చర్చి విశ్వాత్మఅనీ, జ్ఞానం ఒకరమైన నమ్మకమనీ ఆయన ప్రచారం చేశాడు.

తరువాత ఆయనలో మరొక మార్పువచ్చింది. ఈ మార్పు ఫలితమే 'సృజనశక్తి అర్థం' అనే పుస్తక ప్రచురణ. ప్రపంచం పాపపంకిలమైందనే భావం ఈ కాలంలోనే ఆయన మనస్సును వశపరచుకుంది. దానినుంచి తప్పించుకోవటం కంటే మంచిపని లేదనే అభిప్రాయం దాని పర్యవసానంగా వచ్చిందే! ఈభావాలు 'విముక్తి ఆత్మ' అనే పుస్తకంలో పరాకాష్టనందుకున్నాయి. ఆయనకు మతకర్తగా వుండాలనే అభిలాష లేదు. మతవిషయాలలోకూడా తాత్వికదృష్టినే వెలిబుచ్చేవాడు. ఈకాలానికి చెందిన బర్డ్యావ్ మానసిక ప్రవృత్తిని జెంకోవిస్కీ ఇలా వర్ణించాడు, "భగ

వంతుడు ఉన్నాడనే సిద్ధాంతంలో వున్న 'స్వాభావికత'కు ఆయన భయపడేవాడు. చలనంలేని స్వరూపంగలిగిన భగవంతుడు అంటే ఆయనకు ఏమాత్రం గిట్టేదికాదు. అందులో దివ్యత్వంలోవున్న మర్మంలేదు. ఏఖ్హార్ట్‌కివలె ఆయన దివ్యత్వం పుట్టుకను వొక పరిణామంగా భావించేవాడు..." అయితే ఈ భావాలను లోతుకుదిగి తెలుసుకోవలసిన అవుసరం ఇక్కడ మనకు ఆట్టేలేదు. ఈ సందర్భంలో మనం తెలుసుకోవలసిందల్లా, బర్డ్యావ్ భావాలు క్రమక్రమేణా భగవంతు డనే భావాన్నిసడలించి మానవుని ప్రాముఖ్యతకు ప్రాధాన్యత ఇచ్చాయనే! "బర్డ్యావ్ ఎప్పుడూ ఉనికికంటే, ఆత్మ ముందు అని ఘంటాపథంగా చెప్పేవాడు. ఇది మానవులపట్ల మరీ ముఖ్యం అనేవాడు. ఎందుకంటే మానవ స్వాతంత్ర్యం వొకరు సృష్టించింది కాదు...... స్వాభావికతను అంగీకరిస్తే వస్తువుకు వున్నగుణాలను భగవంతునికి ఆపాదించవలసి వస్తుంది. ఈ భయంతో బర్డ్యావ్ ఈ ప్రపంచాన్ని వొక గుర్తుగా పరిగణించాడు. అంతేకాదు. ఉనికికి వర్తించే రకాలు 'ఆధ్యాత్మిక క్షేత్రానికి' వర్తించవనిచెప్పి, క్షేత్రవిభజనచేశాడు. ఈ ప్రపంచం అధోగతిలో వుందనిచెప్పి, దీనిపట్ల ఏహ్యాభావాన్ని కల్పించుకున్నాడు" ఇలా కల్పించుకొని దీనివల్ల పదార్థ ప్రభావాన్నుంచి విముక్తిని ప్రసాదించే వొక నూతన ఆధ్యాత్మిక తత్వంకావాలని కాంక్షించాడు.

### చారిత్రక శృంఖలాలు :

మిగిలిన విషయాల్లో జరిగినట్లుగానే ఇందులో కూడా బర్డ్యావ్ భావాలు పరిణామం చెందుతూ వచ్చాయి. మొదట ఆయన అనుసరించిన మార్క్సిజం చారిత్ర దృష్టి తోనూ, శాస్త్రఅంగీకారాలతోనూ, నిండివున్నదే కాని బర్డ్యావ్ త్వరలోనే ఈ స్థితిని అధిగమించి వాస్తవికతయొక్క అహేతుకత్వాన్ని అంగీకరించి ప్రచారంచేసేస్థితికి వచ్చాడు. దీనికి అనుగుణంగా చారిత్రక వ్యాఖ్యానాలు తిరగవ్రాయ బడినవి. "చరిత్ర, పరతత్వంయొక్క అంతర్గోళాలలో ప్రారంభం అయివుండాలి. చరిత్రయొక్క స్వాతంత్ర్యం, చరిత్రకు పునాదిగా వుండివుండాలి" చరిత్రయొక్క అహేతుకత్వాన్ని గురించి ఆయన, 'అసమానత్వంయొక్క తత్వ శాస్త్రం' అనే గ్రంథంలో వ్రాశాడు. మొదట్లో ఆయన అలౌకిక వాస్తవికత్వానికీ లౌకిక వాస్తవికత్వానికీ సంబంధం వున్నదని భావించాడు. కనుక మానవుని విధి, లౌకికమూ అలౌకికమూ రెండూ అనుకున్నాడు. 'అది చారిత్రాత్మకమే కాదు, తాత్వికంకూడా' అని నిర్వచించాడు.

ఈ రోజుల్లో బర్డ్యావ్ కాలాన్ని రెండుగా విభజించాడు. నిజమని మనం భావించేకాలాన్ని ఆయన అబద్ధమైన కాలంగా పరిగణించాడు. ఇక రెండవరకం కాలాన్ని ఆయన 'అగాధకాలం' అన్నాడు. ఇలా విభాగించాడేగాని ఈ రెండూ వేరువేరు అనుకునే స్థితికి ఆయన అప్పటికి రాలేదు. కాని ఈ విషమపరిస్థితినుంచి ఆయన ఎక్కువ

కాలం తప్పుకు తిరగలేక పోయాడు. దీనికి వాస్తవికత్వం అంటే ఆయనకున్న ఏహ్యాభావం, ఈ ప్రపంచం అనేది ముగిసివున్నదనే దానికి వ్యతిరేకత ప్రాముఖ్యత వహించాయి. అప్పుడాయన 'ఆత్మయొక్క పతనమే చరిత్ర' అని వ్యాఖ్యానించాడు. "భగవంతుని రాజ్యం ఇక్కడ స్థాపించబడనూ లేదు, ఇక్కడ ప్రతిబింబించనూ లేదు" అని ఉద్ఘాటించాడు. ఆయనకు ఈ ప్రవృత్తి వచ్చేటప్పటికి లౌకిక అలౌకిక ప్రపంచాలు రెండుముక్కలక్రింద తెగిపోయి విడివడ్డాయి. "అయితే అలౌకిక ప్రపంచం, అప్పుడప్పుడూ లౌకిక ప్రపంచంమీదకు తన ప్రభావాన్ని ప్రసారంచేస్తూ వుంటుంది. ఈ ప్రసారంద్వారా తాత్విక చరిత్ర, చరిత్రలోకి చొచ్చుకు వెళ్తూవుంటుంది. క్రియలో, చరిత్రను తాత్విక చరిత్ర రద్దుచేస్తుంది. ప్రతి సృజనాత్మక చర్యా వాస్తవికతను నిర్మూలించటానికి సహాయపడుతుంది. లౌకిక ప్రపంచంలో భగవంతు డనేవాడు లేడుగనక, ప్రతి లౌకికస్థితీ, తాత్విక సూత్రం చరిత్రలో ప్రవేశించటంవల్ల నాశనం అవుతుంది గనక, సృజనశక్తియొక్క ఆదర్శం క్లుప్తంగా చెప్పాలంటే ఈ గమ్యస్థానం త్వరగా జేరుకునేటట్టు చెయ్యటం." ఈ విధంగా వాస్తవికత్వానికి విముఖత్వం చూపి, పెడమొహం పెట్టాడు బర్‌డ్యావ్. వాస్తవికత్వ వినాశనానికి ఆమోదం చూపాడు.

## వైయక్తిక తత్వం:

బర్‌డ్యావ్‌కి వ్యక్తియొక్క అనుభవం ముఖ్యం. ప్రపంచంలో ఏమి తెలుసుకోవాలన్నా ఏవ్యక్తికి ఆ వ్యక్తి

తన అనుభవాన్ని బట్టేగదా తెలుసుకోగలిగేది. తన అనుభవానికి వినా ఇంకేదో తెలియజెప్పేది వున్నదనుకోవటం పొరపాటు. అందుకనే 'నీవు' అనేదే భ్రమ అంటాడు బర్డ్యావ్. దీనివల్ల వ్యక్తికి ప్రాముఖ్యత వచ్చింది. వ్యక్తి ప్రయత్నానికి ప్రాధాన్యత వచ్చింది. వ్యక్తిలోవున్న సృజనాత్మక శక్తివల్ల వ్యక్తికి స్వతంత్రత వొచ్చింది. ఇంతవరకు బాగానేవుంది. కానివ్యక్తికి స్వతంత్రతవొచ్చేటప్పటి వ్యక్తికీ వ్యక్తికి వున్న సంబంధం కుంటుపడింది, బర్డ్యావ్ సిద్ధాంతంలో. ఈ సంగతి జెంకోవిస్కీ- రష్యా తత్వశాస్త్రి చరిత్రలో ఇలా చెప్పాడు. "ఆయన వైయక్తిక తత్వం మానవులను ప్రత్యక్షంగా విడగొడుతుంది-కలపదు. ఈ వ్యక్తిత్వం ఉనికినుంచి ఉద్భవించిందికాక, ఉనికిముందునుంచీ వున్నదని ఆయన చెవుతున్నాడు గనక, ఆయన సిద్ధాంతంలో ద్వంద్వం నిగూఢంగా వుందని అనుకోవలసి వస్తుంది... ఈ విధంగాచూస్తే ఆయన వైయక్తికవాదం ఆయనచుట్టూ ఒక వలయం సృష్టించింది. బయట ప్రపంచంతో సంబంధం త్రుంచివేసింద."

౪

బర్డ్యావ్‌కి నిగ్గుదేలిన సిద్ధాంతం అనేది లేదు. ఆయన ఆలోచనలకు అది సహజమే. తనకు వొక సిద్ధాంతం లేదని ఆయనే చెప్పాడు. "తాత్విక సిద్ధాంతాల నిర్మాణం నేను చేశాను అని గానీ, అటువంటి నిర్మాణం అవుసరం అని గానీ నేను అనుకోవటంలేదు" అన్నాడు. అందుకని

బర్‌డ్యావ్ ఏనాడూ ఒక సిద్ధాంతాన్ని నిర్మించటానికి కృషి చెయ్యలేదు. 'వాస్తవికత'లో ఆయనకు నమ్మకం లేక పోవటంవల్ల, ఆయనకు ఇది పొసిగే పని కూడా కాదు. బర్‌డ్యావ్ మానసిక జీవితం గాఢమైంది. ఆయన, తన అన్వేషణ కార్యక్రమంలో అనవరతం చిక్కుకొని వుండే వాడు అనుకోవటంలో ఉత్ప్రేక్ష ఏమీ లేదు. "ఈ స్థాయిలో ఆయన కంఠధ్వనిని ప్రపంచం అంతా గుర్తించింది. ఆయన ప్రపంచ ప్రాముఖ్యతను గడించాడు. నైతిక రంగంలో ఆయన రచనలు మంచి సిద్ధిని పొందినై. కాని ఎవ్వరి అనుభవ సారమే వారికి వాస్తవం అనీ వేరు వాస్తవికత అనేది లేదనీ భావించి ఊహించటంలో తన ప్రతిభకు తానే సంకెళ్ళు వేసుకున్నాడు బర్‌డ్యావ్ అని చెప్పుకోవలసి వస్తుంది. ఎందుకంటే ఈ ధోరణిలో ఎవ్వరి ఆవేశాలు, ఉద్రేకాలు వారికి వాస్తవమూ, సత్యమూ అవుతై. వాటి మీద ఊహించటం జరుగుతుంది. పునాదిలో వున్న కల్మషం ఊహల్లో ప్రతిబింబిస్తుంది. ఇది ఏమంత మంచిపని? కాకపోతే వ్యక్తిని వొక యంత్రం క్రింద జమకట్టి సిద్ధాంతాలను నిర్మించే ఈ రోజుల్లో, ఆయన పలుకుల్లో ఒక సందేశం వినవస్తుంది అనేది నిజం. "మనిషి ముఖ్యం, మనుష్యు లందర్నీ ఊక ఉమ్మడిగా జమకట్టి ఒక దేశం నెపంతోనో వర్గం నెపంతోనో, పార్టీ నెపంతోనో వారి వ్యక్తిత్వాన్ని అజలోకి తీసుకోకపోతే విషమ పరిస్థితులు ఉద్భవిస్తాయి," అనే హెచ్చరిక ఆయన ప్రతిపలుకూ నినదిస్తుంది. బెర్‌డ్యావ్ ఆలోచనల సారాం

శాన్ని ఈ విధంగా తేల్చి చెప్పాడు జెంకో విస్కీ. "బెర్డ్యావ్ రచనల్లో అత్యద్భుతమైన ఆకర్షణ వుంది. ఆయన భావాలను పరిశీలించినప్పుడుమాత్రం ఆ ఆకర్షణ విడిపోతుంది." ఆయన తాత్విక ప్రతిభ పైకి ఏవిధంగా కనుపించినా అంతర్గతంగా స్వతంత్రత కలిగింది కాదు. ఆయనలో వున్న అనేక ఆవేశాలకూ, అహేతుక ఉద్రేకాలకూ ఆ ప్రతిభ బానిసగా ప్రవర్తించిందే. ఆయనే మరొకచోట ఇలా అన్నాడు. "ఆయన తాత్విక ప్రతిభా, సూక్ష్మంగా ఆలోచించగలిగిన శక్తీ, శీఘ్రగ్రాహిత్వం, ఇవన్నీ ఆయనలో వున్న రకరకాల ఉద్రేకాలవల్ల బలహీన పడినాయి. వీని కంతకీ కల్పనాశక్తికి ఆయనమీదవున్న అప్రతిహతమైన పలుకుబడే కారణం."

ఈ శక్తి ఆయన్ని వాస్తవికత్వాన్ని నిరాకరించి, సొలిప్సిజాన్ని ఆశ్రయించేటట్టు చేసింది. ఆయన చేతుల్లో కల్పన నిజం అయింది; నిజం కల్పన అయింది.

—o—

# 'తార్కిక, నిశ్చితార్థ తత్వవేత్త'

# ఏ. జె. అయ్యర్

తత్వశాస్త్ర చరిత్రలో, నిర్మాణదృష్టి, విధ్వంసక దృష్టి ఒకదాని తరువాత ఒకటి ప్రాముఖ్యత వహిస్తూ వుండటం పరిపాటిగా కనుపిస్తుంది. అదేవిధంగా హెగెల్ తత్వశాస్త్రం రెమ్మ రెమ్మలుగా తాత్వికరంగాన్ని ఆక్ర మించుకొన్న పిదప, భావ జనితమైన సిద్ధాంతాల నన్నిటినీ తుడిచిపెట్టే రకరకాల తాత్విక దృష్టులు ప్రచారంలోకి వొచ్చినై. అందులో ఈ తార్కిక నిశ్చితార్థ తత్వవేత్త తత్వం ఒకటి. "వాస్తవిక వాదులైన హ్యూమ్, మాచ్, జేమ్స్ మొదలైనవారి తత్వశాస్త్రాలనూ, హెర్మహోజ్, పాయింకరె, ఐన్‌స్టీన్ మొదలైన శాస్త్రవేత్తల సిద్ధాంతాలనూ, సమన్వయంచేసే ప్రయత్నంలో ఈ తత్వశాస్త్రం ఉద్భవించిందని చెప్పుకోవచ్చు. అంతేకాదు; గణితశాస్త్రజ్ఞులూ, తార్కికులూ అయిన ఫ్రెగె, రసెల్, వైట్ హెడ్ వంటి మేధావుల యొక్క, మోర్, మొదలైన నవ్యవాస్తవిక వాదుల యొక్క, విట్‌గెన్‌స్టీన్‌వంటి భాషావేత్తల యొక్క ప్రభావంకూడా ఈ తత్వశాస్త్రంమీద కనిపిస్తుంది" అని ప్రాచ్యపాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో డి. యమ్. దత్తా ఉద్ఘాటించాడు.

ఈ తత్వశాస్త్రం 1928 వ సంవత్సరంలో, మోరిజ్ ష్లిక్ అనే ఆయన ఆధ్వర్యంక్రింద, వియన్నా సర్కిల్ అనే పేరున ప్రారంభించబడింది. ఈ సంస్థలో రుడాల్ఫ్ కార్నప్, బటోన్యూరాత్, హెచ్. ఫీగిల్, పి. ఫ్రాంక్, కె. గోడెల్ మొదలైన ప్రముఖులు సభ్యులుగా వుండేవారు. సైన్సు, గణితశాస్త్రం, తత్వశాస్త్రంవంటి రంగాలలో పనిచేసే మేధావులను కొంతమంది ఈ తాత్వికదృష్టి ఆకర్షించింది. పోలెండ్, జర్మనీలలో దీనితరహున సంస్థలు నెలకొల్పబడినై. అమెరికాలో సి. డబ్ల్యు. మోరిస్, ఇంగ్లండులో ఎ. జె. అయ్యర్ ఈ తత్వశాస్త్రవేత్తల్లో ప్రముఖస్థానం వహించారు. క్రమక్రమేణా ఈ తత్వశాస్త్రం అనేక చిలవలనూ, పలవలనూ వేసింది.

దీనిని గురించి, రాధాకృష్ణన్ 'సర్వేపల్లి రాధాకృష్ణన్ తత్వశాస్త్రం' అనే గ్రంథం పీఠికలో ఇలా వ్రాశాడు. "ఇంగిత జ్ఞానంవల్లగానీ, సైన్సు సహాయంతో ఏర్పడిన, వాటి విస్తరణవల్లగానీ నిరూపింపబడని జ్ఞానం సత్యసమ్మతమైనదికాదని ఈ తత్వవేత్తల నమ్మకం. ఈ దృష్టికి భగవంతుడు, 'ఆత్మ' మొదలైన సమస్యలు అప్రస్తుతమైనవి. మతం ఆవేశ జనితమైనది. కవిత్వం, కల్పనా జీవితరంగంలో వున్నట్టే, 'భగవంతుడు' 'ఆత్మ' అనేవి కూడా వున్నవి. అవి ఆవేశాలు బహిర్గతం అవటానికి అవుసరం కావచ్చు. కాని జ్ఞానసేకరణాభిలాషను తృప్తిపరచలేవు. ఇంద్రియాల వల్లగానీ, మేధోపరిశీలన వల్లగానీ నిరూపించబడినవే సత్యమైనవి అని ఈ తత్వశాస్త్రం చెపుతుంది.

భగవంతుని అస్తిత్వంతోగానీ, ఆయన గుణాలతోగానీ, చర్యలతోగానీ సంబంధించిన ఆధ్యాత్మికదృష్టితో ఈ తత్వశాస్త్రానికి ఎటువంటి ప్రసక్తీలేదు. వీటిని భౌతిక సాక్ష్యాల సహాయంవల్ల నిరూపించలేం. ఇవి నిజాలూకాదు; అబద్ధాలూ కాదు-ఆవేశాల రూపాలు మాత్రమే!" అన్నారు. అని ఈ తత్వశాస్త్రాన్ని గురించి తమ అభిప్రాయాన్ని ఇలా వ్యక్తపరిచారు.

"ఆధ్యాత్మిక చింతను చూచి భయపడటం అస్వాభావికం. ఆధ్యాత్మిక చింతను దగ్గరకు రానీయనంత మాత్రాన, మానవుని తాత్వికస్వభావం నశించదు. ఖాళీగా కూడా ఉండదు; నిండే వుంటుంది. దేనితో? ఆధ్యాత్మిక అపనమ్మకంతో. అది కూడా ఒక రకమైన తాత్వికచింతే. ఆధ్యాత్మిక వ్యతిరేకోద్యమం కూడా తత్వశాస్త్రమే. భౌతిక సాక్ష్యాలనుంచి తాత్విక దృష్టిని వృద్ధి చేసుకోవటం అనే వర్తమాన జాడ్యం ఎక్కువ కాలం వుండదు" అన్నాడు ఐన్‌స్టీన్. కాబట్టి తాత్విక అపేక్షఅనేది మానవునికి వుంది. అది ఏదో ఒకవిధంగా తీరాలి. ఆధ్యాత్మిక చింతన వల్లా తీరవచ్చు; ఆధ్యాత్మిక వ్యతిరేక చింతనవల్ల తీరవచ్చు. అందువల్ల తార్కిక నిశ్చితార్థం ఈ తత్వశాస్త్రం వల్ల, భావోద్రిక్తత వల్ల వచ్చే ప్రమాదాలను తప్పుకోవటం కంటే పెద్ద ప్రయోజనం అభిలషించవలసిన అవుసరం ఎక్కువగా కనుపించదు - అన్నట్లు భావించాడు రాధాకృష్ణన్. 'తత్వశాస్త్రం' అనే గ్రంథంలో జె. వి. యస్. కెనర్లే ఇదేభావాన్ని తేలికగా అర్థంఅయ్యేటట్లు ఉదా

హరణ ప్రోక్తకంగా విశదపరిచాడు. ఆయన ఇలా అన్నాడు: "సాలిస్‌బరి చర్చికి ఒక పొడుగాటి శిఖరం వున్నదని నేను అనుకుంటే, నేను తేలిగ్గా సేలిస్‌బరీ వెళ్లి నా ఊహ నిజమో, అబద్ధమో తెలుసుకోగలను. సాపేక్ష సిద్ధాంతం లాంటి, శాస్త్రి సిద్ధాంతాలూ, సూత్రాలూ, ఈవిధంగా నిరూపించ బడవు. ప్రదేశం మార్పుతో వీటిని మనం చూడలేం. కాని వీటిఫలితాలను చూడగలం. ఈ ఫలితాలను మనం ఊహించి నిరూపించగలం. ఈ రెండు పద్ధతులుగానూ, నిరూపింపబడని సిద్ధాంతాలు నిజమని చెప్పటానికీ వీల్లేదు; అబద్ధమని చెప్ప టానికీ వీల్లేదు. అని ఉపదేశిస్తుంది-ప్రస్తుతం మనం చర్చి స్తున్న తార్కిక నిశ్చితార్థ తత్వశాస్త్రం."

—౨

ఈ తత్వశాస్త్రాన్ని పైవిధంగా విపులపరచి, దీన్ని ప్రతిపాదించే ప్రముఖుల్లో వొకడైన ఎ. జె. అయ్యర్ భావా లను ఉదహరించాడు, జె. వి. యస్. కెపర్లే. "ఇంగ్లండులో ఈ తత్వశాస్త్రాన్ని అనుసరించేవారిలో ఎ. జె. అయ్యర్ ప్రసిద్ధులు. మనం నిరూపించగలిగిన వాటినిగురించే మనం తెలుసుకోగలమని ఆయన గట్టిగా వాదిస్తాడు. నీతిశాస్త్రాన్నీ, ఆర్థికశాస్త్రాన్నీ, మతాన్నీ గురించిగానీ, కళాభిరుచినిగురించి గానీ తత్వశాస్త్రం ఏవిధంగానూ ఉపయోగపడలేదు. మనం 'భగవంతుడు ఉన్నాడు' 'నిజంచెప్పాలి' 'ఎల్లావీలర్ విల్ కాక్స్‌కంటే షేక్స్‌పియర్ గొప్పవాడు' అనే అభిప్రాయాలను వెలిబుచ్చుతూ వుంటాం. ఈ అభిప్రాయాలు కొన్నివిషయాల

మీద మనకున్న ఆవేశాలను తెలియబరుస్తవేగాని, నిజం చెప్పాలంటే అర్థరహితమైనవి. అవి యదార్థాలని మనం నిరూపించలేం. అయితే అవి అసత్యాలనికూడా నిరూపించలేమని మనం సంతుష్టి పడవచ్చు."

ఈ తత్వశాస్త్రి స్వభావాన్ని తెలియజెప్పటమేగాక, దాని అసమగ్రతను కూడా విశదపరిచాడు కెస్లర్. ఆయన ఇలా అన్నాడు. "హేతువాదానికీ, అర్థం వుండటానికీ సంబంధించిన క్షేత్రాన్ని ఎక్కువగా సంకుచిత పరచటంవల్ల, మన జీవితాలలో ఎక్కువభాగం దాని సరిహద్దుల అవతల గడుపుతున్నామని మనం భావించవలసి వస్తూవుంది. ఈ తత్వవేత్తలు అర్థయుతం అనుకొని నిర్ణయించిన సరిహద్దుల్లో ఎవ్వరూ, సైంటిస్టులు సైతం, బ్రతుకలేరు. అయితే ఒకసంగతి. అయ్యర్, నీతిశాస్త్రానికీ, రాజకీయ శాస్త్రానికీ, మతానికీ, తత్వశాస్త్రం ఏ విధంగానూ సహాయ పడదని చెప్పినప్పుడు, ఈ క్షేత్రాలలో కూడా మనం కొన్ని నిశ్చయాలకు రావలసిన అవుసరం వుంటుందనే భావాన్ని ఆయన కాదనలేదని అర్థం చెప్పుకోవచ్చు. ఈ నిశ్చయాలను హేతువాదం ఆధారంతో చెయ్యాలనుకోవటం మాత్రం వొట్టి కాలయాపన అని మాత్రమే ఆయన చెప్పాడని మనం సమర్థించుకోవచ్చు.

కానీ నిశ్చితార్థతత్వశాస్త్రం ఇంకొక అడుగు ముందుకు వేసింది. ఈ క్షేత్రాలకు సంబంధించిన నిశ్చయాలు అహేతుకమైనవి, నిరర్థకమైనవీ అని ఉద్ఘాటించింది."

"అయితే ఇది ఎంతవరకు నిజం? సర్వమానవుల ఏవగింపుకీ గురైన మూఢనమ్మకానికీ మేధస్సుమీద ఆధారపడిన ఏ థామస్ ఎక్వినాస్ సమర్థించిన మతానికీ భేదం లేదా? మృగదశలో బానిసలుగా వున్నవారి నీతిసూత్రాలకూ, కాంట్ వంటి మహాశయులు సమర్థించిన నీతిశాస్త్రానికీ భేదం లేనట్టేనా? రాజకీయ రంగంలోని ప్రజాస్వామికానికీ నిరంకుశత్వానికీ భేదం లేనట్టేనా? ఈ తత్వశాస్త్రం నిర్వచించిన సూత్రాలే నిజమైతే ఇటువంటి ప్రశ్నలు అనేకం ఉద్భవించే అవకాశాలున్నాయి.

## 3

డి. యమ్. దత్తా ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రలో ఈ విషయం చర్చిస్తూ తార్కిక నిశ్చితార్థ తత్వశాస్త్రానికి రెండు ముఖ్యలక్షణాలున్నాయని చెప్పాడు. అందులో మొదటిది వ్యతిరేక స్వభావం కలిగింది; రెండవది నిర్మాణాత్మకమైంది. ఈ రెండు లక్షణాల స్వభావాలను స్థూలంగా తెలుసుకుంటే ఈ తత్వశాస్త్రాన్నిగురించి ఎక్కువ భాగం తెలుసుకున్నట్టే. అందుకని దత్తా అభివర్ణించిన లక్షణాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

### ఆధ్యాత్మిక దృష్టికి వ్యతిరేకత :

ఆధ్యాత్మిక దృష్టిఅంటే అనుభవానికి అతీతంగానూ, ఒగువనో ఉండే దృష్టి అని నిశ్చితార్థ తత్వవేత్తల ఉద్దేశం. 'మైండ్' అనే పత్రికలో 1934 జులైన ఏ. జె. అయ్యర్

ఇలా వ్రాశాడు. "ఆధ్యాత్మికవాద ముఖ్యసూత్రం, అతీతంగా ఉండే వాస్తవికత వొకటి వుందని చెప్పటం... అనుభవానికి అతీతంగావుండే వాస్తవికత్వాన్ని వర్ణించటం ఆధ్యాత్మిక తత్వాదర్శం. కాబట్టి భౌతిక సాక్ష్యాలకు అందుబాటులో వుండేది ఏదీ ఆధ్యాత్మికం కాదని మనం తేల్చుకోవచ్చు."

అయితే, హ్యూమ్, కాన్ట్ మొదలైనవారు ఈ విధంగా ఊహించటానికీ, నిశ్చితార్థులు ఊహించటానికీ కొంత తేడావుంది. మానవుని జ్ఞానం పరిపూర్ణం అయింది కాదు గనక ఆధ్యాత్మిక సమస్యలు పరిష్కరించబడవు-అని మొదటివారు అన్నారు. ఇక రెండవవారు: ఈ సమస్యలను అర్థంలేని మాటల కూర్పుగా పరిగణించారు. వారీస్థితికి, జ్ఞానానికి అంతకీ ఇంద్రియానుభవమే మూలాధారం అనుకోవటంవల్లా, భాషకు వారు వర్తింపజేసే తార్కిక పరిశీలనవల్లా వచ్చారు. దీనికి ఉదాహరణగా, 'భాష, తర్కం, సత్యం' అనే గ్రంథంలో ఏ. జె. అయ్యర్ వెలిబుచ్చిన భావాలను పరిశీలిద్దాం.

ఇంద్రియాలకు గోచరించే సత్యం నిజమైన సత్యం కాదని ఆధ్యాత్మిక వాదం చెప్తుంది. కాని ఈ అభిప్రాయాన్ని ఇంద్రియానుభవంతో ఋజువు చేసుకోలేం. కాబట్టి ఇటువంటి అభిప్రాయం నిజమూ కాదు; అబద్ధమూ కాదు-అని మనం చెప్పకోవాలి. దీనికి అర్థంలేదు. మరికొంతమంది ఆధ్యాత్మిక వాదులు, ఎన్ని రూపాలుగా కనబడుతున్నా, అసలు వాస్తవికత వొకటేనని చెప్తారు. మరికొంతమంది

ఈ వాస్తవికత అనేకం అంటారు. దీనిని గురించి తార్కిక నిశ్చితార్థులు ఏమంటారు? పూర్వపద్ధతినే, అనుభవంవల్ల ఇతమిద్ధమని తేల్చుకోలేం గనక 'ఇది నిజమూ కాదు, అబద్ధమూ కాదు, అర్థంలేనిది' అని అంటారు. ఇది ఇదమిద్ధమని ఎందుకు తేల్చుకోలేం అనే ప్రశ్నకు ఇది అనుభవం అడుగున వుండేదని భావించబడింది గనుక అని జవాబు చెపుతారు. అదేవిధంగా వాస్తవికవాదులకూ, భావ వాదులకూ మధ్యన జరిగే వాగ్యుద్ధములోకూడా తార్కిక నిశ్చితార్థులు ఏవిధంగానూ సహాయపడలేరు. ఎందుకని? ఇంద్రియానుభవానికి విడిగా వొక కారణం వుందా లేదా అనే ప్రశ్నకు జవాబు నిర్ణయించుకోటానికి సాక్ష్యం దొరకదు గనుక!

## తత్వశాస్త్ర బాధ్యత :

కాబట్టి, మూలతత్వం వొకటి వున్నదని ఊహించి దానిమీద సిద్ధాంతాలను నిర్మించటానికి పూనుకోగూడదు తత్వశాస్త్రం. ఇంద్రియాలవల్లా, సైన్సు కనిపెట్టిన సాధన వల్ల జరిగిన విస్తరణవల్లా వచ్చిన జ్ఞానంతో కనిపెట్టబడిన ప్రకృతి సూత్రాలను గురించికాక, ఈ విశ్వానికి చెందిన జ్ఞానంతో కూడుకున్న మరే సిద్ధాంతాన్నీ నిర్మించిరాదు. ఇన్ట్యూషన్‌వల్ల గ్రహించబడే మూలతత్వం అవసరం లేదు. ఇన్ట్యూషన్ మహా ఉపయోగపడితే వర్తమానానికి చెందిన మానసిక స్థితినిగురించి చెప్పగలుగుతుందేమోగాని సార్వజనీనికమైన ఏసూత్రాన్నీ నిర్మించలేదు. ఏ తత్వవేత్త

అయినా, ఇటువంటి ఆధారాలమీద తత్వశాస్త్రాన్ని నిర్మించటానికి పూనుకుంటే అది తత్వశాస్త్రం కాదు, సాలిగూడుగా తయారౌతుంది.

అంతేకాదు. తత్వశాస్త్రం, సైన్సుల్లో తాను మేటి సైన్సు అయినట్లు నటించగూడదు. సైన్సులకు, వాటి ఆధారానికి పనికివచ్చే మూలసూత్రాలను అందివ్వగలననే భ్రమ, తత్వశాస్త్రానికి ఉండగూడదు. ఆపని సైన్సులే చేసుకో గలుగుతయి. వివిధశాఖలకు చెందిన సైన్సులు ప్రోగుజేసిన జ్ఞానాన్ని తత్వశాస్త్రం సమన్వయ పరచగల దనుకోవటం కూడా పొరపాటే. ఈ పనికూడా సైంటిస్టులే చేసుకో గలుగుతారు. అటువంటి ప్రయత్నం జనరల్ సైన్సుగా పరిణమిస్తుంది.

అయితే ఇక తత్వశాస్త్రం చెయ్యవలసిన పనేమిటి? ఈ ప్రశ్నకు ఇలా జవాబు చెప్పాడు ఏ. జె. అయ్యర్. 'శాస్త్ర పరిశోధనా ఫలితాల ప్రకటనలను, తత్వశాస్త్రం తార్కికంగా పరిశీలించవచ్చు. అది పరిశీలించవలసిన విషయం. ఈ పరిశీలన భాషకు సంబంధించి వుండవలసిందే గాని, విషయానికి సంబంధించిందై వుండరాదు. అప్పుడది సైన్సులో పెనవేసుకుని వుండే వ్యాకరణం అవుతుంది. అందుకని వొక ప్రత్యేకతను గడించుకుంటుంది.' ఇలా చెప్పుకు పోవటమేకాక నిశ్చితార్థ తత్వవేత్తలు ఈ పనికి పూనుకున్నారు కూడా. 'భాషయొక్క తార్కిక నుడికారం' అనే గ్రంథంలో కార్నప్ ఈ శాఖను అభివృద్ధి చేశాడు. తదతరంకూడా కృషి చేశాడు.

## ౪

తార్కిక నిశ్చితార్థ తత్వశాస్త్రం ఇంద్రియ జ్ఞానం ముఖ్యమనే సిద్ధాంతంమీద నిర్మించబడిన తత్వశాస్త్రం అని మొదట్లో చెప్పుకున్నాం. అయితే ఆధ్యాత్మిక వాదులు, ఇంద్రియాలద్వారానేకాక ఇతరత్రా మరికొన్ని మార్గాల ద్వారా జ్ఞానాన్ని సేకరించే వీలుందని చెపుతారు. దీనికి వీరు, మూలభావాన్ని ధిక్కరించిన తత్వవేత్తలు చెప్పిన జవాబునే చెపుతారు. కాన్టు నిర్వచించిన మూలసూత్రాలను మిల్ ఈ విధంగా ఎదుర్కొన్నాడు. "అది అనాది నుంచీ వ్యతిరేకత అనేది లేకుండా వస్తున్న అనుభవంయొక్క ఫలితం," అన్నాడు "అది ఏనాటినుంచో వస్తున్న నమ్మకం గనక దాని వ్యతిరేక సిద్ధాంతాలు వుండటానికి అవకాశం వుందనే భావం తట్టకుండా పోయింది" అన్నాడు. ఆధ్యాత్మిక వాదులు చెప్పే పైసిద్ధాంతానికి నేటి తార్కిక నిశ్చితార్థులు ఇటువంటి జవాబే చెప్పగలరు.

అయితే గతించిపోయిన చారిత్రక సంఘటన సంగతి ఏమిటి? అవి అనుభవంలోకి వచ్చేవికావు; ఇప్పుడు పరీక్షించటానికి వీలయినవీ కావు. దీనికి ఏ. జె. అయ్యర్ ఇటువంటి సంఘటనలను మనం ప్రత్యక్షంగా పరీక్షించలేక పోయినా, వాటివల్ల వచ్చే ఫలితాలనుబట్టి పరోక్షంగా పరీక్షించ వచ్చని చెప్పాడు.

*     *     *

కాని మానవ జీవితాన్ని హేతువాదంమీద నడపా లన్నా, స్వచ్ఛమైన హేతువాదంతో వాస్తవిక తత్వాన్ని తెలుసుకోవాలన్నా అది జరిగేపనికాదు అంటాడు కేసర్లే. దానికి కారణం 'తత్వశాస్త్రం' అనే గ్రంథంలో ఇలా విశదపరిచాడు. "మానవుడనేవాడు కొంతవరకు హేతువాది; కొంతవరకు అహేతువాది. ఈ రెండుదృష్టులూ అతనుచేసే అన్నిపనుల్లోనూ కనుపిస్తూనే వుంటై. స్వచ్ఛమైన సైంటిస్టుల తత్వవేత్తల జీవితాలలోకూడా అహేతువాదానికి చెందిన అనేక లక్షణాలు కనుపిస్తయి. తనలోవున్న హేతుదృష్టిని ముఖ్యమైన దానినిగా తీసుకొని తనలోవున్న అహేతుక దృష్టిని, ప్రమాదకరమైన స్థితికి రాకుండా, నిరపాయమైన దారులలో ప్రవహింపజెయ్యటం మానవుని నేటి సమస్యల్లో ముఖ్యమైంది. అలా కాకుండా అసలు అహేతుతత్వం మాన వునిలో లేనట్లూ, దానిని తీర్చవలసిన అవుసరం లేద న్నట్లూ ప్రవర్తిస్తే, ఆ స్వభావాన్ని ప్రకోపింపజేసి, దాని ఇష్టంవొచ్చినట్లు అది ప్రవర్తించే అవుసరం కలిగించటమే అవు తుంది. ఈ పనే నేటి తార్కిక నిశ్చితార్థ తత్వం చేస్తూ వుంది. చాలా చిత్రమే."

* * *

కేసర్లే వెలిబుచ్చిన అనుమానాలకు, నేను మరికొన్ని అనుమానాలను జోడించదలిచాను. ఇటువంటి హేతువాదం మీద నిర్మించిన సిద్ధాంతాలను తలుచుకున్నప్పుడల్లా నాకు కలిగే అనుమానాలే ఇవి.

హేతువాదం అనేది ఏమిటి? ఆనాటి జ్ఞానాన్నిబట్టి దానిని ఆధారంగా తీసుకొని ఊహించే నిర్ణయాలు కలిగించేదే గదా! ఏనాటి జ్ఞానమైనా, సంకుచితమూ, అపరిపూర్ణమే గదా! అందుకనేగదా, ఎప్పటికప్పుడు హేతువాదాన్ని బట్టి తేల్చుకున్న ఫలితాలను మార్చుకోవలసి రావటం? అయినప్పుడు దీనిమీద నిర్మించబడిన సిద్ధాంతానికి ఎక్కువవిలువ ఇవ్వటం దేనికి? సత్యాన్ని తెలుసుకోటానికి దీనికంటే వేరు మార్గంలేక అనుకుంటే, ఆధ్యాత్మిక వాదులు ఏకగ్రీవంగా చెప్పే ఇన్ట్యూషన్ మాటేమిటి?

మరొక అనుమానం ఏమిటంటే, ఫ్రాయిడ్ ఆడ్లర్ మొదలయిన ఇతరదేశాల మనస్తత్వ శాస్త్రజ్ఞులూ, మన పూర్వ మనస్తత్వ శాస్త్రజ్ఞులూ, అందరూ మానవునిలో కనపడే చైతన్యం, లోపలవుండి, పైకి కనపడని చైతన్య ప్రవంతిలో ఒకభాగ శకలమేనని చెపుతున్నారు. అంటే మనలో ప్రస్తుతం మనకు తెలిసిన ఆవేశాలకంటే, తెలియని ఆవేశాలే ఎక్కువ వున్నాయని వీరంతా చెపుతున్నారని అనుకోవలసి వస్తుంది. అటువంటప్పుడు పైకి తెలిసిన కొద్ది దాన్నిబట్టి, అదికాక ఇంకేదీ ఉండటానికి వీల్లేదనే వైఖరితో సిద్ధాంతాన్ని నిర్మిస్తే అది మానవులకు ఎంతవరకు ప్రయోజనకారి అవుతుంది? పైకి కనపడే లక్షణాలనుబట్టి చట్టం నిర్మించుకొని, మిగిలిన లక్షణాలను నిర్దాక్షిణ్యంగా అణచివేసుకుంటే మానవుడు ఏమవుతాడు? లోపల గుంపు చింపులుపడే ఆవేశాల స్వభావం మనకు తెలియనప్పుడు తెలి

సిన వాటినిబట్టి ప్రవర్తించటంకంటే చెయ్యగలిగిందేముంది' అని కొంతమంది తిరుగుప్రశ్న వెయ్యవచ్చు.

'లోపల ఆవేశాలను తెలుసుకోవటమే' అనేదే దీనికి జవాబు. అంతర్ముఖులై యోగసాధనంవల్ల మహర్షులు చెయ్యదలిచిందీ, చేసిందీ ఈ ఆవేశాలనూ, వాటి స్వభావాలనూ తెలుసుకోవటమే. 'మిస్టిక్స్' అంటారే వారు చేసిన పని ఇదే! ఈ అనుభవం రావటానికిగాను నిర్ణయించబడి వున్న మార్గాలను అనుసరించకుండా 'గత్యంతరంలేక' అనటం అన్వేషకులు అనదగిన మాటకాదు. పైగా గత్యంతరంలేక చేసేపని అన్వేషణకు ఎలా సహాయపడుతుంది?

— ... —

# 'సంపూర్ణైక్య తత్వవేత్త'

# సైమన్ లుడ్విగోవిచ్ ఫ్రాంక్

రష్యాదేశంలో ఇరవైయ్యో శతాబ్దంలో, ఒకప్రక్క మార్క్సిజానికి ప్రాముఖ్యత హెచ్చుతూ వుండగా, రెండవప్రక్క సంపూర్ణైక్య తత్వశాస్త్రంకూడా ప్రచారంలోకి రానారంభించింది. ఈ తత్వశాస్త్రం ప్రచారానికి పూనుకున్నవారిలో ఎక్కువమంది మొదట్లో మార్క్సిస్టు సంస్థల్లో పనిచేసినవారే! కర్సావిన్, లుడ్విగోవిచ్ ఫ్రాంక్, ఫ్లారెన్‌స్కీ, బుల్గకోవ్ మొదలైనవారు ఇందులో ప్రముఖులు. వీరంతా కూడా సంపూర్ణైక్య తత్వశాస్త్ర సృష్టికర్త అయిన సొలవ్‌యోవ్‌నుంచి, తమ సిద్ధాంతాలకు అవసరమైన ఆవేశాన్ని పొందినవారే. అయితే వీరు అనుసరించిన మార్గాలు వేరు. అయినా వీరిసిద్ధాంతాలకు పునాదీ, ఆదర్శం ఒకటే అవటంవల్ల సామ్యం ఎక్కువగా కనుపిస్తుంది.

ఈ సిద్ధాంతాల్లో స్ఫురించే సామ్యాన్ని మనం మూడుభాగాల క్రింద విభజించవచ్చు. అందులో మొదటిది ఈ ప్రపంచం జీవిస్తున్న ఐక్యతగలది – అనే భావం. మనిషికి, ప్రకృతికీ, పరాశక్తికీ వున్న సంబంధం రెండవది. ప్రపంచం యొక్క దైవిక సంబంధం మూడవది. నేను మొదట ఉదహరించిన తత్వవేత్తల తాత్విక సిద్ధాంతాల్లో ఈ లక్షణాలు

ప్రస్ఫుటంగా కనుపిస్తయి. వారు అనుసరించిన మార్గాలను బట్టి వాళ్ళెక్కరిలో వాళ్ళక్క లక్షణం ప్రాధాన్యత వహించవచ్చు..

షోలవ్యోవ్ ఈ తత్వశాస్త్రం సృష్టికర్త అని నేను పేర్కొన్నప్పుడు, అంతకుముందు రష్యా తత్వశాస్త్ర చరిత్రలో ఈ భావాలు లేవని నా అభిప్రాయమని ఎవ్వరూ ఊహించ నక్కరలేదు. ఖొడయోవ్, ఖోమ్యకొవ్, కిరే గావ్, మొదలైన మేధావు లనేకులు ఈ పద్ధతిన అనేకరకాల భావాలను, వివిధ శాఖలలో ప్రచారం చేశారు. అయితే షోలయోవ్, వివిధశాఖలకు చెందిన ఈ భావాలను జతపరిచి, సమగ్రమైన తత్వశాస్త్రాన్ని రచించాడు. అందువల్ల ఆయనను సృష్టికర్తగా పేర్కొనటం జరిగింది. ఈయన చేతుల్లో సమగ్రతను సంపాదించుకొన్న 'సంపూర్ణైక్య తత్వం' ఫ్రాంక్ చేతుల్లో ఏవిధంగా వృద్ధిచెంది, నవ్యత్వాన్ని, నిండుదనాన్ని రూపొందించుకుందో పరిశీలిద్దాం.

౨

సైమన్ లుడ్విగొవిచ్ ఫ్రాంక్, 1377 వ సంవత్సరంలో మాస్కోలో జన్మించాడు. ఆయన తండ్రి డాక్టరు. ప్రథమ దశలో మిగిలిన మేధావులవలె ఈయన కూడా మార్క్సిస్టు సంస్థల్లో పనిచేశాడు. ఆ ప్రభావంలో వుండి, మాస్కో విశ్వవిద్యాలయంలో, ఏ. ఇ. చుప్రొవ్ అధ్యాపన క్రింద 'లా' అభ్యసించాడు. 1899 లో ఆయనను విశ్వ

విద్యాలయాలున్న పట్టణాలనుంచి బహిష్కరించారు. అప్పు డాయన బెర్లిన్, మూనిచ్ మొదలయిన ప్రదేశాల్లో రాజ కీయ ఆర్థిక శాస్త్రంలోనూ, తత్వశాస్త్రంలోనూ, పని చేస్తూ కాలం గడిపాడు. ఆయన 1900 సంవత్సరంలో 'మార్క్సు నిర్వచించిన విలువ' అనే పుస్తకం, 1902 లో 'దూరతీరాలకు నీషే ప్రేమ' అనే పుస్తకం ప్రచురించాడు. అప్పటినుంచీ తాత్వికసమస్యల పరిష్కారానికి ఆయన తన సృజనశక్తిని ధారపోశాడు. 1012 లో ఆయన పీటర్స్ బర్గ్ విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడుగా పనిచేశాడు. అదే సంవత్సరంలో ప్రెగ్మాటిజంమీద వ్రాక పుస్తకం, 1915 లో 'జ్ఞానం ఆదర్శం' అనే పుస్తకం ఆయన ప్రచురించాడు. ఆయన 1917 లో సారటావ్ విశ్వవిద్యా లయంలోనూ, 1921 లో మాస్కో విశ్వవిద్యాలయంలోనూ తత్వశాస్త్రి శాఖకు అధ్యక్షుడుగా పనిచేశాడు. ఈలోగా 'మానవుని ఆత్మ' అనే పుస్తకం ప్రచురించాడు. 1922 లో రష్యానుంచి బహిష్కరించబడి, బెర్లిన్లో నివాసం ఏర్పరచు కున్నాడు. అక్కడ బర్డ్యావ్ స్థాపించిన మత, తాత్విక సంస్థలో పనిచేశాడు. ఆయనకు బర్డ్యావ్‌తో మాస్కోలో సంబంధం వుండేది. అక్కడ వారిద్దరూ 'ఆధ్యాత్మిక సంస్కృతీ సంస్థ'లో కలిసి పనిచేశారు. ఆ స్నేహం ఇప్పుడు పునరుద్ధరించబడింది. 1930 నుంచి 1937 వరకూ ఆయన బెర్లిన్ విశ్వవిద్యాలయంలో అనేకసార్లు రష్యాదేశపు ఆలో చనల మీాదా, సాహిత్యంమీాదా ఉపన్యసించాడు. అక్కడ నుంచి 1937 లో ఫ్రాంసుకీ, 1945లో లండన్‌కీ తన నివాసం

మార్చుకున్నాడు. డిసెంబరు 1950 సంవత్సరంలో లండన్ లోనే ఆయన మరణించాడు.

ఇదీ ఆయన జీవితచరిత్ర. ఆయన జీవితం నిరంతరాన్వేషణతో కూడుకొని వుంది. ఒకదృష్టితో పరిపూర్ణసిద్ధిని పొందిన జీవితమనే చెప్పుకోవచ్చు. ఇంతకుముందు నేను ఉదహరించిన గ్రంథాలేకాక, ఆయన ఇంకా అనేక గ్రంథాలు వ్రాసి ప్రచురించాడు. ఆయన చివరిపుస్తకం 'వాస్తవికత-మానవుడు'. మానవులను కలవరపరిచే అనేక సమస్యలను ఆయన తన గ్రంథాలలో చర్చించి, తన తరువాత రంగం ప్రవేశించిన తత్వవేత్తలకు అనేకవిధాల సహాయపడ్డాడు. ఆయన శక్తి సామర్థ్యాలను గురించి జంకోవిస్కీ- 'రష్యా దేశపు తత్వశాస్త్రచరిత్ర'లో ఇలా వ్రాశాడు. "నిర్వచించటంలో ఫ్రాంక్ శక్తి సామర్థ్యాలు చెప్పుకో దగ్గవి. ఆయన ఆలోచన వొక విశిష్టమైన పద్ధతిలో అభివృద్ధిచెందుతుంది. ఆయన చెప్పేవిషయం, ఏ పరిస్థితికి ఆ పరిస్థితికి సరిపోయేటట్టు ఆయన ఉదహరించే సూత్రాలవల్లేకాక, ఆయన నిర్మాణానికి వేసుకున్న పునాది బలంవల్ల కూడా ఆకర్షిస్తుంది. ఆయన విమర్శలూ, చర్చలూ, ఆయనకున్న భాషా పాండిత్యంవల్ల, అతి శక్తివంతంగా కనుపిస్తాయి. చెప్పదలచిందేదో ఆయన స్పష్టంగా, ఆకర్షవంతంగా చెప్పేవాడు. ఇదేకాక అయన తాత్విక ఆదర్శం యొక్క తేజం అతి మనోహరంగా ఉండేది. ఆయన శక్తి సహజంగా సమన్వయ శక్తి. ఆయన ఊహించిన పూర్ణైక్య తత్వశాస్త్రం ఈ శక్తికి

హితమైన దవటంవల్ల మనస్సులను రంజిల్లచేసింది. తాత్విక భావోత్తేజంలో రష్యా తత్వశాస్త్ర చరిత్రలో ఆయనకు సరిపోయేవారు లేరని మనం నిస్సందేహంగా చెప్పుకోవచ్చు."

ఆయన నిర్మాణ చాతుర్యంకూడా గొప్పది. ఆయన సిద్ధాంతాలు సమగ్రమైనవి. దీర్ఘాలోచనతో కూడుకున్నవి. ఫ్రాంక్ తాత్విక సిద్ధాంతం వ్యక్తిగత సమస్యలను పరిష్కరించటానికి వినియోగపడేటంత సామర్థ్యం గలది.

3

ప్రాచీనజ్ఞాన పరిశీలనను ఆధారంగా తీసుకొని ఫ్రాంక్ తన సిద్ధాంతాన్ని నిర్మించాడు. పూర్ణైక్యతను సాధించదలచిన వారు ముఖ్యంగా మూడు విషయాలను గమనంలోకి తీసుకోవాలి. ఈ మూడు విషయాలూ అనుభవం, ఆలోచన, ఊహా. వీటి సమన్వయాన్ని సాధించటమే పూర్ణైక్యతను సాధించటం. ఈ పనిని ఫ్రాంక్ ఏ విధంగా నిర్వర్తించాడో విచారిద్దాం.

ఫ్రాంక్ సాధారణంగా విమర్శాత్మకమైన హేతువాదాన్ని సమర్థించేవాడు. కాని నిర్ధారించి చెప్పవలసిన చోట అతీత తత్వాన్ని అనుసరించేవాడు. ఈ రెండు లక్షణాలూ ఆయనలో మొదటనుంచీ కనుపిస్తాయి. ఆయన ముఖ్య గ్రంథాలైన 'జ్ఞానం ఆదర్శం', 'అగాధమైనది' అనే గ్రంథాలలో ఈ రెండు లక్షణాలూ గోచరిస్తయి. ఆయన జ్ఞానం రెండురకాలు అని తేల్చాడు. (1) సంయుక్త

జ్ఞానం. ఇది తీర్పులు, భావాల కలయిక మొదలయిన వాట్ల ద్వారా బహిర్గతం అవుతుంది (2) పదార్థంతో ప్రత్యక్ష సంబంధం ఉంచుకోవటంవల్ల ఏర్పడిన జ్ఞానం. ఈ జ్ఞానాన్ని ప్రథమంలో కలిగేజ్ఞానంగా భావించాడు ఫ్రాంక్. తత్వవేత్తగా ఫ్రాంక్ తొలిగా కలిగే ఈ జ్ఞానాన్ని తెలియబరచటానికి తన సిద్ధాంతాన్ని నిర్మించాడు. ఆయన ఆలోచనకు ఆధారం ఈ జ్ఞానమే. దీనిని గురించి విశదంగా తెలుసుకుందాం.

ఇతర వాటితో దేనితోనూ సంబంధం లేకుండా, తనలో తానుగా వుండేది, ఈ ప్రపంచంలో ఏదీలేదు. ఉనికిలో పూర్ణైక్య స్వభావం వుంది. ఉండేవి అన్నీ ఒకదానితో వొకటి సంబంధం పెట్టుకుంటూ ఇందులో వుంటై. పూర్ణైక్య స్వభావం కలిగిన ఈ ఉనికిలో పరతత్వం కూడా వుంది. అలా వుండబట్టే వునికిలోవుండే ఐకమత్యం పూర్ణైక్యంగా మారింది. ఈ ఐక్యతనుంచి భగవంతుడుకూడా విడిగా వుండటానికి వీల్లేదు. ఎందుకంటే ఆయన్ని, మూలసూత్రంగా, సృష్టికర్తగా, ఈ విశ్వాన్ని నిలబెట్టేవానిగా మనం భావించేటప్పుడు, ఈ ఐక్యతకు విడిగా ఆయనెలా వుంటాడు? సృష్టికి సంబంధం లేకుండా సృష్టి కర్త ఎలా వుంటాడు ?

ఫ్రాంక్ అభిప్రాయాలను అర్థం చేసుకోటానికి వాటిని రెండు భాగాలు క్రింద విభజించాడు జెంకోవిస్కీ. అవి ఇవి: (1) అంతర్గతంగావున్న ఐకత్య(2)బయట ప్రపంచంతోవున్న ఐక్యత. అంతర్గతంగావున్న ఐక్యత అన్నప్పుడు తనలో

తానుగా వుండేదని ఎవ్వరూ పొరపడకూడదు. ఎందుకంటే అనుభవం ద్వారా దీనిని మనం తెలుసుకోగలం. తెలియనిదీ, అతీతంగా వుండేది, మనకు దాని అనిశ్చిత స్వభావం ద్వారా తెలుస్తుంది.

ప్రత్యక్షానుభవం తెలిసినంత నగ్నంగానూ, స్పష్టంగానూ, తెలుస్తుంది. ఇక బయట ప్రపంచంలో వున్న ఐక్యతలో, ద్వైవికస్వభావంతో కలిసివున్న ప్రకృతితత్వశాస్త్రం, జీవశాస్త్రం వుంటాయి. పూర్ణైక్యతనుంచి పరతత్వాన్ని ఫ్రాంక్ విడదియ్యలేదని మనం మొదటే చెప్పుకున్నాం. ఉనికికి సర్వాధికారం ఇచ్చినప్పుడు, అది ఏవొక్క భాగానికీ చెందక, పూర్ణైక్యతకు మాత్రమే చెందుతుందని మనం మరువరాదు. 'అగాధమైంది' అనే పుస్తకంలో ఫ్రాంక్ ఇలా వ్రాశాడు. "భగవంతుడు ప్రథమసూత్రంగా, పూర్ణైక్యత అని చెప్పుకోవాలి. దానికి విడిగా ఇంకేది లేదు. ఈ ప్రపంచం భగవంతునికి వేరుగావుంటే, అది ఆయననుంచి ఉద్భవించిందే. ఈ ప్రపంచం భగవంతునితో ఏకత్వం పొంది లేదు. పూర్తి విడివడి లేదు. ఈ ప్రపంచంలోని ద్వైవికతత్వం, ఏకమైన భగవన్మానవత్వంతోపాటు ప్రదర్శితమౌతుంది."

ఫ్రాంక్ చెడునిగురించి విమర్శించేటప్పుడు ఈ పూర్ణైక్యత కొంత సడలివుంటుందని మనం గ్రహించగలుగుతాం. కాని ఈ సడలివుండటం అనేది విడివడివుండే అంతవరకు

రాదు. ఈ సడలటం అనేది కూడా అందులోవున్న మానవ లక్షణం వరకే వర్తిస్తుంది. నిజం చెప్పాలంటే ఈపూర్ణైక్యత అనేది ఉనికి అంతకీ వర్తిస్తుంది. వాస్తవికత యొక్క చిన్న శకలంలో సైతం ఇది వుంటుంది. ఉనికి వేళ్లు ఇందులోనే ఉండి, దీనివల్లె అది పోషింపబడుతూవుంటుంది. సంకుచిత పడని సృజనశక్తి ఈ పదార్థమయ ప్రపంచ జనానికి కారణం.

మరొకవిషయం మనం ముఖ్యంగా మన్నించాలి. ఫ్రాంక్ దృష్టిలో అనాదిలోవున్న ఐక్యతకూ, పూర్ణైక్యతకూ భేదంవుంది. అందుకనే ఉనికియొక్క ఐక్యతకు ఆధారంగా ఉండే విశ్వాత్మను సృష్టించటానికి ఆయన నిరాకరించాడు.

మరొకచోట ఆయన తన తత్వశాస్త్రం మూల సూత్రాన్ని విడమరచి చెప్పాడు. ఆయన మొదట ఆధ్యాత్మిక పూర్ణైక్యతత్వాన్ని కోరాడు. కాని రెండు ప్రపంచాలను ఊహించాడు. అలా ఊహించబట్టే వ్యతిరేకంగా నిలబడేవ్యక్తి వ్యక్తికానిదీ కలిసివుండటానికి వీలయింది. ఆయన తత్వశాస్త్రంలో, వొకేదానిలోవున్న భేదాలు ద్వంద్వాన్ని సూచిస్తయి. దాని ఈ ద్వంద్వం అనాది ఏకత్వంలోనుంచి వచ్చిందే. ఈ భావాన్నే ఆయన ఇంకా స్పష్టపరిచాడు. ఉనికియొక్క ప్రథమ నియమం, మొట్టమొదటి ప్రాణం- దేనిలోకి అన్నీ జేరుకుంటాయో, దేనిలోనుంచి అన్నీ బహిర్గతం అవుతాయో అది. దానితో పోల్చుకుంటే మిగిలిన

వన్నీ, అలంకార ప్రాయమైనవీ, ఉపాధి లేనివీ, తమలో తమకు ఆధారం లేనివీ. కాబట్టి ఈ మొదటినియమం ఉనికి కాదు. అది ఉనికికంటే గొప్పది. అది అనాది వాస్తవికత. అదే పూర్ణైక్యత. పూర్తిగా వొకటి అనికూడా మనంచెప్పుకో వచ్చు. ఇంతకుముందు మనం చెప్పుకున్నట్లు పైకి రెండుగా కనుపించేది ముఖద్వారం దగ్గర వొకటే-ఒక దానినుంచి ఉద్భవించిందే...

౪

రష్యా తత్వవేత్తల్లో మానవ స్వభావానికి ఏకత్వం కల్పించటానికి ఫ్రాంక్ చేసినంత కృషి మరెవ్వరూ చెయ్య లేదని మనం చెప్పుకోవచ్చు. ఈ ఏకత్వం మానవునికి అపా దించాలంటే ఇది అనాదిపదార్థంలో వున్నదని నిరూపించాలి. లేకపోతే స్థూలదృష్టికి ప్రపంచంలో కనబడే భిన్నత్వాన్ని సమన్వయపరచలేం. రూపభేధం ఉన్నా అందరిలో వున్నదీ వొకటే అని చెప్పగలగాలి. ఇందుకే కృషిచేశాడు ఫ్రాంక్. ఆయన పుస్తకాల్లో 'నేను' కంటే 'మనం' ముంచు అని ఉద్ఘాటించాడు. 'నేను' అనే భావం వొచ్చినప్పుడు 'నీవు' అనే భావం దానితోనే వొస్తుంది. కాని ఈ రెంటికీ ముందు 'మనం' అనేది వుంది అని ఆయన అభిప్రాయం. ఈ అభి ప్రాయాన్ని సమర్థిస్తూ 'అగాధమైంది' అనే పుస్తకంలో ఆయన ఇలా వ్రాశాడు: "మనం అనే భావం నానుంచి విడి పోయి ప్రపంచంలో భాగం అవ్వాలని బలంగా కోరుతూ వుంటుంది. అలా బయటి ప్రపంచంలో భాగంఅయి,

ప్రత్యేక అస్తిత్వం కలిగిన వాస్తవికతకువలె నన్ను ఎదుర్కొం టుంది. ఈ విధంగా మనం అనే భావంయొక్క చక్షుర్గో చరంగాని ఏకత్వమే మనల్ని ఆవహిస్తూ వుంది. 'మనం' 'అది'గా కనుపించి బయటి ప్రపంచానికి ఆధారం అవుతూ వుంది. ఈ సాంఘిక చారిత్రక గుణం, మానవ జీవితంలోని జగద్గుణంగా పరిణమిస్తూ వుంది. జగత్తులో వున్న అహేతు కత్వంతో, క్రౌర్యంతో మానవుణ్ణి ఆవహిస్తూ వుంది. ఈ విధంగా పదార్థరూపాన్ని పొందిన 'మనం' అనే భావం హేతు, అహేతు తత్వాలయొక్క సమన్వయం అనీ, అందు వల్ల హేతు తత్వానికి అతీతమైనదనీ మనం అంగీకరించాలి."

ఈ అంగాంగీ భావమే మానవుని ఐకమత్యానికి ఆధారం. మానవుడు తాను ఏ సమిష్టియొక్క భాగాన్నని భావిస్తున్నాడో, ఆ సమిష్టికూడా వ్యక్తివంటిదే. ఎందు కంటే వ్యక్తీ సమిష్టీ రెండూ ఒక అనాది పదార్థంనుంచి ఉద్భవించినవేలవటంవల్లా, అది వ్యక్తినుంచి బహిర్గతంఅయి పదార్థాన్ని ఆశ్రయించింది అవటంవల్లా, దానిసరిహద్దు, ఒక అలౌకిక ఐకమత్యం-భగవన్మానవ తత్వ సమిష్టినిర్మాణం, మన భావనలోని అవతార పురుషుడు. ఇదే సూత్రం భగ వంతునికీ వర్తిస్తుంది. మానవునిలో భగవంతుని స్వభావం ఏవిధంగా మిళితమైవుందో, అదేవిధంగా భగవంతునిలో మానవస్వభావం మిళితమై వుంది.

ఫ్రాంక్ మన విశిష్టాద్వైతానికి దగ్గర్లో వుంటాడని చెప్పుకోవచ్చు. ఫ్రాంక్, బర్‌డ్యావ్ ఇద్దరూ మార్క్సిజానికి వ్యతిరేకులే అయినా, ఇద్దరూ వేరువేరు ప్రదేశాలనుంచి

అన్వేషణ ప్రారంభించారు. బర్డ్యావ్‌కి వ్యక్తిమూలస్థానం. ఫ్రాంక్‌కి సమిష్టి మూలస్థానం. బర్డ్యావ్‌కి వ్యక్తిఅనుభవం వొక ప్రత్యేకత కలిగింది. ఫ్రాంక్‌కి వ్యక్తి అనుభవం సమిష్టి అనుభవంలోని వొకభాగం మాత్రమే. అందుకని వ్యక్తి అనుభవంలో సమిష్టి అనుభవం, సమిష్టి అనుభవంలో వక్తి అనుభవం వున్నదంటాడు. అయితే బయలుదేరిన స్థానాలు వీరిద్దరికీ వొకదానికొకటి వ్యతిరేకంగా వున్నట్లే కనుపించినా గమ్యస్థానం వొకటిగాకనుపించిన ఛాయలను మనం గుర్తించవచ్చు. ఒకరు వ్యక్తి అనుభవాన్ని పునాదిగా తీసుకొని సమిష్టిభావాన్ని పొందేమార్గంలో ప్రయాణం చేశారు. రెండవవారు సమిష్టిని పునాదిగా తీసుకొని, వ్యక్తి అనుభవంలో సమిష్టి అనుభవాన్నిచూచి ఎల్లెడల పూర్ణైక్యతను ప్రత్యక్షం చేసుకున్నారు.

వీరి అన్వేషణలోని దృష్టిభేదం ఈ ప్రపంచంలో వున్న చెడుని పరిశీలించే సందర్భంలోకూడా కనిపిస్తుంది. బర్డ్యావ్ సిద్ధాంతములో ఈ ప్రపంచంలోవున్న చెడుని పరిశీలించేఘట్టం ముఖ్యమైంది. ఆయన బ్రాహ్మమే సిద్ధాంతాలను అంగీకరించటానికి ముఖ్యకారణం: ఈ సమస్యవల్ల తాను పొందిన కలవరమే – అని మనం నిస్సందేహంగా భావించవచ్చు. ఫ్రాంక్ ఈ సమస్యకు ప్రాధాన్యత ఇవ్వడు. తత్వశాస్త్రం మానవకోటికి ఆశను కలిగించే విధానం అవటం వల్ల చెడుయొక్క వాస్తవికతనే అది అంగీకరించదని ఆయన నిర్వచించాడు. కాని మనం పరిశీలించిచూస్తే తను ఆశావాది

అవటంవల్ల తనగుణాన్ని తత్వశాస్త్రానికి ఆపాదించి చెడుకి ప్రాధాన్యత లేకుండా చెయ్యటానికి ప్రయత్నించాడని బోధపడుతుంది. 'ఈ విధంగా ప్రపంచంలో చెడు కున్న ప్రాధాన్యతను అంగీకరించక పోవటానికి కారణం ఏకత్వ సిద్ధాంతంలో ఈ సమస్యకు పరిష్కారమార్గం సూచించటం అసంభవం అవటమే' అని జెంకోవిస్కీ తన రష్యా తత్వ శాస్త్రి చరిత్రలో వ్యాఖ్యానించాడు. ఇది గమనించదగిన విషయం. ఆయనే ఇంకా ఇలా పరామర్శించాడు. "మానవుడు తన జీవితంమీద తాను సర్వాధికారి కాడు. పైన జరిగే నిర్ణయాలను ఆచరణలో పెట్టటంలో మాత్రమే ఆయనకు స్వాతంత్ర్యం వుంది" అని ఆయన అన్నాడు. ఆయనే మరొకచోట, "వ్యక్తిత్వం యొక్క ఆకర్షణ అది తన్నుతాను అధిగమించటంలో, తనను మించిపోవటంలో తన మామూలు స్వభావానికికూడా అంద కుండా పెరగటంలో వుంది" అన్నాడు. కాని చెడుని పరామర్శించవలసి వొచ్చేటప్పటికి ఫ్రాంక్ చేతులు జారవేశాడు. "మనం పరిష్కరించ లేని రహస్యాన్ని ఎదుర్కొంటాం" అని ఊరుకున్నాడు. ఈ సమస్య ప్రాధాన్యతను త్రోసిపుచ్చి, పరిష్కారమార్గం సూచించినట్లు భావించాడు. "చెడుకి తాత్పర్యం చెప్పటం, దానికి కారణాలన్నీ చూపి సమర్థించటం అవుతుంది" అని వ్రాశాడు- 'అగాధమైంది' అనే గ్రంథంలో.

అయితే కారణం చెప్పటం సమర్థించటం కావచ్చు గాని, వ్యాఖ్యానించటం సమర్థించటం ఎలా అవుతుంది?

పరస్పర వైరుధ్యం లేకుండా ఏకత్వాన్ని ప్రతిపాదించే ఏ సిద్ధాంతంలోనైనా 'చెడు'కి ఒక స్థానాన్ని నిర్ణయించటం కుదిరేపనికాదు. ఈ సంకటస్థితిలో పడి దాని ప్రాధాన్యతను గుర్తించకపోవటం మంచి దనుకున్నాడు ఫ్రాంక్.

కారణం ఏదయినా, ప్రపంచంలో కనపడే చెడుకి అర్థం చెప్పలేకపోయాడు ఫ్రాంక్. కానీ చెడువున్నదని అంగీరించక తప్పేది ఏమున్నది. ఉంటే ఎక్కడనుంచి వచ్చింది? ఏదో వొకవిధంగా చెడుకి స్థానం కల్పించక తప్పదు గనక ఫ్రాంక్ భావించిన ఐక్యత కొంత సడలక తప్పిందికాదు. ఇదే అంగాంగీ భావానికి దారితీసింది. ఈ చెడు అనేది, భగవంతునిలో పుట్టి, భగవంతునిలో పెరిగి, భగవంతునికి విడిగా వుంటున్న వాస్తవికతకు చెందిన వొక భాగంలో మొదట జన్మించింది- అని ఆయన చెప్పాడు. భగవంతుడు ఉండటాన్నీ ఉండకపోవటాన్నీ కలిపే ద్వారబంధంలో వున్న అగాధంలో జన్మించింది-అని ఆయన చెప్పాడు. ఈ సిద్ధాంతాన్ని పూర్తిగా పూర్ణైక్యత చట్టంలో ఇమడ్చటానికి ప్రయత్నించాడు ఫ్రాంక్ "కష్టాలద్వారా సృష్టి భగవంతుని చేరటం, భగవంతునిలోనే జరుగుతుంది" అని ఆయన స్పష్టపరిచాడు.

**౫**

ప్రపంచంలో కనబడే ఏదోవొక లక్షణాన్ని పట్టుకొని, ఏదోవొక నెపంతో మిగిలినవాటిని తోసివేసి, తత్వశాస్త్రం నిర్మించటం తేలికే, అందులో తికమకలు వుండక,

ఉన్నంతవరకు విస్పష్టంగా వుంటుంది గనుక అటువంటి తత్వ శాస్త్రానికి అభిమానులూ, అనుచరులూ వుంటారనేది కూడా నిజమే. ప్రపంచంలో వున్న అన్ని ఆవేశాలనూ కలుపుకు రాగలిగిన తత్వశాస్త్రాన్ని సృష్టించ దలచినప్పుడే వస్తుంది చిక్కు. తత్వవేత్త శక్తి సామర్థ్యాలు కనుపించేది కూడా అప్పుడే. ఇటువంటి ప్రబల ప్రయత్నానికి పూనుకున్నాడు ఫ్రాంక్. ఈ ప్రయత్నం హర్షించదగింది. అయితే ఈ విధంగా భావించినవారు లేరా అంటే వున్నారు. ఇక ఫ్రాంక్ విశిష్టత ఏమిటి ? ఆయన విశిష్టతను ఇలా అభివర్ణించాడు జెంకోవిస్కీ. "ఆయన ప్రత్యేక విశిష్టత పూర్ణైక్య తత్వశాస్త్రంలో లేదు, సోలవ్యోవ్, ప్లోటినస్, నికొలస్ ఆఫ్ కూసా మొదలైనవారి ప్రభావం ఈ తాత్విక నిర్మాణంలో కనుపిస్తుంది. అంతేకాక ఆయనకాలంలోనే ఆయనతో పాటు, కర్సాలిన్, పోరున్స్కీ, బుల్గకోవ్ మొదలైన తత్వవేత్తలు కొద్దిపాటి భేదాలతో ఈ తాత్విక దృష్టిని ప్రచారం చేశారు. అయితే ఆయన విశిష్టత ఆధ్యాత్మిక సిద్ధాంతానికి ఆయన వేసిన పునాదిలో వుంది. జ్ఞానంయొక్క ఆదర్శానికి సంబంధించి అనుభవానికి అతీతంగానూ తర్కానికి లోబడీ వున్నదాన్ని తార్కికంగా ఊహించటంలోనూ, ఈ ప్రపంచంయొక్క, అనుభవానికి అతీతంగా వుండే నిర్మాణానికి హద్దులను నిర్ణయించటం లోనూ, వస్తుజ్ఞానంకన్నా గాఢమైనది సహజ జ్ఞానం అని వొప్పించటంలో ఆయన చూపిన చాతుర్యంలోనూ, భాగా

లకు చెందిన జ్ఞానం మొత్తం యొక్క సంకుచితజ్ఞానమేననిసిద్ధాం తీకరించటంలోనూ సమగ్రమైన సహజజ్ఞానం, అనే సిద్ధాంతాన్ని నిర్మించటంలోనూ ఆయనకు నిజంగా ఒక ప్రత్యేకమైన విశిష్టస్థానం వుంది. ఏ దేశపు తత్వశాస్త్రంలోనయినా ఈ భావాల విపులీకరణంవల్ల రష్యా తత్వశాస్త్ర చరిత్రకు ఆయన వొక నూతనాధ్యాయం కలిపినట్లే అని మనం భావించవచ్చు. పైగా ఈ భావాలనన్నిటినీ ఆయన అతి క్లుప్తంగా, మిక్కిలి సూటిగా, విస్పష్టంగా చెప్పగలగటం మెచ్చుకోదగ్గ విషయమే. ఫ్రాంక్ గ్రంథాలను రష్యాతత్వవేత్తలు, రచనావిధానంలో, ఆదర్శ గ్రంథాలుగా పరిగణించవచ్చు.

* * *

ఇప్పుడు పూర్ణైక్య తత్వశాస్త్రి చరిత్రను తెలుసుకుందాం. ఇది మానవుల మనస్సులను ఆకర్షించి ఉత్తేజపరిచే భావం. ఈ దృష్టి అనాదినుంచీ వుంది. 'స్టోయిక్స్' ఈ దృష్టిలో ప్రపంచానికి అర్థం చెప్పాలని ప్రయత్నించారు. ప్లోటీనస్, ప్రోక్లస్ మొదలయినవారు ఇందుకు ప్రయత్నించారు. అయితే ప్రయత్నాలు జరుగుతున్నకొద్దీ ఈ తత్వశాస్త్రంలో క్లిష్ట సమస్యలు పొడచూపుతూ వున్నాయి. ఫైలో అనే ప్రఖ్యాత తాత్వికుని చేతుల్లో ఈ భావం, బైబిల్ ఆలోచనకు సన్నిహితమైంది, బైబిలు ద్వారా ఇది క్రైస్తవ మతంలోకి ప్రవేశించింది. క్రైస్తవ మతంమీద ప్లేటో తత్వంయొక్క ప్రభావం గాఢంగా

వున్నప్పటికీ ఈ భావం మాత్రం మారలేదు—సృష్టి భావం. థామస్ ఎక్వినాస్ సిద్ధాంతంలో ఈ భావం కొంత చెదిరింది. ఆయన సిద్ధాంతంలో సృష్టిక్రమం విశ్వాసాన్ని బట్టీ, ఆ విష్కరణ అవటాన్ని బట్టీ అంగీకరించబడింది. ఈ సృష్టిభావం స్కోడస్ ఎరిగెనా, నికొలస్ ఆఫ్‌క్యూసా అనే మేధావులను కూడా కలవరపెట్టింది. నికొలస్ ఆఫ్ క్యూసా ఈ సృష్టిభావాన్ని పూర్ణైక్య తత్వశాస్త్రి నిర్మాణంలో ఇమడ్చలేకపోయాడు. తరువాత జరిగిన తత్వశాస్త్రి చరిత్రఅంతా ఈ నిర్మాణంలోని ప్రత్యేక భాగాలను వృద్ధి చెయ్యటంతో సరిపోయింది. తరువాత, ప్రకృతి శాస్త్రిం వృద్ధిచెందటంవల్ల మేధావుల దృష్టి మారింది. ఈ మార్పు వల్ల ప్రకృతి తత్వశాస్త్రిం, తాత్విక జీవశాస్త్రిం ప్రచారం లోకి వచ్చి, తాత్విక అన్వేషణా వైఖరిని మార్చివేసినై. పూర్ణైక్య తాత్వికదృష్టి అడుగున పడింది. సృష్టిభావం కూడా మరుగున పడింది. దానిస్థానే పరిణామదృష్టి వృద్ధి చెందింది.

వ్లాడిమిర్ షొలొవ్‌యావ్ ప్రవేశంతో ఈ పరిస్థితి మళ్ళీ మారింది. పూర్వసమస్యలన్నీ మళ్ళీ తలలెత్తినయి. పూర్ణైక్యసిద్ధాంతం మళ్ళీ జీవితాన్ని పోసుకుంది. ఆయన ప్రభావం వొక్క రష్యా తత్వశాస్త్ర చరిత్రమీదే కాక ప్రపంచ తత్వశాస్త్ర చరిత్రమీదేపడి ప్రపంచ దృక్పథాన్నే మార్చివేసింది. ఆయన తత్వశాస్త్రం ముఖ్యంగా రష్యాలో

ప్రముఖుల మనస్సుల నన్నిటినీ వశపరచుకుంది. అందరూ ఏదో ఒక రూపంలో ఈ పలుకే పలికారు. కర్సావిన్ అప్రయత్నంగా అన్వేషణజరిగే శక్తికి తన్ను అంకితం చేసుకున్నాడు. కాని ఆయన తత్వం తయారుచేసిన నిర్బంధంలో నిజమైన ఉనికి ఉక్కిరిబిక్కిరయింది. ఆయనకంటే ప్రాపంచిక వాస్తవికతకు ఫ్రాంకు దగ్గర్లోవున్నాడు. ఈ ఇద్దరూ ప్రపంచ సృష్టినిగురించి మాట్లాడారు గాని, వారి సిద్ధాంతాలలో దీనికి ప్రత్యేకస్థానం లేదు. ఈ ప్రపంచాన్ని పరాతత్వంతో కలిపే లంకె ఈ ఇద్దరి తత్వశాస్త్రాల్లోనూ బలంగా లేదు. అందువల్ల ఉద్భవించిన ఉనికికి న్యాయం జరుగలేదు. ఇక ఫ్లోరెన్ స్కీ, బుల్గకావ్‌లు వున్నారు. మిగిలిన వారిలో కంటే వీరిలో ప్రపంచంనుంచి పరతత్వానికి వెళ్ళేదారి నిష్కంటకంగా నిర్మించబడింది. ఈ ఇద్దరూ జగత్స్వభావాన్ని వివరంగానూ, విస్పష్టంగానూ నిర్వచించారు. పూర్ణైక్యత అనేభావం వీరిని కొంతవరకు హద్దుల్లో పెట్టిన మాట వాస్తవమేఅయినా, వీరిద్దరూ ఈక్షేత్రంలో భవిష్యత్తులో జరగవలిసిన సమన్వయానికి చాలా దోహదంచేశారు.

వీరిద్దరూకూడా బర్డ్యావ్, ఫ్రాంకులకువలె జీవితాలను మార్క్సిస్టులుగా ప్రారంభించి పూర్ణైక్య తత్వవేత్తలుగా మారిన వారే. వీరుకూడా రష్యాప్రభుత్వంవల్ల బహిష్కృతులు కాబడినవారే. ఫ్లారెన్‌స్కీ-విప్లవ సమయంలో టర్కిస్తాన్‌కి పంపి వెయ్యబడ్డాడు. కొంతకాలానికి మళ్ళీ మాస్కో వచ్చాడు. వెంటనే, మొదట సోలోవ్‌కీ, పిదప సైబీరియాకీ

పంపివెయ్యబడ్డాడు. ఆయన సైబీరియానుంచి తిరిగిరాలేదు. అక్కడే మరణించాడని ప్రతీతి. బుల్గకావ్‌ని సోవియట్ ప్రభుత్వం 1923లో రష్యానుంచి వెళ్ళగొట్టింది. ఆయన కొన్నాళ్ళు కాన్స్టాంటినోపిల్‌లోనూ, కొన్నాళ్ళు ప్రేగ్‌లోనూవుండి చివరకు పారిస్‌లో స్థిరవాసం ఏర్పరచుకున్నాడు. 1944లో మరణించాడు.

వీరినిగురించి జెంకోవిస్కీ 'రష్యాతత్వశాస్త్ర చరిత్ర' అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు.

'పి. ఫ్లోరెన్ స్కీ':

"ఈజగత్తుయొక్క ప్రాణంతోకూడిన ఐకమత్యానికి ఆయన ఇచ్చిన ప్రాధాన్యత, స్వభావసిద్ధంగావుండే వ్యక్తిలో వున్న మిస్టిరీ, జగత్తుయొక్క ఆదర్శక్షేత్రాన్ని గురించి ఆయనచేసిన విశదీకరణా, ఆయన సిద్ధాంతాలలో ముఖ్యమైనవి. ఈక్షేత్రం ప్రత్యక్షంగావుండే ఉనికికీ అప్రత్యక్షంగా ఉండే ఉనికికీ సంబంధించినది. ప్రపంచంలో వున్న, మారే సూత్రాలకూ, మారని సూత్రాలకూ సంబంధించినది. సృష్టికి తల్లి వేరువంటిది."

మరొకచోట ఇలా వ్రాశాడు. "ఫ్లోరెన్‌స్కీ సిద్ధాంతాలలోని ప్రత్యేకత, ఆయన ఉదహరించే మత దృష్టాంతరాల వల్ల వచ్చినవి. ఆయన జీవితం అంతా, ఈ పునాదిమీద పూర్ణైక్య సిద్ధాంతాన్ని నిర్మించటానికి అంకితంచేయబడింది. కార్సవిన్ అనుసరించిన వేదాంతానికి ముడిపడివున్న హేతువాదాన్ని అనుసరించక ఆయన మంచిపని చేశాడు.

ఫ్రాంక్ తో పోల్చి చూసినట్లయితే మతానికి సంబంధించిన సామగ్రి ఎంతో వుంది, ఫ్లోరెన్స్కీ దగ్గర. ఆయన పుస్తకాల్లో, తమ గ్రంథాలనుంచీ మహాత్ముల జీవితాలనుంచీ, చర్చినాయకుల నుంచే కాక వ్యతిరేక దృష్టికి చెందిన మూలాలనుంచీ కూడా ఉదాహరణలు కుప్పతిప్పలుగా కనుపిస్తాయి. దీనివల్ల తాత్విక సిద్ధాంతంలో సహజంగావుండే జటిలత కొంతవరకు తగ్గటానికి వీలయింది."

'యస్. బుల్గకావ్'

బుల్గకావ్ పండితుడు-తన పాండిత్య నిష్టను తాత్విక పరిశోధనలలో కూడా చూపాడు. ఆయన విషయజ్ఞానం గలవాడు. ఆలోచనా పరుడు. అందువల్ల ఆయన సిద్ధాంతాలను అంగీకరించనివారు కూడా ఆయన రచనలపట్ల ఆసక్తిని చూపేవారు. ఉనికిని తెలుసుకోటానికి అవసరమైన జగత్తుకి సంబంధించిన విషయాలను ఆయన లోతుగా పరామర్శించటం దీనికి కారణం. సృష్టించబడిన భ్రమ అనే భావనను రష్యా చరిత్రలో, ఆయన పరిశోధించినంత బాగా ఎవ్వరూ పరిశోధించలేదు. ఆయనచేసిన ఆర్థికతత్వ శాస్త్ర పరిశోధనలు ఉత్తేజపరిచేవిగా ఉంటాయి."

ఆయనే మరొకచోట ఇలా వ్రాశారు: "పాఠకులకు బుల్గకావ్ రచనలు జటిలంగా ఉంటాయి. అందమైన ఆయన శైలి ఆయన సృష్టించే బహువైన రూపాలలో చిక్కుకొని వుంటుంది. వీటిని అన్నింటిని త్రోసివేసి ఆయన ఆలోచనను చేసుకోగలిగితేమాత్రం, ఆయన మేధశ్శక్తినీ, ఆయన

అన్వేషణా తృష్ణా ఎవ్వరినైనా ఆకర్షిస్తవి... ఆయన తన ఆదర్శాన్ని పూర్తిగా జేరుకోలేక పోయాడుగాని, చేరువకు జేరుకోగలిగాడు. రష్యా తత్వశాస్త్రానికి భవిషత్తు అనేది వొకటివుంటే, ఆయన రచనలవలన కలిగే ప్రయోజనాన్ని రష్యా తత్వశాస్త్రం పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకుంటుంది.

బుల్గకావ్‌మీద ఫ్లోరెన్‌స్కీకి వున్న పలుకుబడిని ఆయనే ఇలా వర్ణించాడు. "బుల్గకావ్‌లో కంటే ఫ్లోరెన్‌స్కీలో ప్రదర్శన కుతూహలం ఎక్కువ; అయితే ఫ్లోరెన్‌స్కీకివలె బుల్గకావ్‌లో కూడా క్రొత్త మద్యాన్ని పాత సీసాలో పోసేగుణం వుంది. 1918 రష్యా విప్లవం వారిని విడదీసిన తరువాత మాత్రం బుల్గకావ్ తనకు తానుగా రూపొందాడు. వ్యక్తిత్వాన్ని పొందాడు.

"బుల్గకావ్‌లోవున్న అంతర్గత తర్కం, ఆయన ఆలోచనా విధానం, ఆయన్ని ఏకాంతజీవిగా చేసినై. ఆయన ఇతరుల అభిప్రాయాలమీద ఎప్పుడూ మోజు చూపేవాడు కాదు. తనదారి తానే నిర్మించుకొని అనుసరించాడు. అయితే షోలవ్‌యావ్, ఫ్లోరెన్‌స్కీలు మాత్రం ఆయన అంతర్గత ప్రపంచంలో శాశ్వతంగా వుండిపోయారు. బుల్గకావ్‌ది స్వభావసిద్ధంగా పురుషస్వభావమే అయినా, ఎవ్వరికో వొకరికి కట్టుబడి వుండాలనే స్త్రీ స్వభావం ఛాయలు కూడా ఆయనలో కనుపిస్తయి. ఆయన చాలాకాలం ఫ్లోరెన్‌స్కీకి కట్టుబడి వుండటానికి ఇదే కారణం"

—— . . . ——

# అద్వైత తత్త్వవేత్త

# రాధాకృష్ణ

రాధాకృష్ణను తత్త్వవేత్తగా అర్థం చేసుకోవటం అంత తేలికైనపని గాదు. బహుముఖ ప్రజ్ఞగలవాడవటమే దీనికి కారణం. ప్రపంచంలో తత్త్వవేత్తగా ప్రసిద్ధి చెందిన వారెవరూ ఈయన పనిచేసినన్ని రంగాలలో పనిచేసివుండరు. ఈయన ఉపాధ్యాయుడు, ఆచార్యుడు, పండితుడు, పరిపాలనాదక్షుడు, రాజనీతిజ్ఞుడు, అన్నిటినీమించి తత్త్వవేత్త. ప్రాచ్యపాశ్చాత్య దేశాల్లో భారతీయ సంస్కృతికి ప్రతినిధిగా ప్రవర్తించగలిగిన ప్రజ్ఞాధురీణుడు. ఇన్ని కార్యరంగాల్లో ఆయన జయప్రదంగా కృషిచెయ్యగలగటానికి యీయన తాత్త్వికదృష్టే కారణమని మనం చెప్పుకోవచ్చు. పరభావ సహిష్ణుత, ఈయన తాత్త్వికదృష్టిలో ముఖ్యలక్షణం అవడం వలన ఏ పనినయినా సాధించటానికి అవుసరమయిన కలుపుగోలుతనం, జనాకర్షణ ఈయనలో ఎక్కువగా కనిపిస్తాయి. దీనికి తగినట్లు యెటువంటి జటిలమయిన భావాన్నయినా తేలిగ్గా, సూటిగా చెప్పగలిగిన సామర్థ్యం ఉండటం ఈయన పనిని సుకరం చేసింది. ఈయన శక్తిసామార్థ్యాలను గురించి 'భారతతత్త్వశాస్త్ర మూలాధారం' అనే గ్రంథం ఈవిధంగా ఉద్ఘాటించింది. ఈయన అపారపాండిత్యం, అత్యద్భుత శైలి సంపూర్ణసహనం, ఆయన్ని భారతదేశంయొక్క తాత్త్విక, మత, సంస్కృతిక భావాల వ్యాఖ్యాతగా రూపొందించడమే

గాక, ప్రపంచ మేధావుల్లో ఒకరినిగా పరిగణింప బడేట్లు చేశాయి. ఆయనతత్వం పరిపూర్ణ భావవాదం. కాని ఏదో ఒకశక్తివుండి అది చెప్పినట్లు యీ ప్రపంచం నడుస్తూ వుందనుకోవడంలో తీసివేయవలసిన అనేక సత్యాలను ఆయన తోసివేయడు. ఈ సత్యాల నన్నింటినీ ఇముడ్చుకుంటేనే అభివృద్ధిచెందే భావవాదం ఆయనది. అంటే అనుభవంలోకివచ్చే అనేక అనుభవాలను, వాస్తవికతను ఆయన అంగీకరిస్తాడు. తత్వశాస్త్రంలోని అన్ని స్థాయిల్లోను ఆయన అసామాన్యమైన సమన్వయ శక్తిని ప్రదర్శిస్తాడు. 'అతి సర్వత్ర వర్జయేత్' అనే భారతీయ సాంస్కృతిక సూక్తిని ఆధారంగాతీసుకుని తనఅల్లికను పూర్తిచేస్తాడు. ఈవిధంగా ఆయన భావవాదానికీ, దాని వ్యతిరేకవాదానికీ, భగవంతునికీ, ప్రపంచానికీ వాస్తవికతను స్థూలంగా కనిపించేదానికీ హేతువాదానికీ, ఆత్మజ్ఞానానికీ, జీవితానికీ, వేదాంతానికీ వున్న వైరుధ్యాన్ని తాత్వికసిద్ధాంతాల్లోనూ, వివిధ మతాల్లోనూ వున్న వ్యతిరేకతనూ నిర్మూలించి సమన్వయ పరుస్తాడు. రాధాకృష్ణ పండితులు అసహనానికి, మాధ్యానికీ, పాక్షికదృష్టికి, అన్నిరకాల పెడవాదులకు వ్యతిరేకి. ఈ వ్యతిరేకతను ఆయన తాత్వికదృష్టితో సమర్థిస్తాడు. ఆత్మజ్ఞానంవల్ల వచ్చే సమగ్రచింతనవల్ల కలిగే దృష్టి ఇది. ఈ దృష్టి తెలివిగా కనపడాలనే వాంఛను నిర్మూలిస్తుంది.

అయితే వివిధ సిద్ధాంతాలను గాని, రూపాలను గాని సమన్వయం చెయ్యడమేనా రాధాకృష్ణపండితుడు చేసింది? ఆయన స్వంత ఆలోచన లనేవి ఏవీ లేవా? అనే ప్రశ్నలు

యీ సందర్భంలో ఉదయించవచ్చు. ఎందుకు లేవు? ఉన్నవి. సమన్వయం చేయడం మన అనేక క్రొత్త లక్షణాలు బహిర్గత మవుతాయి. ఈ విధంగా బహిర్గతమయిన లక్షణా లకు ఈయన కారకు డవటంవలన ఈయన స్వతంత్రాలో చనాపరుడూ, నిశితమైన దృష్టికల వాడూ అని చెప్పాలో వలసివస్తుంది. తత్వశాస్త్రంలో స్థూలదృష్టికి కనిపించే రెండు వ్యాఖ్యానాలకు ఈయనను కర్తగా మనం గుర్తించవచ్చు. అందులో మొదటిది మాయావాదానికి యీయన యిచ్చిన నూతనవ్యాఖ్యానం. ఈయన చెప్పే మాయావాదానికి, ఇతర భారత తత్వశాస్త్రజ్ఞులు చెప్పే మాయావాదానికి చాలా తేడా వుంది. ఈయనదృష్టిలో మాయావాదమంటే మిథ్యా వాదం కాదు. ప్రపంచం మాయఅంటే ప్రపంచం లేదు అని కాదు. ఈ ప్రపంచం అనాది పదార్థం కాదని మాత్రమే ఈయన ఉద్దేశ్యం. అయితే యీ ప్రపంచం అవాస్తవిక మైనదనిగానీ, లేనిదనిగానీ అర్థం చెప్పటానికి వీలు లేదు. ఈ ప్రపంచం వాస్తవికమైనదనే ఈయన నిర్ణయం. దాని అస్తిత్వం వారి పూర్ణభావాలలో ఇమిడిఉంది. ఈ ప్రపం చంలో కనపడే రూపభేదాలకు మూలం పరిపూర్ణభావంలో వుంది. అయితే ఈరూపభేదాలు బ్రహ్మ యొక్క సమగ్రతను గాని, పరిపూర్ణతను గాని కదిలించలేవు. ఈ విధంగా రాధాకృష్ణపండితులు ప్రాచ్యపాశ్చాత్య దృష్టులనుకూడా సమన్వయపరచగలిగారు. ఇందువల్లనే భారత తత్వశాస్త్రాన్ని పాశ్చాత్యులు సానుభూతితోను ఆదరితతోను చూడగలిగేట్లు

చేయగలిగారు. ప్రపంచానికి సరిపోయే ఒక విశిష్టతత్వ శాస్త్రానికి పునాది వెయ్యగలిగారు.

ఇక వీరి తాత్వికదృష్టిలో రెండవలక్షణాన్ని పరిశీలిద్దాం. అది వీరు ప్రచారంచేసే ఆత్మతత్వం. ఈ తాత్విక దృష్టిలో మూలసూత్రాల్లో అన్నిమతాలూ ఒకటే. అన్ని మతాల సారాంశం ఒకటే. యెందుకంటే మతమనేది ఒక సిద్ధాంతం కాదు. కొన్నిసూత్రాల సంపుటీకరణంకాదు. అది వాస్తవికతలోకి చూడగలిగినదృష్టిని వ్యక్తికి సంపాదించి పెడుతుంది. మతమంటే అంతే. ఈ దృష్టి కలిగివుండడం వలన రాధాకృష్ణ పండితులు మతవైషమ్యాలనూ, కలహాలనూ నిర్మూలించుకొనడానికి అవకాశం కలిగించిన న్యాయవాది. మూఢనమ్మకాలకూ అధికార ప్రాబల్యంకోసం పడే ఆరాటానికి అతీతంగా వుండగలిగినా సజీవ సిద్ధాంతాన్ని సృష్టించగలిగాడు. ఈ సిద్ధాంతానికి గాంభీర్యాన్ని, గన్యస్థానాన్ని పొందుపరచ గలగటమే గాక నిత్య జీవితానికి పనికివచ్చేదిగాకూడా చేశారు.

ఈ విధంగా భారతదేశంయొక్క ప్రాచీన సిద్ధాంతాన్ని స్వచ్ఛపరచి, ప్రస్తుతపరిస్థితికి సరిపోయే నూతన వ్యాఖ్యానాల్ని దానికి జతపరచి, విశ్వమానవాభ్యుదయానికి తోడ్పడిన వారిలో రాధాకృష్ణ పండితులు ముఖ్యులని మనం చెప్పవచ్చు. ప్రపంచశాంతికి, విశ్వమానవ సృష్టికి పునాదివేసిన ప్రముఖు లీయన. ఈయన్ని గురించి ఇంకా విపులంగా తెలుసుకొందాం.

౨

ఈయన పూర్తి పేరు సర్వేపల్లి రాధాకృష్ణ. ఈయన మద్రాసుకు 40 మైళ్ళదూరంలో నున్న తిరుత్తని అనే చిన్నగ్రామంలో సెప్టెంబరు 5, 1888 వ సంవత్సరాన జన్మించారు. తిరుపతి అందరికీ తెలిసిన పుణ్యతీర్థమే. అదే విధంగా తిరుత్తనికూడా ఒక పుణ్యతీర్థం. తన చిన్నతనంలో రాధాకృష్ణ ఈ రెండు పవిత్రస్థలాల్లోనూ విద్య నభ్య సించారు. వారు మెట్రిక్ వరకు క్రైస్తవమత పాఠశాలల్లో చదవడమే కాక తరువాత మద్రాసులోని క్రైస్తవ కళాశా లలో చదివారు. బి. ఏ. లోనూ, ఎమ్. ఏ లోను ప్రథము లుగా ఉత్తీర్ణులయ్యారు. తరువాత అంటే వీరు ప్రపంచ విఖ్యాతిని గడించిన తరువాత తాను తత్త్వవేత్తగా రూపొంద డానికి కారణాలను వెదుకుతూ 'బహుశా తిరుత్తనివంటి పుణ్యతీర్థంలో జన్మించడం, తిరుపతివంటి పుణ్యతీర్థంలో విద్యనభ్యసించడం, మతవిద్యా సంస్థల్లో చదువుకోవడం, కొంతవరకు కారణం కావచ్చు' అని అన్నారు. అంకు రార్పణ ఏవిధంగా జరిగినా పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ హిందూమతాన్ని గురించి తెలుసుకోవాలనే ఆపేక్ష, తెలుసు కున్నతర్వాత దానిమీద అభిమానం వీరికి పెరుగజొచ్చి నాయి.

కాలేజీ చదువు పూర్తికాగానే ఈయన మద్రాసులో ఒక కాలేజీలో తత్త్వోపన్యాసకులుగా చేరారు. తత్త్వ శాస్త్రాన్ని విద్యార్థులకు తేలిగ్గా అర్థమయ్యేటట్టు బోధించడం

ఈయన ఆదర్శంగా పెట్టుకొన్నారు. తెలిసేటట్లు చెప్పడం ముఖ్యం. అందువల్ల కొంత భావగాంభీర్యతను కోల్పో వలసి వచ్చినాసరే, అని వీరనుకొని ప్రవర్తించినట్లు కనబడు తోంది. కాలేజీలో పనిచేస్తూనే వీరు ప్రముఖ పత్రికలకు వ్యాసాలు రాసి పంపుతుండేవారు. ఈ రచనలద్వారా ప్రపం చంలో వున్న మేధావులతో వీరికి కొంతపరిచయం ఏర్ప డింది. తరువాత వీరు కొంతకాలం మైసూరు విశ్వవిద్యా లయంలో తత్వాచార్యులుగా పనిచేశారు. 1922 లో కలకత్తా విశ్వవిద్యాలయంలో పనిచేశారు. 'భారతీయ తత్వశాస్త్రం' అనే వీరి ఉద్గ్రంథం ఈ రోజులలోనే ప్రచురించబడింది. 1926 లో ఇంగ్లాండులోనూ, పిమ్మట అమెరికాలోనూ వీరు అనేక ఉపన్యాసాలిచ్చి, భారతీయ తత్వశాస్త్రాన్ని ప్రచారం లోకి తెచ్చారు. కొన్నాళ్ళకు ఇంగ్లాండులో ఆక్సుఫర్డ్ విశ్వ విద్యాలయంలోని తత్వశాఖకు ఆచార్యునిగా వీరికి ఆహ్వానం వచ్చింది. ఈ ఆచార్యత్వం యితర దేశస్థునికి యివ్వడం ఆ విశ్వవిద్యాలయ చరిత్రలో అదే ప్రథమం. దీనివల్ల రాధాకృష్ణ పండితునికి జరిగిన సన్మానం ఎటువంటిదో మనం ఊహించవచ్చు. అప్పుడప్పుడు విశ్వవిద్యాలయంలో ఆచా ర్యత్వం నెరపుతూనే వీరు ఆ దేశాలలో ఉపన్యాసాల ద్వారా, గ్రంథప్రచురణద్వారా, ముఖ్యంగా మేధావుల మనస్సుల్లో భారత తత్వశాస్త్రాన్ని గురించి ఒక విశిష్ట రూపాన్ని సృష్టించి, స్థిరనివాసం ఏర్పడేట్టు చేయగలిగారు. 1930 లో వీరు ఇండియాకు తిరిగి రావడం, కలకత్తా విశ్వ విద్యాలయం వీరిని జీవితాంతంవరకు తత్త్వశాస్త్రాధ్యాప

కునిగా నియమించడం వెంట వెంటనే జరిగినాయి. 1931 లో వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి స్వీకరించారు. ఆపదవిలో 5 సంవత్సరములు పనిచేసి ఆ విశ్వవిద్యాలయ సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడి 1936 లో తిరిగి ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయానికి అధ్యాపకునిగా వెళ్లారు.

ఈ విధంగా వీరు స్వయం కృషివలన క్రమక్రమేణా ప్రపంచఖ్యాతిని సంపాదించారు. గొప్ప తత్వవేత్తగా ఖ్యాతి సంపాదించడమువలన నానాజాతి సమితిక్రింద పనిచేసే మతి మంతుల సహకారసంఘంలో సభ్యులుగా నియమితులైనారు. ఆ సంఘంలో వీరు 9 సంవత్సరాలు పనిచేసి, విజ్ఞాన కళా రంగాల్లో ప్రపంచ పౌరులమధ్య స్నేహం, సన్నిహితత్వం పెంపొందటానికి తోడ్పడ్డారు. ఈపని పూర్తిఅయినతర్వాత 1939 లో వీరు కాశీ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షు లైనారు.

రెండవ ప్రపంచ యుద్ధంతరువాత ప్రపంచ శాంతి కోసం ఐక్యరాజ్యసమితి స్థాపించబడడం జరిగింది. ఈసమితికి నానాజాతి సమితికన్నా యెక్కువ అధికారాలూ బలం కూర్చ బడినాయి. ఈసంస్థ శాఖోపశాఖలుగా విస్తరించింది. ఆ శాఖ లలో 'విద్యా, వైజ్ఞానిక సాంస్కృతిక మహాశాఖ' ఒకటి. ఈ మహాసభకు భారతదేశ ప్రతినిధి వర్గ నాయకుడిగా వెళ్ళి 1946 నుంచి 1950 వరకు పనిచేశారు రాధాకృష్ణ పండితులు. ఆకాలంలో ప్రపంచం ఒకటిగా కావలసినతరుణం సమీపించిందనీ, వివిధదేశాల కలయికతో ప్రపంచ రాజ్యాన్ని స్థాపించవలసిన అవసరం వచ్చిందనీ, వీరు అనేక

మహోపన్యాసాలు చేశారు. "ప్రపంచం అంతా ఒకటయి పోతే దేశాలమధ్య పరస్పర వైషమ్యాలవల్ల వచ్చే యుద్ధాలు తప్పుతవి. ప్రపంచ శాంతికి పునాది ఏర్పడుతుం" దని వీరు భావించారు. అక్కడనుంచి వీరు ప్రత్యే కాహ్వానంపై చైనాదేశం వెళ్ళారు. ఆ దేశంలో అనేక ఉపన్యాసాలు చేయడమేగాక ఆ దేశంయొక్క ప్రాచీన సంస్కృతిని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించారు.

తరువాత మనదేశం స్వాతంత్రమయింది. మనదేశం స్వతంత్రమవడంతో, రాధాకృష్ణపండితుల శక్తిసామర్థ్యాలు విజృంభించినాయి. అంటే అలా విజృంభించటానికి తగిన అవకాశాలు ఆయనకు ఒనగూడినవన్నమాట. జవహర్‌లాల్ నెహ్రూ వీరిని రష్యా దేశానికి రాయబారిగా నియమించారు. రష్యా మేధావులు, వీరిపేరు అంతకుముందే విని వున్నారు. వీరు వ్రాసిన గ్రంథాలు అంతకుముందే చదివి వున్నారు. అందుకనే వీరిని ఆనాటి రష్యా విదేశాంగమంత్రి ఆహ్వానిస్తూ, "మీరు మాకు కొత్తవారుకాదు. మీ గ్రంథాలద్వారా మీరు మా ప్రజలకు చిరపరిచితులే. మా దేశానికి మీరు రాయబారిగా రావటం చాలా సంతసించ వలసిన విషయం!" అని అన్నాడు.

వీరు రష్యా దేశంలో ఉన్నప్పుడు ఆ దేశ పరిస్థితుల లోనూ, కమ్యూనిష్టు వాతావరణంలో పెరిగిన రష్యన్ల మనస్తత్వాన్ని బాగా అవగాహన చేసుకున్నట్లు కనబడు తోంది. సిద్ధాంతంగానేగాక, ఆచరణలోవున్న కమ్యూ నిజాన్ని వీరు చూచారు. మామూలుగా విదేశ రాయబారు

లకు దర్శనమివ్వని స్టాలిన్, వీరిపట్ల వేరు విధంగా ప్రవర్తిం చడం మనం గమనించవలసిన విషయం. రాధాకృష్ణ పండి తునకు రష్యా దేశానికి వెళ్ళిన మొదటి రోజుల్లోనే స్టాలిన్‌ను కలుసుకునే అవకాశం లభించింది. ఇద్దరూ ప్రపంచ పరిస్థితు లనుగురించి చర్చించినట్లు ప్రతీతి. రాయబారి పదవినుండివదలి వీరు స్వదేశానికి తిరిగి వచ్చేప్పుడుకూడా స్టాలిన్ స్వయంగా పిలిపించుకొని వీరితో చాలాసేపు మంతనాలాడారుట. దీన్నిబట్టి రాధాకృష్ణ పండితునియెడల స్టాలిన్‌కు చాలా సద్భావం, విశ్వాసం ఉన్నట్లు కనిపిస్తోంది. వీరికే కాదు ఎటువంటివారి సన్నిహితత్వాన్నయినా త్వరగా చూరగొనగలిగినశక్తి వీరికిఉంది. స్టాలిన్ వీరిని గురించి "మానవ సమాజాభివృద్ధికోసం రాధాకృష్ణ ఎంతో ఆరాటపడతారు. ఆయన మాట్లాడుతుంటే గాయపడిన మానవ హృదయం తన ఆరాటాన్ని వెళ్ళబోసుకున్నట్లు వుంటుంది" అని అంటే మరొకప్రక్క చర్చిల్ ప్రపంచాన్ని నేడు ఎదుర్కొంటున్న భీకర సమస్యలను గురించి రాధాకృష్ణకంటే ఎక్కువ తెలిసినవా రెవరూ లేరని నా అభిప్రాయం అని తన విశ్వాసాన్ని ప్రకటించాడు. వీరు విరుద్ధ సిద్ధాంతాలకు చెందిన నాయకుల ఆదరాభిమానాలను పొందడానికి కారణం ఈ రెండు సిద్ధాంతాలను ఇముడ్చుకోగలిగిన విశాలతత్వం వీరి దృష్టిలో ఉండడమే.

రష్యానుంచి తిరిగివచ్చినపిదప, ఈయన భారతదేశానికి ఉపాధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయినారు. ఆనాటి నుంచి ఈనాటివరకు ఈయన ఉపాధ్యక్షులుగానే వుంటు

న్నారు. వీరి జీవితం అసదృశమైనది. వీరు ధరించు వస్త్రములవలెనే ధవళకాంతులను విరజిమ్ముతున్నది.

3

అన్ని వాదాలలో వున్నట్లే భావవాదంలో కూడా అనేక రకాలు వ్యాప్తిలో వున్నాయి. భగవంతుడు అనేవాడు వొకడు వుండి లీల జరుపుకు పోతున్నాడు గనుక, మానవుడు సాక్షీభూతంగా వుండటంకంటే చేసేది ఏమీ లేదనీ, తన స్వంత బాధ్యతమీద ఏదన్నా చెయ్యటానికి సంకల్పిస్తే అవి భగవదపచారమేననీ, వాదించేవారు వీరిలో లేకపోలేదు. భావమే నిత్యమైందనీ, అనాది పదార్థమనీ, అందువల్ల దానికి భిన్నంగా వున్నట్లు మనకు కనిపించేదంతా భ్రమేగాని నిజం కాదనీ వాదించేవారూ వీరిలో వున్నారు. లౌకిక ప్రపంచం, పదార్థంతో నిర్మించబడిన శరీరం మొదలైనవన్నీ, పంకిలమైనవనీ, అందువల్ల అభివృద్ధి నిరోధకాలనీ భావించి, వాటిని రోసి జీవించటం ముక్తికి సాధనమని భావించి వాదించేవారూ వీరిలో వున్నారు. ఒక సిద్ధాంతానికి వ్యాఖ్యానం చెప్పటం అనేది జరగవలసి వచ్చినప్పుడు భిన్నాభిప్రాయాలకు తావు ఏర్పడుతుంది. ఇది వొక్క భావవాద ప్రత్యేకతే కాదు. అయితే ప్రతి సిద్ధాంతానికీ మూలసూత్రం వొకటుంది. తరచి తరచి దాన్ని చేరుకోగలిగితే, ఆ సిద్ధాంతంయొక్క యదార్థ స్వరూపం గోచరిస్తుంది. ఇందుకు ఎంతో కృషి చెయ్యాలి. అలా కృషిచేసి మూలసూత్రాన్ని జేరుకో గలిగిన కొద్ది

మందిలో రాధాకృష్ణపండితు లొకరని మనం నిర్ధారణగా చెప్పుకోవచ్చు. అందుకనే 'భావవాది జీవిత దృక్పథం' అనే గ్రంథంలో రాధాకృష్ణ పండితులు, "భావవాది జీవిత దృక్పథం, ఒక నిర్ణీత పథకానికి కట్టుబడి వుండేది కాదు. దానికి అనేక రంగులున్నాయి. అనేక రూపాలున్నాయి. అయితే భిన్నంగా కనుపించే ఇవన్నీ ఒకే చైతన్యంనుంచి ఉద్భవించినవే నని నిరూపించే ముఖ్య సూత్రాలు కొన్ని వున్నాయని మనం తెలుసుకోగలం" అని అన్నారు. తమ అభిప్రాయాన్ని వీరింకా విపులపరచి చెప్పారు. "ప్రాచ్య పాశ్చాత్య దేశాలలో భావ వాదానికి పెద్ద చరిత్ర, ఎడతెగనిది వున్నది. ప్రాచ్య దేశాలలో వేదాలూ, ఉపనిషత్తులూ, పాశ్చాత్యదేశాలలో సోక్రటీస్, ప్లేటో మొదలైన తత్వవేత్తల భావాలూ, ఈ సిద్ధాంతాన్ని అతి విశాలవంతమైన దానినిగానూ, ఏ పరిస్థితినైనా తనలో ఇముడ్చుకో గలిగిన శక్తిగలదానినిగానూ నిర్వచించి అట్టిపెట్టినై. భారతదేశంలో వాస్తవిక సిద్ధాంతాలుగా పరిగణించ బడే, న్యాయ, వైశేషిక, సాంఖ్య సిద్ధాంతాలూ, యోగసూత్రాలూ, మీమాంసా, ఉపనిషత్తులు ప్రతిపాదించే మూల సత్యంతో భేదించవు. ఉపనిషత్తులు వాస్తవికత్వాన్నీ, ఉన్నతమైన విలువలనూ, విడదియ్యటానికి వీలులేదని చెపుతున్నయి. పరిపూర్ణ భావం వాస్తవికమైనదీ, చైతన్యయుతమైనదీ, స్వతంత్రం కలిగిందీనీ, అంటే అది సత్తు, చిత్తు, ఆనందం. పాశ్చాత్యదేశాల్లో సోక్రటీస్, ప్లేటోలు మొదలుకొని, బ్రాడ్లీ, అలెగ్జాండర్ వరకూ

వాస్తవికత్వానికీ విలువకూ అవినాభావ సంబంధం వున్న దనే అభిప్రాయం పదేపదే ఉద్ఘాటించబడింది. ప్లేటోకి, మంచిని పొందటం, విశ్వంయొక్క అర్థం. ఈ ప్రయోజనం కోసం విశ్వం అస్తిత్వాన్ని కలిగివుంది.

ఇంత విశాలమైనది రాధాకృష్ణపండితుని భావవాదం. అందుకనే, 'తత్వశాస్త్రం భావవాద జనితమే ... దానికి సంబంధించిందే' అనే హెగెల్ అభిప్రాయాన్ని వారు సమర్థించ గలిగారు. 'కనుపించేదానికీ వాస్తవికత్వానికీ, సత్యానికీ, జరిగిందానికీ, ఉనికికీ, సారాంశానికీ పోటీపెట్టి ఈ కనుపించే దాన్ని అధిగమించి భావప్రపంచం వొకటి వున్నదనే ఊహను నిర్ధారణచేసింది. తత్వశాస్త్రం ఈ ధోరణిలో సమగ్రమైన భౌతికవాదం, భావవాదమే. ఎందుకంటే భౌతికవాదులు అనాదివస్తువుగా వ్యవహరించే పదార్థం ఒక రూపాన్ని ధరించివున్న వాస్తవికత కాదు. అది వొక భావం మాత్రమే. మన అనుభూతిలో వున్న ప్రపంచాన్ని నవీన శాస్త్రం నీడలక్రిందకూ గుర్తులకిందకూ తేల్చింది. అది ఉద్ఘాటించే, 'ఇయోనున్సు' 'ఎలక్ట్రాన్స్' 'ఇడ్స్' కనుపించే వస్తువులు కావు. అయినప్పటికీ ఆలోచించటానికి ఉపకరిస్తాయి గనక వాటిని యథార్థమైనవిగా భావించటం జరిగింది. వాస్తవికత్వాన్ని ఏదో వొకరూపంలో చూడాలని ఎంత ప్రయత్నించినా అది సంభవం కావటంలేదు. దాని కొక స్వరూపాన్ని ఇవ్వలేకపోతున్నాం. భావాలు వాస్తవికత్వానికి తప్పనిసరి గనుక అవి ఎప్పుడూ మనతో వుంటూనే వున్నవి. వాటిని మనం ఆదర్శాలుగానో, విలువలుగానో

వ్యాఖ్యానిస్తే, భావవాదదృక్పథం రూపొందుతుంది" అని అన్నారు.

వీరు వెలిబుచ్చిన పై అభిప్రాయాలనుబట్టి వీరు ప్రతిపాదించిన భావవాదం ఎంత విశాలమైందో మనం తేలిగ్గా ఊహించుకోవచ్చు. వీరి భావవాదం విశ్వాన్నంతా కప్పగలిగిన శక్తిగలిగినది. ఈ విశ్వంలో కనబడేవి అనాదిపదార్థం యొక్క వివిధరూపా లని మనం ఊహించినప్పుడు, ప్రతిఒక్క దానినీ మనం సానుభూతితో అర్థంచేసుకోవడం, సబబుగాని కొన్ని రూపాలను పనికిరానివాటిక్రింద త్రోసివేసి మరికొన్ని రూపాలనుచేపట్టడం సబబుగా కనిపించదు. విశ్వంలో కనిపించే అన్ని రూపాలకు ప్రయోజనం కల్పించి వాటికి ఉచితస్థానాలను యివ్వగలిగినప్పుడే, ఏ తత్వశాస్త్రానికయినా విలువ ఏర్పడుతుంది—మానవుల మనస్సుల్లో స్థావరం ఏర్పడుతుంది. ఈ పనిని అతి ప్రతిభావంతంగా నిర్వర్తించినవారిలో రాధాకృష్ణ పండితు లొకరని మనం నిరాఘాటంగా చెప్పుకోవచ్చు.

మాయావాదాన్ని అంగీకరించకపోయినప్పటికీ రాధాకృష్ణ పండితులు శంకరభగవత్పాదుల శిష్యులని డాక్టర్ పి. టి. రాజుగారు ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్రంలో విశదపరిచారు. మాయావాదం అర్థాన్ని వీరీవిధంగా విశదీకరించారు. "ఈ ప్రపంచం సృష్టిని మనం అర్థంచేసుకోలేమనేగాని, ఈ ప్రపంచానికి ఏ విధమైన విలువగానీ ప్రాముఖ్యతగానీ లేదని ఈ వాదం అభిప్రాయం కాదు. వీరు యీ ప్రపంచాన్ని సత్తు అసత్తుల కలయికగా భావించగలిగారే

గాని సత్తుగా గానీ, అసత్తుగా గాని భావించలేరు. తార్కికంగా అద్వైతానికి అర్థంచెప్పే పండితుల దృష్టికి యిది వ్యతిరేకం. శంకరభగవత్పాదులే 'ఒకచోట పైకి కనిపడేది సత్యాసత్యాల కలయిక' అని అన్నారు. రాధాకృష్ణ పండితులు శంకరభగవత్పాదుల యొక్క ఈదృష్టిని అనుసరించినట్లు కనబడుతుంది. వీరు శంకర భగవత్పాదుల మాయావాదానికి వ్యాఖ్యానాన్ని నిరూపించడమేగాక, శంకరుల రామానుజుల అభిప్రాయాలనుకూడా సమన్వయం చేశారు. ఏ విధంగా సమన్వయం చేసిందీ యిలా క్రోడీకరించారు. డాక్టర్. పి. టి. రాజుగారు. "శంకర భగవత్పాదులు ఉద్దేశించిన బ్రహ్మం అఖండమైంది. రామానుజులు ఉద్దేశించిన బ్రహ్మం భగవత్‌స్వరూపుడు. భగవంతుడూ ఒకవ్యక్తే. అతనికి రూపం వుంది. అఖండశక్తి వ్యక్తికాదు. దానికి రూపం లేదు. భగవంతుడు మేధస్సుకు సంబంధించిన రూపం. అఖండశక్తిని మాత్రం ఆత్మజ్ఞానం ద్వారానే తెలుసుకోగలం. మేధస్సుకంటె ఆత్మజ్ఞానం గొప్పది. అది 'నీవు' 'నేను' అనే భేదాన్ని అధిగమించగలదు. మన ఆలోచనా శక్తి అనేక హద్దులకు లోబడి ఉంటుంది. కాబట్టి హేతువాదానికి అతీతంగావున్న అఖండశక్తిని తెలుసుకోదలచినప్పుడు దానిని తన హద్దులలోకి యిరికించడానికి ప్రయత్నిస్తుంది. కాబట్టి మన ఆలోచనా నియమాలలోకి ఇరికించబడిన అఖండశక్తే భగవంతుడు. ఆలోచన 'నేను' 'నీవు' అనే భేదాన్ని రద్దుచేయలేదు. ఆత్మజ్ఞానంవల్ల, ఈ భేదాలను అధిగమించవచ్చు."

ఈ దృష్టిని రాధాకృష్ణ పండితులు 'భావవాది జీవిత దృక్పథం' అనే గ్రంథంలో ప్రతిభావంతంగా ప్రదర్శించారు; సమర్థించారు. "ఊహకిగానీ, మేథస్సుకిగానీ, కనుపించే దానికిగానీ వేరుగావుండే చైతన్యం వొకటి వుంది. అది తనకు తానే సాక్షి అవటమే కాక స్వయం సంపూర్ణమైంది. వాస్తవికతను తెలుసుకునేందుకు రావిడిపట్టిన ప్రత్యక్షాను భవంతోనే, అన్ని కాలాలకు చెందిన మత ప్రచారకులు భగవంతుని అస్తిత్వాన్ని నిశ్చయం చేసుకోగలిగారు. బయటి వాతావరణం యొక్క స్వభావం, వ్యక్తి స్వభావం వంటిదే. దాని స్పర్శ అప్పుడప్పుడూ దీనికి సోకుతూవుంటుంది. ఈ ఆధ్యాత్మిక వాతావరణం స్వభావాన్ని నిర్వచించటంలో అనేక భేదాలు పొడచూపవచ్చు. కాని వొకటి మాత్రం నిజం. సత్యాన్వేషణకూ మంచిని సిద్ధించుకోటానికీ ఇంత కంటె వేరొక కారణం కనుపించదు. ఆత్మ పరమాత్మల సంయోగం విశ్వవ్యాప్తమైంది అనే ఆత్మజ్ఞానానికి ఒక్కొక్క సారి భగవంతుని త్రోసివేసేటంత విలువ యివ్వబడింది. వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని రద్దుచేసేటంత విలువ యివ్వ బడింది. ఈ చైతన్యంకలిగిన వ్యక్తులు మహాత్ములు. వీరిదృష్టి అఖండమైనది. అఖండమైన దృష్టిని కలిగివుండటంవలన వీరు పరమత సహిష్ణుత, విశ్వానికంతటికీ వర్తించే నైతికస్వభావంలో నమ్మకం, చెదరని ఆశాపూరితదృక్పథం, పరమాత్మ యొక్క పూర్ణాధిక్యంలో ఏకాగ్రత కలవారయినారు.

మతం యొక్క ఆదర్శం ఆధ్యాత్మికసంబంధమైన అంతర్ దృష్టిని పొందటం. దీనికి మార్గం నైతిక జీవితం, ధ్యానం."

ప్రపంచ పరిణామంలో ఒక్కొక్కదశలో ఒక్కొక్క రకమైన చైతన్యం వుంటుందని రాధాకృష్ణ పండితులు చెపుతారు. మృగదశలో చూడటానికీ పని చెయ్యడానికీ అవుసరమైన చైతన్యం వుంది. మానవదశ వచ్చేటప్పటికి తన్ను తాను తెలుసుకునే చైతన్యం ఆవిర్భవించింది. ఇది కాక, ఆధ్యాత్మిక చైతన్యం అనేది ఒకటి వుంది. దీనిని అతీత చైతన్యం అనికూడా అనుకోవచ్చు. పైన ఉదహరించిన మొదటి రకం చైతన్యంవల్ల మృగానికి దానికి సంబంధించిన వాతావరణానికి ఒక విధమైన మానసిక కలయిక ఏర్పడుతూ వుంది. రెండవరకం చైతన్యంవల్ల ఏర్పడే కలయిక తార్కికమైనది. ఇక మూడవది ఆధ్యాత్మిక కలయిక. ఈ స్థాయిలో మానవునికి పరమాత్మ యొక్క స్పృహ వుంటుంది. ఈ స్పృహ మేధస్సునుంచి బహిర్గతంఅయ్యే దానివలె ఉండదు. అది తనకు విడిగావున్న వస్తువును గ్రహించే తెలివిగా వుండదు. ఈ స్పృహలో 'నేను' 'నీవు'గా కనుపిస్తుంది. తనే తనకు విడిగా వున్న వస్తువు అనిపిస్తుంది. అంటే తన్ను తాను పరామర్శించుకో గలిగిన శక్తి ఆవిర్భవిస్తుంది. ఈ స్థాయిలో కాలాకాశాలకు అతీతంగా వుండేది, అనుభవానికి పునాదిగావుండే వాస్తవికత తానేనని గుర్తిస్తుంది.

ఈ ఆధ్యాత్మిక శక్తియొక్క స్వభావాన్ని ఈ విధంగా క్లుప్తపరచి చెప్పారు రాధాకృష్ణ పండితులు. "తననూ, తనకు విడిగావున్న వస్తువునీ ఇముడ్చుకోగలిగిన ఈ శక్తి స్వయంపోషకమైందీ, స్వయంపూర్ణమైందిన్నీ. ఏదో ఒక విధమైన అపవాదుకు లోబడకుండా, మన అనుభ

వంలో వున్న దేనినీ వాస్తవికమైన దానినిగా వ్యక్తిత్వంగల దానినిగా వర్ణించలేం. ఈ ఒక్క-ఆధ్యాత్మిక శక్తికి తప్ప, తన్ను విభజించేది దీనిలో ఏదీలేదు. తనకు సరిహద్దులను నియమించేది దీనికి బయట ఏదీ లేదు. మనపూర్తి కోర్కెలను, మేధస్సుయొక్క- కాంక్షలను ఇది మాత్రమే తృప్తిపరచ గలదు. ఉన్న సర్వస్వమూ ఇదే... అస్తిత్వమూ ఇదే - విలువా ఇదే."

మనలో చాలామందికి ఆధ్యాత్మికానుభూతి లేకపో వచ్చు. ఆ మార్గం అందుబాటులోకి రాకపోవచ్చు. అయి నంత మాత్రాన, మన ఆలోచనకు అందనిది ఊహింపరాని దనీ, మనను ఆకర్షించనిది అస్తిత్వం లేనిదనీ మనం అనుకో రాదని రాధాకృష్ణ పండితులు ఈ సందర్భంలో వ్రాకు చ్చారు. ఆధ్యాత్మికానుభూతి మనను అంటకుండా చేసుకునే స్వాతంత్ర్యత మనకు ఉంది. దానిని మనలను అంటకుండా చేసుకొన్నంత మాత్రాన అది లేదని మనం చెప్పలేం. అలా చెప్పటం హాస్యాస్పదం. అలా చెప్పటానికి పూనుకుంటే ఈ ప్రపంచంలో ఎందరికో వున్నవి మనకు అనేకం లేకుండా పోతాయి. ఇప్పుడు ఐన్స్టీన్ ప్రతిపాదించిన సాపేక్షసిద్ధాం తాన్నే తీసుకుందాం. అది మనలో ఎంతమందికి అర్థం అవు తుంది? చాలామందికి శాయశక్తులా ప్రయత్నించినా అర్థం కాకపోవచ్చు. కొంతమందికి తెలుసుకోవాలనే అపేక్ష లేక పోవటంవల్ల తెలియకపోవచ్చు. కాని మనకు తెలియనంత మాత్రాన అపనమ్మకాన్ని పెంచుకోవలసిన అవుసరంలేదు- అలా పెంచుకోవటం ధర్మంకూడా కాదు.

మానవుడు అసంతృప్తి పడటానికి కూడా చక్కని కారణాన్ని చూపారు రాధాకృష్ణ పండితులు. వారేమన్నారో వినండి. "వ్యక్తి చైతన్యంలో, దానికంటె గొప్పదైన విశ్వ చైతన్యం ఉండి, పనిచేస్తూ ఉండటంవల్లనే, వ్యక్తికి సంబంధించిన మనస్సుకి ఎప్పటి కప్పుడు తాను ధరించే సంకుచిత రూపాలతో అసంతృప్తి చెందటం అనేది సంభవిస్తూవుంది. కాబట్టి 'విశ్వాత్మ' అనేది ఒక ఊహకాదు. తత్వశాస్త్ర నిర్మాణానికి వేసుకున్న ఒక ప్రాతిపదిక కాదు. మనకు నిత్య జీవితంలో అనుభవంలోకి వచ్చేదే. మానవస్థాయిలో, అతీత మానవుడు కావాలనే కాంక్ష, అతని స్వభావంలో నిగూఢంగా వున్నట్లు గోచరిస్తుంది. నిగూఢంగా వున్న ఈ కాంక్షను బహిర్గతం చేసుకోవటమే మానవుని గమ్యస్థానం. తన్నుతాను మరచిపోలేని వ్యక్తికి, విలువలలో విశ్వాసం వుంచుకోవటమే మతమైతే, ఆధ్యాత్మిక సంపన్నానికి ఈ విలువలకు మూలమైన వాస్తవికతతో సంబంధం ఉంచుకోవటం మతం."

మానవజాతి వొకే రకమైన కదగని ముద్దకాదు. ఈ జాతిలో ప్రస్ఫుటంగాకనుపించే అంతస్థులు కొన్నివున్నాయి. లౌకిక ప్రపంచం నిజమే. ఆ మేరకు లౌకిక ప్రపంచానికి సంబంధించిన సమస్యలూ నిజమే. కాని ఈ సమస్యల పరిష్కారమే గమ్యస్థానంకాదు. ఈ పరిష్కారం, జేరుకోవలసిన గమ్యస్థానానికి మార్గాన్ని సుగమం చెయ్యటానికి మాత్రమే ఉపకరిస్తుంది. ఈ గమ్యస్థానం పరమాత్మతో ఏకం అవటం. ఈ స్థితి ఊహకాదు. సత్యమైందే - ఎలా

సత్యమో రాధాకృష్ణపండితులు, 'భావవాద జీవితదృక్పథం' అనే గ్రంథంలో ఇలా చెప్పారు:—

"మానవుని చైతన్యం వాస్తవికత్వాన్ని చేరుకునే మార్గంలోవున్నంతసేపూ, పరమాత్మ వేరుగా కనపిస్తుంది. కాని ఆ స్థాయిని చేరుకున్నవారికి అది నిజమే. ఈ ప్రపంచానికి చెందిందే. ప్రత్యక్షానుభవంలో వుండేదే, ఆ స్థాయి కొచ్చేవరకూ మరొక ప్రపంచానికి చెందిన ప్లేటోయొక్క 'భావా'నికి వలె, అది గోడమీద పడేనీడగా మాత్రమే గోచరిస్తుంది. ఆ స్థాయిని చేరుకున్న మానవుడు, సత్యేతర మైన వాటినన్నిటినీ, మనోవాక్కాయ కర్మలతో త్యజించి, విశ్వాత్మతో వొకటి అయినట్లు తెలుసుకుంటాడు. ఆత్మ అనేది మానవునిలో అంతర్గతంగా వుండటంవల్ల, అంతర్ దృష్టివల్ల మాత్రమే దానిని తెలుసుకోగలుగుతాం. తెలుసుకున్న తరువాత మాత్రం దానికి విడిగా ఏదీ మిగిలివుండదు. మతానికి వర్తించేభాషలో ఈ విశ్వాత్మే భగవంతుడు. సర్వవ్యాప్తమైనదీ, అఖండమైనదీ, ఇదే..."

మామూలుమనిషికీ ఆధ్యాత్మిక సంపన్నునికీ స్థాయీ భేదం వుండటంవల్ల, అతనిని క్రొత్తమనిషిగా భావించవచ్చు. అతను జీవితానికొక నూతనత్వాన్ని ప్రతిపాదించగలుగుతాడు... అన్ని మనస్సులలోనూ, అన్ని జీవితాలలోనూ, అన్ని శరీరాలలోనూ వొకేశక్తి ఉన్నదని గ్రహించటం వల్ల ప్రపంచంఅంత విశాలత్వాన్ని తానూ పొందుతాడు ఆ వ్యక్తి. అతీతమానవులు ఈ సత్యాన్ని గ్రహించి,

దానికి అనుగుణంగా ప్రవర్తిస్తారు. వీరే విముక్తులు... ఇదే రాధాకృష్ణ పండితుల తాత్వికదృష్టి...

౪

నేటి ప్రపంచంలో రాధాకృష్ణ పండితులవంటి మహా వ్యక్తి లేడనే చెప్పుకోవచ్చు. దీనికి వీరిజీవితమే దృష్టాంతరం. పాల్ ఆర్థర్ షిల్ప్ అనే ఆయన 'సర్వేపల్లి రాధాకృష్ణుని తత్వశాస్త్రం' అనే ఉద్గ్రంథాన్నివొకదాన్ని ప్రచురించాడు. అందులో, ప్రపంచంలోని ప్రముఖులెందరో వీరి తాత్విక దృష్టిని అనేక కోణాలనుంచి పరామర్శించారు. జార్జి పి. కోన్గర్ అనే ఆయన 'రాధాకృష్ణుని ప్రపంచం' అనేవ్యాసం వ్రాశాడు. ఆ వ్యాసంలో రాధాకృష్ణపండితుల ప్రతిభను ఈ విధంగా కొనియాడాడు — "కార్యోత్సాహం, శక్తి, బహుముఖసేవా పాశ్చాత్యులసొత్తు అనుకునేవారికి, సర్వేపల్లి రాధాకృష్ణ వివిధ రంగాలలో చేసిన కృషి. ప్రపంచంలోని మరే తత్వవేత్తా చేసివుండలేదని తెలుసుకోవటం ఆశ్చర్యం కలిగించవచ్చు. ఈనాటివరకు చూచినా, ఆయన జీవితంతో, కొంతమంది సమకాలికుల జీవితాలను కలిపి చూస్తే తప్ప, మరే ఇతర ప్రముఖుని జీవితాన్నీ పోల్చి చూడటానికి వీలు కనపడదు. ఈసమకాలికుల్లో చాలామంది, ఉపాధ్యాయులూ, గ్రంథకర్తలూ, ఆచార్యులూ, అనువాదకులూ, సంపాదకులూ వున్నారు. కొంతమంది తత్వశాస్త్ర చరిత్రకారులు కూడా వున్నారు. వీరిలో పెక్కుమందికి విద్యారంగంలో గొప్పతనం ఆపాదించబడింది. డబ్ల్యు. ఇ. హాకింగ్‌లాంటి

ఏ కొద్దిమందో ఇతరదేశాల విశ్వవిద్యాలయాల్లో అధ్యాపన చేసినవారు ఉన్నారు. మతానికి పలుకుబడివున్న రంగంలో, విలియం జేమ్సుకి మంచి ప్రాముఖ్యత వుంది. జాన్ డ్యూయీకి రాజకీయరంగంలో ఖ్యాతివుంది. ఒకరిద్దరు అమెరికన్ తత్వవేత్తలు శాసనసభ్యులయినారు. జాక్వెస్ మారిటైన్ రాయబారిగా వున్నాడు. ముప్ఫయి సంవత్సరాల కృషితో రాధాకృష్ణ, ఈపనులేకాక ఇంకాఎన్నోచేశారు."

ఇంత క్లుప్తంగా చక్కగా రాధాకృష్ణ పండితుల గొప్పతనాన్ని వ్యక్తపరిచినందుకు కోనర్‌గారిని నిజంగా మనం ప్రశంసించాలి. వారే రాధాకృష్ణ ప్రాశస్త్యానికి మూడు కారణాలను విశదీకరించారు. ఇందులో మొదటిది రాధాకృష్ణ పండితుల ప్రత్యేకత ... రాధాకృష్ణ పండితులు అఖండ భావవాదాన్నే ప్రతిపాదించారు. అందులో సందేహంలేదు. అయితే వారి విశిష్టత వారికి వుంది. ఈ వాదానికి, క్రొత్త ఉదాహరణలతో క్రొత్త నమ్మకాలతో క్రొత్త భాషతో క్రొత్త దనాన్ని చేకూర్చారు. "రాయిస్‌కున్న పాండిత్య ప్రకర్షణ వీరికి లేదు. బ్రాడ్లేకున్న నిగ్రహం వీరికి లేదు. హెగెల్‌కివున్న సుళ్ళూ తిరుగుళ్ళూ వీరికి లేవు. వీరి భావవాదం ఒక లోతైన జలనుంచి ప్రవహించే నిర్మల ప్రవాహం వంటిది. పోల్చి చూస్తే వీరిముందు యూకెన్ సంకుచిత వాదిగా కనుపిస్తాడు. కైసర్‌లింగ్ తేలికపారుగా కనుపిస్తాడు. ఫిచే, షెల్లింగ్‌ల తరువాత, నిర్నిరోధకంగా ప్రవహించే ప్రవాహంవలె నడిచిపోయే ఇటువంటి తత్వ శాస్త్రాన్ని మనం ఎరుగం" అని అన్నాడు, జార్జి పి. కోనర్.

ఇది అక్షరాలా నిజం. ఇక రాధాకృష్ణుని ప్రాశస్త్యానికి రెండవ కారణం: భారతదేశ ప్రాచీన సంస్కృతిని వారు పూర్తిగా ప్రతిబింబించటం. ఒకప్పుడు మాక్స్ ముల్లర్, "భారతదేశం మనకు నేర్పేది ఏమిటి?" అని ప్రశ్నించాడు. దీనికి జవాబు రాధాకృష్ణ పండితుల తత్వశాస్త్రం... వీరికి ఆవేశాన్నిచ్చింది భారతదేశంలో ప్రసిద్ధికెక్కిన వేదాంతమే. రచనలలోని ప్రతి అక్షరం ఆ వేదాంతవాహినిలో ముంచెత్తినట్లు కనుపిస్తుంది. అయినప్పటికీ వీరి తాత్వికదృష్టి విశ్వాన్నంతా తనలో ఇముడ్చుకో గలిగినంత సువిశాలమైంది. ఇక మూడవ కారణం: వీరు ప్రపంచ మానవులవటం, తత్వశాస్త్ర చరిత్రలో ప్రపంచ విఖ్యాతిని గడించిన ఇటువంటి వ్యక్తి మరొకరు లేరని చెప్పటం అతిశయోక్తి కాదు. ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచాలకు వీరు ఒకే గమ్యస్థానాన్ని చూపగలిగినదివ్యజ్యోతులు. వీరుకాశీవిశ్వవిద్యాలయంలోనూ ఆక్సుఫర్డ్ విశ్వవిద్యాలయంలోనూ ఒకేసారి ఉద్యోగాలను నిర్వహిస్తూ ఇక్కడనుంచి అక్కడకూ, అక్కడినుండి ఇక్కడకూ ప్రయాణంచేస్తూ అందరికీ సరిపోయే తత్వశాస్త్రం అనే వాక అల్లికను అల్లారు. చైనా దక్షిణ ఆఫ్రికా, చికాగో, మెక్సికో, ఇక్కడా అక్కడా ఏమిటి, ప్రపంచంలో ఎక్కడబడితే అక్కడ వీరు ప్రత్యక్షమయ్యేవారు. ప్రపంచంలో వీరు మెట్టని ప్రదేశం లేదు. వీరిని గౌరవించని స్థలం లేదు. తత్వశాస్త్రాన్ని నేటి పరిస్థితులకు అన్వయించి, ప్రపంచానికంతటికీ సరిపోయేటట్లు చేసి అతీతమానవసృష్టికి తగిన వాతావరణం సృష్టించిన మేటి సర్వేపల్లి రాధాకృష్ణపండితులు.

✤━━━✤



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B156 |
| పుస్తకం పేరు | తత్త్వ వేత్తలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 419 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, D, F |
| లేని పేజీలు | 1-6, 154TO160 |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |